'అభినవవాగనుశాసన'

## శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు,

Lecturer, Sanskrit & Telugu. Andhra University (Rtd)
ధవళేశ్వరం (7—1—56)

"మొన్న మీ పుస్తక మందినది మొదలుగా నింతవఱకు సక్తి తఱచుగాఁ జూచితిని. దీనికై యభిప్రాయము లపేక్ష్యము లైనను కాల మునుబట్టి కోరితి రంతే.

శబ్దార్థముల నిజస్వరూప మెఱుఁగఁజాలని రచన యేదేనియును భాష కనర్థదాయకము. నిష్పక్షపాతమును నిరసూయము నైన విమర్శనము భాషకు శ్రేయోదాయకము. ఈ రెండంశములను జక్కఁగాఁ దెలుపఁజాలి యున్నది - మీ సాహిత్యసమీక్ష."

## శ్రీ వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు,

కోడుగంటివారివీథి; విజయనగరము.

"తాము దయతో నంపిన 'సాహిత్యసమీక్ష' అందినది. ఆ గ్రంథమున శబ్దరత్నాకర శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువులవిమర్శ గొప్పగాఁ జేయఁ బడినది. అది మిక్కిలి యావశ్యకమగు మహాకార్యము. ఆ నిఘంటువులలో వ్యాకరణవైరుధ్యాది విషయములును గలవనుట నిశ్చయమే. కాని వానిని విమర్శింతమన్నచో వానియం దుదాహృతములగు ప్రబంధాదులను బట్టుకొని చిరకాలము - కనీసము తా మీగ్రంథమును రచించినంతకాలమేని - పరిశ్రమింపవలయును. అపుడు వానియుక్తాయుక్తములు విశదమగును. అట్టిపనిని జేయఁజాలమికి వృద్ధుఁడను బాలవ్యాకరణోద్ద్యోతగ్రంథరచనామగ్నుఁడను నగు నన్ను క్షమింప వేఁడెదను.

మొదటిపదము 'అసురద్విషుండు' అనుదాని విషయమునఁ దాము సవరించినదే యుక్తమనఁదగును. శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటుకారుల పక్షమున శ్రీ. కవిరత్న - వీరబ్రహ్మకవిగారి సమర్థనము వ్యాకరణ సమ్మతము కాదుగాని మార్గాంతరము కలదేమో యని తోఁచుచున్నది.

'అసురద్విషుండ' అనునది ప్రహ్లాదసంబోధనము కానోపు ననియు నచటి పరరూపసంధి యర్వాచీనసమ్మత మగుననియుఁ జెప్పనగునేమో ?

'ఔద్గుగణాచి' యనునది సుందరీదాగిలోని హిరణ్యకశిపునిపరముగానే యన్వయింపక తీరదు."

'విద్యారత్న'

శ్రీ యా. వే. వీ. రాఘవాచార్యులుగారు, M.A., A.E.S.

Head of the Department of Oriental Languages,
P. R. Govt. College, Kakinada - (28-1-56)

"దయతో మీరు పంపిన 'సాహిత్యసమీక్ష'- 20వ తిథి నందినది. చాలఁ గృతజ్ఞుఁడను. అనుదినము గ్రంథము నవలోకించుచు, సహాధ్యాపకులకును జూపుచుంటిని. సాహిత్యసాగరమును గూలంకషముగ మథించి, సారస్వత మండలి కందఁజేసిన యీ మీ దివ్యామృతమును ధన్యవాదపురస్సరముగ భద్రపరచుకొందుము. సర్వంకషముగఁ దలస్పర్శముగ మీ రొనరించిన సాహిత్యవ్యవసాయమున కిది చక్కని ఫలసంపద. మీ వాఙ్మయగవేషణవ్యసన మేలోత్తరముగ దృఢతరమై, ఆంధ్రశారదకు మీ కృతిభూషణము లనేకములు లభించుఁగావుత మని మా యాశంసనము."

శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు.
సంగీత సాహిత్య పరిశోధకులు,
శ్రీ వేంకటేశ్వర - ఓరియంటల్ ఇన్‌స్టిట్యూటు, తిరుపతి. (1-2-56)

"తమ 'సాహిత్యసమీక్ష' సాంగముగా చదివితిని. ఈ పరిశ్రమ విలువ తెలుసుకొనఁగలవారు పలువురు లేరుగదా యని చింత జనించినది. మరి తీవ్రమై గంభీరమైన వ్యాసంగ మేర్పడినను దానిస్వరూప మింతేకదా యను తత్త్వము నాకు కొంత నెమ్మది నిచ్చినది. తమది వాదము గాదు; తత్త్వదర్శిత. నిష్పక్షపాతు లందరును నిజముగా కన్నుల కొత్తుకొనఁగల వస్తువది."

విద్వాన్, శ్రీ దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారు.
Pandit
Andhra University College - Waltair (1-2-56)

"శ్రీయుతులు సాహిత్యప్రియులు పిచ్చయ్యశాస్త్రిగారి సాహిత్యసమీక్షలోని పెక్కుభాగములు సోత్సాహముగఁ జదివితిని. ఈ రచనలో శ్రీ శాస్త్రిగారు చూపిన శ్రద్ధయుఁ గావించిన పరిశ్రమయును మిక్కిలి మెచ్చుకొనఁదగి యున్నవి. ఇంత బహుగ్రంథ పరిశీలనపాటవమును, పద

పదార్థస్వరూపవివేచనకౌశలమును, అడుగడుగునను బొడసూపుచుండును. ఇట్టి విపులవిమర్శనములవలననే ప్రాచీనాంధ్రగ్రంథములలో సందిగ్ధము లగు శబ్దార్థస్వరూపములు సునిశ్చితములు కాఁగలవు. ప్రకృత మీ సమీక్ష భాషాసక్తులకు మిక్కిలి యుపకారకము - తత్త్వాన్వేషణపరులకు మార్గసూచకము. ... ...''

## శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు, M.A. (Hons)

**Professor, Usmania University, Hyderabad. 10-2-56**

''తమరు దయతో పంపిన సాహిత్యసమీక్ష చేరినది. పూర్తిగా చదువకుండ నేమి వ్రాయుటకును ఇష్టములేక యింతవర కాలస్యము చేసితిని. చూచినపిమ్మటగూడ తమ ప్రయోగవివేకమునకును - పరిశీలన పాటవమునకును - అర్థనిర్ణయసామర్థ్యమునకును ఆశ్చర్యపడుటకన్న మఱేమియు వ్రాయలేకున్నాను. కఠినశబ్దముల అర్థము తెలిసికొనుటకు నిఘంటువులుతప్ప వే ఱాధారములేని మావంటివారికి తమ విమర్శ పెక్కు-విధముల మార్గదర్శకముగా నున్నది. తాము చూపిన దోషములు ఆ యా నిఘంటుకర్తలును - వ్యాఖ్యాతలును మాత్రమేకాక యెల్లరును చేయు నట్టివే. అందుచే తమ సమీక్ష అట్టివారి నందఱిని అన్యాపదేశముగా మందలించుచున్నది. తాము వివిధపదములకు - జాతీయములకు చూపిన అర్థము లెంతో సమంజసముగా నున్నవి.''

'శిరోమణి'

## శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు, (P.O.L.)

**Telugu & Sanskrit Lecturer**
**Raja Bahadur VenkataRama Reddy's Women's college**
**Hyderabad. (12-2-56)**

సమీక్షను మీ పీఠిక మొదలిడుకొని చాలభాగము చూచితిని. మిగిలినదియుఁ జూతును. మీ సమీక్ష సమీక్షయే. అన్వర్థమే. ఇది నిష్పక్షపాతమగు విమర్శ. గుణమున్న గుణమును, దోషమున్న దోషమును జూపుటయే న్యాయ్యమగు విమర్శ.

''సర్వజ్ఞత్వము సాంబమూర్తిది. మనుష్యప్రజ్ఞ యల్పంబు'' అన్నట్లు ఎవ్వరును సర్వజ్ఞులుగారు. నా తత్త్వమచంద్రికలో శంకరుల

వారివి రెండుమూఁడు దోషములు చూపితిని. అంతమాత్ర శంకరుఁడపండితుఁడు కాఁజాలఁడు. నేను మహాపండితుఁడను గాను. వేంకటరాయశాస్త్రిగారి కట్టి ధీమా యున్నట్లు వినికి. అది కూడదు. అదికూడదని మీరు నిరూపించితిరి.

'స్పర్ధయా వర్ధతే విద్యా' అన్నట్లు వేంకటరాయశాస్త్రిగారి శిష్యగణ మితరవిద్వాంసులను తృణీకరించుటచే మీకుఁగలిగిన స్పర్థయే మిమ్మింత విమర్శకాగ్రేసరునిఁ జేసినదనుట స్పష్టము.

"జ్వలతి చలితేంధనోగ్నిః, విప్రకృతఃపన్నగః ఫణాం కురుతే"
అనికదా వాచోయుక్తి?

విద్వాన్ శ్రీ గంటి జోగిసోమయాజిగారు, ఎమ్.ఏ. ఎల్.టి.,
ప్రొఫెసరు - ఆంధ్రభాషాశాఖాధ్యక్షులు, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు.
విశాఖపట్టణము (21-2-56)

"తమరు పంపిన 'సాహిత్యసమీక్ష' అను గ్రంథము చాలవఱకు సావధానముగా చదివితిని. మీరు చేసిన సుదీర్ఘమయిన పరిశ్రమకు, సారస్వతసేవకు, మీకుఁ గల సునిశితవిమర్శనశక్తికి ఈ గ్రంథము సాక్ష్యము. దీనిని సావకాశముగ చదివి, పరిశీలించి పండితులు ఆనందింపవలసినది. సామాన్యుల కిది అందరానిది. తాత్కాలికములు, వ్యక్తిగతములు అయిన సమకాలమువారల రాగద్వేషములకు దూరులయి విషయవిమర్శనధురీణులయినపండితుల యామోదము నందు వ్రాతలే వ్రాతలు.

ఈ గ్రంథమును జాగరూకతతో జదివి కొందరయినను కొన్ని యంశముల నయినను తెలిసికొందు రని యాసించుచున్నాను."

'మహామహోపాధ్యాయ'
పండిత శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు.
నెల్లూరు (6-3-1956)

మీ 'సాహిత్యసమీక్ష' చేరినది. రుగ్ణుఁడనుగావున వ్రాయ సజ్జుఁడనుగాక యున్నాను. ఈ వ్యాసములన్నియు, నేను - అముద్రితదశలోనో, అచ్చులోనుండఁగానో చూచినవే. వీనిలోని అమూల్య విషయములు జ్ఞాత

పోకుండునట్లు, గ్రంథాకృతిం దీర్చి భావి విద్వద్విద్యార్థి సముదాయ నిరీక్షణ మునకు ఉపాదేయము సేయుటకు మిమ్మెంతయు నభినందించుచున్నాను. ఈ పుస్తకము అతినిశితమైన మీ విమర్శకౌశలమునకును, అతివిశిష్టమైన మీ రచనాచమత్కారమునకును తార్కాణముగాఁ జిరకాలము వెలుఁగాఁ గలదు.

దర్శనాచార్య, మహోపాధ్యాయ, సాహిత్యాచార్య, శాస్త్రవిశారద,
లాక్షణికశిరోమణి, విద్యా - భాషాప్రవీణ,
శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు,
ఏ. సి. కాలేజి, గుంటూరు (13-8-1956)

వ్యాఖ్యా వ్యాకృతి పక్షః శ్రీ శాస్త్రీ దీపితాశయః
సాహిత్యాకాశ సంచారే సమీక్షాం శ్రయతే కృతీ.

సాహితీదీప శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారూ! నమః!

మీరు వెలువరించిన సాహిత్యసమీక్ష నేనూ ఈక్షించాను. సాహిత్య లోకములో సాహిత్యాలోకమిచ్చే మీరు సాహితీలోచనుల మయిన అస్మద్వృశులకు చిరపరిచితులు ఎందుకు కాగలిగినారా? అని నేను ఎప్పుడూ ప్రశ్నకు అవకాశము ఇచ్చుకోలేదు. మీరు నిరూపించినవిషయములు ఎప్పుడో విన్నట్లుంటవి. హృదయంలో గూఢంగా ఉన్నట్లు గోచరిస్తవి. మీరూ మేమూ ఏకచింతనంతో ఒక మననతరి పట్టినామా? అనిపిస్తుంది. మీరు సాహిత్యబంధువులు. యుక్తకాలంలో వీనిని చూచాము. ఇంకా ఎన్నింటినో చూచాము. ఇప్పుడు సంయుక్తంగా చూస్తున్నాము.

వేదవాఙ్మయంలోని శబ్దాలలో పదింటికి ఆరు నేను తెలియనం లేదు. తెలిసిన నాలుగుపదాలు పట్టి శబ్దముల సారూప్యవైరూప్యములు సంవాదవిసంవాదములు పరిశీలించడానికి ప్రయత్నించిన భాషావైయాకరణులు - నిఘంటుకర్తలున్నూ అలవాటయిన పొరపాటును గుర్తించగల సామర్థ్యంతో లేరు. చక్కగా షట్పదారాధన ప్రజ్ఞాపాటవం కలవారయితే; భాషాసమీక్షకులు "భాషాదర్శనము" వెలువరించగలుగుతారని స్వస్పందసౌందర్యం సంభావిస్తున్నాను.

కావ్యభాషను తగిన వ్యాఖ్యారచనము ఎప్పటినో కుంఠితమయింది. భావరసోన్మేషమునకు వలసిన వ్యాఖ్య చూడాలని ఉంటుంది. సమయసంకేతానికి ఇంకా చేతనములేదు. భావనచేసే భావుకులు లేరనడము అపచారము. భావుకుల భావనకు భావధారలు ఏ ప్రభాతములోనయినా ప్రతిభాతములగునోకి అనుకుంటాను.

కోశములు నిఘంటువులు వ్యాఖ్యలున్నూ "వాసాంసిజీర్ణాని విహాయ"— నవ కంచుకాలు ధరించాలని నన్ను అననివ్వండి! భాషాసంగరములో మీరు ఆయుధాలు ధరించారు. మాకు కావలసిన వానిని మీరు అందరూ సాధించండి. మేము శిరఃకంపనము చేస్తాము.

సంస్కృతాంధ్ర కర్ణాట భాషాకోవిదులు, అనంతపురంజిల్లా వజ్రకరూరు
హైస్కూలు పండితులు, విద్వాన్, వైద్యవిద్వాన్, కవీశ్వర
శ్రీ ఆలూర్కార్ గొల్లాపిన్ని వాసుదేవశాస్త్రిగారు.

తమ రోసంగిన 'సాహిత్యసమీక్ష'ను పనులకొందరలో నచ్చ టచ్చట చూచితిని. అందలి వాదప్రతివాదముల పొంకమును గమనించితిని. మి మ్మెరుంగని యథాజాతులు మిమ్ము నేమన్ననూ అయ్యవి సూర్యముఖాన దుమ్ముచల్లినవితంబున నన్నవారిపై వెనుదిరుగునవే. కాన వానిం దడవంబనిలేదు. మీ చక్కని సాహిత్యసమీక్ష కాంధ్రవిద్వల్లోకము కృతజ్ఞము.

(1) ఉద్ది - ఇది కన్నడశబ్దము. మా ప్రాంతములో ఉద్దిచేను, ఉద్దిబేడలు అని వాడుకలున్నవి. ఉద్దుచేను - ఇత్యాదులులేవు.

(2) అగ్రపుస్తకములు - అని పక్షిప్రశ్న మొదలగు శాకునశాస్త్ర గ్రంథములకు పేరున్నది. కొందరు రామాయణాదిగ్రంథములనియును అందురు.

(3) వైద్యమిచ్చు - ఇదియును మందిచ్చు నను నర్థమున మా సీమలో వాడుకయందున్న పదమే.

(4) జలపోత, కయ్యముపొడుచు - అను పదములు వాడుకకు తొలంగినవై ప్రాబంధికరచనలలో మీరు వ్రాసినయర్థములు గలవై యున్నవి.

విద్వత్కవి శేఖరులు,

శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు, బి.యే., బి.యల్.

సాహితీసమితి. (శ్రీగిరి) రేపల్లె. (18-3-56)

'సాహిత్యసమీక్ష' సమగ్రముగా పరిశీలించినాను. అందులో అడుగడుగునా మీ భాషాపరిశ్రమ వ్యక్తమవుతున్నది. ప్రతివిషయములోను మీ వాదములు యుక్తియుక్తములుగా ఉన్నవి. తెలుగుపుస్తకముల అచ్చుప్రతులు నిర్దుష్టములుగా లేవు. ఎక్కువభాగము మీరు అచ్చుప్రతుల మీదనే ఆధారపడుటచేత, వ్రాతప్రతులలో ఎట్లావున్నది ఇక్కడ, అనే సందేహము మాత్రము మధ్యమధ్య కలుగుతున్నది. వ్రాతప్రతులు పరిశీలించినమీదట, మీ సిద్ధాంతాలు కొన్ని పరాస్తము కావచ్చును. ఐనా మీ కృషి బహు శ్లాఘ్యమైనది.

సూర్యరాయాంధ్రనిఘంటు నిర్మాతలును ఇతర గ్రంథకర్తలును మీ విమర్శలు సద్భావముతో గ్రహించి, ముందు ముందు ముద్రణములలో అవసరమైన సవరణలు చేసికొనగల రని నా విశ్వాసము. ప్రమాణభూతములుగా ఉండే గ్రంథాలలోని, ఎంత చిన్నలోపాలు ఎంత కటువుగా ప్రదర్శించినా, ఆ గ్రంథనిర్మాతలు సహృదయతతో శిరసావహించవలె! తీవ్రవిమర్శ ఆ విమర్శకునికి ఆ గ్రంథమందుగల గౌరవమునే మరొకరూపాన అభివ్యక్తము చేస్తుంది. మీరుచూపిన లోపాలలో చిన్నవేకాక పెద్దవీ ఉన్నవి. మీ విమర్శకూడా, ఎక్కడో కాని, పరుషాక్షరముగా లేదు.

మీ గ్రంథము పండితు లంతా గమనింపవలసినదని నా నిశ్చయము.



# ప్రస్తావన

## తెలుఁగు నిఘంటువులు

భాషకు సంబంధించిన శబ్దము, అర్థము, భావము, రసము, అలంకారము, ఛందస్సు, వ్యాకరణము మొదలయిన సకలాంశముల సమష్టి జ్ఞానము సాహిత్యము. సాహిత్యమునకు శబ్దము, అర్థము ప్రధానములు. శబ్దస్వరూపమును, దాని యర్థమును సప్రమాణముగను - సమగ్రముగను నిరూపించి చెప్పవలసినవి నిఘంటువులు. కావున నవి నిర్దుష్టములై యుండవలెను. వానిలో ప్రమాదము లుండరాదు. ఉండెనా, ఆ ప్రమాదములు కాలక్రమమున గ్రంథములలో ప్రవేశించుటయు, తన్మూలమున భాష కలుషిత మగుటయు, ప్రయోక్తలు హాస్యపాత్రము లగుటయు అనివార్యమగును.

తెనుగుభాషకు నిర్దుష్టము - సమగ్రములైన నిఘంటువు లేదు. ఉన్నంతలో చెప్పఁదగిన నిఘంటువులు రెండు. అందు మొదటిది శ్రీ సి. పి. బ్రౌనుదొరగారి బ్రౌణ్యము; రెండవది శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులవారి శబ్దరత్నాకరము.

బ్రౌణ్యము-సకల జనోపయోగార్థము సంతరింపబడిన పెద్ద నిఘంటువు; వ్యావహారిక ప్రధానము.

శబ్దరత్నాకరము - బళ్లయందు చదువుకొను విద్యార్థుల యుపయోగార్థము సంతనచేయబడిన చిన్న నిఘంటువు; గ్రాంథిక ప్రధానము.

శబ్దార్థ జిజ్ఞాసువులకు శ. ర. కంటెను బ్రౌణ్యమే యెక్కువగా నుపకరించుచున్నది. జాతీయములైన తెనుగునుడుల సంప్రదాయార్థములను గుర్తించుటలోను విశదముగా వివరించుటలోను బ్రౌనే సమర్థుఁడు.

ఏ విషయమునైనను సుఖముగను - ధారాళముగను తెలుపుటకు వాడుకభాషయేగాని *గ్రాంథికభాష అనువైనదికాదని యాతని మతము. అందువలన నాతఁడు అరసున్నల నాదరింపలేదు; బండిరాలను పాటింపలేదు;

---

* "In composing this work I have had the approbation of many learned assistants. But some (sastris)

లక్షణమును లక్ష్యము చేయలేదు. తన వివరణమంతయు వాడుకభాషలోనే వ్రాసినాడు.

శబ్దరత్నాకరమునకు బ్రౌణ్యమే సంచి మొదలు. శ.ర.లోని పదములు చాలవరకు బ్రౌణ్యములోనివే. పదములే కాదు; ఒక కొన్ని అర్థ వివరణవాక్యములున్నూ అక్కడివే. ఆచార్యులవారు బ్రౌణ్యము నుండియు, మరికొన్ని యితర నిఘంటువులనుండియు పదముల నెత్తివ్రాసికొని, తాము స్వయముగా సేకరము చేసిన పదసముదాయమును వాటితో చేర్చి, అన్నిటికిని అర్ధానుస్వారశకటరేఫము లమర్చి - గ్రాంథికపరచి ఆ నిఘంటువును తయారుచేసినారు. అప్పటినుండియు గ్రాంథికభాషకు, విద్యార్థులకు-విద్వాంసులకుకూడా అదియే ప్రమాణమైనది.

శ.ర. గ్రాంథిక నిఘంటువైనను, శ.ర. కర్త, అర్థవివరణమునను, కొన్ని మూలపదములలోను, తన పీఠికలోను వాడినది అంత నికరమైన గ్రాంథికము కాదు. *అందు దుస్సంధులు; విసంధులు; లక్షణదుష్ట శబ్దములు; వ్యావహారికరూపములు మొదలయినవి కనబడుచున్నవి. మొత్తము మీద ఆ భాష నేటి వ్యావహారికమునకు పూర్వరూప మనదగియున్నది.

---

scholars have disapproved the spelling here exhibited. Instead of that found in poems and used in ordinary life they wish us to practice a pedantic style; which is admired because conceited and far from clear. Such refinements are disregarded by men of real learning, who are therefore considered vulgar by some who are inferior in sound scholarship.'' (Preface)

* 'నిఘంటువులో యీ దేశభాష'— 'అయినను అంగు'— 'విత్తనష్టమును...పాటింపక'— 'నాయఁడు...లేఖరిగానుండి'— 'ఎట్టివంటి బుద్ధిశాలురకును'— 'జున్ను = పియ్యూషము'— 'ఎక్కలి = ...కన్నుగ్గొనినయనుక'— 'లక్షణంబులకు లోఁపడని'— 'మునిమునిచీఁకటి = ప్రొద్దు క్రుంకీక్రుంకక మునుపు పర్వు...చీఁకటి'— 'నీరుపదును'— ఇత్యాదులు.

బహుజనపల్లి వారు బ్రౌణ్యములోని పదములనూ - అర్థములనూ తీసికొనుటలో చాలాపదములను వదలివేసినారు. అది తప్పుకాదుగాని, తీసికొన్న పదములలో కొన్నిటికి, అర్థములు పూర్తిగా వ్రాసికొనక *అరగొరగా వ్రాసికొన్నారు; కొన్నిటికి, బ్రౌణ్యములో సరియైన అర్థమున్నను చక్కగాచూడక తప్పర్థములుచెప్పినారు. అదితప్పు. ఈవిధముగా వారి నిఘంటువులో అసమగ్రార్థములు, అపార్థములు, అపపాఠములు, అపసిద్ధాంతములు, అపశబ్దములుకూడా చేరియున్నవి. అవి పెద్దపెద్ద పండితుల వ్యాఖ్యానములలోను, ఇతర నిఘంటువులలోను ప్రవేశించుటయు జరిగినది.

---

* శ.ర. అరగొరగా వ్రాసుకొన్న ఘట్టమును, అందువల్లగలిగిన అనర్థమును తెలుపుట కొక్క ఉదాహరణము.—

'రూక' అను పదమునకు బ్రౌణ్యములో,—"రూక-A silver coin, sometimes equal to two and sometimes to four annas. A two-anna piece.—....చిన్నమెత్తు వెండిబంగారములనాణెము. చిన్నరూక a single two anna piece పెద్దరూక the coin called a quarter of a Rupee.—రూకలు = ధనము..." అనియు, మరికొన్ని విశేషములును చెప్పబడియున్నవి.

శ.ర. లో, "రూక=1. ధనము; 2. చిన్నమెత్తు వెండిబంగారముల నాణెము" అనిమాత్రమే యున్నది. ఆచార్యులవారు, బేడ; పావలా అన్న అర్థములను వదలివేసినారు.

అందువల్లవచ్చిన అనర్థ మేమంటారా! 'విజయ'-'పాండురంగ' ములకు టీకలువ్రాసిన పండితులు శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు, 'లప్పలతోడఁ గ్రొంబెరుగు లక్ష్మణవజ్ఝలయింట రూకకుఁగా'-అన్న క్రీ.రా. పద్యములోని 'రూక'కు, రూపాయి అని యర్థముచేసుకొని, "మంచన శర్మ లక్ష్మణవజ్ఝలయింట్లో (పూటకూలి) ఒకరూపాయి యిచ్చి భోంచేసినట్లు శ్రీనాథుడు వర్ణించాడు" అన్నారు. (1944 జూలై, భారతిలో,-'పాడబమంటే పులుసు'అని వ్రాస్తూ). పైపద్యములోని రూక, 'బేడ'గాని రూపాయి కాదు. మరి ఆ పండితు లలా యెందువల్ల అనుకొన్నారు? శ.ర. లో 'రూక=బేడ' అని లేనందువల్లనూ, 'చిన్నమెత్తు వెండినాణెము' అని యున్నందువల్లనున్నూ.

బ్రౌణ్యమున పొరపాటులు లేకపోలేదు. కాని బ్రౌను ఈ దేశము వాడు కాడు; ఈ భాషవాడు కాడు. కావున ఆ దోసగులు కొంతవరకు క్షంతవ్యములు కావచ్చును. కాకపోయినను అంత చిక్కు లేదు. పండితులకు బ్రౌణ్యము ప్రమాణము కాదు. కావున దానిని చూచువారే అరుదు. పలువురు దాని పేరుగూడా వినియుండరు.

ఏది యెట్లున్నను, వ్యావహారిక భాషకు బ్రౌణ్యమును, గ్రాంథిక భాషకు శబ్దరత్నాకరమును నేడు మన కుపాదేయములై యున్నవి. ఆ రెండు నిఘంటువుల తోడ్పాటే లేకపోతే యీనాడు ఆంధ్రభాషోపాసకులు అంధకారమున అయోమయస్థితిలో పడియుండవలసినవారే. కాని ఆ రెండుకోశముల కలయికవల్లనైనను తెనుగుబాసకు గల అక్కర తీరగలేదు. సర్వలక్షణసంపన్నమైన సమగ్రనిఘంటువు లేనిలోప మట్లే నిలిచియున్నది. ఆ లోపము తీర్చుట కేర్పడినదే,—

## శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు.

శ్రీ శ్రీ శ్రీ పీఠికాపురాధీశ్వరుల మహౌదార్యమున ప్రవర్తిల్లిన ఆ బృహన్నిఘంటువు తెనుగుతల్లి కొక అనర్ఘభూషణము కాదగినది. ఆకారముచేతను-గుణముచేతనుగూడా చాలా పెద్దది. ఇప్పటికి వెలువడిన నకారమువరకే 4సంపుటములు; దాదాపు 3850 పుటలు. అది పూర్తియగుచో

---

రూపాయి చిన్నమెత్తే యుండునో, తులమెత్తే యుండునో, రూపాయీ అన్న అర్థము పైపద్యమున సరిపడునో, సరిపడదో ఆ విచారము వారి కెందుకు? శ.ర. లో 'వెండినాణెము' అని యున్నదిగనుక రూపాయి అనుకొన్నారు. అంతే.

శ.ర. లోని అసమగ్రార్థము, ప్రౌఢకావ్యములకు టీకలువ్రాయు పండితులనే యిట్లు తప్పుదారులకు లాగినదంటే, ఇక సామాన్యులమాట చెప్పవలెనా?

ఇక్కడ ఇంకొక విశేషము: 'చిన్న' మనగా—నాలుగు గురిగింజల యెత్తు. ఇదియును బులుసు-పండితు లెరుగరు. ఎరిగియేయున్నచో 'చిన్నమెత్తు వెండినాణె' మంటే రూపాయీ అనుకొనుటే పొసగియుండదు గదా!

ఆంధ్రభాషకు పర్యాప్తమైన నిఘంటువు లేదన్నలోపము చాలమట్టుకు తీరిపోవచ్చును.

కాని బహుకాలపరిశ్రమకును, బహుధనవ్యయమునకును, ఫలితమైన ఆ గొప్ప నిఘంటువునకును తప్పుల తెక్కలి తప్పలేదు. సూ.ని. పండితులు శ.ర. లోని తప్పర్థములను-తప్పుపాఠములను అట్లే తీసికొన్నారు. కొన్ని యెడల భ్రాంత్యమును, శ.ర. ను, ఇతరనిఘంటువులను సరిగా చూడకయు, చూచియు సరిగా అర్థముచేసికొనకయు అసమంజసార్థములు వ్రాసినారు.

అందుకు కారణ మిట్లుండవలెనని నా యూహ.— నిఘంటుకార్యమున పండితులతోపాటు, భాషానుభవముచాలని పెద్దలు కొందరు నియుక్తులై యుందురు; అట్టివారి వ్రాతలను ఆ పండితులు వట్టిమీది నమ్మకముచేతనో-పరిశీలింప పాలుమాలియో అట్లే అందుకొని గ్రంథమున చేర్చియుంగురు. కాదేని, పూర్వనిఘంటువులలోను ఆ యీ పండితుల వ్యాఖ్యానములలోను ప్రమాదపతితములైన అర్థదోషములు - పాఠదోషములున్నా, పండితపరిష్కృతములుకాని ముద్రితప్రాచీనకృతులలోని తప్పుపాఠములూ-తుదకు అచ్చుతప్పులున్నా సూ.ని. లోని కేల చేరియుండును? పండితుల కడగంటిచూపు సోకియున్నను ఆ తప్పు లప్పుడే ఒప్పులుగా మారియుండవా? నిఘంటువు నిర్దుష్టమై యుండదా?

## ఏతద్విమర్శ ప్రసక్తి

సూర్యరాయనిఘంటువును నే నింతగా పరిశీలించుటకును, ఈ విమర్శ ప్రకటించుటకును మూల మేమనగా:—చేమకూర వేంకటకవి సారంగధరచరిత్రకు నేను టీక వ్రాయునప్పుడు, అంతకు మునుపు శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారి పేర ప్రకటితమైయున్న ఒక టీకను పరికించుటలో, పాఠనిర్ణయమునకును - అర్థనిర్ణయమునకును సూ.ని. పలుమారు చూడవలసి వచ్చినది. అప్పుడు సూ.ని.లో పాఠదోషములు - అర్థదోషములు కూడా దాదాపు ఒక యిరువదియైదుదాకా నా కగపడ్డవి. వాటి నన్నిటిని నేను నా టీకలో ప్రసక్తి ననుసరించి ఉట్టంకించి యున్నాను. వాటిలో కొన్ని వేదంవారివియు కలవు. ఆ సంగతి తెలుపుచూ, నేను నా ('జితకాశి') పీఠికలో,— 'వేదంవారు ప్రసిద్ధపండితులుగావున, వారిమీది విశ్వాసముచేత—

సూ.ని. వారి పాఠములను - అర్థములను అంతగా ఒరసిచూడక అట్లే గ్రహించినది' అన్నాను.

అది ఆ నిఘంటువుమీద లేని లోపముల నారోపించుటగా నిర్ణయించి, సూ.ని. పండితులలో నొకరైన శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు, ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో, ఇట్లొక సమాధానము వ్రాసినారు. (పార్థివచైత్ర-ఆషాఢసంచిక)

"('జితకాశి' వ్యాఖ్యానములో) శబ్దస్వరూపము నిర్ణయించుతఱి శ్రీ పిచ్చయ్యగారు శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువునుగూడఁ బ్రమాణీకరించుచు వచ్చిరి. కాని యచ్చటచ్చట శ్రీ సూ...నిఘంటువుపైఁ గొన్ని లోపము లున్నట్లు వీ రారోపించి చూపిరి.— ...సూ.ని.లో గ్రహింపఁబడిన పాఠములు పదపదార్థములు నవిరుద్ధములని పాఠకు లెఱుఁగుదురుగాక. మొదటినుండియు బ్రామాణికులగు పెక్కురుపండితు లేకాభిప్రాయముగ నిర్ణయించిన పదపదార్థములనే పూర్వోత్తర విరోధములు లేకుండ గ్రహించుట, సూ.ని. పరిపాటి. నాఁటికి నేఁటికి నీ నిఘంటు నిర్మాణమున ఆ సరణియే గ్రహింపఁబడుచున్నది. ఇట్లుండ సూ.ని. హృదయము సాకల్యముగ నెఱుఁగకయే దోషముల నారోపించుట శ్రీ పిచ్చయ్యశాస్త్రి గారి సాహసమాత్రమే యనియు, ఇట్టి యారోపణలు ప్రామాణిక నిఘంటువుపై అనాలోచితముగ ఇతరులు చేయకుందు రనియు నెఱింగించుటకే యింతవఱకు సమాధాన మీయవలసి వచ్చినది."

శ్రీ శాస్త్రిగా రా సమాధాన వ్యాసములో నా పొరపాటులు కొన్ని చూపి, 'కొండఁజేయు'-'ఆనఁబోడుచు' అను పాఠములు సాధువులే నను మా తమకు తోఁచిన యుపపత్తులను తెలిపినారు.

నేను నా పొరపాటుల నొప్పుకొని *పాఠవిషయమున వారు చూపిన యుపపత్తులు శాస్త్రసమ్మతములు కావని (11-3-1946) 'త్రిలిఙ్గ'లో స్పష్టపఱచినాను. వారు బదు లేమియు వ్రాయలేదు.

సత్య మిట్లుండగా, వారు తమ సమాధానముతో - వెనుక నేను చూపిన పాఠదోషాదులన్నియు నిరస్తములైనట్లు, - నన్ను తార్కాణగా

* చూ. ఈ సమీక్షలో, పుట 38, 81.

చూపి,-'ఇట్టి యారోపణలు...... ఇతరులు చేయకుందురని యెచ్చరించుటకే యింతవఱకు సమాధాన మీయవలసి వచ్చినది' అని భావి విమర్శకులను హెచ్చరించుట సరియగునా? సాహస మనిపించుకొనదా?

శ్రీ శాస్త్రిగారి హెచ్చరికవాక్యము చదివిన తరువాత సూ.ని. స్వరూపతత్త్వమును కొంచెము విపులముగా ఆ శాస్త్రిగారికిని - విమర్శక లోకమునకును తెలుపక మిన్నకుండుట శ్రేయము కాదని తోచినది. అందువల్ల "ప్రామాణికులగు పెక్కురుపండితు లేకాభిప్రాయముగ నిర్ణయించిన పదపదార్థములనే పూర్వోత్తర విరుద్ధములు లేకుండ గ్రహించుట సూ.ని. పరిపాటి" అన్న శాస్త్రిగారివాక్య మెంతవరకు సత్యమో పాఠకులే నిర్ణయింతురుగాక యని,— ఆ నిఘంటువులోని పూర్వాపరవిరుద్ధసిద్ధాంతములనూ, శ.ర. నుండియు, వేదంవారి గ్రంథములనుండియు ఆ నిఘంటువు గ్రహించిన తప్పు పాఠములనూ-తప్పర్థములనూ ఒక కొన్నిటి నెత్తిచూపుచూ ఈ విమర్శ వ్రాయవలసివచ్చినది. అంతేగాని, గొప్పపండితుడనన్న అహంతచే గాని, లేనిలోపము లారోపించి ఆ ప్రామాణికనిఘంటువు ప్రతిష్ఠను కొంచెపరుపవలెనన్న దురుద్దేశముతో గాని, యే వ్యక్తియందలి ద్వేషముచేత గాని నే నీ విమర్శకు పూనుకొనలేదు.

అసలు, ఇది సాహిత్యసమీక్షగాని కేవలము సూ.ని. సమీక్ష కాదు. ఇంగు బ్రౌణ్యము, శబ్దరత్నాకరము, మొదలగు నితర నిఘంటువులును, మనుచరిత్ర శృంగారనైషధ ప్రభృతి కావ్య పాఠవ్యాఖ్యానాదులును విమృష్టములై యున్నవి.

నిఘంటువులలోని తప్పులు కావ్య వ్యాఖ్యానాదులకును, వాటినుండి మరల నిఘంటువులకును, వాటినుండి పిమ్మటి గ్రంథజాలమునకును చేరుచుండుటవలన సాహిత్యమునకు మూడుచున్న ముప్పును విప్పి చెప్పుట యీ సమీక్ష ముఖ్యోద్దేశము.

నా యీ విమర్శలో, సూ.ని.లోని పాఠదోషములు-అర్థదోషములు నూటికిపైగా చూపబడినవి. అందు నాల్గవవంతు వేదంవారికి సంబంధించినవి. ఇది శ్రీ దూ.సూ.నా. శాస్త్రిగారు ముఖ్యముగా గమనింపవలసిన విషయము.

నేను భాషతో ఒకపాటి పరిచయముకలవాడనేగాని పండితుడను కాను గనుక, ఈ పరామర్శలో నా యపరిజ్ఞానమునను - ప్రమాదవశమునను పొసగిన దొసగులను తెలుపవలసినదిగా పండితులను కోరుచూ - వ్యాసమును త్రిలిఙ్గపత్రికలో, (1946 సెప్టెంబరులో) ప్రకటింప మొదలిడినాను.

నా వ్యాసము పూర్తి కాకముందే కవిరత్న-శ్రీరామ్ వీరబ్రహ్మకవి- అనువారు, 'నా సందేహములు' అను శీర్షికతో, నా పరామర్శలోని ప్రతి యంశమును ఆక్షేపించుచూ వ్యాసమొకటి ప్రచురింప దొడగినారు. అది కొండవీటి చేంతాడయినది.

త్రిలిఙ్గ పత్రికాధిపతులు 'విమర్శనమున వాదప్రతివాదము లెటింగిన గాని సత్యము తేలదను నుత్తమాశయము గలవారు' గావున శ్రీ వీరబ్రహ్మం గారి వ్యాసమునుగూడా తమ పత్రికలోనే ప్రచురించినారు. అంతేకాదు; ఈ చర్చనుగూర్చి యితర పండితులు వ్రాసిన *యుత్తమవ్యాసముల సన్నింటిని అట్లే ఆదరించినారు. సాహిత్యక్షేమాభిలాషతో, నిష్పక్షపాతముగా భాషాచర్చల కిట్లు సంపూర్ణావకాశమిచ్చు పత్రిక నేడు త్రిలిఙ్గ ఒక్కటియే యనుటలో అతిశయోక్తి లేదు.

శ్రీ కవిగారి ఆక్షేపములవలన నా ప్రమాదములు కొన్ని తెలియవచ్చు ననియు, వాటిని సవరించుకొనవచ్చుననియు నే నాసపడితిని గాని నా

---

* వ్యక్తిదూషణ బహుళములుగా నున్నవన్న హేతువున శ్రీ రాళ్ల భండి వేంకటసీతారామశాస్త్రిగారి 'సమీక్ష', శ్రీ శంకరప్రసాదుగారి 'తోచిన అభిప్రాయము' మొదలైన కొన్ని వ్యాసములను ప్రకటింపమాని పత్రికాధిపతు లిట్లు తెలిపినారు.

"అష్టావధాని శ్రీ బండి వేంకటరామిరెడ్డిగారి ఆఱు వ్యాసములు ప్రకటించితిమి. తిరిగి ఆఱు వ్యాసములు వచ్చినవి. పరిశీలించి చూడగా వీనియందు భాషావిషయిక మటుండనిచ్చిన వ్యక్తిగతముగ రెండుపక్షను లేర్పడినట్లు స్పష్టమగుచున్నది. ఇచ్చట మనకు కావలసినది భాషావిషయము గాని దూషణభూషణము లెంతమాత్రమును గావు. వ్యక్తిగతములును నిస్సారములగు చర్చలు ప్రకటించు చున్నచో మా పత్రికయేగాదు తెలుగు దేశములో నే పత్రికయు నిలువలేదు. కావున పైవానిలో శ్రేష్ఠముగ నున్న శ్రీ ఉత్పల వేంకటరంగాచార్యులవారి వ్యాసములను బ్రకటించి మిగిలినవానిని బ్రకటింపమని మనవిచేయుచున్నాము." (30-6-1947)

యాస అడియాసయే్యైనది. వారి వ్రాతలు నాకు అనవసరమైన శ్రమను కలిగించినవేగాని లవలేశమును ఉపకరింపలేదు.

వారిది మన మామూలుపాండిత్యము కాదు. వారి వ్యాకరణము వేరు; వారి ఛందోజ్ఞానము వేరు; వారి అన్వయపద్ధతి వేరు; వారి వాద సరణియే వేరు. అంతా లోకాతీతము.

మాదిరి కొక కొన్ని వాక్యములు.—

(1) "దంత్యములు తెలుగుశబ్దములలోనేగాని సంస్కృతశబ్దములలో లేవు. కావున తద్భవములయిన చారు. జడలను, చారు; జడ-అనగూడదు."

(2) "జటాశబ్దము తత్సమమునను తద్భవమునను 'జడ'యై ఇందలి జ తాలవ్యముగను - దంత్యముగను వ్యవహరింపబడును."

(3) "రాజు + ఆజ్ఞ = రాజాజ్ఞ. ఇందలి జా ఆకారముతో గూడి యున్నను తత్సమ మగుటచే తాలవ్యమైనది."

(4) "వలరాజు.—'వల' యనునది తెలుగు. 'రాజు' అనునది మిశ్రమ సమాసము."

(5) "రాజ అనునది విశేషణమై యసంపూర్తిగానుండి యుత్తర పదమును వాంఛించుచుండును. రాజబాట."

(6) "ఉండుట యొక్క భావము ఉనికి."

(7) "పునరుక్తిదోషము తటస్థించి ఛందశ్శాస్త్రరీత్యాగూడా తప్పగుచున్నది."

(8) "ఆటవెలది, వృత్తము."

(9) "గీతపద్యము-అనరాదు; గీతిపద్య మనవలెను."

(10) "*ఉగ్దులు-అను పదము, ఎగ్దులు; ♦సుద్దులు-అనువానివంటిది. కనుక 'ఉద్ది' అను ఏకవచనరూపము పుట్టదు."

---

* "ఉద్దులకు ఏకవచనరూపము 'ఉద్ది' కావచ్చును. 'ఉద్దు' కావచ్చును"అని శ్రీ యే.రా.చయనులుగారి (మధ్యస్థ)తీర్మానము.(7-7-47)

అది సరికాదు. అలా అయితే శ.ర.లోని 'ఉద్ది'ని వదలి సూ.ని. 'ఉద్దు' అననేల? మద్దులు; సుద్దులు-అనుపదముల యేకవచనము మాటయేమి?

♦ "సుద్దులకు 'సుద్ది' యని యేకవచనరూప మున్నట్లు కవిగా రెఱుంగలేదు" అన్నారు. శ్రీ ఉ. వేం. రంగాచార్యులవారు. (7-7-47)

(11) "రలయోరభేదః - అన్న సూత్రముచేత, నీలాటిరేవు, నీరాట రేవయినది."

(12) "నీర + ఆట = నీరాట, నీరాటము( = స్నానము.) ఇది తత్సమసమాసము.— 'నీరాటవనాటములకు...' - అను ప్రాచీనరచనలు ప్రమాణములు."

(13) "నీర + ఆమని=నీరామని (వర్ష ఋతువు) ఇదియును తత్సమ సమాసమే."

ఇట్లెన్నని చూపను? వారి వ్రాత అంతా ఇట్టిదే. వారి వ్యాస భాగములు ఈ సమీక్షలో ఆయా విషయములక్రింద నున్నవి. వివరము లందు తెలియగలవు. (గ్రంథము పెరుగునన్న భయముచే వారి వ్యాసములలోని కొన్ని యంశములుమాత్రమే చూపబడినవి.)

శ్రీ కవిగారి వ్రాతలు సరియైనవికావని, శ్రీ వేంకటరామిరెడ్డిగారు, శ్రీ యేలూరిపాటి రామభద్రచయనులుగారు, శ్రీమాన్ ఉత్పల వేంకట రంగాచార్యులవారు, శ్రీ మేడవరపు రామబ్రహ్మశాస్త్రిగారు త్రిలిఙ్గ ముఖమునసే తెలిపియున్నారు. వారివారి వ్యాసభాగములున్నూ ఈ సమీక్షలో ఆయా సందర్భములలో నుదాహృతములై యున్నవి.

'నిఘంటువు నొండు' అనుట సరికాదు; నిఘంటు వొండు — అని గాని, నిఘంటువు నొకటిని - లేదా నిఘంటువు నొకదానిని - అనిగాని అనవలెను-అన్న నా సవరణను ఆక్షేపించుచూ, (11-10-1948 త్రిలిఙ్గలో) శ్రీ శంకరప్రసాద్‌గారు, ('కవి'గారి పక్షమున)—'ఆశ్చర్య మాశ్చర్యము' అని యెలుగింపగా — (25-10-48 త్రిలిఙ్గలో) వ్యాకరణ విద్యాప్రవీణ, తెలుగుభాషాప్రవీణ, శ్రీ తంగిరాల వేంకటసుబ్బయ్యశాస్త్రిగారు 'ఆశ్చర్య నిర్మూలనము' కావించినారు.

ఈ వాదసందర్భమున 'కవి'గారు అపూర్వమైన ఒక ఘనకార్యము చేసినారు. అది యేమనగా : ఇద్దరు పెద్దల* నాశ్రయించి, తమవాదమే

---

* వారి సన్మానసంపాదనముకూడా ఇట్టిదిగానే తెలియుచున్నది. "అత్తవారింట్లో అల్లుడితోపాటు గిల్లుడికికూడ ఆదరమర్యాదలు జరిగినట్లు, రాణాప్రతాప కావ్యకర్త శతావధాని బ్రాహ్మణ దుర్భాక

సరియైనదైనట్లు—సర్టిఫికెట్లు వ్రాయించుకొన్నారు. మీరెట్లడిగిరో, మరి వారెట్లు వ్రాసియిచ్చిరోగాని, యిట్టివారు భాషాచరిత్రలో ఇంతకుముందు లేరు.

## సర్టిఫికేట్లు ; వాటి వాలకము

(1) శ్రీ చిట్టా బాలకృష్ణశాస్త్రిగారు, యం.ఏ. (బందరు)

"బందరు పురనివాసులు సుప్రసిద్ధకవులు...శ్రీరామ్ వీరబ్రహ్మకవిగారు త్రిలిఙ్గ పత్రికయందు 'నా సందేహములు' అను శీర్షిక క్రింద నేబదియైదు వ్యాసములు ప్రచురించుట భాషామతల్లికి అత్యుత్తమ సేవచేయుట యని...యెంచనగును. వారి పరిశీలనజ్ఞానము,...విమర్శక (?) ధురంధరత్వము ఆ వ్యాసములయందు గన్పించగలవు....శ్రీ దీ. పి. శాస్త్రిగారు ఏ గ్రంథములను ప్రమాణములుగ దీసుకొనిరో ఆ గ్రంథములనుండి... ఎక్కువగ పరిశ్రమచేసి, అన్వేషించి, పదప్రయోగముల విపులీకరించి, సమయోచితసందర్భముగ కవిత్రయహృదయము గ్రహించి చదువరులకు... సహాయముచేసి కవిగారు పేరెన్నిక గనిరి.

పాయదొలంగు, జిడ్డి, పైడాయగ, కడానిమెఱుంగు, పసిండిపాలకి-మున్నగు వందలకొలది పదముల అర్థము స్పష్టీకరించుటలో వారికి వారే సాటి..."

ఈ సర్టిఫికేట్టు, ఉందూరివారన్న మొగమోటముచేతను, చుట్టుకచుట్టుక తిరుగుటవలన తప్పించుకోలేకను ఇచ్చినట్లున్నదేగాని,యీయుభయుల వాదములను చదివి, అందు కవిగారి ప్రజ్ఞావిశేషమును గుర్తించి - మెచ్చి యిచ్చినట్లు లేదు. విద్యావివాదములలో, సత్యనిర్ణయావసరములలో ఇట్టి యిచ్చకపువ్రాతలు నిరుపయోగములు. పై పదములకు సంబంధించిన

---

రాజశేఖరకవిగారితో పాటు, శతకరచయితలగు విశ్వబ్రాహ్మణ వీరబ్రహ్మేంద్రకవిగారికిగూడ నూటపదహార్ల సన్మానము జరిగింది; వదాన్యులు తిక్కవరపు రామిరెడ్డిగారి దయవలన. అంటే, రాజశేఖరుల కవితాప్రభావానికి, వీరబ్రహ్మేంద్రుల ఆశ్రితవాత్సల్యానికి (=ఆశ్రయింపునకు) సన్మానమని తెనుగు అర్థము" (2-4-48 జమీన్‌రైతు పత్రిక.)

మరి, వారి బిరుదసంపాదనవిధాన మెట్టిదో!

చర్చ, ఇందు 125, 128 పుటలలో నున్నది. శ్రీ శాస్త్రిగారు పండితులని వినికి. వారిప్పుడైనను ఋజుహృదయముతో, నిదానముగా నరసి, తమకు సత్యమని తోచినమాటను సప్రమాణముగా లోకానికి తెలుపుట లక్ష్యం. పండితు లభిమానింపవలసినది భాషనుగాని, వ్యక్తులను కాదు.

(2) శ్రీయుత డాక్టరు గిడుగు వేంకటసీతాపతిపంతులు (బి.ఏ.యల్.టి., డి.లిట్.) గారు.

వీరి సర్టిఫికేట్టు చాలా పెద్దది. త్రిలిఙ్గ (13-12-1948) పత్రికలో, కొంచెము తక్కువగా నాలుగు కాలములు. కవిగారు కోరినారని గనుక వ్రాసియిచ్చినారట! అందువల్లనే కాబోలు! వారిని పొగడి, నన్ను నిందించి నారు. అంతపొడుగు వ్యాసములోను, ఒట్టుపెట్టినట్లు నన్నుగూర్చిన మంచి మాట ఒకటియును లేదు. పోనిందు; శబ్దార్థచర్చయేమైనా చేసినారా? అదియును లేదు. వ్యాసమంతా నాపై దోషము లారోపించుటతోనే సరి పోయినది. నేను (17-1-49) 'పరామర్శలలో పరుషవాక్ప్రయోగము' అను శీర్షిక క్రింద వారి వ్రాతలోని తత్త్వమంతయు విజ్ఞలోకమునకు విశదము చేసియున్నాను. ఇక్కడ వారి వాక్యములు కొన్నిమాత్రమే ముద్రించి నాకు తోచినమాటలు మనవిచేస్తాను.

I. "విమర్శలలో వ్యక్తిదూషణము కేవల మవివేకమయినపని."

అలాఅయితే, విమర్శకాగ్రేసరులు, శ్రీ పంతులుగారి తండ్రిగారు— 'పండితభిషక్కుల భాషాభేషజము' అను విమర్శలో,—'వే. వేం. శాస్త్రి గారు ఆంధ్రకవితాపితామహుని సైతము వివేకములేక ఆక్షేపించినారు'.— 'పురశ్చరణచేస్తే శాస్త్రులవారిని పట్టుకొని పీడించి మతిపోగొట్టి అసంబద్ధ ప్రలాపము లాడించిన వైయాకరణపిశాచము వదలిపోతుంది'.—శాస్త్రులు వారు బాలవ్యాకరణము చదువుకోలేదు.—ఇట్టి పండితుల భ్రమప్రమాదా హంకారములవల్ల అపరిమితమైన కీడు గలుగుచున్నది'...'సీతారామా చార్యులవారు తీర్పు వ్రాసినారు, చీ అనేవారు లేరు.'—'ఆ సీతారామా చారికి వివేకము లేదు. ఆతని నిఘంటువు తప్పుల తడక'.—'అహోబలునికి ఆంధ్రసారస్వతజ్ఞానము సర్వమంగళము'.—('చిలకమర్తివారు వాడిన) ఆ మాటకు అర్థము తెలిసినవారు రోతపడి థూత్కారము చేయకమానరు'.— ఇత్యాదిగా, తమవలెనే భాషాకృషి కావిస్తూఉన్న తోడిపండితులనూ - పూర్వపండితులనుగూడా పేర్లుపెట్టి అంతతీవ్రముగా నిరసించియున్నారే-

అది అవివేకమయినపనే నంటారా! పంతులవారు. వాదమున కంటారేమో! కాని అట్లనరాదు.

వాదప్రతివాదములలో - విమర్శలలో కటువాక్ప్రయోగముండుట స్వభావము. అది సత్యనిశ్చాయకమే గాని వ్యక్తిదూషణము కాదు. మల్లినాథవ్యాఖ్యలోని 'అహో మూలచ్ఛేదీ తవపాండిత్యప్రకర్షః'; 'నాథ వచన మనాథవచన మేవ' అన్న నుడుల తత్త్వమేమి? భారతచంపూ వ్యాఖ్యాత కురవిరామకవి, తత్పూర్వవ్యాఖ్యాతయైన నృసింహపండితుని, 'తస్యానాఘ్రాతవ్యాకరణగంధస్య న చోద్యాయ' అనియు, 'తస్య మూల నిర్మూలకస్య న చోద్యాయ' అనియు,—'అపమూల మనన్విత మతిదురహం యుభిగత్ర కల్పితాః పాఠాః, అపి విదుషో మోహయితుం వ్యాచఖ్యౌ బత స పండితమ్మన్యః' అనియు నిరసించుటయేకాక, తుద కా నృసింహ మును 'గ్రామసింహ' మనికూడా దూషించినాడు.

కావున 'విమర్శలలో వ్యక్తిదూషణము కేవలము అవివేకమయిన పని' యనుట అంత వివేకమయిన పని కాదు.

II. "శ్రీ దీ.పి. శాస్త్రిగారి 'పరామర్శ'లో నాకు సద్భావము కనబడలేదు."

పంతులుగారు నిజమే సెలవిచ్చినారు. నా పరామర్శలో సద్భావము తమకు కనబడలే దన్నారు. అంతేగాని 'లే' దనలేదు. ఎలా అనగలరు? వారి తండ్రిగారు 'ఓదార్పు' అను నా విమర్శగ్రంథ మొకటి చదివి నా కిట్లు వ్రాసియున్నారు.

"ఓదార్పులోని విషయము భాషకు వేయిమడుగులుగా నాకు ప్రియ మైనది. వేదంవారి పాండిత్యము ఏలాటిదో వారి శిష్యులకు తెలియదు. నేను కొంచెము అది నిరూపించినాను. మీరు సందేహానికి ఎడములేకుండా చేసినారు. మీ గ్రంథం మిమ్ములను సుపరిచితులను చేసినది. మీ దర్శ నము చేయవలెనన్న అభిలాషకూడా పుట్టినది......"

(రాజమహేంద్రవరం 2-9-38)

నా విమర్శలో సద్భావము లేకపోతే ఆ మహనీయునికి నన్ను చూడవలెనన్న అభిలాష పుట్టునా? ఆ 'ఓదార్పు'లోని విమర్శ యెట్టిదో నా యీ 'పరామర్శ'యు నట్టిదే. అందున్న సద్భావ మిందును కలదు.

ఉన్నను శ్రీ పంతులుగారికి కనబడకపోవుట యెందుకన్నదో స్పష్టతే చెప్పుదురుగాక.

III. "పరామర్శలో పెక్కుచోట్ల నాటు సమాసనాటక్కులు కన బడినవి."

కనబడుగాక. వాటిజోలి తమకేల? మా సర్వేశ్వరుని సంగతి చెప్పాలను గదా తాము తేల్చి చెప్పవలసినది?—"భాషా చిత్రవధ కావించినట్టి విమర్శ కుఁడు విమర్శలోఁ జూపు కటుత్వమును తొలఁగఁజేసి సత్కవి విమర్శ యొక్క పటుత్వాపటుత్వములనే పరికించుకొనుట మేలు" అన్నారే సదం పండితులు; శ్రీ పంతులుగారికి ఆ విమర్శకమార్యదాశిక్షావాక్యము ప్రమాణము కాదా?

IV. " 'అసురద్విషుండోరి' అనేపాఠము సరియైనది కాదని శ్రీ శాస్త్రిగారు చేసిన 'పరామర్శ' అప్రస్తుతము."

పాఠదోషములను చూపుటకే పూనియున్న నేను, పాఠదోషమును చూపుట అప్రస్తుతమైతే, మరి నాకక్కడ ప్రస్తుతమేదో పంతులుగారే సెలవియ్యవలె.

V. "ఇంతకూ ఆ పాఠము సరియైనదే అని శ్రీ కవిగారు సమర్థించినారు."

ఆఁ! నిజముగా సమర్థించినారా? ఆ సమర్థనపు వ్రాతను పంతులు గారు చదువుకొన్నారా? ఆ వ్రాత ఈ గ్రంథమున తొలుదొల్తనే యున్నది. ఒకమారు తిలకించుట మంచిది.

VI. "అతివాసమునుగూర్చి కవిగారు చాలా శ్రమపడి శ్రీ శాస్త్రి గారి అభిప్రాయమును ఖండించినారు."

కవిగారు చాలా శ్రమపడి ఖండించినారు; పంతులుగారు చాలా శ్రమపడి సర్టిఫికేట్టు వ్రాసియిచ్చినారు. మంచిదే; కాని 'అతివాసము'నకు 'శ్రాద్ధమునకు ముందు దినము'అన్న యర్థము చెప్పరాదన్న పట్టుదలతో, కవిగారు,— బ్రౌణ్యములో - "అతివాసము-శ్రాద్ధమునకుముందు నొక్క పొద్దుపుండే దినము" అనియున్నను, దానిని చెప్పక కప్పిపుచ్చినారు. పంతులుగారు గమనించినారా?

'వాసర'మన్నను 'అధివాసర'మన్నను ఒకటే యర్థమట! అందువల్ల, సూ.ని. 'అధివాసరము'ను ప్రత్యేకించి చూపలేదట! పంతులుగా రొప్పు కొన్నారా?

ఆ పక్షమున 'వాస'మన్నను, 'అతివాస'మన్నను అర్థమొకటే యగునుగదా! మరి, సూ.ని. 'అతివాసము'ను చెప్పుటకు కారణమేమో పంతులుగారు, కవిగారి నడిగినారా?

మరియు, ఆ కవిగారు, 'వాసర'మన్నను 'వార'మన్నను 'దిన' మనియే అర్థమని చెప్పి, అందుకు-"మనసి విచింతయ వారం వారం" అను శ్లోకము నిచ్చి, ఇట 'వారంవారం' అనగా ప్రతిదినమునని యర్థమేగదా! అన్నారు. ఆ యర్థము సరికాదంటూ (13-9-1948) త్రిలిఙ్గలో నేనిట్లు తెల్పి యున్నాను. "వారంవారమ్— అనగా మాటిమాటికి అని యర్థము. 'వారంవారం శశ్వ దర్థే' అని యమరము.— 'వారంవారం as many a time, repeatedly, often' అని బ్రౌణ్యము. 'వారంవారం వదన మరుతా వేణు మాపూరయంతం' అని కృష్ణకర్ణామృతము."

పంతులుగా రీ మా చర్చను చిత్తగించియున్నారా? చిత్తగించియు కవిగారిదే సరియైనవ్రాత అనుకొన్నారా? అలా అనుకొనియేఉంటే వారును కవిగారివంటి పండితులే ననుకొనవలసివస్తుంది.

VII. "తరిపాలు, నిలువునీరు, నీరుపదను, చేపట్టుకుంచము మొదలయిన కొన్ని శబ్దములనుగూర్చి శ్రీ శాస్త్రిగారు చెప్పినది సరిగాలేదని ఖండిస్తూ శ్రీ కవిగారు సూ.ని. వ్రాతలను సమర్థించినారు."

ఆ సమర్థన మెట్టిదో, ఈ పుస్తకమున 224, 250, 136, 222 పుటలలో తెలుపబడియున్నది. పాఠకులు చూచి *పంతులుగారికి తెలుపుదురుగాక.

---

* కవిగారి సమర్థనములు సూ.ని. కి అపకారకములు. ఆ కవిగారు సూ.ని. సిద్ధాంతముల నాక్షేపించియు నున్నారు. పంతులుగా రెరుగరు. చూడండి.

(I) సూ. ని. 'నల్లిల్లు' క్రింద, కే. బా. చ. పద్యమును—'వనమ్ము-నల్లిల్లు' అను పాఠముతో చూపినది. "నల్లిల్లు అనుట తప్పు. 'నట్టిండ్లు' అనవలె"నని కవిగారి ఆక్షేపము. (పు. 7)

VIII. "చేంగలించు"ను గురించి శ్రీ శాస్త్రిగారి ఆక్షేపము నాకు సరిగా బోధపడలేదు."

ఆక్షేపము బోధపడకముందే అభిప్రాయ నిర్ణయములనిచ్చునంతటి కక్కుర్తి తమకేమి వచ్చినదో శ్రీవారు తెలుపవలెను.

IX. "ఇతరపండితులకంటె తాము గొప్పవారమని సూ.ని. పండితు లెవ్వరును చెప్పుకొనలేదు. ఇక వారిపనిలో ఇతరులకు కనబడిన లోపములు పెక్కు లుండవచ్చును. ఎవరికి కనబడిన తప్పులు వారు తెలియజేయుట మంచిది."

సూ.ని. పండితులు గొప్పవారు కాక సామాన్యులే అయినచో వారు నిర్మించిన నిఘంటువు ఇతరులకు ప్రమాణమగుట యెట్లు? అది యట్లుండగా,- సూ.ని.లో ప్రమాదము లుండవనియు, దీ.పి. శాస్త్రిగారివలె నితరు లెవ్వరును, ఆ ప్రామాణికనిఘంటువుపై ఆరోపణలు చేయజాలరనియు, సూ.ని. పండితులైన శ్రీ దు.సూ.నా. శాస్త్రిగారొకవంక ఘంటాఘోషముగా చెప్పుచూ - విమర్శకులను హెచ్చరించుచుండగా,— శ్రీ పంతులు గారు,— "సూ.ని.లో లోపములు పెక్కులుండవచ్చు" ననుటయు,— "ఎవరికి కనబడిన తప్పులు వారు తెలియజేయుట మంచిది" యనుటయు నెట్లు సంగతమగును?

---

(II) సూ. ని. తెరువాటు - అన్నది.
'తెరవాటు' అనవలెనని క. ఆ. (పు. 8)

(III) 'చారులు పిండివంటలు' అని సూ.ని. పా.—
అవి 'చాలులు' గాని, చారులు గావని క. ఆ. (పు. 19)

(IV) గ(క)ట్టిపెట్టు = కొయ్యపలకకు రంగుపూయుట-అని సూ.ని.
కట్టిపెట్టు=త్రాడుతో కట్టివైచు-అని కవిగారు, (పు. 132)

(V) 'చిరువ(గ)డము = మధురకందము' అని సూ.ని.
'చిరువడము = చిన్నవడ(గారె); చిరుగడము=చిన్నగడ' అని కవిగారు (పు. 208)

ఇట్టి వింకను గలవు. పంతులుగా రేమంటారో!

ఇంకను ఎందుకు విస్తరము. శ్రీ పంతులుగారి ఆ దీర్ఘ వ్యాసములో నిలువగల, విలువగల మాట ఒక్కటియునులేదు. కవిగారి వ్రాతలను పొగడుటద్వారా సూ. ని. సిద్ధాంతములు నిరుపట్టము లనిపింపవలెనని వారి పూనిక. అది నిరర్థకప్రయత్నము. కవిగారి కథ కడగాబెట్టి తామే స్వయముగా పరిశీలించి నా పరామర్శలోని ప్రమాదములను వెల్లడించుట కర్తవ్యము.

## ఒక విశేషము

పాపము! పంతులుగారు తమ సర్టిఫికేట్టు పత్రిక కెక్కునని యెరుగక అట్లు వ్రాసియిచ్చినారట! ఆ విషయము-శ్రీ బాచిమంచి శ్రీహరి శాస్త్రిగారు (23-1-1950, త్రిలిఙ్గలో ప్రకటించిన వ్యాసములోని యీక్రింది పంక్తులవలన తెలియుచున్నది.—

“శ్రీ...కవిగారు తమ ప్రశంసాపత్రముల నన్నిటినీ ప్రతికాముఖము గావించిరి. అట్టిస్థితి ‘ఆత్మస్తుతి’కి తావొసంగకపోదు. అసలు ప్రశంసాపత్ర ప్రకటన యిట్టి చర్చలయం దప్రస్తుతము కాకపోదు. మొన్న బెజవాడలోజరిగిన శతావధాని బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రులవారి పట్టప్రదానోత్సవసభకు వెళ్లినప్పుడు శ్రీగిడుగు వేంకటసీతాపతిగారితో మాట్లాడుట తటస్థించినది. ప్రస్తావవశమున—“మీరు శ్రీ...కవిగారి కేదో ‘సర్టిఫికెట్’ యిచ్చియున్నారే! దానిని నేను త్రిలిఙ్గముఖమున చూచి యున్నాను. తమ యభిప్రాయ మే”మని ప్రశ్నించితిని. అంతట వారు పెదిమవిరిచి- ‘ఏదో సర్టిఫికెట్లు యిస్తూయుంటాము. వాటిని పత్రిక కెక్కించు టేమి?’ యనిరి.”

పత్రికలో ప్రచురించుటకు పనికిరాని సర్టిఫికేట్లు వ్రాసియిచ్చుటలో ఉద్దేశ మేమి? అని అడుగువారికి పంతులుగా రేమి బదులు చెప్పుదురో?

శ్రీ పంతులుగారి సర్టిఫికేట్టును పండితు లిట్లు విమర్శించియున్నారు.

(1) శ్రీ యేలూరిపాటి రామభద్ర చయనులుగారు.—

“శ్రీరామ్ వీరబ్రహ్మము గారు తే 13-12-48 ది త్రిలిఙ్గలో-శ్రీ.గి.వేం. సీతాపతిగారి సర్టిఫికెట్టు నుదహరించిరి. శ్రీ దీ.పి. శాస్త్రిగారి వ్యాసముల వ్యక్తిదూషణ మున్నట్లు శ్రీ సీతాపతిగారు అరువాక్యములను నిందాభాజన

ములుగ వ్రాసిరి. ఇట్టిమాటలు నిందలు కావు. లోకమునకు ఖ్యాతిగానుగ వ్రాయు వ్రాతలను జూచినప్పుడు మనస్సున కలిగిన ఆవేదనాసూచకములగు మాటలవి...విమర్శనమున నట్టి వాక్యములకు దోష మాపాదించుట తగదు. ...కీ. శే. గి. వెం. రామమూర్తి పంతులుగారు (శ్రీ సీతాపతిగారికి పితృపాదులు, నాకు తత్తుల్యులు) తెలుగుపత్రికలో పండితభిషక్కుల భాషాదోషములు- అని వ్రాసిరి. ఇందు భిషక్ భేషజ శబ్దముల ప్రయోగ మెట్లు సహనీయము? అందలి ప్రమత్త, పండితమ్మన్య మొదలయినవాని మాట యేమి? శ్రీ సీతాపతిగారు 'వేదంవారి పరిశీలనలేని పరిష్కరణము'నే దోషముగ నెంచి శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారిని 'తామసు'లనుట తగునా? శ్రీగాన వీర బ్రహ్మముగారు శ్రీ శాస్త్రిగారిని భాషాపరిచయములేనివారని వ్రాసినదిచూచి మందలించెద రేటికి? సూ.ని.లో దోసగులు లేవని ఏవారు నొప్పుకొనుట లేదు. తప్పులను చూపింపుడనియే శ్రీ సీతాపతిగారు కోరుచున్నారు. ప్రస్తుతము నిఘంటువుతో సంబంధముకల శ్రీ సీతాపతిగారు ముఖ్యముగ నిఘంటుపక్షమున సమాధాన మీయవలసియున్నది. కావున నీ సర్టిఫికెట్లు నిచ్చిరా? రెండవపేరాచివర వ్రాసినట్లు శబ్దముల గ్రహించి విమర్శనతోడి అర్థమునుజూపు వ్యాసముల బ్రకటింపవలసినదిగా శ్రీ సీతాపతిగారిని ప్రార్థించుచున్నాను." (3-1-1949-త్రిలిఙ్గ)

(2) వినమ్ర వినివేదనము - మహాకవి శ్రీ కాశీభట్ట కృష్ణరాయ శాస్త్రిగారు.—

"శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారి గ్రంథములు, విమర్శనములు, సమాధానములు మున్నగునవియెల్ల నరయుచున్నాను. శ్రీ వీరబ్రహ్మంకవిగారి 'సందేహములను' జూచితిని. యోగ్యతాపత్రముల జూచితిని. శ్రీ చయనులుగారి సమాధానమును గంటిని. అడుగబడకయే వ్రాయవలసి వచ్చుచున్నది.

శ్రీ గిడుగువారి ధోరణి యంతా యెరిగినదే. ప్రాచీనభాషారూపము యెరిగినవా రెవ్వరూలేరు; తామూ కారు. అన్నింటికి "ఛే" జబాబు. బ్రహ్మంగారు, శాస్త్రిగారు, సీతాపతిగారు, పుట్టినవారు, పుట్టేవారు, వారేంవిటి వీరేంవిటి అంతా అజ్ఞమయం. ఆంధ్రభాష నెరిగినవారు లేనే లేరు. ఇంక సర్టిఫికెట్లు అడిగేరు కాబట్టి యిచ్చేరు. వారి నేమియూ అనడము యెందుకు? తమకున్న లెస్సగా రాదనియే వ్రాసినారు.

ఇట్టి వాదములలో బ్రహ్మశ్రీ వజ్ఝల చినసీతారామశాస్త్రిగారు, మున్నగు పండితవతంసు లెట్టి యభిప్రాయమిత్తురో ? అధికప్రసంగ మసంగతము.'' (4-4-49 త్రిలిఙ్గ)

ఈ పండితప్రకాండుల విమర్శవలన శ్రీ పంతులుగారిది పక్షపాతపు వ్రాతగాని న్యాయ్యమైనది కాదని స్పష్టమయ్యెగదా. ఇకనైనను శ్రీవారిట్టి ప్రశంసాపత్రములను వ్రాసియిచ్చు నలవాటును తగ్గించుకొందురు గాక. భాషారాధకులకు తోడ్పడుదురుగాక.

విమర్శవిధానము లెరిగిన పాఠకులారా, తెలుగు నిఘంటువుల పరామర్శపై నిప్పటికిజరిగిన గ్రంథమంతయు మీ యెదుట పెట్టినాను. ఇక, ఇందలి గుణములను దోషములను నిర్ణయించుభారము మీది.

మానవునికి సర్వజ్ఞత యుండదు గావునను, ప్రమాదము లేకుండదు గావునను నా యీ సమీక్షలో లోటుపాటు లెన్నేని పొటమరి యుండును.

'ఆదరమునఁ దప్పులఁ గడిచి తద్దయు నొప్పులె చూచి మెచ్చుఁడీ'

యని నేను మిమ్మడిగికొనుటకుగాని, మీ రట్లు మెచ్చుకొనుటకుగాని యిది విషయము కాదు. ఇం దేర్పడవలసినది సత్యము. ఈ విమర్శగ్రంథము నిర్దుష్టమై సాహిత్యలోకమున కొక 'మేలుకొలుపు' కావలెనని నా యాపేక్ష. కావున తాము దీనిని శాంతముగను, సాంతముగను పరిశీలించి, యిందలి నిజమైన దొసగులను వెల్లడింతురేని, ఈసారి ముద్రణమున వాటిని తొలగించి, గ్రంథమును నిర్దోషము కావించుకొందును. నా కృతజ్ఞతను తెలుపుకొందును. నేను చేయుచున్న భాషాసేవ కిట్లు తోడ్పడవలెనని వేఁడుకోలు.

## కావ్యములు ; వ్యాఖ్యానములు

ఇక కావ్యములను - వ్యాఖ్యానములను గురించిన మాట.

నాకు, కవితావైభవముంబట్టి శ్రీ తిరుపతి వేంకటకవులయందును, వ్యాఖ్యానదక్షతంబట్టి శ్రీ వేంకటరాయశాస్త్రిగారియందును *అభిమాన మెక్కువ.

---

* ''పాండిత్యంబున కేమి, ప్రౌఢకవితా వ్యాపారసందర్భవాక్
శౌండీర్యంబున కేమిగాని, రసభాస్వత్కావ్యభావాగ్రపుఁ

కవిత్వాభిరుచిచేత వారి గ్రంథములను, సాహిత్యప్రీతిచేత వీరి వ్యాఖ్యానములను-విమర్శలను తరచు చదివెడివాడను.

నే నే గ్రంథమును చదివినను, అందు నా బుద్ధికి విశేషములుగా తోచు గుణములను-దోషములను-తుదకు అచ్చుతప్పులనుకూడా ఆ గ్రంథములోనే - తుదిపుటలో గుర్తుగా వ్రాసియుంచుకొనుట చిన్ననాటినుండియు నలవాటు. అట్లే శ్రీ శాస్త్రిగారి వ్యాఖ్యానాదులనుగూడా గుణదోష పరిశీలనపూర్వకముగ నే చదివితిని. చదువను చదువను వారి పరిష్కరణలలో కొన్నిపాఠములు, టీకలలో కొన్నియర్థములు, శబ్దములు, వాక్యములున్ను తప్పులుగా కనబడసాగినవి. అంతట వారి యనువాదముల నరసితిని. అందును కొన్ని ప్రమాదములు గోచరించినవి. భాషాపరిచితి నలవరుచుకొనగోరువారి కెల్ల నవశ్యపఠనీయములైన గ్రంథములలో తప్పులుండుట శ్రేయముకాదని తోచి, ఆ యా గ్రంథములను పఠించు విద్యార్థుల కొక హెచ్చరికగానుండు నన్న తలపుతోను, సాధుత్వాసాధుత్వములను పండితులు తెలుపుదురన్న ఆశయముతోను ఆ నెరసుల నప్పుడప్పుడు - ఉగాదిసంచిక, భారతి, ఆంధ్ర వారపత్రిక మున్నగువాటిలో ప్రచురించుచు వచ్చితిని. అవియు, ప్రకటితములు కాక నిలిచిపోయిన మరికొన్ని అంశములును ఈ సమీక్షలో సంపుటీకరింపబడినవి.

నా యీ విమర్శకు పూర్వకావ్యములతోనే సంబంధము. ఈనాటి స్వతంత్రరచనలజోలి యిందులేదు. శ్రీ శాస్త్రిగారి సొంతకృతులను నేను స్పృశింపలేదు. ప్రాచీనకృతులను తప్పుగా అనువదించినను, తప్పుగా వ్యాఖ్యానించినను, ఆ యా కవులకు అపచారము చేయుటయు, భాషకు అపకారముచేయుటయు నగునని నా యా వేదనము.

శృంగారనైషధము, ఆముక్తమాల్యద, గౌరనహరిశ్చంద్ర మొదలైనవి ఆంధ్రభాషకు ప్రమాణగ్రంథము లగుటచేతను, వాటిని పరిష్కరించి

---

బండాలంబును విప్పి నీ సగిదిఁ జెప్పంజాలు ధీశాలి యొ
క్కండుఁ లేఁడుగదయ్య మాకు నిఁక వేంకట్రాయవిద్వన్మణీ!"
(సుబోధిని)

ఇది శ్రీ శాస్త్రిగారి నిర్యాణమునుగూర్చి నేనువ్రాసిన పద్యములలో నొకటి.

వ్యాఖ్యానించిన శ్రీ శాస్త్రిగారు ప్రామాణికులని పేరువడ్డవారగుటచేతను నేటి పిన్నలు-పెద్దలు సైతము వారి ప్రమాదములను గమనింపక ప్రమాణములుగా గ్రహించుచున్నారు. ఈ రీతిగా భాషకు మోసము సంభవిల్లుచున్నది. శబ్దార్థములు తారుమారైన పిమ్మట అది సాహిత్య మనిపించుకొనునా? భాష గ్రాంథికమైనను, వ్యావహారికమైనను శబ్దములు-అర్థములు సరిగా నుండవలెగదా!

ఆంధ్రదేశాభ్యుదయమునకు, ఆంధ్రభాషారాధనము ముఖ్యము. ఆంధ్రభాషారాధనకు ప్రాచీన కావ్యరక్షణ మావశ్యక కర్తవ్యము. కావున ఆంధ్రదేశమునకును, ఆంధ్రభాషకును మేలుగోరు పెద్దలు, పరిష్కర్తల-వ్యాఖ్యాతల ప్రమాదము మూలమున రూపుచెడియున్న ప్రాచీన కావ్యములను నిష్ణాతులు కావించి, యథారూపముగా నెలకొలిపి తెనుగుభాష సౌభాగ్యమును కాపాడుదురుగాక.

అత్యంత వ్యయప్రయాసములకోర్చి జీవితమంతయు ఆంధ్రభాషారాధనకే ధారవోసిన శాస్త్రిగారియెడ ఆంధ్రులెల్లరును కృతజ్ఞులై యుండుట ధర్మము. కాని, వారి గ్రంథములు పునఃపరిశీలనమును కోరుచున్నవి. శాస్త్రిగారు మనకు పూజ్యులైనను వారి ప్రమాదములు త్యాజ్యములు. కావున భాషాభిజ్ఞులు భారమనుకొనక, శ్రీ శాస్త్రిగారి యెల్ల గ్రంథములను తత్త్వనిర్ణయదృష్టితో పరికించి అవసరములగు సవరణలను చిన్న చిన్న పుస్తకములుగానైన ప్రకటించుట అత్యవసరమనియు, అట్టి ప్రకటనము, శ్రీ శాస్త్రిగారుచేసిన భాషాసేవకు మెరుగుపెట్టుట, సాహిత్యోపాసకులకు మహోపకారము చేయుట అగుననియు నా మనవి.

నా యీ మనవిని శ్రీ శాస్త్రిగారి మనుమలు, విద్యాధికులును - బుద్ధిమంతులును నైన చిరంజీవి వేంకటరాయశాస్త్రి గారు సౌహార్దముతో మన్నింతురని నా విశ్వాసము.

ఇట్లు
సాహిత్య సాధకుడు
దీపాల పిచ్చయ్యశాస్త్రి

నెల్లూరు,
మన్మథ - 'ముక్కోటి'
25—12—55

# కృతజ్ఞత

—:o:—

ఈ వ్యాసములను అవిచ్ఛిన్నముగా ప్రకటించి, నా సారస్వత సేవకు దోహదమిచ్చిన భాషోద్ధారకులు త్రిలిఙ్గ పత్రికాధిపతులకును, భారతి-ఆంధ్రపత్రిక అధిపతులకును, నా విమర్శతత్త్వమును అవ్యాజాదరముతో లోకమునకు తెలియజేసిన పండితవరేణ్యులకును కృతజ్ఞతావందనములు.

ఈ గ్రంథముద్రణమునకు అర్థసాహాయ్య మొనరించి, నా చిరకాలపరిశ్రమము వ్యర్థముకాకుండ కాపాడిన భాషాభిమానులు - వరకవిపూడి మిత్రమండలివారికి ప్రత్యేకముగా నా కృతజ్ఞతను తెలుపుకొనుచున్నాను.

ముద్రణకార్యమున నెక్కువ శ్రద్ధవహించి, నాకు తోడ్పడి, గ్రంథము నిట్లు చక్కగా తీర్చియిచ్చిన కోకిల ప్రెస్ అధికారులకు నా అభినందనములు.

దీ. పి. శాస్త్రి

~~~:o:~~~
~~~

# విషయసూచిక



## తెలుఁగు నిఘంటువులు

### పాఠపరామర్శ

## అర్థపరామర్శ

## శబ్దపరామర్శ

# కావ్యములు ; వ్యాఖ్యానములు

## మేఘసందేశము



## గౌ. హరిశ్చంద్ర ; టిప్పణము



## శృంగార నైషధము

### పాఠవిచారణ



### అర్థవిచారణ

## శబ్దవిచారణ



## అలంకారవిచారణ



# ఆముక్తమాల్యద : వ్యాఖ్యానములు

## పాఠవిచారణ



## అర్థవిచారణ

శబ్దవిచారణ



అలంకారవిచారణ

# సవరణలు

—:o:—

| పుట | బంతి | ఒప్పు |
|---|---|---|
| 5 | 25 | దీర్ఘికలు |
| 7 | 21 | విగాహ్య |
| 46 | 7 | నల్లగా |
| 104 | 10 | భవగ్ని |
| 127 | 19 | శ. ర. కగ్గ |
| 128 | 17 | సైచుట |
| 190 | 3 | నఖాంకాంకిత |
| 191 | 6 | చూర్ణ |
| 198 | 23 | మల్లి |
| 201 | 8 | కమనీయః |
| 303 | 7 | లేని |
| 352 | 18 | అతడు |
| 379 | 24 | తినదగినది |
| 381 | 6 | ఉపాహారము |

ఇట్టి అక్షరప్రమాదము లింకను కొన్ని యుండవచ్చును. వానిని చదువరులు సరిపరచుకోవలెనని మనవి.

---

# సాహిత్య సమీక్ష

## — తెలుఁగు నిఘంటువులు —

## పాఠపరామర్శ

### ౧. 'అసుర ద్విషుండు'

సూర్యారాయాంధ్రనిఘంటువులో 'నోరుమూయు' అను పదము క్రింద, నృసింహపురాణపద్యము, వావిళ్లవారి ప్రతిలో నున్న ప్రకారము,—

"అనిన నొడుగఱచి యసురద్విషుం డోరి
పడుచ నాకుఁ బుట్టి చెడుగ వైతి,
పేర్చి నోరుమూయు పెడతల వాపోయె
దిట్టి వదర గలఁడె యెచటనైన" (౪. ౩౭)

అని యుదాహృతమై యున్నది.

పై వాక్యములు ప్రహ్లాదునిగూర్చి హిరణ్యకశిపు డన్నవి. హిరణ్యకశిపుడు అసురులకు ప్రభువుగాని, ద్విషుఁడు ( = విరోధి) కాఁడు. కావున *'అసుర ద్విషుం' డన్న పాఠము తప్పు.

---

* "'అసురద్విషుండోరి' అను పాఠమే సరియైనది. అసురద్విషుం డన్న పదము హిరణ్యకశిపునికి చెందినది కాదు. అది ప్రహ్లాదునికే అన్వయించును. 'అసురద్విషుండోరి' యనఁగా,—ఓరీ, నీవు అసురద్విషుండవు,

'అమర ద్విషుండోరి' అని సరియైన పాఠము. 'అసుర ద్విషుండోరి' అని పాఠాంతరము.

'అమర' అను పదము, అచ్చులో 'అసుర' గా మారినది. అది ప్రమాదము. సూ.ని. ఆ ప్రమాదము నట్లే తీసికొన్నది.

## ౨. 'నోరు మూయు'

### (A)

'నోరుమూయు పెడతల' అను పాఠముగూడ తప్పు.

“నోరుమూయఁ బెడతల వాపోయెదు”

అని సరియైనపాఠము. (శ.ర. లో 'వదర' క్రింద నున్నది.)

నోరుమూయన్ = (మాటలాడవలదని) నోటిని మూయఁగా, పెడ తలన్ = పెడతల (= అవటువు) తో, వాపోయెదు, అని యర్థము.

'నోరుమూస్తే పెడతల వాపోతాడు' అని లోకోక్తి. 'మొండివాఁడు' అని భావము. పేర్చి నోరు మూయు(ము) అనుటలో అర్థము లేదు.

కాబట్టి, శ.ర. పాఠ మొప్పు; సూ.ని. పాఠము తప్పు.

---

అని యర్థము. ద్విషుండవు అను పదములోని 'వు' లోపించి 'ద్విషుండ' అను రూప మేర్పడి పిమ్మట, ద్విషుండ + ఓరి = ద్విషుండోరి అయినది. నీవు అసురద్విషుండోరి పడుచ అంటే, ఓరి పడుచా, నీవు అసురద్విషుండవు అని సమన్వయము. ఎత్తితివి + ఏని వకారము లోపింపఁగా ఎత్తితేని అయినట్లే.—ఇచట బాలకుల కొక సందియము గలుగవచ్చును.

పైని గనబఱచినది క్రియాపదము గదా! అట్లే విశేష్యములందును వకారము లోపము గలుగునా? యని. దీనికి ప్రయోగములు గలవు.

పడఁతికి గన్యాధర్మం
బెడలినఁ గొఱయగునె వెండి యెవ్వరికైనన్
గడిపోయిన పువ్వులు మఱి
ముడుచునె? రసికుఁ డగువాఁ డమోఘ విచారా.

(B)

అది యట్లుండఁగా, 'నోరు మూయుము' అన్నప్పుడది వాక్యమగునుగాని, ఏకపదము కాదు. నిఘంటువు, 'నోరుమూయుము'; 'తలుపువేయుము'; 'జాబు వ్రాయుము' అను వాక్యములను గ్రహించుటయు, అర్థములు చెప్పుటయు సంప్రదాయము కాదు.

## ౩. 'నట్టిండ్లు'

శ.ర. కర్త, 'నట్టిల్లు'అను పదమునకు (1) గృహమధ్యము, (2) గర్భగృహము అని రెండర్థములుచెప్పి, రెండవ యర్థమునకు భీమఖండపద్యమును (అచ్చుప్రతిలోనున్న ప్రకారము)—

---

ఇట, రసికుఁడవు + అగువాఁడవు + అమోఘ విచారా! అని పద విచ్ఛేదమయి వకారము లోపించుటచేత — రసికుఁడ + అగువాడ + అమోఘ విచారా = రసికుఁ డగువా డమోఘ విచారా అని యేర్పడినది. కావున నిందలి 'రసికుఁడవు' — 'అగువాడవు' అను నీ రెండు పదములును విశేష్యములే గదా!'' అని 'కవిరత్న వీరబ్రహ్మకవి'గారి దొక సిద్ధాంతము.

ఈ సిద్ధాంతము శ్రీ వారి వ్యాకరణపాండిత్యము, అర్థగ్రహణ కౌశలము, వ్యాఖ్యానవైఖరి, విమర్శపద్ధతి మొదలగు నెల్ల యంశములకును మచ్చు తునక.

ఆటవెలఁది 'వృత్త' మనియు, 'గీత మనగా సంగీతమగునేగాని పద్యము కా'దనియు, 'గీతిపద్య' మనవలెననియు వారి దొక ప్రసంగము.

ఈ ప్రసంగము వారి ఛందశ్శాస్త్రపారీణతకు తార్కాణ.

"మలిపించె *బంగారముల దేవగృహములు
కూర్పించె నట్టిండ్ల గుడిపసవులు" (హ. ౫౩.)

అను పాఠముతో నుదాహరించినాఁడు.

'నట్టిండ్లు' అను పాఠము సరియైనది కాదు. ఆ పాఠమునకో పాటు శ.ర. కర్త ఊహించిన అర్థముకూడ తప్పే. ఎందుచేతననఁగా 'దేవగృహ' మనగా దేవాలయమే. దేవుఁడుండు గర్భాలయమునకే దేవాలయమని పేరు. అదే దేవగృహము. కాబట్టి 'దేవగృహములు మలిపించె' నని చెప్పినపిమ్మట, మరల, నట్టిండ్లు (= గర్భగృహములు = దేవగృహములు) కూర్పించె నని చెప్పుట అనవసరము. అది పునరుక్తి యను దోషము నగును. కావున ఆ యర్థము పొసగదు.

పాఠము, కూర్పించె 'నల్లిండ్లు' అని యుండుట యొప్పు. 'నల్లిం' డ్లనగా, బ్రాహ్మణగృహములు. (= అగ్రహారము)

"అగ్రహారము = బ్రాహ్మణుల యిండ్లవరుస. నల్లిండ్లు" (శ.ర)

"అగ్రహారము A street or village inhabited by Brahmins" (బ్రౌ)

"అగ్రహారః. విప్రగ్రామే" (శబ్దార్థకల్పతరువు.)

"రత్నాకరాంతోర్వరా విహారుండొట నగ్రహారము లసంఖ్యముగఁ జేసె" (విజ. 1.21)

'అగ్రహారములు = ఉత్తమమైన ముత్తైపుంజేరులను, బ్రాహ్మణుల ఇండ్లవరుసలను' అని వేదంవారి టీక.

---

* లోహవాచకమైన 'బంగారము' నిత్యైకవచనాంతము. అయినను మహాకవి శ్రీనాథుడు బహువచనమున వాడినాడు. తిక్కన ధాన్యవాచకమైన 'బియ్యము'ను— "బియ్యములు, నేయు" (ఉద్యో.1.93)అని బ.వ.గా వాడియున్నాడు. బియ్యముకూడా నిత్యైకవచనాంతమే. అయిననేమి? మహాకవులు నిరంకుశులు గదా!

ఆ మహాకవి 'కనకము' లనియు ప్రయోగించినాడు.—
"కనకములు మణులు...అనేకములు వేడ్కనొసఁగె" (అను. 5. 470)

అగ్రహారప్రతిష్ఠ = నల్లిండ్లు నిలుపుట సప్తసంతానములలో నొకటి. అందుకీ క్రింది గ్రంథములు ప్రమాణము :

(1) "నందనుఁడు వనమ్ము 'నల్లిల్లు' నిధి సుర
గృహము చెఱువు మేలుకృతి యనంగ
జగతి వెలయు సప్తసంతానములు" (కేయూర. ౧.౮)

(2) "చలిపందిరులును సత్తరు
వులు నూతులు బావులుం బువుందోఁటలుఁ జె
ర్వులు 'నల్లిండ్లు' నిలిపె" (యయాతి. ౧.౩౮)

(3) "కొమరారఁ జెఱువులు గుళ్లు ప్రతిష్ఠించి
లోకసంభావ్యంబులుగ నొనర్చె,
నిధులు 'నల్లిండ్లు' నిలిపె." (హరి. పూ. ౧.౧౯)

(4) "అనఘుఁడై యెనుబదియెనిమిది వేవురు
బ్రాహ్మణప్రవరుల బ్రహ్మవిదుల
వెలయఁగ 'నల్లిండ్ల' నిలిపి." (భా. సభా. ౨.౧౨౧)

దేవాలయాది ప్రతిష్ఠలను చెప్పుపట్టున 'దేహగృహము'లతోపాటు చెప్ప దగినవి 'నల్లిండ్లు' గాని 'నట్టిండ్లు' కావు అనుట కుదాహృతగ్రంథ ప్రమాణము చాలదా!

భీమఖండపద్యము, ఇంద్రుఁడు దాక్షారామమున గావించిన ప్రతిష్ఠలను తెలుపునదే. చూడండి తక్కున పద్యభాగము—

"కట్టించెఁ బట్టనక్మ్మవిభాగము పైఁడిఁ
గల్పించె వప్రంబు కాంచనమున
నిర్మించెఁ *ప్రాసాదనివహంబు కనకానఁ
బాటించె గవఁకులు హాటకమున
రచియించెఁ గార్తస్వరమున గోపురములు
కీలించెఁ గేళిదీ కలు భూరి

* "ఈ ప్రాసాదనివహంబు — ఇంద్రుఁడు భోగమువాండ్లకొఱకు కట్టించినది" అని వీ. బ్ర. గారి వ్రాఁత.

నాఁటె మందారతరుగుల్మములు తోఁటలందు
వలఁతి సురభులఁ గీలాగములను నిల్పెఁ
బోసె సిద్ధరసంబును బుష్కరిణులఁ
గలఁక నింద్రుండు దక్షిణకౌశికుండు.''

ఇంద్రుడు దేవగృహములతోపాటు 'నల్లిండ్లు' నిలిపె ననుట సముచితముగాని నట్టిండ్లు కట్టించె ననుట సముచితము కాదని సదర్థము భావింపగల ప్రాజ్ఞులు గ్రహింపగలరు.

శ.ర. కర్త గ్రహించిన 'కూర్పించె నట్టిండ్లు' అను పాఠము తప్పనియు, 'కూర్పించె-నల్లిండ్లు' అని యుండదగుననియు సారాంశము.

సూ.ని. ఈ విషయమును గమనింపక, 'కూర్పించు' అను పదము క్రింద, పై 'భీమ' పద్యమును, 'కూర్పించె నట్టిండ్లు' అను పాఠముతోనే ఉదాహరించినది. పొరపాటు.

ఇక్కడ చెప్పవలసిన విశేష మొకటి యున్నది. ఏమనగా : సూ.ని. 'నట్టిల్లు'కు 'గృహమధ్యభాగ' మన్న యర్థమును చెప్పినదేగాని, శ.ర. చెప్పిన 'గర్భగృహము' (గర్భగుడి) యన్న యర్థమును చెప్పలేదు.

అంతేకాదు; కేయూరబాహుచరిత్రపద్యము— అచ్చుప్రతిలో— 'నట్టిల్లు' అను పాఠముతోనుండగా 'నల్లిల్లు' అని సవరించి 'నల్లిల్లు' అను పదముక్రింద నుదాహరించియు నున్నది.

---

ఆ వ్రాతకు సంస్కృతభాషాపరిచయములేమి మూలము. ప్రాసాద శబ్దమునకు దేవగృహ మనియు, రాజగృహ మనియు రెండర్థము లున్నవి. అంతేగాని సాని యిల్లను నర్థము లేదు.

1. 'హర్మ్యాదిర్ధనినాంవాసః, ప్రాసాదో దేవభూభుజామ్' (అమరము)

2. 'ప్రాసాదము = (1) దేవళము, (2) నగరు.' (శ.ర.)

3. 'ప్రాసాదము A temple, A palace, దేవతాగృహము, రాజగృహము.' (బ్రౌను)

కాబట్టి *'కూర్పించె నట్టింఖ్లు' అను పాఠము సూ.ని. దృష్టిలోనూ తప్పే. మఱి ఆ తప్పు నదియేల కైకొన్న దనగా అది ప్రమాదము. ఆ ప్రమాద మిట్లు జరిగి యుండును.

'కూర్పించు' అను పదమున కర్థము వ్రాసినవారు 'నల్లిల్లు' నెఱిగినవారు కారు. అందువల్ల వారా యచ్చుప్రతిలోని 'నట్టిండ్లు' నట్లే యెత్తి వ్రాసికొన్నారు. 'నల్లిల్లు' కర్థము వ్రాసినవారు దాని తత్త్వ మెఱిగినవారు; కావున అచ్చుతప్పు నొప్పుగా సవరించి కైకొన్నారు.

అట్లు కాదని సూ.ని. ముదలకించుచో 'నట్టిల్లు'కు 'గర్భగుడి' యన్న అర్థము చెప్పఁజాలుట, 'కేయూర' అచ్చుప్రతిలోని 'నట్టిల్లు'ను 'నల్లిల్లు'గా మార్చుట—యను రెండు తప్పులుచేసిన ట్లేర్పడును.

## ౪. 'నడువఁ దెరవాటు'

కళాపూర్ణోదయము ('వావిళ్ల'వారి ప్రతి)లో—

"నాకుఁ దేఁ దలంచు లోకోత్తరపు వీణఁ
దనకు నొసఁగఁజేసికొనియె నార!
వరుని ప్రేమ నడువఁ దెరవాటుగొట్టె, ని
ట్లుండవలదె జగతి నువిదయైన." (౭. ౨౩౨)

అని యున్నది. 'నడువఁ దెరవాటు' అనుటలో రెండు తప్పు లున్నవి. (1) 'నడువ' అను పాఠము తప్పు. (2) 'తెరవాటు' అను శబ్దము తప్పు.

---

* 'నట్టింఖ్లు' అను పాఠమే ఒప్పనీ, 'నల్లింఖ్లు'అను పాఠము తప్పనీ వీ.బ్ర. గారు బోలెడు వ్రాసినారు.

అది యంతయు పనికిమాలిన దండుగ వ్రాత. సూ.ని. కిని విరుద మయిన వ్రాత.

*'నడుమఁ దెరువాటు' అని యుండుట యొప్పు.

సూ.ని. 'తెరువాటు గొట్టు' అను పదము క్రింద, పై పద్యమును "నడువఁ దెరువాటు గొట్టె" అను సవరణతో చూపినది. 'తెగవాటు'ను 'తెరువాటు'గా సవరించుట సరేగాని 'నడువ' నట్లే యుంచుట సరికాదు. ఆ పాఠములోని దోషమును సూ.ని. గమనింపలేదు.

తెరువాటు గొట్టినది 'నడుమఁ'గాని, 'నడువఁ' గాదు.

'మల్లాది'వారి ప్రతిలోను, ప్రౌఢవ్యాకరణములో, క్రియా. ౨౨. సూ. క్రిందను 'నడుమఁదెరువాటుగొట్టె' అను పాఠమే యున్నది. ఎందుకుండదమా?

## ౫. 'తెరవాటు'

'తెరువాటు' అనవలెను. 'తెరవాటు' అనరాదు. ఆ పదములోని రేఫము ఉత్వసహితముగాని, అత్వసహితము కాదు. ఈ సంగతి పలువు రెఱుఁగరు. సామాన్యులమాట యేల? ఆంధ్రమల్లినాథులు వేదం వేంకటరాయశాస్త్రిగారే 'ఆముక్త' వ్యాఖ్యానము—(6-40)లో —

---

* 'నడువఁ దెగవాటు గొట్టె' ను పాఠమే సాధువనియు, వగుని ప్రేమ-నడువన్—అనగా అతని ప్రేమ తనపై నిరాటంకముగా నడచుటకున్, తెర - వాటు గొట్టెన్ = నేర్పు లేక వలపు అను తెరను గప్పి, యతని యధీనమున నున్న వీణను సంగ్రహించెనని యర్థమనియు 'కవిరత్న'గారి తీర్మానము.

ప్రేమను దొంగిలించినదని చెప్పవలసినచోట వీణియను దొంగిలించినట్లు చెప్పుటయు, తెరవాటు గొట్టె—నను క్రియకు, తెరను గప్పి దొంగిలించినదని అర్థము చెప్పుటయు ననుచితమని అష్టావధాని శ్రీ బండి వేంకటరామరెడ్డిగారి మందలింపు. (చూ. 14-4-1947 త్రిలిఙ్గ)

"తెరవాటులు = దారిదోఁపుళ్లను కొట్టికొట్టి"; "తెరవాటు కొట్టి = తెరవాటుగా కొట్టి"; *"తెరవు + ఆటు" (శ.ర.) "తెరవు + వాటు (వైచుట = కొట్టుట) అని నేఁ దలంచెద" అని అత్వోయుత రేఫముతోడి రూపమునే పలుమారు లిఖించియున్నారు. ప్రమాదము.

'తెరువు' లోనిది 'ఱ' గాని 'ర' కాదనుటకు శ.ర. కర్త—"ఇట్లు పన్నగారి నగారి పొఱువు తెఱువునం జను నప్పుడు" (ఉ. హరి. ౬ ఆ.) అను శబ్దాలంకార నిబద్ధ ప్రయోగమును చూపియున్నాడు.

పారకవినోదమున కట్టివే మఱికొన్ని :—

(1) "గుఱుపాతకముల గుఱువులు
పురుషులు నరకములు చేరఁబోయెడి తెఱువుల్
పరిభవము నమ్ముఁగుఁ బొఱవులు
తరుణుల మైసిగుల యుఱులు, తగు నచ్చెఱువుల్." (విక్ర. 3.27)

(2) "తెఱవులం దెఱవు లయి విగవులుఁ బూచి ముఱవు లలరు కదంబ తఱువులును." (రాజ. శిలా. ౨. ఆ.)

(3) "తఱువాటులను జేరి తెఱువాటు గొట్టింప
పఱవాటి బల్లెంబు పాలుచేసి." (రాజ. విజ. 2.76)

(4) "పగవులు వెట్టుచుం జిలుకఁబట్టుచుఁ బుష్పాడితీన్నెఁ దొట్టుచుం
దగవులు చుట్టుచుం బుటముతట్టుచుఁ బూఁబొదరింట్లఁ బెట్టుచుం
దెగవులు నట్టుచుం జిగురుడంపములుగట్టుచు గేలికొట్టుచుం
దెఱవులు మొట్టుచుఁ జనలఁ జేసియు యొట్టుచుఁ గూర్మిఁ దిట్టుచుకా."
(బహులా. ౨. ఆ.)

---

* శ.ర. లో 'తెఱవు + ఆటు' అనియే యున్నది. శాస్త్రిగారు సరిగా గమనింపక 'తెరవు + ఆటు' అని యున్నద న్నారు.

(5) "గురువులు తమకును లోఁబడు
తెరువులు చెప్పెడు శిష్యుని వ్యసనదవికిం
*తెరువులు చెప్పఁగ నీకేటికిఁ
బరువులు పెట్టంగనేల బాలకులారా." (భాగ. 7. 246)

ఇక్కడ చెప్పవలసిన విశేష మొకటి కలదు. 'తెరువాటు' అను రూపమును గ్రహించి, అర్థము చెప్పుటయే కాక, 'తెరువాటుకాఁడు' అను పదముక్రింద, రామలింగ శతక పద్యమును—

"తెరువాటుకాఁడు చింతించునే కట్టిన
బట్ట డుల్చిన మానభంగ మనుచు" (30)

అని సాధుపాఠముతో పఠించియున్న సూ.ని., 'డుల్చు' క్రింద ఆ పద్యమునే 'తెరవాటుకాఁడు' అని తప్పుపాఠముతో చూపియున్నది.

అది యెందువల్లనయ్యా? అని నేనడుగగా, సూ.ని. సంపాదక ప్రాజ్ఞులు శ్రీ గిడుగు సీతాపతిగారు— ♦'తెరవాటు అను పదము వచ్చేవరకును, సూ.ని. పండితులకు ఆ పదములోని దోషము ఉత్పన్నమైయున్న సంగతి తెలియ'దని సమాధానము చెప్పినారు. కాని, అది సముంజసమైన సమాధానము కాదు. నిఘంటునిర్మాతల భాషాభిజ్ఞతను కాపాడు సమాధానము కాదు. సత్యమును కాదు.

ఆ తప్పు జరిగినవిధ మిట్లు: 'డుల్చు'న కర్థము వ్రాసినవారికి 'తెరువాటు' రూపము సరిగా తెలియదు. అందువల్ల అచ్చుపుస్తకములోని

* 'తెరువు' అనుట తప్పు; 'తెరవు' అనుటయే ఒప్పు అని సీ. ప్ర. గారి దొక సిద్ధాంతము. అది నిరాకరము.

♦ "డులుచు-అను పదము మూడవ సంపుటము లోనిది. అప్పటికి తెరువాటు శబ్దవిచారము కలుగలేదు. అది ప్రకటితమైనతర్వాత నాల్గవ సంపుటములో ఉండవలసిన తెరువాటు పదము పరిశీలించవలసివచ్చినప్పుడు పై పద్యభాగమే (చూ. పు. 31) ఉదాహరించి తెరువాటుకాఁడు అని సవరించుకొన్నారు." గి. వెం. సీతాపతి. (13-12-48 త్రిలిఙ్గ)

(తెరవాటు కాని' నల్లే నిఘంటువున కెక్కించినారు. 'తెరువాటు కాఁడు' అను మాట కర్థము వ్రాసినవారు దాని తత్త్వము నెఱిఁగినవారు; కావున సరియైన పాఠములోనే యుదాహరించినారు. ఈ విధముగా దొరలిన ప్రమాదములు సూ.ని. లో చాల గలవు. (చూ. ౬ మొదలు ౧౬ వరకును)

## ౬. 'నిడుపు టాఁబడ్డ'

శ.ర. లో 'క్రేళ్లుదాఁటు' క్రింద,—

(a) "అడ్డంపు నిడుపు టాఁబడ్డలగతి మన్నుఁ
బిళ్లు డొంకలనుండి క్రేళ్లుదాఁట" (స్వా. ౨. ౭)

అని యున్నది.

సూ.ని. లో 'ఆఁబడ్డ' క్రింద,—

(b) "అడ్డంబు నిడుపు టాఁబడ్డలగతి......"

అని యున్నది.

బ్రౌను ౧౮౬౧ లో ముద్రించిన ప్రతిలో,—

(c) "అడ్డంబు నిడుపు నాపడ్డలగతి......"

అను పాఠమున్నూ "అడ్డంబు - నిడుపు = అడ్డమున్ను - పొడుఁగున్ను, ఆపడ్డలగతి = ఆవుపెయ్యలవలెనే, *మనుబిళ్లు = మనుబోతులు" అను టీకయున్ను ఉన్నవి, (టీకాకర్త - జూలూరి అప్పయ్యశాస్త్రిగారు.)

'వావిళ్ల' వారి ప్రతిలోను—

(d) "అడ్డంబు, నిడుపు నాపడ్డలగతి......"

అను పాఠమూ, "అడ్డంబు నిడుపును (గల) ఆపడ్డలగతిజ = ఆవు పెయ్యలవలె" అను టీకా యున్నవి.

---

* 'పిడి' యనగా ఆడుమృగము. కావున 'మనుబిళ్లు=మనుబోతులు' అనుట పొరపాటు.

(e) ఆనందవారి ప్రతిలోను—"అడ్డంబు నిడుపు నాపడ్డలగతి" అనియే యున్నది.

ఇంతకును— 'అడ్డంపు నిడుపు టాఁబడ్డలగతి'
'అడ్డంబు నిడుపు టాఁబడ్డలగతి'
'అడ్డంబు నిడుపు నాఁబడ్డలగతి'
'అడ్డంబు నిడుపు నాపడ్డలగతి'

అను నీ పాఠములలో ఏది సరియైనది? కొంచెము విచారింతాము.

(a) అడ్డంబు (=అడ్డము) అను విశేష్యము విశేషణమైనప్పుడు వృత్తియందు వర్ణలోపమును చెంది 'అడ్డ' యగునేగాని 'అడ్డంపు' అను రూపమును పొందిన ట్లెందును కనబడుట లేదు.

అనగా అడ్డకట్ట; అడ్డకత్తి; అడ్డగోడ అన్న రూపములే గాని అడ్డపుఁగట్ట; అడ్డపుఁగత్తి; అడ్డపుగోడ అను రూపములు లేనన్నమాట. అదియునుగాక, 'అడ్డపు ఆవు' నిడుపు ఆవు అను వ్యవహారమున్నూ లేదు. కాఁబట్టి, 'అడ్డంపు నిడుపు' అను పాఠము సరిగా దనవలసి వచ్చుచున్నది.

(b) 'అడ్డంబు నిడుపు టాఁబడ్డ' లన్నపు డర్థ మేమి?

అడ్డంబు = విశేష్యము, నిడుపు (= నిడుపైన) విశేషణము. ఆ రెంటిని ఆఁబడ్డల కన్వయించు టెట్లు? అది పొసఁగదు. కావున ఆ పాఠమును సాధువు కాదు.

'అడ్డంబు నిడుపు నా(ఁబ)పడ్డ' లన్నప్పుడో!

అర్థము జా. అప్పయ్యశాస్త్రిగారు చెప్పియే యున్నారుగదా! వావిళ్ల రామస్వామిశాస్త్రిగారును 'అడ్డంబు, నిడుపును (గల) ఆపడ్డల గతిఁ=ఆవు పెయ్యలవలె' అని అర్థము వ్రాసిరి.

కాబట్టి (a) శ.ర. పాఠము, (b) సూ.ని. పాఠము సరియైనవి కావు. బ్రౌను ప్రతిలోను, వావిళ్ల ఆనందవారి ప్రతులలోను ఉన్న పాఠమే సరియైనది. ఇది నా యభిప్రాయము. పెద్ద లింకను విచారించి నిర్ణయింతురుగాక.

*చేఁద + త్రాడు = చేఁత్రాడు - అయినట్లే, ఆవు + పడ్డ = ఆ పడ్డ కావచ్చునేమో!

ఒక మాట—

'ఆఁబడ్డ' యను పదము క్రింద "...టాఁబడ్డలగతి" అన్న సూ.ని.యే 'అడ్డము' అను పదముక్రింద "...నాఁబడ్డలగతి" యన్నది. మళ్లీ ఆ సూ.ని. యే 'నిడుపు' అను పదముక్రింద "...నాపడ్డలగతి" యన్నది.

ఇట్లా నిఘంటువు ఒక పద్యమునే ఒక చోట 'టాఁబడ్డ'లనీ, మఱియొకచోట 'నాఁబడ్డ'లనీ, ఇంకొకచోట 'నాపడ్డ'లనీ భిన్న భిన్న పాఠములతో నుదాహరించుట సరియగునా? అట్లు జరుగుటకు కారణ మేమి? ఇంతకును ఆ పాఠములలో ఏది సాధువో జిజ్ఞాసువులు నిర్ణయించుకొనుటెట్లు?

## (పాలువిడిచిన ఆవుపెయ్య)

ఆఁబడ్డ యను పదానికి సూ.ని. 'పాలువిడిచిన ఆవుపెయ్య' యని యర్థము చెప్పినది. అదియును సరికాదు. 'పడ్డ'యనగా పాలువిడిచినదూడ కాదు. ఈడేరి కట్టుటకుతగిన వయసులోనున్న పశువు.

శ.ర.లో, "పడ్డ = తొలిచూలియావు (లేక) గేదె" అని యున్నది. బ్రౌన్యములో, "పడ్డ. A female buffalo or cow, fit for breeding" అని చెప్పబడి యున్నది.

---

* "క్రొత్త మొదలగు కొన్నిటి లుప్తశేషమునకుఁ గొన్ని శబ్దములు పరమగునపుడు నకారము కానరాదు. చేఁదు, చేఁత్రాడు."—

(ఆం.భా.శా. సంధి. సూ. ౨౧)

'చేఁత్రాడు' అని శ.ర. కర్త అరసున్న పెట్టి గ్రుతకార్యములేని రూపమునే చూపినాడు. ఆ భాగ్యమున కరసున్న పెట్ట నేల?

మనుచరిత్రలో క్రేళ్లుఱాలిన మానుఁబిడ్డను యౌవనము వచ్చిన ఆవు పెయ్యలను పోలి యుండెననుట యుచితముగాని, చన్నుమున్నుగా *పాలు విడిచిన ఆవుదూడలవలె నుండె ననుట ప్రకరణోచితము కాదు.

## ౭. 'అఁబెయ్య'

సూ. ని. లో 'క్రుమ్ములాడు' క్రింద,—

"కాసర కాఁబోతు నాఁబోతుఁ గ్రుమ్ములాడ
నడిమి యాఁబెయ్యగతివచ్చె నాకు నిపుడు." (కాశీ. ౫-౧౬౪)

అని యున్నది.

'ఆబోతు లాబోతులు కుమ్ములాడి లేగల కాళ్లు విరుగగొట్టినట్లు' అని లోకోక్తి. ఈ లోకోక్తియే గ్రామ్యమున నిట్లున్నది.

"ఆవులావులు పోట్లాడి(తే) లేగల కాళ్లు విరుగుతవి'. When the great fall out the poor suffer."

ఆవులుగాని, ఆబోతులు గాని కుమ్ములాడితే ఆ కొట్లాటలో నలిగి విరుగునవి 'లేగల' కాళ్లు. లేగ లనగా లేతదూడలు. ఈ సందర్భము వచ్చు

* "క్రేళ్లురుకు పడ్డలు పాలతోపాటు శైశవదశనువీడి, యౌవ్వనారంభములోనుండునవియే క్రేళ్లురుకును. క్రేళ్లురుకుట యనఁగా చెంగుచెంగున గంతులు వేయుట గదా? అట్టి గంతులు యౌవ్వనారంభములోనున్న దూడలు గంతులువేయును. గాని యెదయయి మేతసేళ్లు మాని కోడెలైనవి పెరుగు పడ్డలు క్రేళ్లురకవు." అంటారు వీ.బ్ర. గారు.

పడ్డలు, పాలతోపాటు శైశవదశను వీడునట! శైశవమును వీడుట వాటి యిష్టమే కాబోలు!! పాలు విడిచినంతనే ఆ దూడలకు యౌవ్వనారంభమగునట. ఏమి జ్ఞానమండీ! పాలుమానిన పసిబిడ్డ లందరూ యువతులూ, యువకులే నన్నమాట!!!

అది యట్లుండనిండు:- 'క్రేళ్లురుకుపడ్డలు క్రేళ్లురుకును' అట్టి గంతులు దూడలు గంతులువేయును' అనగా అర్థ మేమిటి?

వాక్యమయినను సరిగా వ్రాయలేనివారికి సాహిత్యచర్చల జోలి యెందుకో!

నట్లే శ్రీనాథుఁడును కవిత్వము చెప్పియుండును. కాని, సూ.ని. పాఠమును బట్టి (ఆఁబెయ్య = ) ఆవుదూడ' వచ్చునేగాని, 'లేఁగదూడ' రాదు.

'లేఁబెయ్య' అనియే సరియైన పాఠము.

1916 లో ముద్రితమైన 'వావిళ్ల' వారి ప్రతిలోను, శ.ర. లో 'క్రమ్మఱలాడు' - 'దెస' అను రెండుపదములక్రిందను 'లేఁబెయ్య' అను పాఠమే యున్నది.

మరి విశేష మేమనగా:— సూ.ని. 'దెస' అను పదముక్రింద 'లేఁబెయ్య' పాఠమునే చూపినది. కాబట్టి అచ్చుప్రతిలోను, శ.ర. లో రెండు తావులలోను, సూ.ని. లోను గూడా ఉండుటనుబట్టియు, లోకోక్తి కనుగుణమై యుండుటవల్లను *'లేఁబెయ్య' పాఠమే సాధువు. ఆఁబెయ్య పాఠ మసాధువు.

సూ.ని. ఆ యసాధుపాఠము నెక్కడ సంపాదించినదో చెప్పదు. 'క్రమ్మఱలాడు' క్రింద 'ఆఁబెయ్య' అనీ, 'దెస' క్రింద 'లేఁబెయ్య' యనీ భిన్నపాఠములను చూపుటకు కారణమేమో మన కంతుపట్టదు.

(గతి, దెస)

వావిళ్లవారి అచ్చుప్రతిలో "నడిమి లేఁబెయ్య గతి వచ్చె" అని యున్నది. శ.ర. లో రెండు తావులలోను "నడిమి లేఁబెయ్య దెస" అని యున్నది.

---

* "లేగ - అన్నను 'పెయ్య' అన్నను నప్పుడు పుట్టిన వత్సమునకే పేరు కావున పెయ్యను లేతపెయ్య అనుటలో సారస్యము లేదు"—అని వీ. బ్ర. గారి వ్రాత.

పెయ్య యనగా సామాన్యముగా 'దూడ'; అందును ఆడుది యగును. అంతేగాని, లేఁగ కాదు.

ఆం. భా. లో— 'తనరు లేఁగ యనంగఁ దర్ణకంబు'; 'కోడె

సూ.ని. 'పెస' క్రింద "పడిని లేఁబెయ్యఁగవచ్చు" అను పాఠమును చూపి......"ఇది, శ.ర. పాఠము; లేఁబెయ్య గతి వచ్చు – అని ముద్రిత ప్రతిపాఠము" అని సూచించినది. ఆ ముద్రితప్రతి యెక్కడిదో చెప్పదు.

ముద్రితప్రతిలో 'లేఁబెయ్యగతి' అని యుండఁగా, మరి తాను 'క్రుమ్ములాడు' క్రింద 'ఆఁబెయ్యగతి' యని గ్రహించు టేమి?

పాఠవిషయమున సూ.ని. తగినంత శ్రద్ధ వహింపలేదు.

## ౮. 'కాఁడయి'; 'కాఁడుగ'

సూ.ని. లో 'అబ్బకాఁడు' క్రింద, వేంకటకవి పంచతంత్రములోని పద్య మిట్లుదాహరింపబడినది:

క. "అని చిందరేఁగి యట్ల
చ్చెనటి.........
ఘనజఘనం బాసి యబ్బకాఁడయి పోయెన్" ౪. ౨౯౨
(ఇది చిన్నయసూరి నిఘంటువు పాఠమట)

---

యనఁగఁ బెయ్య యనఁగ గోప్రభృతిపుంస్త్ర్యపత్యముల్'—అని చెప్పబడి యున్నది. అట్లే, శ.ర. లోను—"పెయ్య = 1 పాలువిడిచిన ఆఁడుదూడ; 2 దూడ. లేగ = క్రొత్తగాఁ గలిగినదూడ, తర్ణకము" అని యున్నది.

కావున వీ.బ. గారి వ్రాత సరియైనది కాదు.

"ఈ పెయ్యలలో మగవానికంటె 'ఆఁబెయ్యలే' దుష్టలనులు గనుక "ఆఁబోతు నాఁబోతు గ్రుమ్ములాడునపుడు కాళ్లను విరుగఁగొట్టు కొనునవి 'ఆఁబెయ్య' లనుటయే సరసము గాదా" అని వారిదే మఱియొక వ్రాత.

మగవానికంటె ఆఁబెయ్యలే అనుటలో అర్థమేమొ వారే చెప్పవలె. ఆఁబెయ్యలు (తామే) కాళ్లను విరుగగొట్టుకొనునట! నిజమేనా? ఎందుకు విస్తరము:. వారి వ్రాతలు అర్థశూన్యములు.

సూ. ని. యీ పద్యమునే మరల 'చిందరేఁగు' క్రింద—

"అని.........యబ్బకొడుకఁ జనియెఁ"

అను పాఠముతో చూపినది. ఈ పాఠ మే ప్రతిలోనిదో సూ.ని. చెప్పలేదు. తొలిపాఠమును వదలి యీ పాఠమును గ్రహించుటకు హేతువేమో తెలుప లేదు.

వావిళ్లవారి ప్రతిలోను, 'అబ్బకొడుకు' క్రింద, శ.ర. లోను—

"అని చిందరేఁగిన ట్లు, చ్చెనటి...యబ్బకొడుకఁ బోయెఁ"

అని యున్నది. సరియైన పాఠ మేదో?

## ౯. 'చారు' ; 'చేరు'

శ.ర. కర్త "చారు = మిరియములోనగు సంభారములను చేర్చి కాఁచిన చింతపండిరసము" అని చెప్పి— "ఈ యర్థమం దిది యిట్లు దంత్యాదిగా నొకచోట ప్రయోగింపబడి యున్నది. అయినను వాడుక యందు తాలవ్యాదిగా కనబడుటవలన అది (?) యుక్తముగా తోఁచదు." అన్నాడు. అంతేకాక 'చేరు'నుకూడా మూలపదములలో చేర్చి 'చారు'కు చెప్పిన యర్థమునే చెప్పినాడు. కాని, యే రూపమునకును ప్రయోగము నియ్యలేదు.

వే. వే. శాస్త్రిగారు నెల్లూరు పురమందిరమున ఆంధ్రసాహిత్య పరిష దష్టమ వార్షికసభ కధ్యక్షులైనప్పుడు "విమర్శల విషయమున రసమును (అనఁగా చేరును) రుచి చూచి ఈ రసమెవరిది (అనఁగా నీ చారు నెవరు కాఁచినారు) అని యడుగవలయును. అట్లడిగినదే రసము" అన్నారు.

వారి దృష్టిలోను 'చారు' అపశబ్దము, 'చేరు' సుశబ్దము. సూ.ని., శ.ర. ననుసరించి 'చా' క్రింద 'చారు', 'చే' క్రింద 'చేరు' పఠించి,

శ.ర. లోని యర్థమునే యనుసరించినది. కాని, ఉదాహరణమును 'ౘేరు' అనుట సరికాదు. ౘారు (ఱు) అనియే అనవలెను. 'ౘారు' సంస్కృత 'సార' శబ్దమునకు వికృతి.

సారము = ౘారు అనుటకు ప్రమాణము.

"సారం భోజనసారం, సారం సారంగలోచనాధరతః
పిబ ఖలు వారంవారం, నోచేన్ముధా భవతి సంసారః.
అమ్లికాఫలసంభూతం, సారం వాతవినాశనమ్
పిత్తశ్లేష్మకరం కించిత్, సురుచ్యం వహ్నిబోధకమ్."
యోగరత్నాకరము. (పు. ౧౩౪)

సారమే కన్నడమున 'సారు', తెనుగున 'ౘాఱు' అయినది. కన్నడమున 'చాఱు' అనియును కలదు.

"చాఱు = సాఱు. Sap, juice, broth. See పుళిచాఱు"

"పుళిచాఱు = A broth or sauce made of tamarind, salt etc." (కన్నడ నిఘంటువు)

సూ.ని. 'ౘాఱు'కు, 'ౘేరు'కు కూడ ప్రాచీనరచనలను చూపినది. కాని 'ౘేరు'కు చూపినవి ప్రమాణములు కావు. ఎందువల్లననగా అవి మార్పరాని యతిస్థానప్రయోగములు కావు.

"శబ్దస్వరూపమును నిర్ణయించుటకు శబ్దస్వరూపము మార్చినచో ఛందోభంగమగునట్టి ప్రయోగములు ... పరమప్రమాణములు" అని ఆ నిఘంటువే 'గ్రంథనిర్మాణపద్ధతి'లో వక్కాణించి యున్నది.

సూ.ని. 'ౘాఱు'కు చూపిన వన్నియు, (*ౘారులు పిండివంటలును

---

* 'ౘాఱులు' అని శ్రీ ప్రభాకరశాస్త్రిగారి పాఠము :—

"ఈ తెలుగుపదములందే యుండును. 'చాఱులు' తెలుగుపదమగుచో

శర్కరయుఙ్ (హర. ౨.౩౧) మొదలయినవి) యతిస్థాన ప్రయోగములు. కావున అవియన్నియు గ్రహింపదగినవి. 'చాఱు' సాధురూపము.

'చాఱు'కు అట్టివే మరికొన్ని ప్రయోగములు :

"చాఱులేకాదు బజ్జి పచ్చళ్లతీరు" (పాంచా. 4.53)

"చాఁదుబాగున నల్ల చారుగాఁచి" (హర. 2.121)

"జాఱుటయనఁగ బజాఱు వా
జాఱము మొగసాల మఱియుఁ జాఱులు" (స.సా.సం. 3.185)

"పులిచారు వంచె నొక్కతె
పులిచాఱలచీర గట్టి భోక్తల కేకా
వళిచారు చంచరీకా
వళిచారు చలత్కచాళి వహి మహి పొగడఙ్. (బహులా, ఆ. 4)

చింతపండురసమును 'చేరు' అనుట తప్పనియూ, 'చాఱు' అనుట ఒప్పనియూ, 'చాఱు' తత్సమము తెలుగని సంస్కర్తలు ప్రాచీన రచనల లోని 'చాఱు'ను 'చేరు'గా మార్చి ముద్రణమున వెలయించిరనియూ సారాంశము.

---

'చాఱులు' గావలసియుండునుగదా! 'సారం' అను సంస్కృతశబ్దమునుండి వచ్చినదగుటచేత 'చాఱు' తెనుగు గాదు. అందువలన అందలి 'చా' దంత్యముగ నుండజాలదు. కావున (హరవిలాస పద్యములోనిది) చారులును కాదు; చాఱులును కాదు. మూలగ్రంథము చూచితిని. అందు 'చాఱలు' అని యున్నది. శ్రీనాథుడు వండించినది 'చాఱలు'. చాఱలనగా, చాఱ = మత్స్యవిశేషము, చాఱకంద, చాఱపప్పు... అని శబ్దార్థచంద్రిక". అని వీరబ్రహ్మంగారి ఆక్షేపము.

ఈ యాక్షేపమునకు సమాధానము చెప్పవలసినవారు సూ.ని. పండితులేనని నా సమాధానము.

ౘంగలించు; ౘాలు; ౙడ; ౙాఱు మొదలగు దంత్యాదులను, చెఱ; చెమట; చేప; చేట మొదలగు తాలవ్యాదులనుకూడ— చంగలించు; చారు; జడ; జాణ; చర; చమట; చాప; చాట అని తాలిచకారజకారములతోనే ఉచ్చరించు వాడుక లోకవ్యవహారమున నున్నది. ఆ వాడుక క్రమక్రమముగా వ్రాతలోనికిని, అందుండి అచ్చులోనికిని ప్రవేశించినది.

రాయసగాండ్లు, అచ్చువారుగూడా ఇది దంత్యము (రెండవ చకారము; రెండవ జకారము) అని తెలియుట కౌ చ-జ ల మీద నుంచవలసిన '–' (రెండు) గుర్తు నుంచమానినారు. అందువలన సామాన్యుల మాట యటుండ ప్రాజ్ఞులుకూడా ఒక్కొక్కయెడ తప్పుగ కన్గొనుట తటస్థించుచున్నది.

ఒక్క యుదాహరణము :—

గౌరన హరిశ్చంద్రలోని "చిడుము గోకుచుం ౘెఱం జిక్కినట్లుండి" అన్న నక్షత్రకుని వచనము, వ్రాతలో—

"చిడుముగోకుచు జరం జిక్కినట్లుండి"

అని మారినది. 'ౘెఱ' వ్రాతలో 'జర'గా మారినసంగతి గమనింపక కీ. శే. వెంకటరాయశాస్త్రిగారు 'జర' గానే గ్రహించి

"జరన్ = ముసలితనముచేత"

అని టీక వ్రాసినారు. ౘెఱం జిక్కినట్లు = ౘెఱలోఁ బడ్డట్లు—అని చెప్పుట ప్రకరణమున కుచితము. 'ముసలితనముచేత చిక్కినట్లు' అని చెప్పుట యనుచితము.

ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమున నున్న వ్రాత ప్రతిలో — 'చిడుముగ్రోకుచు = తీటపక్కులు గిల్లుకుంటున్న, చెరజిక్కినట్లుండి = బందెఖానాలో పడినట్లుగా నుండి' అని టీక వ్రాసియున్నది.

కాబట్టి, శాస్త్రిగారు 'ౘెఱ'ను 'జర'గా (ముసలితనముగా) గ్రహించుట పొరపాటు. ఇట్లే వారు 'జలగ'లోని 'జ' కారము దంత్యమని గమ

నింపక తెనుగున 'జ' ఉండరాదన్న భావమున 'జెలఁగ'గా సవరించినారు. 'గిడుగు' వారు ప్రామాణికప్రయోగములను జూపి శాస్త్రిగారి సవరణ తప్పని నిరూపించినారు. (చూ. ఆ. పం. భా. భేషజము)

'చెఱ' - 'జలఁగ' అను పదములు వ్రాయసగాండ్ర అజ్ఞానమునను, సంస్కర్తల అపరిశీలకతవలనను 'చర' - 'జెలఁగ' అయినట్లే, 'చాఱు' 'చారై' - 'చేరు' అయినది. ఆ 'చేరు'ను నిఘంటువు లన్నీ గ్రహించినవి.

ఇక్కడ నొక మాట :— 'చెమట'ను 'చమట' యనుట వ్యవహార మున నేకాక,—

"కన్నీరు గ్రమ్మఁ గంపించు గుబ్బ
చన్నులపై జాఱఁ జమట మైఁ దొరఁగ"

అని, (మద్రాసు యూనివర్సిటీవారు ముద్రించిన) నవనాథచరిత్ర (పుట. 145)లో మార్చ వీలుపడని యతిస్థానమునను గనబడుచున్నది.

అచ్చులో నుంటయే ప్రమాణముగా 'చేరు'ను తీసికొన్న సూ. ని., అచ్చులోను యతిస్థానమునను కూడా ఉన్న 'చమట'ను తీసికొనలేదు! హేతు వేమో?

నవనాథచరిత్రను నేను చూడలేదని సూ. ని. యనుట పొసగదుగదా!

## ౧౦. 'నల్లఁజారు'

సూ. ని. 'చాఁదు' క్రింద హరవిలాసపద్యమును—

"*మూల్గు లెమ్ములతోడ ముదక గాకుండఁగఁ
జాఁదు సేసిన నల్లఁ జారుగాఁచి" (హర. ౨-౧౨౧)

---

* శ.ర. లోను, బ్రౌణ్యమునను కూడా, 'మూలఁగ' అనురూపమే.

అని యుదాహరించినది. లోకవ్యవహారమున, 'గుమ్మడికాయ కూరచేసితిని, వంకాయ పప్పులో వేసితిని, కాకరకాయ తాలింపు పెట్టినాను. బెండకాయ పులుసు చేసినాను' అనురీతి వాడుక కలదు గాని,— 'గుమ్మడికాయఁ గూరచేసితిని, వంకాయఁ బప్పులో వేసితిని, కాకరకాయఁ దాలింపు పెట్టినాను, బెండకాయఁ బులుసుచేసినాను' అనురీతి వాడుక లేదు.

తెనుగు మాతృభాష కానివారు, వ్యాకరణ సహాయమున తెనుగు నలవరుచుకొన్నవారు, అందును 'ద్వితీయకుం బ్రథమయగు' నన్న సూత్ర మెరుగనివారు అలా అంటే అందురేమో గాని, శ్రీనాథునివంటి తెనుగుకవి 'నల్లఁ జారుగాఁచి' అని, అనియుండడు.

వావిళ్లవారి ప్రతిలోను, శ్రీ వే. ప్ర. శాస్త్రి గారు పరిష్కరించిన ప్రతిలోనుగూడా 'నల్లచారుగాఁచి' అనియే యున్నది.

ఈ 'ఁజారు' పాఠమును, సూ.ని. యెక్కడ సంపాదించినదో!

ఇక్కడ నొక విశేషము—శ్రీ 'వేటూరి'వారి ప్రతిలో, పాఠము

'చాఁదుబాగున'

అని యున్నది. 'నల్ల = నత్తురు, చాఁదుబాగునఁజా - చాదుపటె - చిక్కఁగా, చారుగాచి' అని ఆ పాఠమున కర్థము. కాఁపున అదియే సాధుపాఠముగా నున్నది. సూ.ని. ఆ పాఠమును తీసికొనకపోవుటకు కారణ మేమో? ఆ పాఠము తనకు సమ్మతము కానిచో పాఠాంతరముగా నైనను చూపవలదా? చూపలేదే! సూ.ని. ఆ ప్రతిని చూడనేలేదేమో!

ఇంతకును, సూ.ని. తీసికొన్న "చాదుసేసిననల్లజా" అను పాఠమున కర్థమేమో?

---

గాని 'మూలుగు' అనురూపము లేదు. 'మూలగ' అనియే లోకమున వాడుక. ఐతే— పండుగు, పండుగ, దండుగు, దండుగ అన్నట్లు మూలుగు, మూలగ అని రెండు రూపములు నుండవచ్చునేమో!

## ౧౧. 'చేరు'; 'చేరుద్రావుట'

చేరు అనగా పశువుల మగగుఱి. చేరుమాద (= చేరువాచుట) = పశువులకు వచ్చు ఒక వ్యాధి.

'చేరు' పశుముష్కమునందును వర్తించును. ముష్కమర్దనమును *'చేర్లుకొట్టుట' యందురు.

కన్నడభాషలో 'చేరు'కు పశుముష్కమనియే అర్థము.

కన్నడ నిఘంటువులో — "చేరు - Testicles swollen from venereal disease" అని చెప్పబడి యున్నది.

కొన్ని పశువులు లింగమును చుంబించుకొనును; - కొన్ని తమ మూత్రమును పానము చేయును. అట్టి దురభ్యాసమును—

'చేరుద్రావుట'

యందురు. ఈ పదమును, అప్పకవి,—"చేరుద్రావుట, చూరి చిన్నకత్తి" (2-196) యని రేఫాక్షర సీసమాలికలో పేర్కొనియున్నాఁడు.

ఈ 'చేరుద్రావుట' లోని 'చేరు'ను చింతపండు 'చాఱు'గా భావించిన సంస్కర్త లెవరో 'చేరు' అపశబ్దమనుకొని, 'చారు'గా మార్చి, యతి రక్షణార్థము, 'చూరి చిన్నకత్తి' యను పూర్వపాఠమును— 'చిన్నచూరి కత్తి' యని తారుమారుచేసి,— "చారుద్రావుట చిన్ని చూరి కత్తి" అని, అప్పకవి రచనను అమాంతముగా మార్చివేసినారు. 'చూరి = చిన్నకత్తి' యని అప్పకవిరచనలో అర్థము. 'చిన్నచూరి కత్తి' యన్న సవరణ అర్థ శూన్యము. అది, 'చేరు' అను పదమున కర్థమునూ, 'చేరుద్రావుట' అను జాతీయమునూ ఎఱుగని సాహసపు సవరణ.

---

* ముష్కమర్దనమును 'కొలుపట్టుట' యనియు నందురు. శ.ర. కర్త చెప్పలేదు. సూ.ని. లో లేదు.

ఈ యెల్లవిషయములను గమనించి 'గిడుగు' పండితులు, అప్పకవీయములో- "చేటభ్రాంతురు చూపి చిన్నికత్తి" అని సాధుపాఠమునే మరల నెలకొలిపినారు.

## ౧౨. 'కలువడము' : 'కలవడము'

సూ.ని. లో 'చానపి' క్రింద —

"సీ. *కలువడంబు, కలాపి, కలయంపి, చానపి. (ఆం.భా. ౨.౨౩) అని యున్నది.

కలయంపి యను నర్థమునిచ్చు పదము 'కలవడము' కాని 'కలువడము' కాదు. కలువడము అనగా, (కలువ)పూలదండ. "కలువడము = కలువ పూలదండ, ప్రాలంబమాలిక" యనియును, "కలవడము = గోముఖము; అలుకుట" యనియు సూ.ని. లోనే యున్నది.

అది యట్లుండగా ఆ సూ.ని. లోనే కలయంపి, కలవడము అను రెండు పదముల క్రిందను, పై పద్యమే 'కలవడంబు' అను పాఠముతో చూపబడి యున్నది. మరియు నా పాఠము 'బ్రౌ', వ్రాతప్రతి పా.' అనియు తెలుపబడి యున్నది.

'కలవడము' క్రింద "కలవడంబు కలాపి" అను పాఠమును చూపి, "ఇది బ్రౌను, వ్రాతప్రతుల పాఠము" అని చెప్పిన సూ.ని. మళ్లీ, 'చానపి' క్రింద "కలువడంబు, కలాపి" అను తప్పుపాఠమును చూపుట యెందుకు? ఆ పాఠ మే ప్రతిలోనిదో చెప్పకపోవు టేల?

---

* శ.గ. లో 'కలవడము' లేదు. శ.ర. కర్త 'కలాపి' క్రింద "సీ. కలాపి కలయంపి చానపి యన గోముఖాఖ్యయై యలుకుచుండు. ఆం.భా. ద్వి." అను పద్యము నుదాహరించియు, ఆ పద్యపాదమున ప్రారంభముననే యున్న 'కలవడంబు' అను పదమును గ్రహింపలేదు. పద్యపాదము నుదాహరించుటలోను ఆ పదము నుజ్జగించినాడు. ప్రమాదము.

సూ.ని. చెప్పలేదు గాని, ఆ 'కలువడంబు' పాఠము 'వావిళ్ల'వారి ప్రతిలోనిది. ఆ ప్రతిలో 'ల'కు బదులు 'లు' పడినది. అది అచ్చుతప్పు. సూ.ని. ఆ యచ్చుతప్పు నట్లే తీసికొన్నది.

## ౧౩. 'మర్ధ' ; 'మూర్ధ'

సూ.ని. లో 'గొరగ' క్రింద—

"వీరమైలారుదేవర వీరభటులు
గొండ్లియాడుచునున్నారు గొరగపడుచు
నాడుచున్నది చూడు మర్ధాభినయము
తాను సెట్టికసీలంతగాని లేదు" (క్రీడా. ౧౪౩)

అనియు, 'సెట్టికసీల' క్రింద—

"... ... ...
... ... గొరగపడుచు
నాడుచున్నది చూడు మూర్ధాభినయము
తాను సెట్టికసీలంతగాని లేదు"

అనియు భిన్నపాఠము లున్నవి. ఆ పాఠము లెక్కడివో, తా నట్లొక చోట నొకపాఠమును, ఇంకొకచోట నింకొకపాఠమును చూపుటకు కారణ మేమో సూ. ని. చెప్పలేదు.

నేఁడు ప్రచారములోనున్న క్రీడాభిరామము ప్రతులు రెండు :

(1) శ్రీ మానవల్లి రామకృష్ణకవి గారిది.
(2) శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారిది. (సుపరిష్కృతము)

కవిగారిప్రతిలో పాఠ మిట్లున్నది:—

"వీరమైలారుదేవర వీరభటులు
గొండ్లియాడించుచున్నారు గొరగపడుచు
నాడుచున్నది చూడు మర్ధాభినయము
తాను సెట్టిగసీలంతగాని లేదు"

శాస్త్రిగారి పాఠ మిట్లున్నది—

> ''వీరు మైలారుదేవర వీరభటులు
> గొండ్లి యాడించుచున్నారు గొరగపడుచు
> నాడుచున్నది చూడు మూర్ధాభినయము
> తాను నెట్టికసీలంతగాని లేదు''.

ఈ పరిశీలనమువలన, సూ.ని. 'నెట్టికసీల' క్రింద చూపిన 'మూర్ధాభినయము' పాఠము శాస్త్రిగారిప్రతిలోని దని యేర్పడినది; కాని, 'గొరగ' క్రింది 'మర్ధాభినయ' పాఠ మే ప్రతిలోనిదో యేర్పడుట లేదు.

కవిగారిప్రతిలో 'మర్ధాభినయ' మున్నది; కాని, 'గొండ్లియాడించుచున్నారు' అని లేదు; 'ఆడించుచున్నారు' అని యున్నది. 'గొరగ' అని లేదు; 'గొరిగ' అని యున్నది. 'నెట్టికసీల' అని లేదు; 'నెట్టిగసీల' అని యున్నది.

కాబట్టి సూ.ని. పాఠ మెక్కడిదో సంకరపాఠము గాని సరియైన పాఠము కాదు అనిపించుచున్నది.

సుపరిష్కృతమైన శ్రీ శాస్త్రిగారి పాఠ ముండఁగా సూ.ని. అట్టి తప్పు పాఠమేల కైకొనెనో!

## ౧౪. 'తారి'; 'దారి'

సూ.ని. తకారాదిపదములక్రింద, ''తారి = ఆట ఆడించెడు సూత్రధారుఁడు'' అనిచెప్పి, ''సీ...తారి నాఁగను సూత్రధారకుండు.'' అని, ఆంధ్రభాషార్ణవ పద్యము (౨-౨౫౭) నుదాహరించినది.

మళ్లీ, దకారాదిపదములక్రింద, ''దారి = సూత్రధారుఁడు'' అని యర్థముచెప్పి, ఆ (ఆం. భా.) పద్యమునే-''దారినాఁదగు సూత్రధారకుండు'' అను పాఠముతో చూపినది.

"తారినాఁగను" - "దారినాఁదగు" అను రెండు పాఠములలో, ఆం. భా. కర్త పాఠ మేదో ఒకటి యగునేగాని రెండును అతనిపాఠములే యగుట అసంభవముగదా! అతని పాఠమేదో నిర్ధారణగా తెలిసికొనిగదా నిఘంటువు తీసికొనవలసినది?

'తా' క్రింద 'తారి' యని, 'దా' క్రింద 'దారి' యని ముద్రించుటయు, తదనుగుణముగా కవిపాఠమునకును ద్వైవిధ్యము కల్పించుటయు ప్రమాదము కాదా?

ఆ ప్రమాద మిట్లు జరిగియుండునని నా తలంపు.
ఆం. భా. (1912. 'వావిళ్ల' వారి ప్రతి)లో, పాఠము,

"నటుఁడొప్పు నట్టన నట్టువుం డనఁగను,
దారి నాఁడగు సూత్రధారకుండు"

అని యున్నది. ("దారినాఁగను" అను పాఠముగల ప్రతి వేరొకటి యున్నదికాబోలు.) సూ. ని. పండితులలో తకారాదిపదములను సంత రించినవారు, ఆ 'దారి' లోని 'దా'ను, ఆదేశసరళముగా గ్రహించి, "తారినాఁగను" అను పాఠమును తీసికొన్నారు.

దకారాదిపదములవారు, ఆ 'దారి' సరళాదియే యనుకొని, "దారినాఁడగు" అను మాటల నట్లే వ్రాసికొన్నారు. ఎవరి 'దారి' వారిదే. ఒకరిసంగతి, ఒకరికి తెలియదు. అందువల్ల, అటు వారి 'తారి' ఇటు వీరి 'దారి' రెండు అచ్చైకూర్చున్నవి. పరిశీలన సరిగా జరుగలేదన్నమాట.

ఇంతకును 'తారి' సాధువా? 'దారి' సాధువా? అంటే; శ. ర. కర్త, బ్రౌనుకూడా తకారాదిరూపము ('తారి')నే తీసికొన్నారు.

"తారి = ఆటాడించెడి సూత్రధారి" (శ. ర.)

"తారి = The principal actor or manager of a Company. సూత్రధారుడు ఆం. భా. మేళనాయకుడు." (బ్రౌ)

ఆంధ్రపద పారిజాతములోను, 'తారి = సూత్రధారకుడు' అనియే యున్నది. కాబట్టి, 'తారి' అనునదే సాధురూపమని యేర్పడుచున్నది. పండితు లింకను పరిశోధింతురుగాక.

## ౧౫. 'తప్పఁజేసి'; 'తప్పసేసి'

సూ. ని. 'చేసి' అను పదముక్రింద,—"చేసి. అవ్య. తృతీయార్థక విభక్త్యర్థకము. (*ఇది 'చేత' విభక్త్యర్థక ప్రత్యయాంతములవలెను, 'వలన' వర్ణకమునకును తఱచుగ ననుప్రయుక్తమగును)" అని చెప్పి, అందు కుదాహరణముగా,

> "వెలివెట్టిరే బాడబులు పరాశరుఁబట్టి
> దాశకన్యాకేళి తప్పఁజేసి." (మను. ౨-౬౩)

అను పద్యము నిచ్చినది.

అందువల్ల, పై పద్యములోని 'తప్పఁజేసి' అనుమాటను, సూ. ని. 'తప్పచేత' అని యర్థము చేసికొన్నదనియు, ఆ యర్థమున 'తప్పఁ + చేసి' అని విభాగమనియు నేర్పడుచున్నదిగదా.

మళ్లీ, ఆ సూ.ని యే, 'తప్ప' అను విశేష్యమునకు 'చేయు' అను క్రియ అనుప్రయుక్తమై, యేకపద (శబ్దపల్లవ) ధాతువైనట్లు గ్రహించి "తప్పచే (సే)యు" అను క్రియను, మూలపదములలో చేర్చి "తప్పుగా నెంచు" అని యర్థము చెప్పి, ఆ యర్థమునకు ఉదాహరణముగా, మళ్లీ ఆ మనుచరిత్రపద్యమునే,—

> "దాశకన్యాకేళిఁ దప్పసేసి"

అను పాఠముతో చూపినదే! అది యెలాగండీ!!

తొలిపాఠమున 'కేళి' కళ; 'తప్ప' ద్రుతప్రకృతికము.

మలిపాఠమున 'కేళి' ద్రు. ప్ర. 'తప్ప' కళ.

తప్పేది? ఒప్పేది? అసలు కవిపాఠ మేది? పరస్పరవిరుద్ధపాఠములా నిఘంటువులో చేరినదారి యేది?

---

* ఈ వివరణము, ఉదాహరణపద్యము ప్రౌఢవ్యాకరణమునుండి గ్రహింపబడినవి. (చూ. కారక. ౪)

సీతారామాచార్యులవారు, *పారి. వ్యా. లోను, 'వెలిపెట్టు' అను పదముక్రింద శ.ర. లోను, 'తప్పఁజేసి' అను పాఠమునే చూపియున్నారు.

కాని, దాశకన్యాకేళి, తప్పుచేసి (= తప్పుగా నెంచి) అను పాఠమే యుచితమైనది. తప్పుగా నెంచి వెలిపెట్టితే? అనగా, తప్పుగా నెంచలేదనియు – అందువల్లనే వెలిపేయలేదనియు భావము.

'తప్పుచేత వెలివెట్టిరే?' అనుచో, దాశకన్యాకేళి తప్పేయనియు, అయినను ఆ తప్పుచేత వెలిపెట్టలేదుగదా యనియు నర్థమగును.

'కేళి' తప్పని, పరూధిని ఒప్పుకొన్నట్లు చెప్పుటకంటే, తప్పుకాదని నిరూపించినట్లు చెప్పుట యుచితతరము కాదా?

''తప్పుజేసి = నేరముగా నెంచి'' అనియే జూలూరివారి టీక. ('తప్పుచేసి' అను క్రియయే 'తప్పుజేసి' అని వాడబడినది. అది ఆనాటి సంప్రదాయము.)

వావిళ్లవారి ప్రతిలోను,—'తప్పునేసి' అనియే పాఠము.

'దాశకన్యాకేళిక = ...మత్స్యగంధియొక్క కలయికను, తప్పునేసి = తప్పుగాఁగొని' అని వారి టీక.

## ౧౬. 'చేతప్పఁగొను'

'కొను' అను పదముక్రింద, ''౫. కొను = పొందు, స్థాపించు. (ఇది పెక్కుపట్ల విశేష్యముల కనుప్రయుక్తమై ఈ యర్థముతో శబ్దపల్లవక్రియగా ఏర్పడుచున్నది. ఉదా:— లెవులుగొను; భయముగొను; మరులుకొను'' అని చెప్పి అందుకు ప్రమాణముగా,— 'గీ. కొంకుకొసరును జేతప్పుగొనక యుండు' (పాండు. ౧.౬౧) అను పద్యాంశమును చూపిన సూ.ని. యే, మళ్లీ 'చేతప్పు' అను పదముక్రింద ఆ పద్యమునే,—

---

* పారి. వ్యా. మునకు వ్యాఖ్యానము వ్రాసిన 'బులుసు' వారు, ''తప్పఁజేసి అనగా తప్పుచేత'' అని యర్థము వ్రాసినారేగాని, పాఠమును గూర్చి ఒక ముక్కయైనను అనలేదు.

"చేతప్పుఁ గొనకయుండు"

అనుపాఠముతో ('గోకుముం దరసున్న పెట్టి) ముద్రించినది.

అట్టి పాఠ మచ్చులోనున్నదేమోనని చూచితిని; కాని ఆ వ్రాఁతప్రతి లోను అరసున్న లేదు.

ఇదియంతయు నొకరిచేతిమీదుగనే జరిగియుండునాకి చేతప్పుగొను = 'శబ్దపల్లవక్రియ' యని వ్రాసిన చేయియే మరల 'చేతప్పుఁగొను' అని వ్యస్తపదముగా వ్రాసియుండునా? ఎన్నటికిని వ్రాయదు.

## ౧౭. 'జుంజము'; 'జుంజుము'

సూ.ని.—

*"జుంజురుదుందురు సురుడు దివ్వెనకోల
యనఁ గాష్ఠదీపి కౌహ్వాయము చెలఁగు" (2-165)

అను ఆంధ్రభాషార్ణవపద్యమును, 'దివ్వియకోల' క్రింద,

"జుంజుము దుందురు సురుడు దివ్వియకోల......"

అనిచూపి, (వ్రాఁతప్రతి పా. దివ్వెనకోల. చి. ని. బ్రౌ. వ్రాఁత ప్రతుల పా)" అన్నది.

ఆ పద్యమునే, అంతకుముందు, 'జుంజము' క్రింద,

"జుంజము దుందురు...దివ్వెనకోల..."

అను పాఠముతో ఉదాహరించి ("వ్రాఁత, వ్రాఁతప్రతుల పాఠము") అనియున్నది.

మళ్లీ, ఆ పద్యమునే, 'దుందుము' క్రింద,

"జుంజము దుందుము...దివ్వియకోల..."

అను పాఠముతో చూపి, ("వ్రాఁతప్రతి పా.") అన్నది.

ఎన్ని వ్రాతప్రతులు! ఎన్ని వ్రాతప్రతులు!! ఎన్ని భిన్నపాఠములు!!

---

* ఇది 'వావిళ్ల'వారిప్రతి పాఠము. బ్రౌణ్యపాఠమున్నూ యిదే. (చూ. సురుడు, క్రింద)

1. జూంజము - క్రింద, 'జూంజము'గా నున్న పాఠము 'దివ్వియకోల' క్రింద 'జూంజూము'గా మారినది.

2. వావిళ్లవారి ప్రతిలోను, బ్రౌణ్యమునను ఉన్న 'జూంజురు' పాఠ మసలే అదృశ్యమైనది.

3. జూంజము - క్రిందను, దివ్వియకోల క్రిందను నున్న 'దుందురు', 'దుందుము' క్రింద హఠాత్తుగా 'దుంచుము'గా మారిపోయినది.

4. జూంజము - క్రిందనున్న 'దివ్వెనకోల'—దివ్వియకోల క్రిందను, దుంచుము - క్రిందనుగూడా 'దివ్వియకోల' అయిపోయినది.

పరికించారా, సూ. ని. పాఠమును గ్రహించుపద్ధతి; ఆ పద్ధతిలో పద్యములు పడుపాట్లు!

ఇన్ని పాఠభేదములుగల ఆ ప్రాఁతప్రతు లెక్కడివి? ఆ వ్రాఁతప్రతు లెక్కడివి?

ఒక పద్యమునే, ఒకచోట 'జూంజము' అను పాఠముతోను, ఇంకొక చోట 'జూంజూము' అను పాఠముతోను, ఒకచోట 'దుంచురు' పాఠముతోను, ఇంకొకచోట 'దుందుము' పాఠముతోను, ఒకచోట 'దివ్వెనకోల' పాఠము తోను, మరియొకచోట 'దివ్వియకోల' పాఠముతోను, నిరుకులేని మార్పులతో ఉదాహరించుట ప్రమాదవశముననా? ఉద్దేశపూర్వ కముగానేనా? ఉద్దేశపూర్వకముగానే యగుచో ఆ యుద్దేశ మేమి?

## ౧౮. 'నీరుచిచ్చుఁగొను'

సూ.ని. లో, నీరుచిచ్చు క్రింద,—"సలిలములు దొట్టి నీరుచిచ్చుఁ గొని" (చంద్రా. ౫.౬౩) అని యున్నది.

'నీరుచిచ్చుగొను' ఏకపదక్రియ. నీరుచిచ్చు అను వ్యాధి కలదియగు అని యర్థము.

బలుపుగోను, కుదురుకోను, తెవులుగోను, ఒరగోను, మెత్తగాలుగోను, ఉంగిడిగోను, తెక్కలిగోను, చేతప్పుగోను అను క్రియ లెట్టివో నీరుచిచ్చుగోను అను క్రియయు నట్టిదే.

కావున, అం దరసున్న పెట్టుట గిట్టదు.

ఒకమాట:— 'ఒరగోను' అను క్రియ, సూ. ని లో. 'ఒరకోను' అని యున్నది. బాల్యమునను, శ. ర. లోను, 'బసవపురాణములోను, ('అచ్చుల నొరగొను నగసాలి యుండ'— పు. ౧౦౨) 'ఒరగోను' అని *సరళాదేశ రూపముననే యున్నది.

ఒరగట్టు (ఒర + కట్టు), ఒరగడుగు (ఒర + కడుగు), ఒరగల్లు (ఒర + కల్లు) అను పలుకుబడులవలెనే (ఒర + కోను =) ఒరగోను అనియే యుండునని నా యూహ.

---

* కకారమునకు ఆదేశముగా వచ్చిన గకారమును సరళ మనగూడ దని, వీ. బ్ర. గారి ఆక్షేపము.

ఆ యాక్షేపపు వ్రాత యిట్లున్నది:— "ద్రుతకార్యముగ గాక, పరుషాక్షరమునకై 'యాగమం'బైన గ స డ ద వ లలోని 'గ'ను జూచి, యా 'గ' సరళరూపమున నున్నదనిరి. అది తప్పు. ఏమనగ అది పరుష మునకు బదులుగ వచ్చు సరళమే యగుచో దానివెనుక ద్రుతమున్నదై యయ్యది అరసున్నయో నిండుసున్నయో కావలయుగదా?"

ఆహా! ఎంత చక్కని యాక్షేపము!!!

ఆ 'గొ' పరుషమునకు బదులుగా వచ్చినది కాదట! మరి దేనికి బదులుగా వచ్చినదో! వారు తెలుపలేదు.

పరుషమునకు బదులుగా వచ్చిన సరళమగుచో, దానివెనుక ద్రుత ముండి తీరవలెనట! అట్లు వారు చదివిన వ్యాకరణశాస్త్రమున నున్నది కాబోలు!

గ స డ ద వ ల లోని 'గ', పరుషాక్షగమునకై యాగమంబైనదట! పాపము! ఆ వైయాకరణశిరోమణికి ఆగమ మననేమో, ఆదేశ మననేమో తెలియదు.

## ౧౯. 'చెలంగు' ; 'తెలంగు'

శ.ర. లో, 'గరువు' - 'చెందిరిక' అను రెండు పదముల క్రిందను, మనుచరిత్రపద్యము,—

"గరువునకొత్తఁ జెంగలువకచ్చుఘటించిన మోళిఁ జుట్టెఁ జెం
దిరిక చెలంగునట్టి పసిఁడితీఁగలునించిన జిల్గుపాగ" (5.58)

అను పాఠముతో ఉదాహృతమై యున్నది.

బ్రౌనుప్రతిలోను, వావిళ్లవారి ఆనందవారి ప్రతులలోను, 'చెందిరిక చెలంగునట్టి' అను పాఠమున్నూ, "చెందిరిక తెలంగునట్టి" అను పాఠాంతరమున్నూ,— "చెందిరిక తెలంగునట్టి = కమ్మపై దుద్దువిధమున" అనే వివరణమున్నూ ఉన్నవి.

సూ.ని. 'గరువు' క్రింద, "చెలంగునట్టి" అను పాఠముతో ఉదాహరించినదేగాని పాఠాంతరమును చూపలేదు. మరల ఆ పద్యమునే 'చెందిరిక' క్రింద, 'తెలంగునట్టి' అను పాఠముతో చూపి 'ఇది శ.ర. పాఠ' మన్నది.

శ.ర. లో 'గరువు' క్రిందగూడా 'తెలంగునట్టి' అను పాఠమే యుండెఁగదా; సూ.ని. అక్కడ ఆ 'తెలంగు'ను వదలి 'చెలంగు' నే పట్టుకొను టేల? తానేదో ఒక పాఠమును నిర్ణయించి - గ్రహించి, పాఠాంతరమును చూపవలెగాని - ఒక పద్యమునే భిన్నస్థలములలో - భిన్నపాఠములతో చూపుట యెట్లుచితమగును?

'చెలంగునట్టి' అను పాఠమున అర్థము సరిగా ఏర్పడదు. 'తెలంగునట్టి' అను పాఠమే గ్రాహ్యము.

## ౨౦. 'జాఁనువడు' ; 'అనిలుఁడు'

సూ.ని. "జాఁనువడు. అ.క్రి. (జాను + పడు) స్పష్టపడు" అని చెప్పి, అందు కుదాహరణగా,—

ఉ. “నన్నీ నలినాప్తుఁ డీయనిలుఁ డీమృగలాంఛనుఁ డీసుగాత్రుల్
జానువడంగ నీక్షణము చంపరె కోపపరీతచిత్తులై.”

(భా. గ. ఆ. ౨-౨౧౪)

అను పద్యమునిచ్చి, “ఇది శ.ర. పాఠము. *‘జాను సడంగ’ అని ముద్రితప్రతిపాఠము” అని సూచించినది.

చూడబోగా సూ.ని. పాఠమునకును, శ.ర. పాఠమునకును సంబంధమే లేదు. శ.ర. లో ‘జానువడు’ అను క్రియయే లేదు సరిగదా, పైపెచ్చు - ‘జానువు’ అను పదముక్రింద “జానువు. దే.వి. జానుగయొక్క రూపాంతరము. ఉ. ‘నన్నీ నలినాప్తుఁ డియ్యనలుఁ డీ మృగలాంఛనుఁ డీసుగాత్రులున్, జానువడంగ నీక్షణము చంపరె కోపపరీతచిత్తులై.’ (ఇక్కడ జానుపడంగన్ అని వ్యుత్పత్తి చెప్పుట సరికాదు.)” అని యున్నది.

దాని యర్థ మేమి? శ.ర. పాఠము, ‘జానువు + అడంగన్’ అని గాని, ‘జాను + పడంగన్’ అని కాదనియే కదా?

మరి, సూ.ని. ‘జానువడు’ అను క్రియక్రింద, ఆ పద్యమును చూపి, “ఇది శ.ర. పాఠము” అనుట పొరపాటు కాదా?

(జానువు + అడంగన్ =) ‘జానువడంగన్’ అను, శ.ర. పాఠమూ, ♦‘జాను పెడంగన్’ అను, ముద్రితప్రతిపాఠమూ అర్థమున నొకటే యగు

---

* వ్యయ - చైత్ర భారతిలో - శ్రీ సందూరి రామకృష్ణమాచార్యుల వారు “శబ్దరత్నాకరములో ‘జాను పెడంగ’ ముద్రితమని సూ.రా. నిఘంటువే సూచించినది” అన్నారు. పొరపాటు.

♦ ‘అట్టి దైనన్ (= సేను నీయెడ సెగ్గు దలంచినయెడల) నన్నీ నలినాప్తుఁడు; ఈ యనలుఁడు; ఈ మృగలాంఛనుడు - జాను పెడంగఁ జంపరే’—

చున్నవి. 'జానువడు' అను క్రియ యొకటి యున్నచో సూ.ని. ఊహించిన అర్థమునను విప్రతిపత్తి యుండదు. మఱి అట్టిక్రియ లేదే!

అది యట్లుండఁగా శ.ర. పాఠమునను, ముద్రితప్రతి పాఠమునను గూడా, 'నలినాప్తు'ని వెంటనున్న 'అనలుఁడు' సూ.ని. పాఠమున, 'అనిలుఁడు'గా మారి కూర్చున్నాడు; ఆ తమాషా చూచారా? అది సూ.ని. సొంతముగా చేసిన మార్పేగాని అచ్చుతప్పు కాదుసుమండీ!

'జానుపడంగ' అని క్రియగా చెప్పుట సరికాదని, శ.ర. చెప్పుచుండగా తాను 'జానువడంగ' అని క్రియగా చెప్పి, యిది శ.ర. పాఠమనుటయు, శ.ర. పాఠములోని *'అనలు'ని - 'అనిలు'నిగా మార్చి యిది శ.ర. పాఠమనుటయు సూ.ని. వంటి నిఘంటువుకు ధర్మమేనా?

---

అను రచనకు, "జాను సెడంగ = నేను జాను సెడిన—అనగా నా నిసర్గతను, నా స్వభావమును వీడినయెడల చంపరే" అని యర్థము చెప్పవలెనన్నారు శ్రీ 'నండూరి'వారు. అది సరియైన మార్గము కాదు.

* "సూ.ని. అనలుని - 'అనిలు'నిగా సవరించుట ఒప్పే"నని సమర్థించుచూ అనవసరముగా బోలెడువ్రాసి, వీ.బ్ర. గారు, — "దీ. శాస్త్రి గారు, నలినాప్తునివెంటనున్న 'అనలుఁడు' సూ.ని. పాఠమున 'అనిలుఁడు'గా మారి కూర్చున్నాడు అని యాక్షేపింపవచ్చునా?" అన్నారు.

నేనాక్షేపించినది సవరణను కాదు; "ఇది శ.ర. పాఠము" అనుటను. ఆక్షేపమును సరిగా అర్థము చేసికోలేని 'అన్నయ్యలు' విమర్శలకు దిగుటయు, అనవసరపువ్రాతలు వ్రాయుటయు తప్పు.

"జానువు + అడంగ - అని విభాగముచేసి చూపిన శ.ర. పాఠమే తప్పని నా నిశ్చయము. జానుశబ్దము సంస్కృతమైనప్పుడే కాని, అచ్చ తెనుగైన జానుశబ్దము 'జానువు'గా రూపాంతరము చెందదు. సంస్కృతమున ఆగంతుకముగవచ్చిన విభక్తిప్రత్యయమైన 'వు' లోపించియు, లోపించకయు నున్నట్లు తెలుగుశబ్దముల కట్లాగంతుకముగ 'వు' ప్రత్యయమురాదు

## ౨౧. 'ఉక్కుదాయము'

సూ.ని. 'దాయము' అను పదముక్రింద, గో.హరి. లోని,—

“వడినుక్కుదాయము వచ్చుచో ధైర్య, ముడిగిన సైన్యంబు నొందిన నగరి” (ఉ. ౫౯౫)

అను ద్విపదనుచూపి, అక్కడ “(ఉక్కుదాయము = గొప్పయిడుమ, అని టీక)” అని తెలిపినది.

పైపాఠము, టీకకూడా, 'వేదం'వారివి. 'ఉక్కు' అన్న పదానికి 'గొప్ప' అన్నయర్థమును, వేదం-పండితులు చెప్పినారని, సూ. ని. — కుండలీకరణములో చెప్పుట కర్థమేమో నాకు తెలియలేదు. అది గ్రాహ్యమనియా? అగ్రాహ్యమనియా?

సూ.ని. దృష్టిలో ఆ యర్థము గ్రాహ్యమే అగుచో - 'ఉక్కు' అను పదముక్రిందగదా చూపియుండవలసినది? చూపలేదేమి? అగ్రాహ్యమగుచో

---

గనుక ఉన్నది లోపించుటగాని లేనిది వచ్చుటగాని కలుగదు.— చెఱువు; దొరువు 'వు' లోపించి చెఱు; దొరు కాజాలవు”. అని ఆ బ్రహ్మంగారి దొక అపూర్వసిద్ధాంతము.

'వు' లోపించియు - లోపింపకయు నుండు శబ్దములు తెనుగున నెన్నో యున్నవి. ఉదా:— రట్టువు; రట్టు. చట్టువు; చట్టు. కొలఁకువు; కొలఁకు. పుట్టువు; పుట్టు. కావున బ్రహ్మంగారిది భాషాతత్త్వజ్ఞానము లేని అపసిద్ధాంతము.

'జానువు' అను రూపము సరికాదని సూ.ని. భావించియున్నచో 'జానుపెడంగ' అన్న ముద్రితప్రతిపాఠమునే గ్రహించి యుండవచ్చునే. జానువు + అడంగఁ అన్న శ.ర. పాఠమును గ్రహించుట యెందుకు? దానిని 'జాను + పడంగఁ'—అని మార్చుట యెందుకు? ఇది శ.ర. పాఠమనుట యెందుకు?

'దాయము' అన్న పదముప్రక్కమాత్రము చూపవలసిన అక్కర యేమి? చూపి ప్రయోజన మేమి?

అసలు, అది సరియైనపాఠము కాదేమోనని నా కొక సందేహము. ఎందువల్లననగా.—

"గొప్పయిడుమవచ్చుచో ధైర్యముడిగి - దైన్యమునొందుట తగదు" అనగా అర్థమేమి? కొద్దియిడుమవచ్చుచో...తగును; అనియేకదా? ఈ యర్థ ముచితముగానున్నదా? ఇట్టి విపరీతార్థస్ఫురణగల రచనను, గౌరన వంటి ప్రౌఢకవి, చేసియుండునా?

"ఒక యిక్కట్టువచ్చినపుడు అధైర్యపడుట తగ"దని లోకములో వాడుకగా అనుకొనుటకలదు; ఎల్లరెరిగినమాటయే. "ఒక *యిమ్ముదప్పు వచ్చినపుడు వెనుఁబడరాదు. వెనుఁబడితిమిపో దానిచేత సాధ్యమేమి?" అని, చిన్నయసూరి - మిత్రభేదములోను ఉన్నది. ఈ యర్థమునే, గౌరన - "దాయంబుతలనిట్టి దైన్యంబుతగునె" (పుట 130) అని, 'ఉక్కుదాయము' నకు ముందే, అనియున్నాడు.

కాబట్టి, గౌరన-పాఠము 'ఒక్కదాయము' అయ్యుండునుగాని 'ఉక్కుదాయ'మై యుండదని నా నమ్మకము. వ్రాతప్రతులను చూచినగాని నిజము తేలదు. అట్టి పరిశోధనకు తగిన పరికరముగల పండితులు పరామర్శించి నిర్ణయింతురుగాక.

## ౨౨. 'తేటఁబొసంగ'

వేదం-వారి శృం.నై. (8. 170) లో, "దేవి, తమో మషీ రసము తేటఁబొసంగఁగ గట్టివెట్టి" అని యున్నది.

---

* "ఇమ్ముదప్పు. (ఇమ్ము + తప్పు) ఇక్కట్టు, సంకటము" అని శ.ర. లో నున్నది. సూ.ని. లో లేదు. కారణమేమో?

*'తేటఁబొసంగఁగ' అనుట సరికాగు. 'తేటపొసంగఁగ' అని సరియైన పాఠము. వారి టీకలో,— "తేట పొసంగఁగన్ = పెమ్మట వ్రాసెడి యక్షరములు స్ఫుటముగా కనఁబడుటకై, గట్టివెట్టి = గట్టించి" అనియే చెప్పబడియున్నది. అదియును గమనింపక, సూ. ని. 'గట్టి', 'తావడము' అను రెండు పదముల క్రిందను,—'తేటఁ బొసంగఁగ' అను పాఠమునే ఉదాహరించి, ఇది వేదం. పా. అన్నది.

ఎవరి పాఠమయిన నేమి? తాను స్వయముగా చదివి, అర్థము చేసికొనిగదా గ్రహించవలసినది! టీకనైనను చూడకూడదా?

## ౨౩. 'కొండఁజేయు'

వేదం.వారు, — "గట్టి చన్గవ చేతఁబట్టి చూచెద నన్నఁ, జెలి యది యొక కొండఁజేసికొనెను" అని, 'సారంగ' (2—224) లోను,— "ఒకని నా ముందట నొక కొండఁజేసి" అని, గా. హరిశ్చంద్ర (పుట 15) లోను, ముద్రించినారు.

'వావిళ్ల'వారి 'విక్రమార్క' (2. 15)లోఁ గూడా,— "ఈ కొండ మణికొంచనా కొరరుచిఁ గాంచెఁ, గొండ లెల్లను దనుఁ ♦గొండఁజేయు" అనియే ముద్రితమై యున్నది.

సూ.ని. 'విక్ర' పద్యమును 'కొండఁజేయు' అను పాఠముతోనే గ్రహించి "కొండఁజేయు = పెద్దచేయు" అని అర్థము వ్రాసినది.

'పెద్దచేయు' అను నర్థమున 'కొండఁజేయు' అనుట తప్పు. 'కొండ చేయు' అనుట ఒప్పు. 'కొండఁ జేయుట' యనగా, కొండను చేయుట

---

* వావిళ్లవారి ప్రతిలోను, ఈ పాఠమే యున్నది.

♦ వావిళ్ల నిఘంటువు, ఈ పాఠము తప్పని చెప్పి, 'కొండచేయు' అను పాఠముతోనే గ్రహించి, 'కొండచేయు' అను క్రియకు ప్రమాణముగా చూపినది.

యగునేగాని, గొప్పచేయుట కాదు. 'పెద్దచేయు' అను పలుకుబడి యెట్టిదో 'కొండచేయు' అనునదియు నట్టిదే. 'కొండచేయు' శబ్దపల్లవ క్రియ. శబ్దపల్లవము లన్నియు ఏకపదక్రియలు. అందువల్ల ఆ క్రియల లోని ధాతునామావ్యయములను వేరుచేసి, ద్రుతాంతములుగాను ఆయా క్రియలకు కర్మలుగాను అర్థము చెప్పగూడదు.

పెద్దచేయుట యనగా పెద్దగాచేయుట. (పెద్ద = గొప్పవాడు). కొండచేయుట యనగా కొండగాచేయుట = గొప్పచేయుట.

కొండ = గొప్ప అనుట కీ క్రింది రచనలు ప్రమాణము.

(1) "కొండఁ బెకలించి యెత్తుట, కొండొక పనిగాక యొక్క కొండాతలఁపఁగ" (భాగ. 10. పూ. 914) ఒక్కకొండా = ఒక ఘన కార్యమా? అని యర్థము.

(2) "గురు వనీపకుల కొదర మొప్పఁ గొండని, యొసఁగియుఁ 'గొం'డని యొసఁగకుండు" (నరసభూ. పీఠిక. 72.)

కొండు + అని = కైకొనుఁడని, ఒసఁగియు, (ఆయిచ్చినది) కొండని (కొండ + అని) అది యొక గొప్ప యీవి అన్న భావముతో, ఒసఁగకుండు నని యర్థము.

(3) "రండలకొడుకులు యాచక
తండంబుల కేమి త్రవ్వి తల కెత్తేరా?
రెండాకు లొక్క పోఁకయుఁ
గొండసుమీ దానశర్వ, కోమటిగుర్వా" (చాటువు)

కొండసుమీ = గొప్పసుమా.

భాషాతత్త్వవిదులయిన శ్రీ ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరించిన ఉ. హరివంశములో,— "కొడుకులం గని తమవారు కొండసేయ" అనియే పాఠము.

పెద్దచేయు అను నర్థమున 'కొండలుచేయు' అనియును కలదు. 'భర్తృహరి' లోని,— "పర గుణ పరమాణూన్ పర్వతీకృత్య నిత్యమ్" అన్న (పరోపకార 70.) సంస్కృతమును, ఏనుగు లక్ష్మణకవి,—

"వదలక సాధుసద్గుణలవంబులు కొండలుచేసి మెచ్చుచున్—" అని తెనిగించినాడు. ('పర్వతీకృత్య' సంస్కృతమున శ.ప. క్రియ). పర్వతీకృత్య = మహత్తరాన్ కృత్వా — అని వ్యాఖ్య.— పర్వతీకృత్య = కొండలుగాచేసి అని టీక. అణువులవంటి సద్గుణములనైనను కొండంతలుగా భావించి— అని తాత్పర్యము. కాబట్టి, కొండ(లు) చేసి అను క్రియను— 'కొండఁజేసి' – 'కొండలఁజేసి' అని సవరించగూడదు. "చేయు అను క్రియకు 'కొండ' కర్మ" అని వాదించగూడదు.

*"కొండఁజేయు, కొండచేయు లెట్లున్నను, ఇందలి కర్మపదమగు 'కొండ' జడవాచకమగుటచేఁ బ్రథమయుఁ గావచ్చును. ద్వితీయయుఁ గానగును. ఇందు తప్పేమి?"— అని నిఘంటు పండితులలో నొకరైన శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారి వాదము. అది శ.స. క్రియా తత్త్వమును గమనింపని వాదము.

"గట్టి చన్గవ చేత ముట్టిచూచెద నన్నఁ, జెలి యది యొక కొండ చేసికొనెదు" అన్నచోట,— చెలీ, నీ చనుగవను గొప్పగా భావించుకొని, నను ముట్టనీయక దాచుకొనుచున్నావని నిష్ఠురోక్తి. చనులు కొండలవలె నున్నవని చమత్కారము. 'కొండఁ జేసికొనెదు' అన్నచో, ఆ నిష్ఠురోక్తి, చమత్కారముకూడా నశించును, కాబట్టి 'కొండ'ను ద్వితీయగా చెప్పుట తప్పేనని నా సమాధానము.

"'కొండఁజేసి' అను పాఠమే బాగున్నది. అప్పుడు 'ఒక'టు కొండతోనే సంబంధము. ఒక పదమును పృథక్కుగా స్వీకరించిన పిచ్చయ్యశాస్త్రిగారి మతమున అభేదసంబంధముచే నేకదేశాన్వయము సంభ

* చూ. పార్థివ చైత్ర - ఆషాఢముల (1944—45) ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

వించును. కొండఁక అనునది పృథక్పద మనినయెడల దోషము కనుపట్టదు. పెక్కు గుణము లున్నవి'' అని, ఆ శాస్త్రిగారిదే మరియొక వాదము.

అది పద్యార్థమును సరిగా గమనింపనివాదము. ఎందువల్లననగా— చన్నవఁక = రెండు చన్నులను, ఒక కొండఁక చేసికొనెదు = ఒక్క కొండను చేసికొనెదవు— అని యర్థము చెప్పుట హాస్యహేతువగును. కావున, ''ఒకను కొండతోనే సంబంధ'' మనుట సరికాదు.

'ఒక'ను 'కొండ'తో ముడిపెట్టి, ఏకదేశాన్వయదోష మున్న దనుట పొరపాటు. ఒక కొండచేసికొనెదు; ఒక సరకుసేయక—అను పలుకు బడులలో 'ఒక' సంఖ్యావాచకము కాదు. దానికి ప్రత్యేకమయిన అర్థము లేదు. అది ఆ పలుకుబడియందలి భావమునకు బలము (force) నిచ్చు, జాతీయమైన ఊఁతపదము.

కాబట్టి, 'ఒకకొండ = ఒక్కకొండను చేసికొనెదు'; ఒకసరకు = ఒక్కసరకును చేయక అని యర్థము చేయఁగూడదు. 'ఒక కొండచేసికొనెదు', అను పలుకుబడికి 'ఏమో మహాభాగ్యముగా భావించుకొనుచున్నావు' అనియు, (వాణి) 'ఒక సరకుచేయక' అనుమాటకు 'బొత్తిగా లక్ష్యపెట్టక' అనియు, సంప్రదాయజ్ఞు లర్థముచేయుదురు.

'ఒక'కు ఆ యా సందర్భములనుబట్టి అనేకార్థములు :—

1. ''ఏ మొకకొందఱము మహాగ్రామవనాంతరము లెల్లఁ గడచి''
(విక్ర. 5-201)

అన్నచోట 'ఒక' అల్పార్థకము.

2. ''ఒక మున్నాఱు కదల్చి తెచ్చిన లలాటోగ్రాక్షుచాపంబు.''
(భాగ. 9-262)

అన్నచోట 'ఒక' అధికార్థకము*

---

* ప్రౌ. వ్యా. కర్త 'అల్పార్థక' మన్నాఁడు. (చూ. శబ్ద. 84.) పొరపాటు. అది మహాభారమైన ధనువనియు, పలువురు తెచ్చి రనియు చెప్పుటే, అచట, ఉచితము.

3. "భండనమందు నాకు నొక పాండవు లెంతటివారు?"
(పాండవవిజయము.)

అన్నచోట అల్పార్థకమును కాదు; అధికార్థకమును కాదు. నిర్లక్ష్యతాసూచకము.

4. "ఏ నొక దిక్కు లేక యిటు యేడ్చుచుఁ జీరుచునున్నదాన."
(భాస్క. అర. 108)

అన్నచోట, ఒక దిక్కు లేక-అంటే, ఏవిధమైన రక్షణలేక, అని యర్థము. అంతేగాని దిక్కు ఒక్కటి (మాత్రమే) లేక' అని యర్థముకాదు.

5. "నాక కాదీ, త్రిలోకముల కధిపుఁ జూచితిమి యొక యొటుకు" (భా.ఆది. 5-239)

ఇక్కడ, 'ఒక'కు, ఒకానొక అని యర్థము.

ఒక్కొక్కచోట ఈ 'ఒక' యొక్కతత్త్వ మనిర్వాచ్యమై కేవల హృదయైక గమ్యమై యుండును. చూడండి.—

6. 'వాడు *ఒకప్రొద్దుకడ లేచిపోయినాడు' అన్నప్పుడు 'ఒక' కర్థమేమి? ఆ 'ఒక'కు దేనితో సంబంధము? 'ప్రొద్దు'తోనా? 'కడ'తోనా? 'ప్రొద్దుకడ'తోనా? 'లేచిపోవుట'తోనా? శ్రీ సూర్యనారాయణశాస్త్రిగా రెట్లన్వయింతురో!

---

* 'అముక్త' (7. 8) లో, "ఒక ప్రొద్దుకడఁ - లేచిపోవంగ" అన్నచోట సంజీవనీకర్తలు - 'ఒకప్రొద్దుకడఁ = ఒక సమయవిశేషమున' అని టీకవ్రాసినారు. తాత్పర్యములోను 'రాత్రి యొకానొక సమయాన లేచి' అనియే వ్రాసినారు. ఆ 'ఒక' తత్త్వము వారికిని గుర్తుపడలేదు. 'ఒక ప్రొద్దుకడఁ' అనగా, 'చాలా రాత్రి యుండగనే' అని ప్రకరణార్థము. 'లేచి ప్రయాణముచేయదగిన కాలము కాకముందే నన్నమాట. ఈయర్థము 'ఒక'కు దేనితో అన్వయము?' అని తర్కించువారికి దుర్లభము.

ఇందును, 'ఏకదేశాన్వయదోషము సంభవించు'నందురేమో? అనఁగూడదు. అట్టిదోష మిందు లేదు. 'ఒక కొండచేసికొనెదు' అను పలుకుబడిలోను లేదు. ఉన్నదనుకొనుట పొరపాటు.

ఒకవేళ ఉండుగాక. వారిదృష్టిలో అదియొక మహాదోషము కాబోలు! 'సిద్ధసమాస మధ్యగతపదముతో తద్భిన్నపదమున కన్వయము కలుగఁజెప్పినను దోషముకాదని భాషావిదులు చెప్పుచుండగా (చూ. ప్రౌ. వ్యా. సమా. 35) 'ఏకదేశాన్వయము - మహాదోష'మనుట యేటిచదురు? నిఘంటుకారార్య మనేక కావ్యముల నవలోడించి యుందురుగదా; వారికి - ఏతాదృశ రచన లెందును పొడకట్టియుండవా? ఈ క్రింది పద్యమును చిత్తగించండి.

"నిండుమనంబునం దన మనీషిత మెల్ల ఘటింపవచ్చు నా
ఖండలు రాక చారణముఖంబున మున్న యెఱింగి చేది భూ
మండలభర్త గాంచె నతిమాత్రముదం బది యెందుఁ జిత్రమే?
కొండలు పిండిసేయు శతకోటియుతుండు హితుండుగల్గినన్"
(వసు. 5-55)

ఆ శాస్త్రిగారు భావించిన మహాదోషము, ఈ పద్యములోని "కొండలు......యుతుండు" అను రచనకు పట్టదా? పట్టుచో, వారు - 'ఇది తప్పు' అని ఆక్షేపింతురా? లేక దిద్ది సరిచేయుదురా?

ఏకదేశాన్వయాదులు మహాకవుల రచనలలోను క్వాచిత్కముగా నుండును. సహృదయులు వాని నొప్పరికించి - అందలి రసమును - చమత్కారమును మాత్రమే గ్రహించి ఆనందింతురు. ఇది విషయాంతరము.

"సాగంగధరపద్యమున తక్కిన పాదములందలి 'గగనంబుచేయు', 'బంగారుచేయు' మున్నగున *పేకక్రియలనఁ జెల్లునా? అని, ఆ శాస్త్రిగారిదే ఒక ప్రశ్న.

గగనంబు, బంగారు అను విశేష్యములు - 'చేయు' అను క్రియాయోగముచే ఏకపదత్వమును పొంది, శబ్దపల్లవములై, విలక్షణార్థము నిచ్చు

* ఏకపదక్రియ లనవలెను.

చున్నవి గావున ఏకపదక్రియ లనఁజెల్లు నని నా సమాధానము.

గగనము, బంగారు, ఘనము అను పదములను విలక్షణార్థమున వాడు వాడుక భాషాలోకమున నున్నది.

(1) "అరిది, కడిది, గగనము, బంగారు, గహనము, ఘనము, భ్రాంతి దుర్లభార్థకములు." (ఆంధ్రవాచస్పత్యము)

(2) "గగనము = అబ్బురము." (ఆం. స. పారి.)

(3) "అదేమి గగనము. What great marvel is this."

(బ్రౌన్యా.)

(4) "గగనఘంటాపథక్రమణశీలున కెంత, గగనమయ్యె లతాంగి కౌనుచదలు" (వసు. 3-99) 'ఎంత గగనమయ్యెన్ = ఎంత దుర్లభ మాయెను' అని టీక.

(5) "కంధి దాటుట యెంత గగనంబు నాకు." (గంగ. రా. యు.)

N.B:— గగనము = దుర్లభము; గొండు = గొప్ప - అని సూ.ని. లోను ఉన్నది. ఆక్షేపకు లెరుగరేమో!

లెక్కసేయు, సరకుసేయు అను పలుకుబళ్ళెట్టివో, గొండుసేయు, గగనముసేయు, బంగారుసేయు అనునవియును నట్టివే. వానిలో అరసున్నలు పెట్టుట తప్పు. ఈ పలుకుబళ్ళు—అనగా శబ్దపల్లవక్రియలు భాషలో లెక్కకు మిక్కిలిగా నున్నవి. వాని తత్త్వమును సరిగా పరిశీలింపని పరిష్కరణములవల్ల ఆ క్రియ లనేకము ప్రాచీనకావ్యముల (అచ్చుప్రతుల)లో మారురూపుపడి యున్నవి. వానిలో కొన్ని అట్లే నిఘంటువులలో ప్రవేశించినవి. వ్యాఖ్యాతలే కాక, నిఘంటుకర్తలుగూడా వాటి కర్థము చెప్పుటలో ప్రమాదపడుటయు జరిగినది. గ్రంథవిస్తరభీతిచే ఒక కొన్నిటిని మాత్రమే యిక్కడ పేర్కొనుచున్నాను.

(1) లెక్కసేయు = 1. లక్ష్యపెట్టు, 2. లెక్కయేర్పరచు.

(ఉత్తరహరివంశమున డిభకసాత్యకుల యుద్ధవర్ణనము)— "అటమటపుఁ గోమటులునుంబోలె లెక్క సేయక." (4-256)

యుద్ధవీరుల పక్షమున 'లెక్క సేయక'—(శ. ప. క్రియ) = ఒకరి నొకరు లక్ష్యముసేయక అనియు,—అటమటపు కోమటుల పక్షమున లెక్క (ద్వితీయార్థమున ప్రథమ) = జమాఖర్చులెక్కను, చేయక = సరిగా తేల్చి చెప్పక యనియు శ్లేషచేత రెండర్థములు.

లెక్కఁజేయక - అనుచో 'లక్ష్యముసేయక' అను నర్థము సిద్ధింపదు.

(2) ఘనముచేయు = గొప్పగా భావించు.— "నెఱిగొప్ప కొనగోర నివిరిచూచెదనన్న చెలి నీవది ఘనంబుచేసికొనెదు" (సారంగ. 2-226)

ఘనముచేయు అన్న యర్థముననే, 'ఘనంపఱుచు' అను క్రియయును కలదు.

"అని నెనరుముట్టం బూనిన కుసుమాయుధు పూనికి వజ్రాయుధుండు ఘనంపఱిచి" (నన్నె. కు. సం. 4-403)

ఘనముచేయు, ఘనంపఱుచు—అను క్రియలు సూ.ని. లో లేవు.

(3) పటాపంచ(లు)సేయు = నాశముచేయు.— "పాపపూరుషుఁ బటాపంచచేసి" (పాండు. 2-8)

పటాపంచఁజేసి అని సవరించరాదు.

(4) కోపముచేయు = కోపించు. చేయు - క్రియ; కోపము - కర్మ, అనుకొని 'కోపముఁజేయు' అనఁగూడదు.

సూ.ని. 'గడీ' క్రింద,— "పరాసువారు కోపంబుఁజేసి" అని ముద్రించినది. సరికాదు.

(5) ఎల్లిచేయు— "చేడియలమీఁద గ్రుల్లెల్లి సేయరాదు కోయిలా" (నీలా. 3-25)

గ్రుల్లెల్లి సేయరాదు = కోపపడకుము. అచ్చుపుస్తకములలో పలు తావులలో,— "ఎడప కెప్పుడుఁ గన్ను లెల్లిఁజేయుబలంబు" (రసిక. 4-87.)

ఇత్యాదిగా 'ఎట్టఁజేయు' అనియే కవిప్రయోగములు [illegible] ఎట్టు చేయుట - అనగా, ఎట్టగా చేయుటగాని 'ఎట్టును' చేయుట కాదు.

"చిలుక మో మెట్టగాఁ జేసినాఁడు." ([illegible]. 4-156)

కాబట్టి 'ఎట్టఁజేయు' అనుట సరికాదు. అట్లే, 'నల్లసేయు' అను క్రియయును.

"నా వాలంబు నల్లసేసితిరేని" (భా. అర. 2-34)

నల్లసేసితిరేని = నల్లగా చేసితిరని - అని యర్థము. ఈ ప్రయోగమును తిక్కనయే చెప్పినాడు.

"తోఁక నల్లగాఁ జేయరయ్య" (అను. 1-198)

"నల్లగాఁ జేయువార మే మెల్లభంగి, నా సుగంధ ప్రసవతివాలము" (,,-199)

(6) తెనుఁగుచేయు = తెనిగించు.—

"కాశీకాఖండమను మహాగ్రంథ మేను,
దెనుఁగుచేసెద" (కాశీ. 1-7)

"ఇల నుకారాంతపదములఁ దెలుఁగుసేయఁ
గడ వుకారంబునుండు, డుకారముండు."

(కావ్యా. చూ. ఉల్లా. 9)

కాశీఖండము, అచ్చుప్రతిలో,— 'తెనుఁగుఁజేసెద' అని యున్నది.

తెనిగించు అను అర్థమున 'తెనుఁగుసేయు' ఏకపదక్రియ. తెనుఁగును + చేయు = తెనుఁగుఁజేయు అని చెప్పుచో, తెనుగు అను భాషను చేయుట యగునేగాని, తెనిగించుట కానేరదు. తెనిగించుట యనగా, తెనుగుగా చేయుటగాని, తెనుగును చేయుట కాదు. భీమఖండమున శ్రీనాథుఁడే "శివపురాణంబు తెనుఁగుగాఁ జేయు మొకటి" అని వాడియున్నాడు.

"వెలయు బుకారాంత పదా
దులఁ దెనుఁగుగఁ జేయుచోట" అని,
కావ్యా. చూ. ప్రయోగము. (ఉల్లా. 9)

తెనుఁగుచేయు అన్న యర్థమున 'తెనుఁగుపఱుచు' అనియును కలదు.

"తనర విశ్వనాథుఁ డన నకారాంతశ
బ్దములఁ దెనుఁగుపఱుచు భంగులయ్యె."
"భూభుగ్విరాడ్వ (?) దంబులు
శోభితముగఁ దెనుఁగుపఱుచు చో" (కావ్యా. చూ. ఉల్లా. 9)

పోతన భాగవతములో,— "ఒనరఁగ నన్నయతిక్కనాదికవు లీ యుర్విం బురాణావళుల్, తెనుఁగుంజేయుచు మత్పురాకృతశుభాధిక్యంబు దా నెట్టిదో, తెనుగుంజేయరు" అని యున్నది.

కవిపాఠము, "తెనుఁగుల్ చేయుచు... తెనుగుల్ చేయరు" అని యుండునని నా యభిప్రాయము.

(7) పెండ్లిసేయు.— "మా తండ్రి తా, నన్నుం బెండిలిసేయ వేడ్కపడి నానా బంధుసంప్రీతితోఁ." "ధనమిత్రుం డను సెట్టికి, నను వాగ్దత్తంబు సేసినఁ" (దశ. 5-77)

నన్నుం బెండిలిసేయ వేడ్కపడి - అనగా, నాకు పెండ్లిచేయఁగోరి అని యర్థము.

అథర్వణుని,— "క్వచి ద్విభక్తివైచిత్ర్యం దృశ్యతే కవిభాషితే" అను కారికక్రింద ఇట్లు వివరింపబడియున్నది :

"ఒకానొకచో విభక్తివైచిత్ర్యము చూడఁబడుచున్నది. ఉదా:— నిన్నుఁ దానిఁ బెండ్లిచేసెదఁ, నీకు దానికిం బెండ్లిచేసెదఁ. ఇద్దఱకుఁ బెండ్లియగు ఇత్యాదులు.

'ఇద్దఱకుఁ బెండ్లియగు' అన్నపుడు, ఇద్దరికిని వివాహము జరుగును అని వ్యస్తముగా అన్వయము.

'పెండ్లియగు', శ.స. క్రియగానైనప్పుడు, పెండ్లిగాదు - అని యర్థము.

"ఏపురుఁ, బెండ్లియగుఁడు కృష్ణుఁ బ్రీతిగోడ" (భా. ఆది. 7-282)

రాముఁడు సీతను పెండ్లియయ్యెను, ఉద్వాహమయ్యెను, వివాహమయ్యెను—ఇత్యాదు లుదాహరణములు:

పెండ్లిచేసెను, పెండ్లియయ్యెను, పెండ్లిగాదను—అను క్రియలను పెండ్లిఁజేసెను - పెండ్లినయ్యెను - పెండ్లినాఁడను ఇత్యాదిగా వాడఁగూడదని యిక్కడ హెచ్చరిక.

శ.ర. కర్త 'పెండ్లిసేయు' అను క్రియకు, 'పెండ్లాడు' అని యర్థము చెప్పి, ఆ యర్థమున కీ క్రిందిపద్యమును చూపినాడు.

"మమ్ముఁ బెండ్లిసేయు, మా ప్రాణవల్లభ
ప్రాణమిచ్చి కావు భక్తవరద
నీవు సేయుపెండ్లి నిత్యంబు భద్రంబు
పిన్ననాఁటిపెండ్లి పెండ్లికాదు." (భాగ. ౧౦. స్క౦. పూ.)

ఈ పద్యము, కాళియమర్దన ఘట్టములోనిది. కాళియుని భార్యలు, "'వైధవ్య దుష్టాలంకారము పొందనోడెదము.' మా ప్రాణవల్లభుని బ్రతికించి, మాకు పెండ్లిచేయుము. మా పిన్ననాటిపెండ్లి పెండ్లికాదు. నీ విపుడు చేయుపెండ్లే నిత్యమును భద్రము నగు" నని శ్రీకృష్ణుని ప్రార్థించినారు గాని, 'నీవు మమ్ము పెండ్లాడు' మని కోరలేదు. ("మా ప్రాణవల్లభు ప్రాణమిచ్చి కావు" అని, వావిళ్లవారి ప్రతిలో పాఠము) కావున శ.ర. కర్త చెప్పిన యర్థము ఆ పద్యమున సరిపడదు.

(8) చీకటితప్పుచేయు— "అమరవల్లభుఁడు గౌతము భార్య *యిల్లాలిఁ జీఁకటితప్పుచేసిన విధంబు" (కృ. సై. 7-151) వేదంవారి పా.

---

* 'యిల్లాలిఁ జీఁకటితప్పుసేసిన' అని 'వావిళ్ల'వారి పా.

'యిల్లాలుఁ జీకటితప్పుఁ జేసిన' అని శ్రీ వే. ప్ర. శాస్త్రిగారి పాఠము. (క్రీడా. పీఠిక. పుట 24)

"చీకటితప్పుచేసిన సరోరుహనేత్ర
గూబయై చరియించుఁ గోటరమున." (కాశీ. 2-80)

చీకటితప్పుచేసిన = వ్యభిచరించిన.

'నల్లమేఁక తప్పుచేయు' అను క్రియయును నట్టిదే.—

"బలభేది గౌతముభార్య నహల్యఁ గా
మించి చేయఁడె నల్లమేఁకతప్పు" (ప్రబోధచం. 1-50)

'తప్పుఁజేసిన, తప్పుఁజేయఁడె అని, అరసున్నలుపెట్టి ద్రుతకార్యములు చేయరా దన్నది యిక్కడ ముఖ్యాంశము.

(9) తలఁపుసేయు = ధ్యానించు. (సూ. ని.)

"ఆత్మమూర్త్యంతరం బైన యగ్నిదేవు, నర్చనముచేసి నియతి నయ్యష్టమూర్తి, బహుతపోవ్రతనియమైక ఫలవిధాత, *తలఁపుచేసెను మది నొక్కతలఁపుఁ జేసి" (హర. 3-33)

ఒక్కతలఁపుఁ జేసి = ఒకానొక తలఁపుతో, తలఁపుచేసెను = ధ్యానించెను అని యర్థము. తలఁపుచేయు - అను క్రియ, అరసున్నవలన వేరొకయర్థము నిచ్చుట యిందు గమనింపవలసిన యంశము.

(10) ఆలిసేయు = చెఱచు.—

"శూలిసేసిన తపమెల్ల నాలిచేసి
అతని దేహంబునందు సామాలిఁజేసి
కామకింకరుఁ జేసి నా కడిమి నెఱపఁ
గంటి, నీ ప్రస్తవముఁ దీర్పఁగంటి నెలమి." (కు. సం. ౪-౪౯)

---

*ప్రతి 'తలఁపుఁజేసెను' అని వావిళ్లప్రతి పాఠము. అది శ.ప. క్రియ గావున అందు అరసున్న పెట్టరాదని, సూ.ని. సవరణ. 'తపముఁజేసెను' అని, శ్రీ వే. ప్ర. శాస్త్రిగారి పాఠము. 'తపముచేసె' ననుట యొప్పు.

అలిచేయుట = చెఱచుట; అలిఁజేయుట = అలినిచేయుట. ఈ యర్థభేదమునకు కారణ మేమి? అరసున్నయే. కాబట్టి, 'ఇందు తప్పేమి?' అని, ఏకపదక్రియలలో అరసున్నలు పెట్టగూడదు.

(11) నడదివియలుచేయు.— "నడదివియలు సేసె నగరికి మాణిక్య మకుటముల్ పూనిన మనుజపతుల." (భా. విరా. 5-320)

నడవిదియలు సేసెన్ = నడచునట్టి దీపములుగా చేసెను అని యర్థము. నగరమున నడిపించె నని భావము. (చూ. అర్థసరామర్శలో 'నడదివియ')

(12) మాయచేయు = మోసగించు.— "ఆకాశవాణి, చెప్ప నంచును మాయచేసిరి గాని, యొప్ప రీమాటకు నుర్వీతలేంద్ర" (శం. సా. 8-91)

"మాయఁజేసిరి' అని, సూ.ని. పాఠము. (చూ. 'అయిపు') తప్పు.

'మాయచేయు' ఏకపదము. (శ.ప. క్రియ)

1. "శ్రీరామలక్ష్మణుల నా, మారీచుఁడు మాయచేసి" (శ్రీ సేలగాని శివరామశాస్త్రిగారి బాలరామాయణము. ఆంధ్రజ్యోతి, సర్వధారి ఉగాది సంచిక. పు. 29)

2. "మాయల్ సేయఁగరాదు పో నగవులే మాతోడి పోరాటముల్" (భాగ. 8-351)

3. "మాయావి = మాయచేయువాఁడు" (శ.ర.)

'మాయముచేయు' అని మరియొక శ.ప. క్రియ కలదు. 'అదృశ్యము కావించు' అని దాని యర్థము.

1. "అర్కబింబంబు మాయంబుసేయ" (కాశీ. 5-105)

2. "చివురుజొంపపుమావి జీబు మాయముసేసి
పసిఁడియుప్పరిగ దాఁ బ్రబలు టేమి?" (విజ. 1-140)

3. "కుంచెన్న కూడఁబెట్టఁగ
మంచన మాయంబుచేసె" (రుక్మాం. 4-1(5)

'మాయఁజేయు' ప్రేరణక్రియ. (మాయన్ + చేయు) నశింపఁజేయు అని ఆ క్రియ కర్థము.

1. "మా, యారామంబుఁగలంచి జంతుతతి* మాయంజేసినా వేమిరా?" (హరిశ్చంద్ర. 2-147)

2. "అనుపమహేతిదీధితు లహర్పతితేజము మాయఁజేయ" (భాగ. 10. ఉ. 381)

కాబట్టి, మోసగించు - అను నర్థమున, 'మాయఁజేసిరి' అనుట తప్పు. వేదం-వారి, 'సారంగ' ప్రతిలో 'మాయచేసిరి' అని పాఠము సరిగానే యున్నది. ఆ పాఠమును, సూ.ని. 'మాయఁజేసిరి' అని మార్చుట సరికాదు.

(13) కట్టడచేయు = నియమించు; ఆజ్ఞాపించు; ఏర్పఱుచు —

"సురనాధుఁడు దక్షిణకాశి భీమలింగంబున కేకభోగముగఁ
గట్టడచేసె వసుంధరాస్థలిన్ (భీమ. 5-76)

ఈ పద్యమును సూ.ని. (ద్వి.సం. అనుబంధములో, 'ఏకభోగ' మను పదముక్రింద) 'కట్టడఁజేసె' అని పఠించినది. తప్పు. 'కట్టడచేసె' అనియే అచ్చుప్రతిపాఠము. కట్టడ + చేయు. శ.ప. క్రియ.

---

* "ఇట 'మాయంజేసి' అనగా దొమ్మరివాడు బుట్టలోని మామిడి చెట్టును మాయముచేసినట్లు కనబడకుండ జేసి యనియె యర్థముకాని, మాయన్ (= నశించునట్లు) చేసియని కాదు. కావున నిది (మాయంజేసి) శబ్దపల్లవక్రియయే" అన్నారు. వీ.బ్ర. గారు (చూ. 3 ఫిబ్రవరి 1947-త్రిలిఙ్గ)

మాయఁజేయు; మాయముచేయు; మాయచేయు అను క్రియల అర్థభేదమును బ్రహ్మంగా రిప్పుడైనను, పండితులను శుశ్రూషించి తెలిసికొందురు గాక.

(14) అంతసేయు; ఇంతసేయు.—

1. "మొన్న మేరుగిరిపొంటి నిశాచరి నంతసేసె, నేఁ, డే పుసఁ గట్టుబండి నిదె యిందఱుఁజూడఁగ నింతసేసె" (వి. పు. ౭-౧౨౦)

2. "నన్నేల యింతసేసితి" (వి. పు. ౭-౮౩)

3. "అంతలుసేసి పోనడిచి" (భా. ఉ. 3-101)

అంతఁజేసె; ఇంతఁజేసె; అంతలఁజేసి; ఇంతలఁజేసి—అని మార్చ గూడదు.

(15) ఐదుపదిసేయు=1. నమస్కరించు. 2. యుద్ధమున వెనుకంజ వేయు. (అర్థవివరణమునకు, చూ. సూ.ని.)

ఐదుఁబదిఁజేయు అన్నచో ఆ యర్థములు రావు.

(16) బుద్ధిసేయు = తలఁచు, స్మరించు.

1. "మాత్స్యపురమున దైన్యపడుట, బుద్ధిసేయకు" (భా. అశ్వ 1-116)

బుద్ధిఁజేయకుము - అన్నచో అర్థశూన్యపువాక్కగును.

2. "ఏటికి నొండొకబుద్ధిసేసె దే, నవ్వుచుఁబల్కెనన్ ధరణి నాథ యసత్యముగల్గ నేర్చునే?" (భా. ద్రోణ. 1-391)

ఒండొకబుద్ధిసేయుట - యనగా, అన్యథాభావించుట.

3. "స్వా, వీరకులప్రసూతులము వీరుల మే మితరక్షితీశసాధారణ బుద్ధిసేయకు ముదాత్తచరిత్రులమైన మా యెడన్" (భా.అర. 6-182)

ఇక్కడ, మాయెడన్ - ఇతరక్షితీశసాధారణబుద్ధిసేయకుము = మమ్ములను సాధారణులైన యితరక్షితీశులవలె భావింపకుము. అని భావప్రధానముగా నన్వయము చెప్పికోవలెను. అంతేగాని, 'ఇతర...బుద్ధిన్, మా యెడన్, చేయకుము' అని యన్వయించుట కుదురదు.

(17) గజిబిజిసేయు = కలఁతపెట్టు.—

"గజదైత్యుఁ డివ్విధంబున, గజిబిజిసేయంగ" (కాశీ. 6-176)

గజిబిజిసేయు - అన్న యర్థమున 'గసిమసిసేయు' అను క్రియ బసవోదాహరణమున నిట్లు ప్రయుక్తమై యున్నది.

> "ఎసఁగ లలాటవహ్నిఁ గుసుమేషు దహించిన కాలరుద్ర! ముఱ
> *గసిమసిచేసి దక్షునిమఖంబు హరించిన వీరభద్ర!"

ఈ క్రియలలో అరసున్నలుపెట్టి, గజిబిజిఁజేయంగ; అనియు,— 'గసిమసిఁ జేసి' అనియు వాడఁగూడదు.

(18) కరుణగలుగు = కరుణగలవాఁడగు; కరుణగలదియగు.

కరుణ = కరుణను, కలుగు = పొందు, అని యర్థముచెప్పుటయు, 'కరుణఁగలుగు' అని, అరసున్నపెట్టి వాడుటయు సరికాదు.

♦శ.ర. కర్త "కలుగు. (స. క్రి) = పొందు", అని యర్థముచెప్పి, అందుకు 'కరుణగలుగుమమ్మకమలనేత్ర' అను ప్రయోగమును చూపినాడు.

---

* 'గసిమసిఁజేసి' అని శ్రీ ప్రభాకరశాస్త్రిగారి పాఠము. 'గసిమసి చేసి' అని, శ్రీ బండారు తమ్మయ్యగారి సవరణ. (చూ.ఆం.సా.ప. పత్రిక. పార్థివచైత్ర - ఆషాఢములు.)

బసవపురాణము పీఠిక (పుట. ౧౧౮)లో, ప్రభాకరశాస్త్రిగారు, 'కసిమసి = గజిబిజి (గసియు మసియు)" అన్నారు. కాని, నిఘంటు ప్రలలో,— 'గజిబిజి'కి రూపాం. 'గసిబిసి' అని యున్నదిగాని 'కసిమసి' ని లేదు. ఉన్నను, 'కసి'యను మాటకు 'గసి'యను అర్థమువచ్చుమార్గము లేదు.

శ.ర.లో, 'కసిమసి = తొట్రుపాటు' అని యున్నది. సూ.ని. లో దియును లేదు.

♦ సుప్తార్థప్రకాశికలోను, 'కలుగు = పొందు' అనియే అర్థము చెప్ప సినది. ఆ యర్థమునకు శ.ర. కర్త చూపిన ప్రయోగమే చూపబడినది. (చూ.క్రియా.సూ. 104 క్రింద)

అట్లు చెప్పుట సరికాదంటూ వేదం. వేంకటరాయశాస్త్రి గారు, ప్రం.సై.లో, 'పరజనంబులమీఁదఁ గరుణగలుగు' (7-9) అన్నచోట, ఇట్లు వివరించినారు.

" 'కరుణగలుగు' - కలుగు ధాతువునకు 'పొందు' అను నర్థమనియు ఆ యర్థమున నది సకర్మక మనియు తెలిపి సీతారామాచార్యుల వారు 'కరుణగలుగుము' అని యుదాహరణ మొసంగినారు. కాని 'కరుణగలిగి యుండుము' అనుటకే శబ్దపల్లవ కల్పప్రయోగవిశేష మనియు ధాతువు సకర్మకము కాదనియు మదీయాభిప్రాయము; నాకు ఈ యర్థమునకు వ్యతిరేకమునందు చూపిన ప్రయోగము 'లేస' యనునది అకర్మకమునకు బాలవ్యాకరణమున చెప్పినట్టిదే; సకర్మకమునుచో— 'వాఁడు నలువురు పుత్రులను గలిగెను',— 'వానిచే ధనధాన్యములు కలుగఁబడినవి' అని యిట్టి యనిష్టప్రయోగపరంపరను సాధువుగా నంగీకరింపవలసివచ్చును. అదియు నిష్టాపత్తియయేని, 'సుఖంబుండు'— 'నిండోలగంబుండు'— 'కొలువుండు' ఇత్యాదులంబట్టి 'ఉండు' ధాతువును 'పొందు' - 'చేయు' అను నర్థంబులతో సకర్మకంబుచేసి,— 'ఆతండు నలువురు పుత్రుల నుండెను'.— 'వానిచే నలువురుపుత్రులు ఉండఁబడిరి. ఇత్యాది ప్రయోగములను నయితము అంగీకరింపవలసివచ్చును. వీనియందు,— 'సుఖముగా',— 'ఓలగంబుగా',— 'కొలువుగా' అని యర్థమేని ప్రకృతవాక్యమునను 'కరుణగా' (కలుగుము= ఉండుము) అనియే యర్థము కావచ్చును. కావున సకర్మకత్వము సమ్మతము కాదు."

సూ.ని. లోను, "కలుగు = కలదియగు, కలవాఁడగు" అనియే చెప్పబడినది.

కావున శ.ర. కర్త త్రొక్కినత్రోవ సరియైనది కాదు.

(1) "నీవు నతిభక్తిగలుగుము గోవులందు" (భా.అను. 3-87)

(2) "వర్ణంబులు నాలుగింటిమీఁదను మేదినీశ్వరుండు దయగలుగ వలయును" (శాంతి. 2-177)

(3) "ఈ వాక్యంబులం దాత్పర్యంబుగలుగుము" (శాంతి. 2-809)

మొదలగు నెల్లతావులలోను 'కలుగు'ను,— వే. వే. శాస్త్రిగారు చెప్పినట్లు— శబ్దపల్లవముగా గ్రహింపనగునేగాని, శ.ర. కర్త చెప్పినట్లు,— స.క్రి. గా గ్రహింపదగదు.

(భక్తిచెడు)

'కలుగు' అను క్రియవలెనే 'చెడు' అను క్రియయును శబ్దపల్లవముగా ప్రయుక్తమై యున్నది.

1. "భేషజం బెద్దాని భేదింపఁజాలదు, లంఘనంబున నెద్ది లావుచెడదు" (కాశీ. ౧-౧౧౧)

లావుచెడదు = తగ్గిపోదు.

2. " "అప్పురంధ్రీరత్నంబు,— ఇట్టుల మద్భక్తిపుట్టియును ని, జేశునెడ భక్తిచెడదు" (ఆముక్త. 4-50) "భక్తిచెడదు = భక్తిని వదలదు. 'చెడదు', సకర్మకమువోలె ప్రయుక్తము. 'కరుణగలుగుమమ్మ కమలనయన' అన్నట్లు" అని సంజీవనీవ్యాఖ్య.

నిద్రపోవు; వివాహమాడు అనుక్రియ లెట్టివో 'కరుణగలుగు'; 'భక్తిచెడు' అను క్రియలును నట్టివే.

(19) కనుఁగొను; కనుగొను.— ఈ క్రియలు రెండును శబ్దపల్లవములే. భిన్నార్థకములు. అనుస్వారమే ఆ రెంటిని భేదించునది.

కనుఁగొను (కనుంగొను) = చూచు.

కనుగొను = కన్నుగలవాఁడగు.

రెండర్థములకును, ఈ క్రింది ప్రయోగమే ప్రమాణము.—

"ఈతటినిం, గనుఁగొనుపుణ్యుఁడు
మిక్కిలికనుగొనునెన్నుదుట" (దశా. ౧-౧౨౩)

కనుఁగొనుపుణ్యుఁడు = చూచు పుణ్యాత్ముఁడు, నెన్నుదుట మిక్కిలి కనుగొనుఁ = నొసట నెక్కువకన్నుగలవాఁడగును - అని యర్థము. ఫాలనేత్రుఁడగును = ఈశ్వరుఁడగు నని భావము.

శిక్షేసుంగోను( = చూచు) అను క్రియలోని గ్రుచ్చము ద్వితీయార్థమున వచ్చినది కాదు. భాషాసంప్రదాయమును బట్టి వచ్చినది.— డిల్లంబోవు; వెలవెలంబోవు - అను క్రియలలోని గ్రుచ్చ మిట్టిదే.— "కేచిచ్ఛబ్దవిశేషాస్స్యుః క్రియాయోగే గ్రుతాన్వితాః" అని యథర్వణుడు. (ఆ. క్రియా. సూ. 33)

ఈ శ. ప. క్రియల ప్రయోగములూ, అన్వయములూ చిత్రవిచిత్రములుగా నున్నవి. మచ్చున కొన్ని.—

(20) నోరుచేయు.— "కూడనిత్తునె మాలుతోని మోలయెత్తిన, గదిమెద నోరింతకంటెఁ జేయ." (బహు. 2-61)

'ఇంతకంటెన్ - నోరుచేయన్ - గదిమెదన్' అని యన్వయము. ఇంతకంటె నెక్కువ మాటలాడినయెడల గదిమెద నని యర్థము. 'నోరుచేయు' అనునది క్రియ. క్రియలోని నోరు, చేయు అను పదము లెడపడి యున్నను, పదసమన్వయమున 'నోరుచేయన్' అని యేకపదముగా గ్రహించి చెప్పవలెఁగాని,— నోరు = నోటిని, ఇంతకంటెన్ = ఇంత కెక్కువగా, చేయన్ = చేసినయెడల, అని యర్థము చెప్పగూడదు.

నోరుచేయన్ అనుటకు మారుగా 'నోటిఁ జేయన్' అని యనగూడదు.

(21) కైకొన్కసేయు = కానుకగా ఇచ్చు.— "గుండ్లసేరును గైకొన్క కోరి సేతు" (హంస. 3-32)

కోరి, *కైకొన్కసేతు - నని యన్వయము.

(22) చెఱలుపట్టు.— "అసురవైరి పట్టెఁ జెఱ లడ్డములేక మృగాయతాత్ములన్" (నిర్వ. 5-98)

---

* సూ. ని. 'కైకానుక' క్రింద, శుకసప్తతిపద్యమును, 'కైకొన్కఁ జేసెద' (3-318) అను పాఠముతో చూపినది తప్పు. 'కైకొన్కసేయు' శబ్దపల్లవక్రియ. (చూ. 'అర్థపరామర్శ'లో 'నడకోలఁకు'.)

పద్యమున 'పట్టెఁజేలలు' అని ప్రయుక్తమై యున్నను, చేలలు పట్టెన్ - అనియే మన మర్థముచెప్పికొనవలెను. చేలలు = చేలలను, పట్టెన్ = పట్టుకొనెను - అని చెప్పఁగూడదు.

(23) కయ్యముపొడుచు.— "పొడుతు నెట్లుఁ బాండు పుత్రులతోఁ గయ్య మేను". (భా.శల్య. ౧-౬౯)

ఇందు, 'కయ్యముపొడుచు' అను క్రియలోని పదములు వెనుకముం దగుటయు, ఎడపడుటయు గూడా జరిగినది. ఏమయినను, అది యేకపద క్రియయే. 'కయ్యముఁబొడుతు' ననఁగూడదు.

"అధిప నీతనయుండు గయ్యంబువొడుచు" (భా.భీష్మ. ౧-౧౪౨)

కయ్యమువొడుచు అను నర్థమున 'కలనువొడుచు' అనియు కలదు.—

"చిక్కెఁ బోటుబంటు, కలనువొడువ" (కళాత్. 2-112)

(24) చీరికిఁగొను.— "కొనం డు ద్రుపదాత్మజుఁ డగ్గురుఁబోరఁ జీరికిన్" (భా.ద్రో. 3-298)

ద్రుపదాత్మజుఁడు - అగ్గురున్ - చీరికింగొనఁడు - అని అన్వయము. (ఇదియును పై ప్రయోగమువంటిదే)

(25) మరులుకొను.— "నీ, కొన్నమరుల్ జగజ్జనులు కొందురె" (కు.సం. ౨-౧౬౯)

'జగజ్జనులు=లోకములోనివారెవరైనను, నీకొన్నమరుల్ కొందురె?= ఇట్లు నీవలె మరులుకొందురా?' అని భావము.

ఇందు, 'మరులుకొను' అను క్రియ విభక్తమగుటయే కాక వికృతము కూడ నై యుండుట గమనింపవలసిన యంశము.

(26) కొంకుకొసరు - చేతప్పఁగొను.— "కొంకుకొసరును - చేతప్పఁ గొనకయుండు" (పాండు. ౧-౩౧)

కొంకు కొసరుగొనక యుండుము; వేతస్సగొనక యుండుము - అని అన్వయము. కవి రెండు క్రియలను జోడించి చమత్కరించినాడు. కొంకు కొసరును - అనుచోట 'ను' సముచ్చయము.

'కొంకుకొసరు' (జాతీయము) = సంకోచము.

(1) "తొడలపై నిద్రవోయెడు దుష్టవ్యాఘ్రముఁ
గొంకుకొసరింతయును లేక కూలఁద్రోసె." (విక్ర. 3-97)

(2) "సింహబలుఁ డత్యుదగ్రతఁ జిగురుఁబోఁడి
పజ్జఁ గదుపడిఁదగిలి కోపంబుగదుర
నొడిసి తలపట్టి తిగిచి మహోగ్రవృత్తిఁ
గొంకుకొసరించుకయు లేక కూలఁదాఁచె" (బిరా. 2-128)

(27) జంగలుగొను.— లయ॥ "చనుకట్టుల మోఱుంగు బలుచుక్కల పయింగినిసి - జంగల్, చెంగునఁగొసఁజ" (రా.వి. ౨. ఆ.)

చెంగునఁజ, జంగల్ గొనఁజ - అని యన్వయము. (చూ. శ.ర.లో, 'జంగగొను' క్రింద)

జంగల్ = జంగలను, కొనుజ = కొనును, అని యర్థము చెప్ప గూడదు.

## ౨౩. 'పండ్లుకొఱుకు'

*పండ్లుకొఱుకు = కోపముచే పండ్లు పటపటలాడించు. (చూ. సూ.ని. 'కొఱుకు.')

---

* పండ్లుకొఱుకుట అసూయాలక్షణమని, దు.సూ.నా. శాస్త్రిగారి వాదము. వారి వాదము, సూ.ని. కే విరుద్ధము. (చూ. 'కొఱుకు'.)

పండ్లుకొఱుకుట కోపలక్షణముగాని అసూయాలక్షణము కాదు.

'కళా'లో, తుంబురుడు తన్ను బిలువకయే విష్ణుసభ కేగి పాటకచేరీ చేసి బహుమతి పొంది వచ్చుట తన్నవమానించుటగా భావించి, నారదుడు

"నేటుకొని పండ్లుకొఱుకుచుఁ, జీటికిమాటికిని గసరు
చిలుకం జిలుకా, బోటుల నలయించెదు." (నీలా. 3-26)

పండ్లు కొఱుకుచుః = ఫలములను కొఱికి తినుచూ అని యర్థము. కోపమును ప్రకటించుచూ అని యర్థాంతరము.

అరసున్నను చేర్చి,— 'పండ్లఁగొఱుకుచు' అని మార్చినచో ఆ పలుకుబడి అనర్థమే యగును.

కాబట్టి 'ఇందు తప్పేమి' అని, ఊరక అరసున్నలు పెట్టగూడదు. అరసున్నలు పెట్టగూడని మరికొన్ని పలుకుబడులను గూడ, మనవి చేస్తాను.—

(1) పీఁటపెట్టు = కదలక మెదలక కూర్చుండు, తిష్ఠ వేసికొని యుండు.—

కోపము నాపుకొనలేక, 'పండ్లుకొఱికినా' డట! నారదుడే స్వయముగా చెప్పుచున్నాడు. వినండి—

"బాపు! తుంబురుఁడా యంచుఁ బండ్లుగొఱుకు
కొంచు, లోలోన నుడికితిఁ గొంతతడవు." (2-85)

ప్రతాపరుద్రీయములో,— "శత్రుకృతాపచారేణ మనః ప్రజ్వలనం క్రోధః; కంఠగర్జన దంతఘట్టనా ద్యనుభావః" అని తెలుపబడియున్నది.

పండ్లుకొఱుకుట ప్రాచీనకావ్యములలో సర్వత్ర కోపప్రకటనముననే కనబడుచున్నది. ఒకకొన్ని యుదాహరణములు:

1. "కోపముదయింపఁగాఁ బండ్లుకొఱుకుకొనుచు" (ప్రబోధ. 2-14)

(ఈ పద్యము, సూ.ని. లో 'ఇస్సిస్సి' అను పదముక్రింద ఉదాహృతమై యున్నది.)

2. "కుంభోదరుండు భ్రూభ్రుకుటి ఫాలమునఁ బూనెఁ,
గోకిలాక్షుఁడు పండ్లుగొఱికికొనియె,
... ... ...
రాజరేఖాధరుండు దుర్వాసుమీఁద
నలుగు పెంచెఁగి తదీయరోషానువృత్తి" (కాశీ. 7-31)

1. "బెండువడియును బోరనీదు పీటపెట్టి
చూపులనె యేర్చుఁ బ్రాబ నొక్క సూనశరంబు"
(మను. 4-69) బ్రా. ప్ర.

'పీటవెట్టి = మోహరించుకొని కూర్చుండి' అని జూలూరివారి టీక.

2. "పీటవెట్టిన మ్రాను పెల్లగిల్ల" (మను 4-16)

'పీటవెట్టినమ్రాను = స్థిరముగా పాతుకొనియుండే చెట్టు' అని జూ. టీక. 'పీటఁబెట్టి' అని సవరింపరాదు.

(2) పిండిపెట్టు = మెత్తగా నలుపు.— 'వాడిబుగ్గలు పిండిపెట్టాడు' అని వ్యవహారము. బుగ్గలు మెత్తగా నలిపివేశాడని యర్థము.

పిండిపెట్టు = పిండియిడు.

"ఒండొకఁడవైన నిపుడు నీ పిండియిడనె" (మను. 4-128)

'నీ పిండియిడనె = నీ పిండి పెట్టనా అనగా నిన్ను గొట్టి నలిపి పిండి ముద్దగా జేయనా' అనుట. (జూ. టీక.)

పిండిని బెట్టు; పిండినిడు — అని చెప్పగూడదు.

(3) వెలిపెట్టు = బహిష్కరించు.— శ.ర. కర్త "వెలిపెట్టు = వెలివేయు' అని యర్థముచెప్పి, ఆ క్రియకు, "వెలిపెట్టి గేహాదులు" అను

---

3. "కనుఁగొని కోపవేగమునఁ గన్నుల నిప్పులురాల నంగముల్
దనరఁగ సాంద్రఘర్మ సలిలంబులు గ్రమ్మ నితాంతదంతపీ
డనరటదాస్యరంగ వికట భ్రుకుటీనటుల ప్రవృత్త న
ర్తనఘటనా ప్రకారభయదస్ఫుగణా పరిణద్ధమూర్తిగా"
(భా. విరా. 2-133)

4. దశావతారచరిత్ర.—
"నాఁటికోప మీశ్వరుఁ డెఱుఁగుఁగాక."
"జటివరుఁ డిటువలెఁ గనలుచు,...
తటతటకటకటతటులదగఁగ,
గిటగిటమని రదనపటలి గీఁటుచుఁ బలికెన్" (6-84)

పండ్లుకొఱుకుట అసూయాలక్షణ మనువాదము, బహుకావ్యపరిచయముగల పండితులు శ్రీ సూ.నా. శాస్త్రిగారు చేయదగినది కాదు.

మనుచరిత్ర ప్రయోగమును చూపియున్నాఁడు. ఆ పద్యమే ఆయనగారి ప్రౌ. వ్యా. లో, కారక, ౪. క్రింద, (1915 సం॥ ప్రతిలో) 'వెలిఁబెట్టిరే' అను పాఠముతో నచ్చినది. *అది ప్రమాదము. వెలిపెట్టు; బహివెట్టు అను క్రియలు శబ్దపల్లవములు. 'వెలింబెట్టు' - 'బహింబెట్టు' అను రూపములు శాస్త్రమునకును, శ.ర. కును విరుద్ధములు.

(4) గట్టిపెట్టు = రంగు మొదలయినవి - పూయు.—

పూర్వకాలమున వర్తకులు జమాఖర్చులెక్కలు నల్లగుడ్డపుస్తకములలోను, కొయ్యపలకలమీదను, తెల్లని బలపములతో వ్రాసెడివారు. (బళ్లలో పిల్లకాయలుగూడ కొయ్యపలకలమీదనే వ్రాసికొనెడివారు.) అక్షరములు చక్కగా కనబడుటకు, వారు, ఆ పుస్తకపు పుటలమీదను, ఆ పలకలమీదను - బొగ్గుపొడికలిపిన ఆకుపసరు పూసెడివారు. అట్టి పసరుపూయుటను, 'గట్టిపెట్టుట'; 'గట్టియిడుట'; 'గట్టించుట' అందురు.

ఈ పలుకుబళ్లు కావ్యములలోని కెక్కియున్నవి.—

(గట్టిపెట్టు)

1. "దేవి, తమోమషీరసము తేటపొసంగఁగ 'గట్టిపెట్టి' యం
కావళి వ్రాయఁగాఁ దొడఁగె, నంబర సంపుటికొంతరంబునన్
బూవిలుకాని శౌర్యగుణముల్ హరిణాంకుఁడు"
(శృం.నై. 8-170)

2. "ఎంత పాపాత్ములరా లని యిటుల నింక
బ్రహ్మ నిజఫాలఫలకాక్షరములు 'గట్టి
పెట్టు' నన్నట్లు కస్తూరి పట్టువెట్టి" (సారంగధర. 2-155)

3. "అనువుగ మిన్ననుం గడితపాళి(?) తమంబున ♦గట్టిపెట్టి"
(హంస. 1-42)

* 'బులుసు' వారు పరిష్కరించిన (1952 సం॥) ప్రతిలోను, ఆ ప్రమాద మట్లే యున్నది.

♦ 'గట్టిపెట్టు' అని సూ.ని.పా. (చూ. ద్వి.సం. అనుబంధమున 'గట్టి'). అర్థమేమొ!

(గట్టియిడుట)

"*నేఁ, డక్కడితంబు 'గట్టియిడి' నట్టులఁ యున్నది కన్నంగాంచుమా"
(సౌంద. 4-80)

(గట్టించు)

"గట్టించు to rub out what is written on a plank which is used in Hindu Schools like a slate" (బ్రౌ)

'గట్టించు'కు ప్రకృతి ఘట్టించు. గట్టించు – అను పదమునకే 'ఘట్టించు' – అను క్రియయును ప్రయుక్తమై యున్నది.

"చిత్ర సాధనంబులు గాని పలక ఘట్టించి మలుంగిడి త్రిపటించి తిట్టంబు కొలఁదికిం దెచ్చి" (నన్నె. కు.సం. 5-597)

పలక ఘట్టించి - యనగా, చిత్రగును వ్రాయుట కనువగునట్లుగను పలకను పట్టించి అనియే యర్థము.

శ.ర.లో 'గట్టిపెట్టు' మున్నగు పలుకుబళ్ళలో నొక్కటియును లేదు. శ.ర., సూ.ని.కూడా 'కడితము' క్రింద, 'నేఁ డిక్క డితంబు గట్టియిడి నట్టుల యున్నది' అను పద్యము నుదాహరించియు, అందున్న 'గట్టియిడు' అను క్రియను గ్రహించలేదు.

శ.ర. కర్త, గ్రంథ్యములోని పదములను తీసికొనుటలో, 'గట్టించు' అను పదమును జారవిడిచినాడు.

సూ.ని. 'గట్టి' యను పదముక్రింద,— "ప్రాంతప్రజల సాధనమును బట్టియు కట్టించు అను గుంటూరుమండలము వాడుకనుబట్టియు 'కట్టివెట్టు'-గా గ్రహించి కట్టించు అను పదము చెప్పుట మంచిదని తోఁచెడిని" అని చెప్పి 'గట్టించు' అను క్రియ నుజ్జగించినది.

---

* 'నేఁ, డక్కడితంబుఁ గట్టియిడినట్టుల' అని వా.ని.పా. (చూ. 'కడితము')

గుంటూరుమండలములో 'కట్టించు' అను వాడుక యున్నమాట నిజమేగాని, అంతమాత్రమున 'గట్టించు' అను పదమును చెప్పమానుట సరికాదు. 'గట్టించు' అను రూపమును చూపి 'కట్టించు' అని గుంటూరు మండలమున వాడుక— అని చెప్పుట మంచిది.

శృం. నై. టీకలో 'వేదం'వారు,— "గట్టిపెట్టి - వ్రానిపలకమీఁద పాఠములు వ్రాసికొనుబాలురు ఆ పలకలకు ముందుగా బొగ్గుపొడుము దొండాకుపసరు లోనగువానిని కలిపి గట్టిగా పూసి ఆ పూఁత బిగిసికొనిన తర్వాత వానిపై తెల్లఁగా బలపములతో వ్రాసికొందురు. ఆ పూయుటకు గట్టించుట యనియు గట్టన యనియు పేరులు. ఆ గట్టనయే యర్థముగా నిట 'గట్టి' యని శ్రీనాథుఁడు ప్రయోగించినాఁడు" అని వివరించి యున్నారు.

"గందంపుఁబొడి వైచి గట్టించి యందుపై, నెలబాలఁ గట్టిన నెలవు లందు." (యయా. ౫-౯౭)

గందపుపొడి వేసి గట్టించుట యెట్టిదో బొగ్గుపొడి వేసి గట్టించుటయు నట్టిదే. కాబట్టి 'గట్టించు' అనునదే,— బ్రౌను, వేదం పండితులు చెప్పినదే—సాధురూపము.

'కట్టించు' అను వాడుకనుబట్టి, కట్టన, కట్టిపెట్టు, కట్టియిడు అను రూపములు కల్పించుట సరికాదు.

సూ.ని. 'త్రివటించు' అను పదముక్రింద, 'పలక ఘట్టించి' అను కు. సం. వచనము నుదాహరించియు, నందున్న 'ఘట్టించు' అను క్రియను గ్రహించలేదు.

సూ.ని. 'గట్టి' యను పదానికి "బాలురు వ్రాసికొను వ్రానిపలకల మీఁద బొగ్గుపొడి పసరు కలిపి పూయు పూఁత" అని యర్థముచెప్పి, ఆ యర్థమునకు,— "... తేటఁ బొసంగఁగ గట్టిపెట్టి" అను శృం. నై. పద్యమును చూపినది. ఆ యుదాహరణము 'గట్టిపెట్టు' అను క్రియకు చూపదగినదిగాని 'గట్టి'కి చూపదగినది కాదు.

'గట్టి' యనునది గట్టించుటకును, పూయుటకును, పనికివచ్చు పదార్థముగాని, 'పూయుపూఁత' కాదు. సూ.ని. 'గట్టి' యను విశేష్యమునకు,

'కట్టించు' అను క్రియకుగూడా, 'పూయుప్రాంతే' యనియే అర్థము చెప్పినది. అట్లు చెప్పుట యొప్పదు.

'గట్టిపెట్టు' అను క్రియ ఒక్క ప్రాణిసలక్షకు పూతపూయుటయందే కాదు. ఒంటికి నలుగుపిండి పట్టించుటయందును ప్రవర్తించును.

"నలుఁగులు నలువు నర్మిలి గట్టిపెట్టి" (బసవ. పుట. ౬౭)

కావున, 'గట్టి'కి సూ.ని. చెప్పిన యర్థము సమగ్రమైనది కాదు.

'గట్టిపెట్టు' అను శ.ప. క్రియలోని 'గట్టి'ని విడఁదీసి, అర్థము చెప్పుటయే తప్పు. గట్టిపెట్టు - ఏకపదము; రూఢము. రూఢములైన-తలపెట్టు (= ఉద్యమించు), బలిపెట్టు (= చంపు), బహిపెట్టు (= వెలివేయు), పొడవెట్టు (= పొగడు), పెనవెట్టు (= మెలివేయు) మొదలగు క్రియలలోని తల(ఁపు), బలి, బహి, పొడ, పెన—అను పదములను వేఱుచేసి యర్థము చెప్పరాదు. అట్లు చెప్పుచో వాటికిగల ధాతుత్వము పోయి కేవల విశేష్యత్వమే మిగులును.

(5) త్రాడువెట్టు = త్రాడుకట్టు.—

"మిండండు బసవని మెడఁ ద్రాడువెట్ట" (బస. పుట. ౧౪౬) బసవని మెడఁ ద్రాడువెట్టఁగ - అనఁగా, గొట్టె మెడకు త్రాడుగట్టి లాగఁగా - అని ఆ ఘట్టమున నర్థము.

త్రాడువోయు = త్రాడువెట్టు.—

"నడిమివాని మెడఁ ద్రాడువోసి యమ్మెదు" (హరి.పూ. 2-40)

మెడఁగ = మెడయందు, త్రాడుఁబెట్టఁగ = త్రాడునుబెట్టఁగా; త్రాడుఁబోసి=త్రాడునుపోసి,అని యరసున్నలుపెట్టి యర్థములు చెప్పఁగూడదు.

(6) వెన్నుదన్ను.-ఈ క్రియకు ఆయా సందర్భమునుబట్టి యర్థములనేకము.

1. *"చిన్నివెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ
బొడమిన చెలువ తోఁబుట్టు మాకు" (మను. 2-43)

* "ధారాధరము వెన్నుఁదన్ని పుట్టిన చాయ" (విజయ. 2-106) అని 'వేదం'వారి పాఠము. తప్పు. 'బులుసు'వారి సంస్కరణమునను ఈ తప్పు తొలగిపోలేదు.

వెన్నుఁదన్ని — అన్నప్పుడు — వెన్నుమతన్నుటయే యగును గాని విలక్షణార్థ మేర్పడదు.

-చిన్ని... వెన్నుదన్ని - అనగా, చంద్రుని వెనుక, ఆతనితోపాటు, - అని యర్థము.

2. "ధర్మనందనుండు వెన్నుదన్ని యదల్చినఁ—" (భా. భీష్మ. 2-295)
"ఇట్టి జెట్టి వెన్నుదన్ని చూడఁగలవాఁడు" (ఉద్యో. 2-244)
"దొరలు వెన్నుదన్ని పురికొల్ప" (నిర్వ. రా. 4-60)

ఇత్యాదిస్థలములలో, వెన్నుదన్ని = వెనుకనిలిచి, వెంటనుండి, అని యర్థము.

3. "వీరభద్రేశుఁ డీ యద్రి *వెన్నుదన్ని
గౌతమీవారిఁ దరవారిఁ గడిగినాఁడు" (కాశీ. 3-30)

ఈ యద్రి వెన్నుదన్ని = ఈ కొండపై నిలిచి - అని యర్థము.

4. "నెన్నడుముల విన్ను వెన్నుదన్ని" (మను. 101)

ఇది స్త్రీవర్ణనము. ఆ స్త్రీలు తమ నెన్నడుములచేత, 'విన్ను వెన్ను' దన్నినారట! ఆకాశమునకు వెన్నేమి? దానిని స్త్రీలు నడుములతో తన్నుటేమి? వెన్నుఁ—తన్ని అని యర్థము చెప్పఁగూడదు. నెన్నడుములచేత, విన్ను = ఆకాశమును, వెన్నుదన్ని = తిరస్కరించి అని యర్థము చెప్పవలెను. ఆ స్త్రీల నడుములు, ఆకాశమువలె కలదు-లేదు అన్నట్లున్నవని భావము.

(7) కాలుదన్ను = స్తిమితముగా నిలిచియుండు—

"అచటికి వేగంబయరుగక యిచటఁగా, ల్దన్నియుండెడునట్టి ధైర్య మెందుఁ, గలదు" (భా. మౌ. 97)

'ప్రథమయుఁ గావచ్చును, ద్వితీయయుఁ గానగు'నని,-'కాలిఁదన్ని' అని ప్రయోగింపదగదు.

---

* 'వెన్నుఁదన్ని' అని 'వావిళ్ల' ప్రతి పాఠము.

(8) ముసుఁగుదన్ను.— ముసుఁగుదన్నుట యనఁగా ముసుగుగా నేర్పడుట, క్రమ్ముట, ఆవరించుట, వ్యాపించుట.

"కడలేని వీడ్యంబుఁ గప్పు *చందురగ కావి
మోవి పల్లొత్తుల ముసుఁగుదన్న" (పాంచా. 3-10)

వీడ్యపు కప్పు యొక్క - ♦చందురగ కావి = సిందూరవర్ణము, మోవి పల్లొత్తులఁ-ముసుఁగుదన్నఁ=మోవియందలి పలునొక్కుల పై వ్యాపింపగా- అని యర్థము.

ముసుఁగును, తన్నఁ = తొలగింపగా - అని యర్థము చెప్పుట పొసగదు. 'ముసుఁగుదన్ను' వంటిదే 'వేసడన్ను' (= వేసవపాలు) వేరుఁదన్ను—అనరాదు.

(9) మిన్నుదన్ను = అత్యున్నతమగు - అని యర్థము.

సూ.ని. "తన్ను = తాఁకు, అంటు, స్పృశించు (ఉ.రయు. శ.ర.)" అని చెప్పి, ఆ యర్థమునకు, 'మొలఁతలు మిన్నుదన్ను తెలివేడలఁ గ్రీడలు సల్పుచుండి' (రామా. ౧—౧౩౫) అను ప్రయోగమును చూపి, "మిన్నుఁ దన్ను = అత్యున్నతమగు - అని తాత్పర్యము" అన్నది.

మిన్నుఁ - తన్ను - అని విభాగించి అర్థము చెప్పుట సరకాదు.

---

* 'చందుర్గు కావి' అని బులుసువారి పాఠము. తప్పు. ఈ తప్పు పూర్వ ముద్రణమునుండి వచ్చినది. పూ.టీ. లో 'చందుర్గ కావి' అని సరిగనే యున్నది. 'బులుసు'వారు గమనించలేదు.

♦ 'తాంబూలమువల్ల కలిగిన - కప్పు = గారగల, చందుర్గు కావి మోవి = సిందూరపురంగుగల పెదవి, పల్లొత్తుల = దంతక్షతములచేత, ముసుఁగుదన్నఁ = ఆవరింపఁబడఁగా' - అని బులుసువారి టీక.

'గార' పండ్లకుపట్టునుగాని, మోవికిపట్టదు.—పల్లొత్తుల = దంత... చేత — అనుటయు, 'ముసుఁగుదన్నఁ = ఆవరింపఁబడఁగా' — అనుటయు సరికాదు.— పూర్వటీకలో, 'సిందూరవర్ణముగల పెదవి - దంతక్షతములచే - మఱుఁగుపడఁగా' అని యున్నది.

1. "మిందన్ని వేఁఘననీలాంగుఁడు గాంచె" (ఆము. ४. ౧౦౫)

ఈ పద్యమున, మేఘమునకును, వామనావతారమునకును శ్లేష.

మిందన్ని (=మినుదన్ని) = మింటనిలిచి - అని మేఘపక్షమునను,— మిన్ఁదన్ని = మింటికి పాదము చాచి - అని వామనపక్షమునను అర్థములు.

'మిందన్ని = ఆకాశమందు నిలిచి' అని వావిళ్లవారి టీక.

'మిన్ఁ = ఆకాశమును, తన్ని = అధఃకరించి' అని వేదంవారి టీక.

'మిన్ఁదన్ని' (మినుదన్ని) అని శ. ప. క్రియగా నుండిన నేగాని, 'అధఃకరించి' అను నర్థ మేర్పడదు. వట్టి 'తన్ను' అను క్రియకు 'అధఃకరించు' అను నర్థములేదు. కావున వావిళ్లవారి టీకయే కొంత మేలు.

2. "దానఁ గరుత్మఁ డెఱ్ఱజిగిదన్నిన కన్నరచూపుచూడ"
(కళాత. ౫. ౧౨౮)

ఎఱ్ఱజిగిదన్నిన = ఎఱ్ఱవాఱిన - అని యర్థము. ఎఱ్ఱజిగిన్ఁతన్నిన - అని చెప్పుట కుదురదు.

3. "మెడదన్ను పునుకల నిడుపేరు లొండొంటిఁ
బోరిఁబోరిఁదాఁకి బొంశ్వాణుగు రనఁగ" (హర. ౫. ౧౬)

మెడదన్ను = మెడ (నిండ) నున్న - అని యర్థము. మెడఁదన్ను అనఁగూడదు.

(10) తలదన్ను.— సూ.ని. 'తలఁదన్ను = అధఃకరించు, మించు, మీఱు' అని యర్థముచెప్పి, అందు కీ క్రింది పద్యములను చూపినది.

1. "పుట్టినప్పుడె జవ్వనంబును సమస్త
భామినీకోటిఁ దలఁదన్నుపాటి చెలువు
గలిగె దీనికి." (కువల. 3. ౬౭)

2. "చెలియ పెన్నెఱిగుంపు చీకటిఁ దలఁదన్నె" (బిల్హ. ౨-౧౨౦)

తలయు, తన్నుటయు నున్నప్పుడే, తలఁదన్నెన్ = తలనుతన్నెను - అను నర్థము సరిపడును గాని, అవి లేనిచోట నర్థము సరిపడదు. పై పద్యములలో 'తల'యును లేదు; 'తన్నుట'యును లేదు. కావున అట్టి యర్థము కుదురదు.

తలఁదన్ను - అన్నప్పుడు, 'తన్ను' క్రియ, 'తల' కర్మ - యగునేగాని, అందు అధఃకరించు - అన్న యర్థ మేర్పడదు.

భామినీకోటిన్ - తలన్ - తన్నెన్ = భామినీకోటిని, తలనూ తన్నెను. చీకటిన్ - తలన్ - తన్నెన్ = చీకటిని, తలనూ తన్నెను. అనుటలో అర్థము లేదు.

'తలదన్ను' శ.ప.క్రియ. (ఏకపదము) అధఃకరించు, అని రూఢ్యర్థము. కావున, 'తలదన్ను' అను క్రియలో అర్థమున్న పెట్టుట యొప్పదు.

తలకడచు, తలద్రొక్కు, తలకొను, తలగాచు, తలయంటు, అను క్రియ లెట్టివో 'తలదన్ను' అను క్రియయు నట్టిదే.

సూ.ని. 'తలఁదన్ను - ఔపమ్యద్యోతక'మని చెప్పి, - 'అతఁడు విద్యలలో నందఱను తలఁదన్నినాఁడు అని వ్యవహార' మన్నది.

వ్యవహారమునగాని, మరియొకచోటగాని, తలనుతన్నితే - ఎవడైన నూరకుండునా? తిరుగమళ్లి చావగొట్టడా?

(11) వెన్నుచూపు = 1. యుద్ధమున నోడి పాఱిపోవు; 2. వరి పైరు వెన్నుతీయు.

రెండర్థములును, ఈ క్రింది పద్యములలో పొందుపరుపబడియున్నవి.

1. "కలమగర్భంబు లింతి జంఘలకు నోడి
వేగ తృణమూని తలవంచె *వెన్నుచూపి" (రుక్మి. ౪. ఆ.)

---

* 'వెన్నుఁజూపి' అని శ.ర.పా. తప్పు.

వెన్నుఁజూపుట - యనగా, వెన్నును చూపించుటయగునేగాని, పరా

2. "కలమగర్భంబులో మహోత్పలదళాక్షి
పిక్కలను నోడి తద్దయుఁ బీఁకెవాఱి
వెన్నుచూపి తృణంబూని యెన్నరాని
నానఁ దలవంచుచుండె ననారతంబు" (రసిక. ౨. ౧౦౧)

(12) నిజముపట్టు.— "ఆగమముల్ పురాణముల్, ప్రత్యయ మయ్యెనే ♦నిజముపట్టెద, రింతియకాక యేమి?" (కాశీ. 6. 287)

నిజము పట్టుట = నిజముగా గ్రహించుట.— వాడి మాట నేను నిజము పట్టుకొన్నాను అని వ్యవహారము.

(13) కొండయెక్కు = బిగువుచేయు.—

"కొండయెక్కాదు బతిమాలుకొనిన కొలది
......సింహాద్రి నారసింహ" (సిం.నా.శ. 17)

నరసింహస్వామి కొండమీద నున్నాడని స్వభావార్థము. బతిమాలిన కొద్దీ బిగువుచేస్తున్నాఁడని విశేషార్థము. 'కొండనెక్కాదు' అంటే విశేషార్థము సిద్ధింపదు.

(14) పాడెక్కు = నివాస మేర్పరుచుకొను.—

"ఆశ్రితులు కాశికాపురి కస్మదీయ
*లీశ, పల్లేరుదుడిచి పాడెక్కినారు" (కాశీ. 6-155)

పాడునెక్కు - అన నొప్పదు.

---

జితుఁడై పాఱిపోవుటకాదు; పైరు వెన్నుతీయుటయును కాదు.— వెన్నిచ్చు; వెన్నుచూపు - అను క్రియలు రెండును ఒక యర్థము నిచ్చునవే. రెండును శ.ప. క్రియలే.—

వెన్ను నిచ్చెను; వెన్నును జూపెను - అనుచో నవి శ.ప. క్రియలు కావు.

♦ 'నిజముఁబట్టెద'రని అచ్చుప్రతి పా. సరికాదు. సూ.ని. 'నిజము పట్టు' అను క్రియను గ్రహించనేలేదు.

* 'లీశ! ......పాటెక్కినారు' అని వా.ప్ర.పా.

(15) కొండవట్టు = కొండ(ల)కు పాఱిపోవు.—

"గద్దియడిగ్గి కాశ్యపుని గాదిలిసూనుఁడు కొండవట్టినన్" (కా. 6-21)

ఇక్కడ ఒక చిన్న విశేషము.—సూ. ని. 'కొండఁజేయు = పెద్దచేయు' అని వ్రాసి, ఆ పంక్తిక్రిందనే 'కొండవట్టు = పర్వతములకుఁ బాఱిపోవు' అని వ్రాసినది.

"గద్దియ డిగ్గి కశ్యపుని గాదిలిసూనుఁడు గొండవట్టినన్"

అను పద్యమునుగూడా ఉదాహరించినది. 'కొండఁజేయు' అన్నట్లు 'కొండఁబట్టినన్' అనక, 'కొండవట్టినన్' అనుటకు కారణమేమో? కొండన్ - పట్టినన్, అంటే - పర్వతమును పట్టుకొనఁగా, అనే యర్థము వచ్చునేగాని, 'పర్వతములకు పాఱిపోఁగా' అనే యర్థము రాదని తెలిసికొని అలా వ్రాసియుండునా? లేదు; లేదు. ముద్రితప్రతిలో 'వట్టినన్' అని యున్నదిగనుక, తానును 'వట్టినన్' అన్నది. అంతేకాని అర్థవిచారణచేసి కాదు. అట్టి విచారణచేయుపరిపాటియే యున్నచో - 'కొండఁజేయు' అని యేల ముద్రించియుండును? 'కొండచేయు' అని యేల సవరించి యుండదు?

(16) చెట్లువట్టు; తిప్పలువట్టు.—

కొండవట్టు - అను పలుకుబడివంటివే, చెట్లువట్టు; తిప్పలువట్టు - అను పలుకుబళ్లును.—

"ఎవ్వఁ, డేని సప్తాంగములు నీకు నిచ్చి చెట్లు
వట్టి, పెన్రాల తిప్పలువట్టి తిరుగు" (ఆము. ౩. ౨౮)

*చెట్లువట్టి = చెట్లపాలై, తిప్పలువట్టి=తిప్పలపాలై - అని యర్థము.

---

* "చెట్లు = వృక్ష సమూహములను - వట్టి = శూన్యములయిన, పెనురాలతిప్పలు=పెద్ద శిలల కొండలను, పట్టి=ఆశ్రయించి" అని సంజీవనీ టీక. గ్రాహ్యము కాదు.

'ఇచ్చు' అను క్రియతోఁగూడి యేర్పడు శ.ప. క్రియలును ఇట్టివే.—

(17) అగ్నియిచ్చు = అగ్నిసంస్కారముచేయు.—

1. "పురపురఁ బొక్కుచు బకపతి
కరంకముం దేరఁబనిచి గారవమున నె
య్యురఁ దాను నగ్నియిచ్చి" (భా. శాంతి. 3-512)

2. "చెలి యగుట నితనిఁడొక్కఁడు
నలఘుమతిఁ బహ్నియిచ్చి తది మేలకదా" (,,-515)

(18) వైద్యమిచ్చు = చికిత్సచేయు.— "మహోరగంబు గఱచెం దద్వేదనాలీఢుఁడై, తామూర్ఛిల్లినవాడు, వీఁడె విషవైద్యంబిచ్చి రక్షింపరే" (దశకు. 5-93)

విషవైద్యంబిచ్చి = విషవైద్యముచేసి.

(19) పూజయిచ్చు = పూజించు.— "వాసుదేవుఁడఁ జదునకుఁ బూజయిమ్మని విచార విదూరుఁడు భీష్ముఁ డెంతయుఁ, వెడగుఁదనంబునం బనిచె" (భా. సభా. 2-9)

పూజయిమ్మని = పూజచేయుమని, పూజింపుమని. పూజనిమ్మని - అన్నచోఁ ఆ యర్థము రాదు.

(20) అవసరమిచ్చు = దర్శనమిచ్చు.— "అవసరం బిచ్చి శివుఁడు బ్రహ్మాచ్యుతాది, దేవతల గారవించె" (కాశీ. 7-222)

(21) చెఱయిచ్చు = స్త్రీని (చెఱగా) మరియొకని కిచ్చు.

"సురమున నోడి దానవులతోఁడివిరోధము వీడి భక్తితో
సురపతివచ్చి నా శరణుసొచ్చి తగం జెఱలిచ్చియున్న నేఁ
గరుణయ పుట్టి తమ్ముఁ ♦బొడకట్టి శమించినయట్టినాకుఁ దా
నిరవుగఁ బూని మార్కొనియె నేని సహింతునె వాని నెల్లెడఁ"
(నన్నె. కు. సం. 10-139)

---

♦ 'బొడఁగట్టి' అని 'వావిళ్ల'ప్రతి పాఠము. సరికాదు.

చెఱలిచ్చియు = స్త్రీలను నాకర్షించియు—అని యర్థము.

ఈ యర్థమును ఈ క్రింది ప్రయోగములు బలపఱచుచున్నవి :—

1. "దండుగ లిచ్చి వేలగొని దానిపయిం జెఱలిచ్చి కన్న నిం
దుండఁగనిచ్చెఁ గాక దనుజోత్తముఁ డల్లినఁ జంపఁ బెద్దయే"
(నన్నె.—10-163)

2. "పరుల చెఱలు వృత్తులు నర్థంబులు మగుడ నిచ్చి నిజవృత్తి యందు వర్తింపు పరమేశ్వరునందనుం గని విధేయుండవై నిర్వహింప ముచితంబు"
(,,—10-193)

పరులచెఱలు = ఇంతకుముందు నీవు చెఱగా ఆర్జింపబడిన పరస్త్రీలను, మగుడ నిచ్చివేయుము—అని, తారకునికి శుక్రుడు చేసిన యుపదేశము.

(22) చెయ్యిచ్చు = సాయపడు.—

"ఇంటివారిని లేపి యీవల దొంగ
బంటుకు* చెయ్యిచ్చు పాపాత్మురాల" (గౌర. హరిశ్చ. పు. 168)

ఇటు ఇంటివారిని లేపి, అటు దొంగకు సాయపడు పాపాత్మురాలా—అని యర్థము.

(23) మొలయిచ్చు = చీలదించి బిగించు. (మొల = ఇనుపచీల)

"పులక లొండురుల మేనుల నుచ్చిపోయి డ
గ్గఱ మొలలిచ్చిన కరణిగాఁగ,
... ... ... ...
గీఱి మేనుమేను దూర గాఢాలింగ
నంబు సేసి రంగనయుఁ బ్రియుండు." (నన్నె. కు. సం. 9-148)

---

* ఇది పూర్వముద్రణ పాఠము.— 'బంటుకు' అనుట 'నఃకా' సూత్రము ప్రకారము తప్పని 'వేదం' వారు, 'బంటుచేతికి నిచ్చు' అని దిద్ది ముద్రించినారు, ఆ గ్రంథమున వారిట్లు దిద్దినతావులు చాల గలవు. వారికి అర్థముకంటె వ్యాకరణమే ముఖ్యము.

మొల = (ఇనుప) చీల - అనుటకు,—

"అరపైకంబును జేయని
హరివాసరమునకునై నిజాత్మజుఁ దునుమన్
గరవాలు చేతఁబూనిన
కరణి, *యినుప మొలకు మేడ గాల్చుటసుమ్మీ" (రుక్మాం. 5-143)

(24) దళమిచ్చు = (దళము వేయు) మందము కావించు.—

"తనుమధ్య లోపరీ స్తనభారమని విధి
దలమిచ్చెనాఁ గృశోదరము లెసఁగె" (నన్నె. కు.సం. 10—38)

తనుమధ్యలు = సన్నని నడుములుగల యీ స్త్రీలు, స్తనభారము - ఓపరని, విధి, (వారి నడుములకు) దలమిచ్చెనాన్ = దళము వేసినాడో యన్నట్లు, కృశోదరములు = ఆ స్త్రీల సన్నని నడుములు, ఎసఁగెన్ = బలిసెను—అని యర్థము. గర్భమయ్యెనని భావము.

దళమిచ్చుట (= దళము వేయుట) యనగా, పలుచనివస్తువునకు, దానికి తగిన మరికొంతవస్తువును చేర్చి దళసరి కావించుట.

మిద్దె లురియకుండుటకు మందముగా వేయు గారకు 'దళ'మని పేరు. 'దళము వేయు' అను పదము నెల్లూరుమండలమున ప్రసిద్ధము. దళము వేయు - అన్న యర్థముననే, నన్నెచోడకవి, దల(ళ) మిచ్చు - అను క్రియను వాడినాడు. (దళమిచ్చు = దళము చేయు)

---

* 'మొల'కు 'చీల' అనియే లోకమున వాడుకలోనున్న యర్థము. శ.ర. కర్తయు, ఆ యర్థమునే చెప్పి, అందుకు ప్రమాణముగా ఈ పద్యమునే సూచించియున్నాడు.

శ్రీ నిడదవోలు వెంకటరావుగారు,— 'ఇనుపమొల' యనగా 'ఇనుపకచ్చడ' మనియు, ఇనుపకచ్చడ మనగా, యోగులు ఆసనస్థైర్యమునకు మొలత్రాట జేర్చి ధరించు—'ఇనుపబద్దె' యనియు అర్థము చెప్పి, అందు కీ పద్యమునే యిచ్చి—అర్థ మిట్లు వివరించినారు :—

సూ.ని. 'దలము' అను పదానికి 'ఆధిక్యము, గొప్పతనము' అని యర్థముచెప్పి, ఆ యర్థమునకు పై పద్యమునే చూపినది. కాని 'దలము'ను విడిగా - విశేష్యముగా (సూ.ని. ప్రకారము) తీసికొన్నచో,— విధి, (ఆ స్త్రీలనడుములకు) దలము = ఆధిక్యమును, గొప్పతనమును, ఇచ్చెన్ - అని యర్థమగునేగాని, 'దళసరికాలిందను' అని యర్థముకాదు.

కవి, 'దలమిచ్చె' నాన్ - అని, శ.స. క్రియగా వాడినాడుగాని, 'దలమును' - 'ఇచ్చెనాన్'- అన్న యర్థమున వాడలేదు. సూ.ని. 'దలమిచ్చు' క్రియగాచెప్పి, ఆ క్రియకా పద్యమును చూపియుండవలసినది.

దళము = మందము - అనుటకొక ప్రయోగము.—

"దళమెక్కు నాలుక తడబడుమాటల." (శుక. 3-119)

'మెఱుఁగిచ్చు' అను క్రియవంటిది 'దళమిచ్చు' అను క్రియ.— మెఱుఁగిచ్చుట యనగా మెఱుగు పెట్టుట.—

"గొనకొనిసామగానమునకున్ మెఱుఁగిచ్చుచును (?)స్వనంబులన్" (నన్నె. కు.సం. 3-82)

(25) పడుకయిచ్చు = భోగించు.—

"అందరకి నన్నిరూపంబు లంది పొంద
దక్షుఁడయ్యెను నొక వినోదంబుగాఁగ

---

"ఇది (ఈ పద్యము) ప్రత్యేకముగా నాయినుపబద్దలను తయారు చేయించెడివారని తెలుపుచున్నది. ఇనుమును నిప్పుతో కాల్చినగాని సాగదు. ఇనుపబద్ద చేయుటకు తగుమాత్రము నిప్పున్న చాలును. కాని విశేషముగా నవసరము లేదు. ఆ విషయమే ఇందు చెప్పబడినది.— ఏ మాత్రమును విలువలేని హరివాసరముకొఱకు (ఇవి మోహిని మాటలు) కన్నకుమారుని జంపుటకై కత్తియెత్తుట— యినుపకచ్చడము చేయుటకు ఒక పెద్దమేడ కాల్చునంతటి నిప్పు నుపయోగించుట వంటిది— అని తాత్పర్యము" (చూ. వివరములకు, ఐదు - కాగ్రిక భాగవతిలో, 'పెద్దన మనుచరిత్ర')

నిరువురకు ముప్వురకు మఱి యేవురకును
బడుకయిచ్చుచుఁ బెనఁగె గోపాలుఁ డపుడు." (దశా. చ. 8-94)

పడుకనిచ్చుచు అని సవరించగూడదు.

(26) తఱిద్రొక్కు = కాలము సమీపించు.—

"*తఱిద్రొక్కియున్న యీ తల్లిదండ్రులఁ జాల
పఱచవై సంతోషపఱచవైతి" (పాండు. 3-36)

తఱిద్రొక్కియున్న = మరణకాలము సమీపించియున్న— అని యర్థము.

(26) కన్నువొందు = కన్ను మూఁతపడు, నిద్రపట్టు.

"కడుపునిండఁ గుడువఁగానమి శేయెల్లఁ
గన్నువొందకున్నఁ గరముడస్సి,
యున్నవాఁడ." (భా. ఆది. 6-289)

కన్నుపొందకున్నన్ = నిద్రపట్టకపోవుటచేత, అని యర్థము.

శ.ర. కర్త, 'పొందు' క్రింద,— "పొందు = (కన్ను) వాలు" అని యర్థముచెప్పి, ఆ యర్థమున కీ పద్యమునే చూపినాడు. కాని, 'కన్ను వాలకపోవుటచేత' అనుట సంప్రదాయము కాదు. వాలునది 'రెప్ప' గాని 'కన్ను' కాదు.

---

* పూ. ము. లో 'తఱిఁద్రొక్కియున్న' అని పాఠమూ, 'తఱిఁ ద్రొక్కి = (చావు) సమయమును సమీపించి' అని అర్థమూ ఉన్నవి.

'బులుసు' వారు, 'ద్రొక్కి' అనుట తప్పని చెప్పి, 'దక్కి' అని సవరించినారు.

'తఱిన్, దక్కియున్న = (మరణ) సమయమునకు వశమైయున్న' అని వారి టీక. తఱిన్ = (మరణ) సమయమునకు—అనుట సరికాదు. వారి సవరణ, అర్థము రెండును తప్పులే.

'తఱిద్రొక్కు' ఏకపదక్రియ. (చూ. సూ.ని.)

శ.ప. పైన 'కన్నువొందు' అను క్రియలోని 'పొందు'ను వేరుచేసి అర్థము చెప్పుటయే తప్పు. 'పొందు = వాలు' అని చెప్పుట మరియును తప్పు.

'కన్నువొందు' అను పలుకుబడి రూపము. ఈ పలుకుబడిని,—

"సౌఖ్యమొదవ నాతఁ గన్నువొందదొడఁగు"

అని, ఈదురుపల్లి భవానీశకవి ధర్మఖండము. 1-237 లో ప్రయోగించి యున్నాడని శ్రీ నిడదవోలు వెంకటరావుగారు తెలుపుచున్నారు.*

## ౨౪. 'చెఱఁబట్టు'

సూ.ని. లో, 'దేవేరి' క్రింద,— "చెఱఁబట్టెను దశముఖుఁ డే, ద్దెఱ నిచ్చుటఁ జందమామ దేవేరుల సం, దఱసన" (రామా. ౬.౧౪౪) అనియున్నది.

భాషలో, 'చెఱఁబెట్టుట' కలదు; 'చెఱపట్టుట' కలదు. అంతేగాని 'చెఱఁబట్టుట' లేదు.

(చెఱఁబెట్టుట = చెఱలో పెట్టుట)

ఎ.గీ. "ఇట్టి కడలేని దుఃఖాబ్ధిఁ బెట్టి నుంపఁ
దలఁచితియో కాక పోనీక బలిమి నాదు
ప్రాణ మొడలిలో నాకాశవాణి వచ్చి
మగుడఁ జెఱఁబెట్టె నని రతి ♦మఱుఁగుచుండె
(నన్నె.కు.సం. 5-101)

(చెఱపట్టుట = చెఱగా పట్టుట, నిర్బంధించుట)

"శతమన్యుఁ జెఱపట్టఁజాలిరే పగవార
లని తపోలోకంబు మునులు బెగడ" (ఉ.రా. 5-6)

---

* చూ. 'పరిశోధన' పత్రిక. ఏప్రిల్ 1954 (పు. 26)

♦ 'మఱుగుచుండె' అని, వావిళ్లవారి ప్రతి.

చెఱఁబట్టు — అను క్రియ సూ. ని. లోను లేదు. 'వావిళ్ల'వారి రామాభ్యుదయములో, పాఠము, 'చెఱఁబెట్టెను' అనియే యున్నది. సూ.ని. తీసికొన్నపాఠ మెక్కడిదో? ఎక్కడిదైన నేమి? ఆ పాఠము తప్పు.

## ౨౫. 'ఆఁకపెట్టు'

ఆఁకపెట్టు = అడ్డగించు.—

(1) "మంత్రులు తా, రద్దియును బలుక కుండిరి
పెద్దతడవు వింజమాఁకపెట్టినభంగిన్." (భా.రా.యు.కాం.)

(2) "అడుగైన నడనీక యాఁకపెట్టిన సిగ్గు
సంపూర్ణమదధార సరణిఁ బోదల." (కళుత్. 4-10)

ఆఁకఁబెట్టు - అని వ్యస్తపదములుగా వాడినచో, ఆఁక( = చెఱ) యందుపెట్టు, అను నర్థమిచ్చునేగాని, 'అడ్డగించు' అను నర్థము నియ్యవు.

"ఆఁకం బెట్టించెఁ గింకరావళిచేతన్" (భా౯. 9 స్కం. 434)

ఆఁకయిడు; ఆఁకిడు; ఆఁకపడు - అను క్రియలును, అడ్డగించు - అను నర్థము నిచ్చునవే.—

(ఆఁకయిడు = ఆఁకిడు)

(1) "ఆ కొలువువారు కర మచ
లాకృతి నొకపలుకులేక యందఱు వింజం
బాఁకిడిన కరణి" (భా. ఉద్యో. 3. ౨౧౧)

(2) "వింధ్యమాఁకిడి నట్లుండె విశ్వసభయు" (కాశీ. ౭—౧౨౧)

(ఆఁకపడు)

"ఇలఁ బాతాళమున నభ
స్థ్సలి నంబుధి నాఁకపడక చరియింపఁగ" (భా.రా. కిష్కిం.)

ఆఁకపడక = అడ్డములేక, ఎట్టి యాటంకమునులేక, అని యర్థము.

(అట్టాఁకయిడు)

"ఆఁకొని యఱచెడిఁ బ్రేవులు
నేఁకటవో నమలవలయు నీ మాంసము న
ట్టాఁకయిడి యివ్విధంబునఁ
దేఁకువ చెడి పల్కఁదగునె ధేనువ నాతోఁ." (భోజరా. ౪-౨౧౨)

అట్టాఁకయిడి = ఆటంకము పెట్టి - అని యర్థము.

*అట్టాకంబెట్టు; అట్టాకలంబెట్టు; పిర్యాదులంబెట్టు; జిలుగులఁబెట్టు మొదలగు క్రియలలోని ద్వితీయ, సప్తమ్యర్థమున వచ్చినదిగాని కర్మార్థమున వచ్చినది కాదనియు, శ.ప. క్రియలలో ద్వితీయాది విభక్తు లుండవనియు తెలుగునది.

(కత్తిపెట్టు)

కొ. అనంతాచార్యులవారిచే పరిష్కరింపబడి, 1901 లో ముద్రింపబడిన హరివంశములో, పాఠము,—

ఎ. గీ॥ "మట్టికందముల్ వడి గత్తిపెట్టిపెట్టి
వీఁపు లడిచియుఁ దోఁకలు వీఁకఁ దాఁచి."—

అని యున్నది. ఈ యెత్తుగీతియే, ప్రౌ. వ్యా. లో,— "ఒకొక్కచో జడంబు సప్తమికిం బ్రథమ యగు" అన్న (కార. సూ. ౧౯) చోట,— "మట్టికందముల్ వడిఁ గత్తిపెట్టిపెట్టి" అని యుదాహృతమై యున్నది.

'బులుసు'వారు,— "కందముల్ = కందములయందు, వడిఁగత్తిపెట్టిపెట్టి" అని యర్థము వ్రాసినారు; కాని, కందములయందు కత్తిపెట్టుట —అనగా అర్థమేమో చెప్పలేదు.

ఈ గీతపాదమే, వా. ని. లో, 'కందము' క్రింద,— "కందములను గత్తిపెట్టు పెట్టి" అను పాఠముతో చూపబడినది.

---

* "అట్టాఁకంబెట్టు నని యేకపదమయి శబ్దపల్లవక్రియ యగుచున్నది. అట్లయ్యును నిందు సున్న గలదు. కావున, శ.ప. క్రియలలో సున్నలను బెట్టరాదనుట యొప్పుగాదు. మాయచేయు - అను క్రియను 'మాయఁజేసి' అని, సూ.ని. ముద్రించుటను 'తప్పు' అనుట తప్పు" అని, 'కవిరత్న - కవి'గారి ప్రసంగము. (చూ. 17 ఫిబ్రవరి 1947)

నాకుజూడ అదే సాధుపాఠముగా నున్నది. ఎందువల్లననగా : 'కందములను నఱికి' - అని అక్కడ ఏర్పడవలసిన యర్థము. ఆ యర్థము, కందములయందు - 'కత్తి(ని) పెట్టిపెట్టి' అంటే యేర్పడదు. 'నఱుకు' అను నర్థమున 'కత్తిపెట్టు' అను శ.ప. క్రియ యున్నచో, - కత్తిపెట్టిపెట్టి = నఱికినఱికి, అని యర్థము చెప్పవచ్చునుగాని, అట్టిక్రియ లేదు. ఉన్నచో, కందముల్ అను ప్రథమను, కందములను - అని ద్వితీయార్థము చెప్పవలె గాని, కందములయందు - అని సప్తమ్యర్థము చెప్పుట పొసఁగదు. అప్పుడా సూత్రముక్రింద ఆ ప్రయోగము నిచ్చుటే తప్పగును.

కందములయందు - కత్తిపెట్టు పెట్టి - అన్నచో, — కందములను కత్తితో నఱికి, అని యర్థమగును. కావున వా.ని. పాఠమే సాధువు. కాని 'కందములను' అనుటమాత్రము సరికాదు. అది సూత్రవిరుద్ధము.

కవిపాఠము, "కందముల్ వడిఁ గత్తిపెట్టు పెట్టి" అని యుండునని నా యూహ.

## ౨౬. 'చేయీక'; 'సరకుగొనక'

(ఉ. హరి. యుద్ధవర్ణనము.) "విరక్త విటులునుంబోలెఁ జేయీక." (4-256)

చేయీక = పట్టు దొరకనీక—అని యుద్ధభటుల పక్షమునను, అనుకూలింపక—అని విరక్తవిటుల పక్షమునను అర్థములు.

రెండర్థములయందును 'చేయీక' శ.ప. క్రియయే. కావున చేనీక అనగూడదు.

'చేయీక'కు మరి రెండు ప్రయోగములు :—

(1) "జఘనంబుఁ బైకొన సమకట్టు, సమకట్టి
చేయీక తారినఁ *జిన్నఁబోవు" (సాంబో. 1-70)

చేయీక = అవకాశమియ్యక.

(2) "బిట్టు బెదరి చెదరి చేయీక పఱచిన" (హర. 1-3)

చేయీక = చేతికందక.

---

* 'చిన్నపోవు' వా.ని. పా.

(సగకుగొనక)

"తనిసిన తెలువరులునుంబోలె సగకుగొనక"

సగకుగొనక = ఒకరినొకగు లక్ష్యము సేయక—అని, యు. భ. పక్షమునను, సరకును కొనక—అని తెలువరుల పక్షమునను అర్థములు. (తెలువరి= తెలుగు బేరగాడు, దలారి)

తొలి యర్థమున - 'సరకుగొనక' శ. ప. క్రియ; మలియర్థమున-సరకు - కొనక - వ్యస్తపదములు. సరకు ద్వితీయార్థకప్రథమ.

*సరకుంగొనక - అంటే - సరకునుకొనక అను సర్థము వచ్చునేగాని - లక్ష్యము సేయక - అను అర్థము రాదు.

## ౨౭. 'సుడివడు'; 'అడుగుపట్టు'

"లేమగళమున వర్ద్గిగాలేక యోడి
సుడివడుచు, లోన బిగిచెడి యడుగుపట్టి
దరము దరమూని మొఱసేయ దాని కపుడు
దగ మనెడు పేరు విడువక తవిలియుండె." (గసిక. 2-92)

దరము (=శంఖము), సుడివడుట (=సుళ్లు తిరిగియుండుట) సహజము. ప్రకృతమున, గళమునకోడి - కలతపడినదనియు, సుడిగుండమున దుమికినదనియు చమత్కారము.

'సుడిఁబడుచు' అన్నచో-సుడిగుండములో పడుచు - అన్న యర్థమేగాని, 'సుళ్లుతిరుగు' అన్న యర్థ మేర్పడదు. కావున 'సుడివడుచు' అనియే అనవలెను.

సుడివడు - శ. ప. క్రియ. (=సుడికలదియగు)

సుడిఁబడు - వ్యస్తపదములు (సుడిఁన్ = సుడియందు, పడు)

శంఖము, అడుగుపట్టుట = నీటియడుగున నుండుట- సహజము. ప్రకృతమున అధఃపతితమైనదనియు, ఓడిపోయి—అడుగులు (= కాళ్లు) పట్టుకొన్నదనియు చమత్కారము.

---

* 'రుక్మాంగద'లో,—"నన్ను సరకుంగొనమిన్" (3-222) అని యున్నది. పాఠము 'సరకుగఁ గొనమిన్' అని యుండునేమో ?

'అడుగుఁబట్టి' యన్నచో— అడుగులను పట్టుట యగునేగాని నీటి యడుగునకు పోవుట—యను స్వభావార్థము కుదురదు. కావున 'అడుగుఁ బట్టి' యనగూడదు.

అడుగువట్టు—శ. ప. క్రియ.

అడుగుఁబట్టు-వ్యస్తపదములు. (అడుగు - కర్మ; పట్టు - క్రియ.)

## (1) 'వెంద్రుకపట్టు'

"మరుఁడు వెంద్రుకపట్టెడుతూపు లేర్చి (సారంగ. 2-169)

వెంద్రుకపట్టెడుతూపు-లనగా, వెంద్రుకను తెంచునంతటి పదునుగల బాణము లని యర్థము; వెంద్రుకలు ధరించునవి పుష్పములు కావున, 'పుష్పబాణము' లని యర్థాంతరము.

తొలియర్థమున 'వెంద్రుక' ద్వితీయార్థకప్రథమ. మఱియర్థమున ప్రథమ. కావున 'వెంద్రుకఁబట్టెడుతూపులు' అనుట సరిపడదు.

## (2) 'కొమ్ములుసూపు'

"కుంభోదకమువోసి యంభోజముఖివెంపఁ
జాతంబు కొమ్ములుసూపఁదొడఁగె" (విక్ర. 1-156)

కొమ్ములుసూపఁదొడఁగెఁ = కొమ్ములువేయుచున్నది-అని యర్థము; పొడువ వచ్చుచున్నదని చమత్కారము.

కొమ్ములఁజూపఁదొడఁగె - అంటే, అర్థమూ చమత్కారమూ అంతర్ధాన మవుతవి.

## ౨౮. 'ఆనఁబోడుచు'

సూ.ని., కళాపూర్ణోదయ పద్యమును 'ఆనపొడుచు' క్రింద—

'దొంగ లానఁబొడిచినఁ గోకల్ విడుతురె?" (3-139) అని యుదాహరించినది.

‘ఆజ్ఞాపించు’; ‘ఒట్టుపెట్టు’, అను నర్థములలో ‘ఆనపొడుచు’; ‘ఆన పొడుచు’ అనియే గాని, ‘ఆనఁబొడుచు’ అను రూపము కావ్యభాషలో కనబడదు. పై పద్యమును శ.ర. ‘పొడుచు’ క్రింద ‘ఆనపొడిచిన’ అనియే పఠించి ‘ఆనవొడుచు = ఆనపెట్టు’ అని యర్థముకూడ చెప్పినది. నేను ఈ యెల్లవివరమును తెలిపి, “సూ.ని. ‘ఆనఁబొడిచిన’ అని ముద్రించుట ప్రమాదము” అని నా ‘జితకాశి’ వ్యాఖ్యానము (పు. ౪౧౧)లో వ్రాసినాను. అందుకు నిఘంటుపండితులలో నొకరైన శ్రీ దు. సూర్యనారాయణశాస్త్రిగారిట్లు బదులువ్రాసినారు.

“ఈ విషయము సూక్ష్మముగా పరికింపవలసినది. ఆనపొడుచు అను పదమునకు ఆజ్ఞాపించు, అను నర్థమునను కవుల ప్రయోగము లున్నవి. ఇది శబ్దపల్లవము. ఇదియు సూ.ని. యందుఁ జూపఁబడినది. ఇఁక సూ.ని.లో ‘ఆన’ అను పదానికిఁ గళాపూర్ణోదయపద్య మిచ్చిన *4-వ యర్థము, ఆజ్ఞాముద్ర, అని వ్రాయబడినది. అట ‘ఆనఁబొడుచు’ అనియే పాఠము. ఇది ప్రమాదమని విమర్శకుల యభిప్రాయము. ఇట ఆన, పొడుచు, అనునవి వ్యస్తపదములుగా గ్రహించినప్పుడే ప్రకృతపద్యార్థము ప్రకరణానుకూల్యము నందును. అట్లుగాక యేకపదముగాని ‘ఆజ్ఞాపించు’ అను నర్థమున - గతార్థము చేసినచో, ఆజ్ఞాపించుట వాగ్రూపకమైనదిగాన ఆ రూపన దొంగిలించుటయం దప్రయోజకము. అట్టి యాజ్ఞ యున్నను లేకున్నను దొంగకు తెలియునది కాదు. ఇఁక ముద్రారూప కాజ్ఞ యున్నచో సంత్రీయుల కది గ్రహించుటలో నివర్తకముగా నుండును. ♦ప్రకృత మది యున్నను దొంగిలించువానికి బాధకము కానేరదను నభిప్రాయ మీ ప్రకరణమున కనుగుణము. దానిని స్ఫురింపఁజేయుటకే, సూ.ని. ‘కళా’ పద్యములోని దానిని పదద్వయముగా నిశ్చయించి ‘ఆన’లోఁ జూపినది. కళాపూర్ణోదయపద్యమునందలి ప్రకరణమును బరిశీలించుచో నిది యెట్లులున్న నచటి సందర్భము సరిపడునో తెలియఁగలదు.”

---

* సూ.ని.లో ‘ఆజ్ఞాముద్ర’ 2-వ యర్థముగాని 4-వ యర్థము కాదు.

♦ ఈ వాక్యము నా కర్థము కాలేదు.

నా సమాధానము.

నిజముగా ఇది సూక్ష్మముగా పరిశీలింపవలసిన విషయమే. సూ.ని. అట్లు పరిశీలింపకపోవుటచేతనే 'ఆనవోడుచు' అను చక్కనిధాతువు అన్యాయముగా రెండు తుండెములై మరల నొక అరసున్నయనుగ్రహమున నెట్లో అతుకుపడి 'ఆనఁబోడుచు' అను వికృతరూపమును పొందవలసిన దురవస్థకు పాలైనది.

"దొంగ లానవోడిచినఁ గోకల్ విడుతురె" యన్న లోకోక్తి యే యర్థమున వాడఁబడినదో వారికి ఆకళింపుకాలేదు. అందువల్ల ఆ యుక్తి లోని కోకలకు 'ఆన'ను బోడువకున్నచో అర్థము కుదురదనియు, వట్టి 'ఆన'యైనచో పొడుచుట కనువుపడదనియు, అందువల్ల 'ఆన' యను పద మునకు 'ఆజ్ఞాముద్ర' అని యర్థము చెప్పవలెననియు, 'ఆనవోడిచిన'యెడల అది వాగ్రూపకమైన ఆజ్ఞయై దొంగిలించుటయం దప్రయోజకమగుననియు, 'ఆన'ను 'బొడిచిన' యెడల, అది ముద్రారూపకాజ్ఞయై సప్రయోజకమగు ననియు, అందుకు ఆన-పొడుచు, అను పదములను వ్యస్తముగా గ్రహింప వలెననియు, అట్లు గ్రహింపనిచో పద్యార్థము ప్రకరణానుకూల్యము నంద దనియు వ్యాఖ్యానము చేసినారు.

(ఆజ్ఞాముద్ర)

లోకములో, కోకలమీదనేకాదు; కొయ్యలమీదను, జాబుల మీదను, దస్తావేజులమీదను, ధాన్యపురాసులమీదను, ఆబోతులపిరుదుల మీదను, ఇంకను ఎన్నోచోట్ల ముద్రలువేయు ఆచార మున్నది; కాని ఆ క్రియను 'ఆనఁబొడుచు' అను నాచారము లేదు. ఎందువల్లననగా; 'ముద్ర'- 'ముద్రణము' అను నర్థమునిచ్చు తెనుగుపదము 'అచ్చు'గాని 'ఆన' కాదు. అందువల్ల, ముద్రకుసంబంధించిన యర్థమున, కావ్యములలో-అచ్చుపొడుచు; అచ్చుపెట్టు; అచ్చుపోయు; అచ్చువేయు; అచ్చొత్తు; అచ్చుపడు; అచ్చు కొట్టు; అచ్చగు; అచ్చునఁబెట్టు; అచ్చుబెల్లము; అచ్చుఎద్దు; అచ్చు పుస్తకము అను పదములేగాని, ఆనఁబొడుచు; ఆనఁబోయు; ఆననొత్తు; ఆనఁబడు; ఆనఁగొట్టు; ఆనయగు; ఆనబెల్లము; ఆనయెద్దు; ఆనపుస్తకము అను పదములు ప్రయుక్తములు కాలేదు. ప్రాచీనకవులు, ముద్రవేయు-

అను నర్థమున, 'అచ్చువోదుము' - 'అచ్చుపెట్టు' - 'అచ్చొత్తు' అను క్రియలను వాడిన విధము చూతము.

(1) "దానిఁ జక్కరంపెఱుఁగులుచేసి దానధర్మ
మలకు నొకపాలు గైకొని మూఁడుపాళ్లు
వెచ్చమునకును రానీక యచ్చువోఁచి
డాఁపవలయు విభుండు భండారమునను" (పి. శకుం. 4-175)

(2) "పొరఁదన కోడి పాలు నీహారగోచిఁ
బట్టుకొనిపోయి దానవప్రభుఁడు పితరికి
వారికెల్లను నోగులవానిఁ గాఁగ
నురముపై జీడి నిత్తియచ్చొత్తి పిడిచె" (నన్నె. కు.సం. 4-16)

(3) అమరారి తనపేరియచ్చులు పెట్టించి
సురధేనుసమితిఁ గీలరముచేసె." (,,—4-11)

'తనపేరి అచ్చులుపెట్టించి' అంటే, తన నామాక్షరముల ముద్ర వేయించి అని యర్థము.

(4) "జినసమయులు వచ్చి శివభక్తవితతి
ముందటి దెసఁజూఁగి మ్రొక్కఁగఁబడిన
యందఱిమొగములయం దచ్చులొత్తి
యారించి పెడబొబ్బ లందందయిడుచు" (బస. పు. పుట. 192)

జైనుల మొగములయందు, అచ్చులొత్తి = శైవముద్రలువేసి అని ప్రకరణార్థము.

కొంకలమీద ముద్రవేయుటను ఈ క్రిందిరచన తెలుపుచున్నది.

(5) "కాలంబుపేరి సుంకరి యంబరంబునఁ
బొడిచినట్టి యరుణముద్ర యనఁగఁ,...
దోఁచె, నెత్తమ్మివిరివిందు తూర్పునందు" (రా. వి. 3-30)

ఇందును కవి, 'అంబరంబునఁ బొడిచినముద్ర' అన్నాడు, గాని 'పొడిచిన (ఆజ్ఞ) అన' అనలేదు.

(6) "అచ్చుపోడిచిన యాఁబోతులు = స్వేచ్ఛగా (హద్దులేక) తిరుగు వాండ్రు. 'రాజభటుల నచ్చుబొడిచిన యాఁబోతుల రీతిని విచ్చలవిడిగా విడనాడినచో' (ధర్మరాజు రాజసూయము)" ఆం. వా.

'ముద్ర వేయు' అను నర్థమునిచ్చు క్రియ 'అచ్చువోడుచు'గాని 'అనఁ బొడుచు కాదనియు, అచ్చులుపెట్టు; అచ్చువోడుచు, అను క్రియలు నన్నెచోడుని, కు. సం. రచననాటినుండియు ప్రచారమున నున్నవనియు, ఈ యుదాహృతగ్రంథమువలన స్పష్టమగుచున్నదిగదా! సూ.ని. పండితులు ఆ సూర్యనారాయణశాస్త్రిగా రేల యెఱుగరు? సూ.ని. లో 'అచ్చు' అను పదముక్రిందనున్న అచ్చువోడుచు; అచ్చులుపెట్టు—అను క్రియలను—వాని యర్థములను, ప్రయోగములను తిలకించియుండరా!

విస్తరమెందుకు : ముద్ర(వేయు) అను నర్థమున కవులెల్లరును, ముద్ర; అచ్చు-అను పదములను వాడిరేగాని 'అన' యను పదమునువాడినట్లు కనబడదు.

"మిను కళ్లము, తారలు చి
క్కినగింజలు, పూర్ణతుహినకిరణుఁడు తూర్పె
త్తినకొలుచురాశిగా లాం
ఛనము మషీరచితముద్రచందము దాల్చెన్" (వరాహ. 4-148)

ఈ పద్యమునను ముద్రయే కలదు. 'అన' లేదు.

సూరనార్యుడు, 'అచ్చువోడుచు' అను క్రియనెరుగక — 'ముద్ర వేయు' అను నర్థమున — 'అనఁబొడిచె' ననెనా? లేదు. లేదు.

అతఁడు తన పద్యములోని కోకలమీద 'ఆజ్ఞా-ముద్రలు' వేయింప దలపలేదు. కావుననే 'అచ్చువోడిచిన' అని యనలేదు.

(ప్రకరణానుగుణము)

ఇక, "కోకలమీద - ఆజ్ఞా—ముద్రలు పొడువకున్నచో ప్రకరణానుగుణమయిన అర్థ మేర్పడ"దన్న వాదము నించుక పరామర్శింతాము.

అక్కడ ప్రకరణ మేమనగా — దొంగరంభ ( = కలభాషిణి) మాయానలకూబరు (మణికంధరు)నితో కూడియుండగా, అసలురంభ

అక్కడికి వచ్చినది. అప్పుడా రంభల కిద్దరికిని, ఆ నలకూబరుని విషయమున జగడము జరిగినది. ఆ జగడమున అసలురంభ, దొంగరంభతో,—

"మగఁ డాపట్టంబునఁ దల
తెగఁగొట్టినఁ గొట్టుఁగాక తెకతేరఁగ నీ
కెగవిడిచి పోయెదనె ప్రా
వగ నా కౌఁగాచిగ్గైన వలపులపంటన్." (3-191)

"వెడవెరవు లిచటఁ జెల్లవు
పుడమి నహహ దొంగ లానవాడిచినఁ గోకల్
విడుతురె? గణింతునే యె
క్కడి గతిమాలిన పిశాచికవో నీ మాటల్" (,,-193)

అన్నది. అనగా నర్థమేమి?—

"గతిమాలి, మోసగించి నా వల్లభు నపహరించిన ఓసి దొంగముండా నీ ప్రగల్భపుమాటలకే బెదురుకొని నా మగనిని నీకు ధారవోసిపోదునా?— (దొంగిలించిన కోకలతోసహా పట్టుబడిన) దొంగలు, ఆనవాడిచినను = "మేము దొంగలము కాము; ఈ కోకలు మావేకాని మీవికావు. మా యమ్మతోడు; మా యబ్బతోడు" అని ఒట్టులు పెట్టుకొందురుగాక; నూరు ప్రమాణములు చేయుదురుగాక; ఆ యొట్టులకును, ఆ ప్రమాణములకును బెలుపోయి, కోకల్ విడుతురె (= సొంతదారులు) ఆ కోకలను ఆ దొంగలకు విడిచిపెట్టిపోదురా? నా మగనిని నేను లాగుకొనిపోదునుగాని నీ కర్పించి పోనుసుమా" అని యన్నదన్న మాట.

ఈ యర్థము, సూ.ని. ప్రమాణముగా గ్రహించిన 'వావిళ్ల' ప్రతిలోను, శ్రీ సుబ్బయ్యశాస్త్రిగారి ప్రతిలోను ఉన్న పాఠమునుబట్టి యేర్పడుచున్నది. *'మల్లాది'వారి ప్రతిలో 'దొంగ లానవాడిచినఁ 'గోకల్ విడుతురె' అని (కలభాషిణి =) దొంగరంభ - అన్నట్లు ఉన్నది.

---

* ఆ పాఠమున నేర్పడు అర్థ మిట్లు :—

"ఎక్కడిగతిమాలిన పిశాచివే నీవు? నా వల్లభు నాచికొనిపోవుటకె యెత్తువేసివచ్చితివి! నీ మాయదారికూత లిక్కడ సాగవు. మోసముచేసి,

ఆ రెండు తెరగుల అర్థములలోను 'ఆనవొడువ' వలసినది - దొంగలే. సొంతదారులు కారు. ఆ ఆనపొడుచుట, వాగ్రూపకమేగాని ఆజ్ఞా ముద్రారూపకము కాదు. అనగా కోకలమీద ముద్రలువేయుట కాదు. కోకలు వదలుకొనవలసినవారు సొంతదారులు. దొంగలు కారు. 'ఆన వొడుచుట'తోగాని, 'ఆనఁబొడుచుట' తోగాని సొంతదారుల కెట్టి సంబంధమును లేదు.

## సారాంశము

'ఆన' యను పదమునకు 'ఆజ్ఞాముద్ర' అను నర్థము భాషలో లేదు కావునను,—'ఆనఁబొడుచు' అను పదమునకు 'ఆజ్ఞాముద్రవేయు' అనే యర్థము సిద్ధింపదు కావునను, పద్యములోని కోకలమీద - ఆజ్ఞాముద్రలు పొడువవలసిన అక్కరయే లేదు కావునను, దొంగలుచేయవలసిన 'ప్రమాణము' లను కోకలమీద పొడువవలసిన ముద్రలుగా చెప్పుట ప్రకరణవిరుద్ధము కావునను, ఆ పద్యమునకు సూ.ని. పండితు లంతగాశ్రమపడి చెప్పిన అర్థ మంతయు వ్యర్థమనియు, ఆ వ్యాఖ్యానము వట్టి ఆకాశపంచాంగమేగాని తత్త్వమెరిగిచెప్పినది కాదనియు, అందువలన అది ప్రకరణానుగుణముకా దనియు సారాంశము.

## (వ్యస్తపదభ్రాంతి)

'ఆనవొడుచు' అని యేకపదక్రియగా వాడినయెడల, అది వాగ్రూప కాజ్ఞ యగుననియు, 'ముద్రారూపకాజ్ఞ' అని స్ఫురింపజేయుటకు, ఆనన్- పొడుచు, అని వ్యస్తపదములుగా వాడవలె ననియు, ఆ శాస్త్రిగారి దొక వాదము. అది భ్రాంతిమూలకము. శబ్దపల్లవధాతువుల స్వరూపస్వభావ ములను సరిగా పరిశీలింపమి ఆ భ్రాంతికి మూలము.

---

ఆయీ వస్తువుల నపహరింపవచ్చు దొరకోలుసన్నాసులు (= దొంగలు)— 'ఈ కోకలు మావి' అని పేచీపెట్టి, (తామేమో సత్యభామ లైనట్లు), ఆనవొడిచినన్ = ఒట్లుపెట్టుకొన్నంతమాత్రమున—లేక, ప్రమాణములు చేసినంతమాత్రమున, (సొంతదారులు), కోకల్ విడుతురె = వస్త్రములను ఆ దొంగల కర్పింతురా? చాలు - చాలు, పోవే."

'ఆనవోడుచుట' యనగా విధిరూపమునగాని, నిషేధరూపమునగాని 'ఆజ్ఞ సేయుట'. అది వాగ్రూపకము కావచ్చును; ముద్రారూపకము కావచ్చును; లేదా యేదేని వస్తురూపకమును కావచ్చును. అడవిజాతుల వారి ఆజ్ఞలు — కట్టుపుల్లతోను, నూలుదారముతోను, చెల్లుబడి యవుచుండునట.—

"ఆభీరభిల్లాది, కంపకోల నూల నాజ్ఞ చెల్లు." (ఆముక్త. 4-206)

ఎరుకుల - యేనాది కులములలో - 'కులతప్పు' సందర్భములలో, పుల్ల విరిచి - ఆనపెట్టు, ఆచార మిప్పటికిని కలదు.

ఆన వాగ్రూపకమగుచో, 'ఆనంబలికె' ననియు, ఆన ముద్రారూపకమగుచో, 'ఆనంబొడిచె' ననియు, ఆన వస్తురూపక మగుచో, చేతికి 'ఆన నిచ్చె' ననియు, ననవలె ననుకొనుట పొరపాటు.

ఆజ్ఞారూప మేపయినను అది 'ఆనవోడుచుట'యే యగును. ప్రకరణమునుబట్టి ఆ ధాతువే ఆయా యర్థముల నిచ్చుచుండును. ఆ యర్థములను పండితులు మెలకువతో - సులభముగనే గ్రహించుచుందురు.

అర్థము మారినను శబ్దపల్లవధాతువురూపము మారదు. మారినచో అందలి పదములు - ఏకపదత్వమును, ధాతుత్వమును, విలక్షణార్థాభిధాయిశక్తిని కోలుపోయి, వ్యస్తములై అవయవార్థమును మాత్రమే యియ్యగలవి యగును. కావున శ్రీ సూర్యనారాయణశాస్త్రిగారి మతముప్రకారము, 'ఆన = ఆజ్ఞాముద్ర' - యైనను, 'ఆనంబొడుచు' అన్నరూపమున ఆ వ్యస్త పదములు వారర్థించిన యర్థము నియ్యజాలవు. అనగా (శ్లోకలమీద) 'ఆజ్ఞాముద్రలువేసినను' - అన్న యర్థము నియ్యజాలవు. 'ఆన' ద్వితీయాంతమైనందున 'పొడుచు' అను క్రియకు కర్మయగుచున్నది. అందువల్ల (పుల్లయో - పుడకయో తీసికొని) 'ఆన' ను, పొడిచినను అన్న యర్థమును మాత్రమే యిచ్చును.

కాబట్టి, శ్రీశాస్త్రిగారు "ఆన-పొడుచు, అనునవి వ్యస్తపదములుగా గ్రహించినప్పుడే ప్రకృతపద్యార్థము ప్రకరణానుకూల్యము సందును" అనుట కేవలము పొరపాటని నా మనవి.

పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి 'అచ్చుఁబోఁడిచి' అనక 'అచ్చువోఁడిచి' అనుటలో గల రహస్య మేమో శ్రీ శాస్త్రిగారు నిలకడమీఁద విచారించి తెలిసికొందురుగాక.

మఱచినాను. ఇక్కడ ప్రస్తావింపవలసిన యంశ మొకటి యున్నది.- ఇంతకుముందు కొండచేయు; కొండఁజేయు, అను పదములనుగూర్చిన చర్చలో శ్రీ సూర్యనారాయణశాస్త్రిగా రేమన్నారంటే :—

"కొండఁజేయు; కొండచేయు, లెట్లున్నను, ఇందలి కర్మపదమగు 'కొండ' జడవాచకమగుటచేఁ బ్రథమయుఁ గావచ్చును, ద్వితీయయుఁగా నగును. ఇందు తప్పేమి" అన్నారు.

మఱి ప్రకృతమైన వారి 'అనఁబోఁడుచు'లోనూ, పొడుచు-అనుక్రియకు (వారి మతముప్రకారము) అన, కర్మయే కదా? జడవాచక మే కదా? ప్రథమయుఁ గావచ్చును. ద్వితీయయుఁగా నగును గదా? ఇందును-తప్పేమీ యుండదుగదా? అట్టిస్థితిలో వారు 'అనక' అని ద్వితీయగా ముద్రింపవలసిన యవసర మేమి? ప్రథమగా ముద్రింపకపోవుటకు హేతు వేమి? 'అది వ్యస్తము, ద్వితీయయే' యని అంతగా పెనగవలసిన నిమిత్త మేమి? ఈ వ్రాత, పూర్వవిరుద్ధము కాదా? *ఇది నిశ్చయదృష్టిలేనివ్రాత కాదా?

ఇది గట్టిగాపట్టి చూడవలసిన యంశము కావున విమర్శకుల జ్ఞప్తి కెలయించినాను.

(పాఠ పరిశీలనము)

" 'అనఁబోఁడుచు' అనియే పాఠము. కావున అన, పొడుచు, అనునవి వ్యస్తపదములుగా గ్రహించుటే సాధుమార్గము" అని సూ.నా. శాస్త్రిగారి వాదము. ఆ వాదమునకుగల బల మేమో పరిశీలింతము.

---

* ఆ శాస్త్రిగారు నావ్రాతను, 'నిశ్చయదృష్టిలేక తొడతొక్కిడిగా వ్రాసిన వ్రాత'యనియు, 'పూర్వాపరవిరోధముగలది' యనియు, ఆక్షేపించి యున్నారు.

ఆనఁబొడుచు - అనియే పాఠమా? ఎక్కడి దాపాఠము? ముద్రిత ప్రతిలోనిదేకదా? నేటి ముద్రణములు సుపరిష్కృతములు కావన్నది పండితు లెరిగిన విషయమేకదా! అట్టి ప్రతులలోని పాఠములను పరిశీలింపక అట్లే ప్రమాణముగా గొనుచో ఆ నిఘంటువు నిర్దుష్టమగునా? అట్లు గ్రహించుటవల్లనేగదా యిపుడింత పొసగినది? 'పాండురంగ' ముద్రిత ప్రతిలో—

"ఏదారఁ కేటికిందారకు నీవు విపాగ్నుల నానఁబెట్టుటల్." (2-198) అని యున్నదే; దానినిబట్టి, సూ.ని. 'ఆనఁబెట్టు' అనియు ననవచ్చునని ఆ రూపమునుగూడా గ్రహించి యుండవలసినదే. ఏల గ్రహించలేదు?

ఎందుకు గ్రంథవిస్తరము? 'ఆనఁబొడుచు' అను పాఠము తప్పు. 'ఆనవోడుచు' అనుట ఒప్పు. నీమాటకు ప్రమాణ మేమంటారా?

నా మాటకు ప్రత్యంతరపాఠములు ప్రమాణము. నిఘంటువులు ప్రమాణము. ప్రాచీనకవిప్రయోగములు ప్రమాణము. వ్యాకరణశాస్త్రము ప్రమాణము.

1. సూ.ని. ప్రకటితమైన పిమ్మట నే శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు - ఆంధ్రభాషానుశాసనకర్తలు - అభినవవాగనుశాసనబిరుదవిరాజితులు, కళాపూర్ణోదయమును, పెక్కు ప్రతులతో సరిమాచి సవరించి ప్రకటించినారు. ఆ ప్రతిలో 'ఆనవోడిచిన' అనియే పాఠము. 'ఆనఁబొడిచిన' అన్న సూ.ని. పాఠము గ్రహింపబడలేదు.

2. అటుపిమ్మట శ్రీ కాశీభట్టసుబ్బయ్యశాస్త్రిగారు సాహిత్యవిశారదులు కావించిన పరిష్కరణముతో ఆ గ్రంథము మరల ముద్రితమైనది. అందును పాఠము 'ఆనవోడిచిన' అనియే. సగసములగు పాఠములను సూ.ని. నుండి తాము కైకొన్నట్లు శ్రీ సుబ్బయశాస్త్రిగారు గ్రంథపీఠికలో వ్రాసి యున్నారు. వారును 'ఆనఁబొడుచు' పాఠమును గ్రహించలేదు. పైగా, కఠినపదార్థవివరణమున 'ఆనవోడుచు = ఆనపెట్టు' అని వివరించియున్నారు.

3. శ.ర. కర్త, 'ఆనవోడిచిన' అన్న పాఠమును 'పొడుచు' అను పదముక్రింద ఉదాహరించి యున్నాడు.

4. ఆంధ్రపదపారిజాతములో,— 'దొంగ లానవోడిచిన' అను పాఠమూ, 'ఆనవోడిచిన = ఆనపెట్టుట' అను అర్థమూ ఉన్నవి.

**5.** ఆంధ్రవాచస్పత్యము, శ.ర. పాఠమునే గ్రహించినది. (సూ.ని. పాఠమును గ్రహించలేదు.)

**6.** "పోకుండ నా యానవోడిచి" అని గౌరనకవి ప్రయోగము. (హరిశ్చ.ఉ. 1612)

**7.** 'ఆనవోడుచు' శబ్దపల్లవధాతువు; ఏకపదము; కావున 'ఆనఁ బోడుచు' అని వ్యస్తరూపకల్పనముచేయుట శాస్త్రవిరుద్ధము.

నా మాటకు ఆయీ ఇతరప్రమాణములకంటెను, సూ. ని. పండితుల వాదమే ప్రబలప్రమాణము. అది యెలాగంటే—

" 'ఆన' యను పదమును 'ఆజ్ఞాముద్ర' అన్నయర్థము చెప్పవలసిన అక్కఱపడితేనే 'ఆన' - 'పొడుచు', వ్యస్తపదములు. అట్టి అక్కఱలేనిచో 'ఆనవోడుచు' ఏకపదమే", అనికదా వారివాదము?

ప్రకృతపద్యార్థమున ఆజ్ఞాముద్రలతో పనిలేదు కావున 'ఆన'కు 'ఆజ్ఞాముద్ర' అన్నయర్థమును చెప్పవలసిన అక్కఱ లేదని సిద్ధాంతమై పోయినది. అందువలన 'ఆనఁబోడుచు' అన్న వ్యస్తపదపాఠముతో పని లేదనియు, 'ఆనవోడుచు' అన్న యేకపదపాఠమే చాలుననియు - ఆ పండితులు చెప్పక చెప్పినట్లే కదా?

ఇంతకంటెను నా మాటకు ప్రమాణము వేరే యేమికావలెను?

(ప్రయోగాంతరము)

"మా వాదమునకు బలముగా 'శాసనపద్యమంజరి'లో 'ఆనఁబోడుచు' అనువ్యస్తపదప్రయోగ మొకటి యున్నది. చూచుకోండి" అని సూ.ని. సూచించినది. చూడబోగా ఆ పద్య మిట్లున్నది.—

*క॥ ఇనుపాదము లర్చింపఁగఁ
జనుచోఁ జని అర్ఘ్యమంత్ర జలపాత్రలు దా
వినువీది నాఁగఁబంచెను
ఘనముగఁ దనయానవోడిచి కరికాలుఁ డిలన్.

---

* మాతృక యిట్లున్నది:—
"ఇనుపాదము లర్చింపంగం
జనుచో (ం) జని అర్ఘ్యమంత్ర జలపాత్రలు దా

ఈ పద్యములో 'ఆనఁబోడుచు' అను రూపమూ లేదు. 'ఆజ్ఞాముద్ర' అన్న యర్థమూ లేదు. చిత్తగించితిరా? ఈ సందర్భమున సూ.ని. అసత్యమును లిఖించినదనుటకంటే, ప్రమాదపడిన దనుట సమంజసమే పో!

ఇక్కడ చెప్పవలసిన గొప్ప విశేష మొకటి యున్నది. ఏమనగా, ఆ 'కళా' పద్యమునే, సూ.ని., 'గడించు' అను పదముక్రింద,—

"దొంగలానవొడిచిన"

అను పాఠముతోనే ఉదాహరించియున్నది. (నే నిటీవల చూచినాను) కాబట్టి, 'దువ్వూరి'వారి వాదము దుర్బలము; విచారవిదూరము; వ్యర్థము.

'ఆన'కు 'ఆజ్ఞాముద్ర' అని యర్థము చెప్పుటయు, 'ఆనవొడిచిన' అను ప్రాచీనరచనను 'ఆనఁబొడిచిన' అని మార్చుటయు, 'అట్లుండినఁనే గాని అక్కడ అర్థము సరిపడ'దని వాదించుటయు తప్పు.

తొలుత ఆ తప్పు జరిగినవిధ మిట్లుండును: 'ఆన'కు అర్థములు వ్రాసినవారు (శ్రీ సూర్యనారాయణశాస్త్రిగారే నేమో?) 'ఆనవొడుచు' అను శ.ప. క్రియాతత్త్వము నెరిగినవారు కారు. అందువలన 'ఆనఁబొడిచిన' అని మార్పుచేసినారు. 'గడించు' అను పదమున కర్థము వ్రాసినవారు ఆ క్రియాతత్త్వము నెరిగినవారు; కావున ప్రాచీనపాఠము సరిగ్గా గ్రహించినారు. నిజమింతే. శ్రీ శాస్త్రిగా రేమంటారో!

ఆనవెట్టు; ఆనవొడుచు—అను క్రియ లనేకార్థములలో వాడబడి యున్నవి. అన్ని యర్థములలోను, అవి శబ్దపల్లవములే. 'ఆనంబెట్టు', 'ఆనఁబొడుచు' అని వ్యస్తముగా కనబడవు.

ఒక కొన్ని యుదాహరణములు :—

'ఆనవెట్టు'

1. "వేడం జనుదేర నానవెట్టితి." (సారం. 3-77)

వేడుకొనుటకు రాగా, ఆనపెట్టితి = దగ్గరికే రావలదని ఆజ్ఞచేసితివి అని యర్థము.

---

వినువీధి నాంగంబంచ్చెను
ఘనముగం దనయానవొడిచి కరికాలుం డిలను." (1 భా. 74 పు. 6 ప.)

2. "త్రిమ్మరివచ్చిన నొట్టటంచు, వా
క్రువ్వఁగరాని యానలిడి." (పాంచా. 5-30)

వాక్రు...యానలిడి = నోట వచింపరాని ఒట్టులుపెట్టి అని యర్థము. (ఆనలిడి = ఆనలుపెట్టి.)

3. "పంటనొక్కు నటంచు బాసచేసినఁగాని
తేనెలూరెడి మోవి నాననీను,
... ... ...
అగడుసేయ నటంచు నానవెట్టినఁగాని
హాళితో రతికేళిఁ దేలనీను." (దశా. 7-134)

అగడుచేయనని, ఆనవెట్టినఁగాని = మాట (హామీ) యిస్తేతప్ప, అని యిక్కడ అర్థము.

'ఆనవోడుచు'

1. "నీ వచటి, కేఁగి పీనుఁగుఁ గాఁటికెవ్వరేఁ దెచ్చి
కైకొని తమయిచ్చగాఁ గాల్చి మరలి
పోకుండ నా యానవొడిచి." (గౌ. హరి. ఉ. 1612)

ఇక్కడ, నా-ఆనపొడిచి-అంటే, నా యాజ్ఞనుచెప్పి-అని యర్థము. అంతేగాని, నా యాజ్ఞాముద్రనుపొడిచి, అని కాదు. 'నా-ఆజ్ఞాపించి' అనియును కాదు.— (ఆనవొడిచి = ఆనపెట్టి అని వే. వే. శా. టీక.)

2. "బంధురమైయున్న పరివార మాన
బొడవంగ దనకేల." (పల్నా. II.)

'ఈ స్థలములో ఆనబొడుచుట యనగా— వొట్టుబెట్టుట' అని బ్రౌనుపండితుడు.

3. "కవిసెనేనిఁ గఠోరకంఠహుంకారంబు
వొనరించి మీ యానవొడుచువాఁడ,
నానయును ద్రోచివచ్చెనే నాగ్రహమున
దాని పండ్లన్ని రాలంగఁ దన్నువాఁడ." (కాశీ. 4-37)

'ఆనవైచు' అను పలుకుబడియును కలదు.—

"అనవైచినట్లు, పూన్కిమంత్రప్రయో
గంబు చేసినట్లు, కట్టినట్లు
నిట్టవోడిచి యెదురఁదోట్టినవాహిని
యిపుర జలము వాటె నిసుక దోఁప." (భోజ. 3-18)

ఆనవైచినట్లు = ఒట్టు వేసినట్లు. (సూ.ని. లో, ఆనవైచు; ఒట్టువేయు అను పలుకుబడులు రెండును లేవు.)

'ఆనవోవు' అను క్రియయు నున్నది.—

"కాఁబోలు నని విన్న కన్నవా రెన్న నే
ర్పునఁగని యానలువోయి వోయి." (నిగంటు. 2-17)

ఇంకను విస్తర మెందుకు? పెట్టు; పొడుచు మొదలగు క్రియలు మరికొన్ని ధాత్వాదులతో కూడి, ఏకపదత్వమును పొంది, వివిధార్థములను పెక్కింటి నిచ్చుచుండును. సూ.ని. గమనించినట్లు లేదు.... 'పొడుచు' అను క్రియ 'ఆన'తో కూడినట్లే, ఎన్ని యితరపదములతో కూడి, యెన్ని యర్థముల నిచ్చుచున్నదో చూడండి.—

(1) 'తడుకువొడుచు' = తడికెపరుచు.—

సూ.ని., తడుకువొడుచు=వెలుగునాటు, కంచెవేయు అని యర్థము చెప్పి, అందుకే క్రింది పంక్తి లుదాహరించినది.

"మట్ట లెత్తుకొని యెత్తుగల పొదరుటడవులు చొరంబాఱు సిడి కడితికదుపు నురవడికి విఱిగిపడిన విటపివిటపంబులం దడుకువొడిచినగతి నొందు నెడలును" (మను. ౪-౩౭)

వావిళ్లవారి టీకలో,— 'విఱిగి నేలపైఁ బడిపోయిన చెట్లకొమ్మలచే, తడుకువొడిచినగతిన్ = కంచెవేసినరీతిని' అనియే యున్నది.

కాని, అది సరియైన అర్థము కాదు. విరిగి నేలపై చెల్లా చెదరుగా పడిపోయియున్న కొమ్మలు—తడికె పరిచిన ట్లుండునుగాని, వెలుగు నాటిన ట్లుండవు.

"తడుక బొడిచినగతి = తడికెలు పరిచినట్లుగా నున్నటువంటి, ఎడలును = ప్రదేశములును" అని జూలూరివారి టీక.

అదే సరియైన అర్థము. కాబట్టి, 'తడుకుపొడుచు' అను క్రియకు— 'తడికెపరుచు' అన్న యర్థముకూడా ఉన్నదని చెప్పవలెను.

(2) అప్పుపొడుచు = అప్పుచేయు.—

"పొందుపట్టుల నప్పులు పొడిచిపొడిచి" (పాండు. 3-18)

అప్పుపొడుచు ( = అప్పులుపొడుచు) అను క్రియ, 'కయ్యము వొడుచు'; *'మేడమువొడుచు' అను క్రియలవంటిది.—

సూ.ని. 'తడుకువొడుచు' అను క్రియను చెప్పినట్లే, 'కయ్యము వొడుచు';—'అప్పువొడుచు' అను క్రియలను చెప్పియుండవలసినది.

(3) పన్నిదమువొడుచు = పందెమువేయు.—

"ఎత్తినపూవులు ముడుచుచుఁ
బొత్తిచ్చిన పన్నిదములు వొడుచుచు నత్యు
ద్వృత్తగతి వీథిలో శుభ
టోత్తము లంగళ్ల మెఱయుచుండుదు రెలమిన్"

(నన్నె. కు. సం. 7-122)

(4) చిఱలువొడుచు = పశువులు చెలరేగి గంతులుపెట్టు.—

"చిఱు పెండ వెట్టుచుఁ జిఱలువొడ్చుచును" (బసవ. పు. 160)

(5) పులపొడుచు = కన్ను తటాలునమూసి తెరచు.—

"చప్పుళ్లకుఁ బులపొడుచుచు" (భల్లా. 3. ఆ.)

శ.ర. లో,- 'పులపొడుచు = ఱెప్పవేయక చూచు' అని యున్నది. సరికాదు. చప్పుడైనప్పుడు తటాలున కన్నుమూయుట స్వభావముగాని రెప్పవేయకచూచుట స్వభావము కాదు.

'ఆముక్త'లో, "తడి తలడిగ్గి ముంప, జడతం దుదఱెప్పలఁ గన్ను వీడి, పుల్పొడుచుచు' (౪-౧౧౨) అన్నచోట, వే. వే. శాస్త్రిగారును, 'పుల్పొడుచుచు = ఱెప్పవేయక చూచుచు' అనియే టీక వ్రాసినారు. కాని అక్కడను, రెప్ప యొకమారెత్తి మరల మూసికొనుచు— అనియే

---

* 'మేడమువొడుచు' (శ. ర. పా.) 'పిడుపర్తి' బస. పు. ముద్రిత ప్రతిలో 'వేడెముబోతురె' అని యున్నది. (చూ. 6-24) ద్వి. బస. పు. 172 పుటలో 'ఓడితి నన్నను మేడెముపొడువఁ బాడియె' అని యున్నది.

అర్థము. వర్షపునీరు కన్నులలోనికి డిగగా, పక్షులు, రెప్పల నప్పళించినవని యక్కడ వర్ణనము. కావున 'ఱెప్పవేయకచూచుచు' అని యర్థము చెప్పుట యొప్పదు.

(6) నిక్కవోడుచు = నిక్కు.—

సూ.ని., - "నిక్కవోడుచు (నిక్కు + అ + పోడుచు) = నిక్కన నిలుచు.— (వ్యావ)మేన వెండ్రుకలు నిక్కవోడిచెను. (శ.ర.)" - అని చెప్పియు, మరల తానే 'నిలువఁబడు' అను పదముక్రింద,—

"నిక్కు,నిక్కఁబోడుచు" అని లిఖించినది.

'నిక్కంబోడుచు' అను రూపము సూ.ని. ప్రకారమే తప్పు.

'విజ' (1-99) లో, వే.వే. శాస్త్రిగారును,- ♦'నిక్కఁబోడుచుకొని' అనియే అన్నారు. పొరపాటు.

ఇట్టి పొరపాటు లెన్నని చెప్పను? నిఘంటువులలోను, వ్యాఖ్యానములలోను నూరులస్థానమును మీరియున్నవి.

ఇంతకును నేను చెప్పవచ్చిన దేమనగా.— 'పెట్టు; పోడుచు; చేయు; తన్ను మొదలగు క్రియలు ఇతరధాతువులకును, విశేష్యాదులకును అనుప్రయుక్తములై, ఏకపదత్వమును-రూఢత్వమును నెనసి, విలక్షణములైన యనేకార్థముల నిచ్చుచు - శబ్దపల్లవధాతువులన నొప్పుచుండు ననియు, ఏ యర్థమునగాని, ఆ ధాతువులోని క్రియను వేరుపరచి-దాని ముందరిపదమును కర్మగా భావించి,— ద్వితీయాంతమునుచేసి, అనఁబెట్టు; అనఁబోడుచు; పులఁబోడుచు; *తడుకుఁబోడుచు; సరకుఁజేయు; కొండఁజేయు; తలఁదన్ను; వెన్నుఁదన్ను; నిక్కఁబోడుచు ఇత్యాదిగా రూపములు కల్పించుటయు,- అనను బెట్టెను; అననుబోడిచెను; కొండనుజేసెను; తలను దన్నెను, ఇత్యాదిగా ప్రతిపదార్థములు చెప్పుటయు, సరికాదనియు, ఈ సందర్భమున సూ.ని. చాల తావులలో పొరపడినదనియును. అంతే.

---

♦ 'బులుసు' వారును అట్లే అన్నారు.

* వే. వే. శాస్త్రిగారు 'ఆముక్త' పీఠికలో 'తడుకుఁబోడిపించి' అనియే ముద్రించినారు. (చూ. పుట. 9)

## ౨౯. 'నులివడు'

సూ.ని. ''నులిపడు, నులివడు, అ.క్రి. (√ నులి) ౧ దోఁపుడువడు'' అనిచెప్పి, అందుకుప్రమాణముగా, ''దోఁపువోయె ననుట దోఁచు నులిపడె న్వనంగ'' అను (ఆ.భా. ౩.౧౧౬) పద్యము నిచ్చినది.

'నులి' (= దోఁపుడు) అను విశేష్యముండిననే కదా, 'నులి + పడు= నులివడు' అనుక్రియ యేర్పడుట. మరి సూ.ని. లో 'నులి = దోఁపుడు' అని మూలపదములలో లేదే! సూ. ని. లోనే కాదు, 'దోఁపుడు' అన్న యర్థముతో 'నులి'యను పదము శ.ర. లోను లేదు; బ్రౌణ్యమునను లేదు. 'నులి' యను పదమే లేనప్పుడు - 'నులివడు' అనుక్రియ యేర్పడుట యెట్లు?

అసలుకథ యేమనగా: ఆంధ్రభాషార్ణవపద్యములో, ''వోఁపుపోయె ననుట దోఁచు నొలిపడె ననంగ''— అనుటకు మారుగా ''...దోఁచు నులిపడె ననంగ'' అని అచ్చైనది. 'నొ', 'ను', అగుట, వ్రాయసగాని తప్పో, అచ్చువారితప్పో అయ్యుంటుంది. ఆ తప్పును, సూ.ని. అట్లే వ్రాసికొన్నది.

'తోఁచు నొలిపడెననంగ' అన్నచోట, 'తోఁచున్ - ఒలిపడెన్' అని విభాగము. కాబట్టి అది 'ఒలి'గాని 'నులి' కాదు.— ''ఒలి = ఒలుపు, దోఁపుడు, అపహారణము. 'ఒలిచిన నొలి వాడెదరు.' జై.భా. ౧.౬౩'' అని, శ.ర. లోను, సూ.ని. లోనుకూడా ఉన్నది.

'ఒలివడు' అను క్రియ సూ.ని. లో లేదుగాని, శ.ర. లో— ''ఒలివడు = (ఒలి + పడు) దోఁపుడువోవు. 'సీ. *ఒలివడ్డ సెవమునఁ గలలేని సిరిచెప్పి, చుట్టలపై దాడిపెట్టువారు.—(ఆము. ౬. ఆ)'' అని ఉదాహరణతో గూడా ఉన్నది. (శ.ర. లో ఉన్నపదమును సూ. ని. చెప్పక వదలుటకు హేతువేమో?)

బ్రౌణ్యమునను, ''ఒలివడుట. To be plundered or robbed దోపుడుపోవుట'' అనియున్నది.

---

* 'ఒలఁబడ్డ' అని 'వేదం'వారి పా. అసాధువు. ఆ యసాధు పాఠమునే సూ.ని. 'ఒలుచు' క్రింద చేర్చినది.

కాబట్టి సూ.ని. ఆం.భా. అచ్చుప్రతినిబట్టి గ్రహించిన 'నులివడు' అనురూపము తప్పు. ఆం.భా. అచ్చుప్రతిలో - "తోఁచు నొలిపడెననంగ" అను సాధుపాఠ మున్నను, సూ.ని. 'నొలివడు' అనియే గ్రహించియుండును గాని 'ఒలివడు'గా గ్రహించియుండదు. పదస్వరూపము తెలియనప్పుడు జరుగుప్రమాదము లిట్టివేగదా!

శ.ర. లో లేదుగాని, 'ఒలివోవు' అను క్రియ యొకటి యున్నది.

"ఒలివోయి యీలేక యొకపూఁట పెట్టెడు తామరచెలిపట్టిఁ దడవ నేల" (యయా. 1-29)

## 30. 'ఉలుక్కు'

శ.ర.లో "ఉలుక్కు = అశ్వగతివిశేషము. సీ. చనునులుక్కనఁగ నీచగతి పేరు. ఆం.భా." అని యున్నది.

సూ.ని. ఆ మాటల నట్లే యెత్తి వ్రాసికొన్నది. శ.ర. 'ఉలుక్కు' అన్నందున సూ.ని. 'ఉలుక్కు' అన్నది. కాని, నిజానికది 'లుక్కు' గాని 'ఉలుక్కు' కాదు.

♦"అడ్డవేడెముల్, లుక్కు దువాళి" అని, సారంగధర (1-82) ప్రయోగము. గుఱ్ఱము 'లుక్కులుక్కన బోతున్నది' అని లోక వ్యవహారము.

'లుక్కు' శ.ర.లో 'ఉలుక్కు' అయినవిధ మెట్టిదనగా.— 'చనును-లుక్కు-అనఁగ' అని విభాగించుటకు బదులుగా, శ.ర. కర్త 'చనుఁ-ఉలుక్కు-అనఁగ' అని పదవిభాగముచేసినాడు. అది ప్రమాదము.

* సూ.ని. ఆ ప్రమాదము నట్లే యనుసరించినది.

---

♦ 'అడ్డవేడెము లుక్కుదువాళి (= డుక్కుదువాళి = మఱుఁగుపడి నట్టి దవుడు)' అని, 'వేదం'వారి పాఠమూ- అర్థమున్నూ; తప్పు. వివరములకు, చూ. సారంగధర - 'జితకాశి' పుట. ౯౦.

వా.ని. లోను 'ఉలుక్కు' అనియే యున్నది.

## ౩౧. 'కోపధారి'

సూ.ని. లో 'కత్తులబోను' క్రింద, చెన్నబసవపురాణపద్యము అచ్చు ప్రతి ప్రకారము,—

"బావ ప్రతికూలుఁడు, నాథుఁడు కోపధారి"(4-277)అనియున్నది.

'కోపధారి' యను సంస్కృతశబ్ద మున్నదేమో! సూత్రధారి, సూత్రధారుఁడు అన్నట్లు, కోపధారి; కోపధారుఁడు—అనియు ననవచ్చునేమోగాని, 'కోపదారి' యను జానుతెనుగుపదముమాత్రము వాడుకలో ప్రసిద్ధముగా నున్నది.

అది, మాయదారి టక్కుదారి తెగుదారి ఇచ్చకదారి వంటిది.

మాయము + దారి = మాయదారి అయినట్లే, కోపము + దారి = కోపదారి యైనది. తత్సమపదములమీఁద తెనుగుప్రత్యయమువచ్చుట కలదు. ఉదా:—1 హాస్యగాఁడు; 2 విటకాఁడు; 3 విటకత్తె; 4 కోపగాఁడు; (5 కోపకత్తె; 6 అభిమానకత్తె).— చూ. ఆం. భా. శా. తద్ధిత. ౧౧. (4, 5, 6 సూ.ని. గ్రహించియున్నది.)

'కోపదారి' యను రూపము తప్పనుకొని, 'చె. బ.' పరిష్కర్త—'కోపధారి' యని సవరించినాడు. అది జానుతెనుగు పలుకుబడి యెఱుగని సవరణ. సూ.ని. ఆ సవరణ నట్లే కైకొనుట సరికాదు.

చె. బ. పురాణకర్త 'కోపదారి' యను 'జానుతెనుగు' పదమును వదలి 'కోపధారి' యను అప్రసిద్ధపదమును వాడినట్లు భావించుట భావ్యముకాదు.

'కోపధారి' యనుట సరికాదని తెలిసికొని, వా.ని. *'కోపదారి' యను రూపమునే గ్రహించి, అందుకా 'చె. బ' పద్యమునే ప్రమాణముగా చూపినది.

సూ.ని. లో, 'కోపదారి' లేదు; 'కోపధారి'యును లేదు.

---

* "...ఇట్టి సమాసములు వాడుకలో గలదందురు. లోకవ్యవహారమే శాస్త్రీయమైనచో—దురలవాటు, బహుమంది, శుద్ధతప్పులుగూడ సాధువులే యగునుగదా! గ్రామ్యమైనను వాడవచ్చునుగాని శాస్త్రదుష్టములైన వాక్యములు వాడనగునా?" అని 'కవిరత్న-కవి'గారి ప్రసంగము.

అది శాస్త్రమన నేమో, దుష్టమన నేమో యెఱుగని ప్రసంగము. కావున నిరస్తము.

కాబట్టి సూ.ని. ఆం.భా. అచ్చుప్రతినిబట్టి గ్రహించిన 'నులివడు' అనురూపము తప్పు. ఆం.భా. అచ్చుప్రతిలో - "తోఁచు నొలిపడెనసంగ" అను సాధుపాఠ మున్నను, సూ.ని. 'నొలివడు' అనియే గ్రహించియుండును గాని 'ఒలివడు'గా గ్రహించియుండదు. పదస్వరూపము తెలియనప్పుడు జరుగుప్రమాదము లిట్టివేగదా!

శ.ర. లో లేదుగాని, 'ఒలిపోవు' అను క్రియ యొకటి యున్నది.

"ఒలిపోయి యీలేక యొకపూఁట పెట్టెడు తామరచెలిపట్టిఁ దడవ నేల" (యయా. 1-29)

## ౩౦. 'ఉలుక్కు'

శ.ర.లో "ఉలుక్కు = అశ్వగతివిశేషము. సీ. చనునులుక్కనఁగ నీచగతిపేరు. ఆం.భా." అని యున్నది.

సూ.ని. ఆమాటల నట్లే యెత్తి వ్రాసికొన్నది. శ.ర. 'ఉలుక్కు' అన్నందున సూ.ని. 'ఉలుక్కు' అన్నది. కాని, నిజానికది 'లుక్కు' గాని 'ఉలుక్కు' కాదు.

♦"అడ్డవేడెముల్, లుక్కుదువాళి" అని, సారంగధర (1-82) ప్రయోగము. గుఱ్ఱము 'లుక్కులుక్కున బోతున్నది' అని లోక వ్యవహారము.

'లుక్కు' శ.ర.లో 'ఉలుక్కు' అయినవిధ మెట్టిదనగా.— 'చనును-లుక్కు-అనఁగ' అని విభాగించుటకు బదులుగా, శ.ర. కర్త 'చనుఁ-ఉలుక్కు-అనఁగ' అని పదవిభాగముచేసినాడు. అది ప్రమాదము.

* సూ.ని. ఆ ప్రమాదము నట్లే యనువదించినది.

---

♦ 'అడ్డవేడెము లుక్కుదువాళి (= దుక్కుదువాళి = మఱుఁగుపడి నట్టి దపుడు)' అని, 'వేదం'వారి పాఠమూ- అర్థమున్నూ; తప్పు. వివరములకు, చూ. సారంగధర - 'జితకాశి' పుట. ౯౦.

* వా.ని. లోను 'ఉలుక్కు' అనియే యున్నది.

## ౩౧. 'కోపధారి'

సూ.ని. లో 'కత్తులబోను' క్రింద, చెన్నబసవపురాణపద్యము అచ్చు ప్రతి ప్రకారము,—

"బావ ప్రతికూలుఁడు, నాథుఁడు కోపధారి"(4-277)అనియున్నది.

'కోపధారి' యను సంస్కృతశబ్ద మున్నదేమో! సూత్రధారి, సూత్రధారుఁడు అన్నట్లు, కోపధారి; కోపధారుఁడు—అనియు ననవచ్చునేమో గాని, 'కోపదారి' యను జానుతెనుగుపదముమాత్రము వాడుకలో ప్రసిద్ధముగా నున్నది.

అది, మాయదారి టక్కుదారి తెగుదారి ఇచ్చకదారి వంటిది.

మాయము + దారి = మాయదారి అయినట్లే, కోపము + దారి = కోపదారి యైనది. తత్సమపదములమీద తెనుగుప్రత్యయమువచ్చుట కలదు. ఉదా:—1 హాస్యగాఁడు; 2 విటకాఁడు; 3 విటకత్తె; 4 కోపగాఁడు; (5 కోపకత్తె; 6 అభిమానకత్తె).— చూ. ఆం. భా. శా. తద్ధిత. ౧౧. (4, 5, 6 సూ.ని. గ్రహించియున్నది.)

'కోపదారి' యను రూపము తప్పనుకొని, 'చె. బ.' పరిష్కర్త—'కోపధారి' యని సవరించినాడు. అది జానుతెనుగు పలుకుబడి యెఱుగని సవరణ. సూ.ని. ఆ సవరణ నట్లే కైకొనుట సరికాదు.

చె. బ. పురాణకర్త 'కోపదారి' యను 'జానుతెనుగు' పదమును వదలి 'కోపధారి' యను అప్రసిద్ధపదమును వాడినట్లు భావించుట భావ్యముకాదు.

'కోపధారి' యనుట సరికాదని తెలిసికొని, వా.ని. *'కోపదారి' యను రూపమునే గ్రహించి, అందుకా 'చె. బ' పద్యమునే ప్రమాణముగా చూపినది.

సూ.ని. లో, 'కోపదారి' లేదు; 'కోపధారి'యును లేదు.

---

* "...ఇట్టి సమాసములు వాడుకలో గలదందురు. లోకవ్యవహారమే శాస్త్రీయమైనచో—దురలవాటు, బహుమంది, శుద్ధతప్పులుగూడ సాధువులే యగునుగదా! గ్రామ్యమైనను వాడవచ్చునుగాని శాస్త్రదుష్టములైన వాక్యములు వాడనగునా?" అని 'కవిరత్న-కవి'గారి ప్రసంగము.

అది శాస్త్రమన నేమో, దుష్టమన నేమో యెఱుగని ప్రసంగము. కావున నిరస్తము.

## ౩౨. 'రాచవాఁడు'

సూ.ని.లో 'కనువెచ్చ' — 'కరఁగు' అను పదముల క్రింద,—

'వలరాచ రాచవాఁ డలికొత్తు కనువెచ్చఁ
గరఁగిన యల కనికరపుఁ జోటు" (మను. ౨-౯)

అని యుదాహృతమై యున్నది.

మనుచరిత్ర అచ్చుప్రతులన్నిటిలోను సూ.ని.లో ఉన్నట్లే, 'వలరాచ రాచవాఁడు' అనియే యున్నది. కాని, అది సాధుపాఠము కాదు.

'వలరాచ — రాచవారు'

అనుట సాధువు. ఎందువల్ల ననఁగా:— భాషలో రెండు తెఱఁగుల 'రాచవా' రున్నారు.

(I) రాచవారు=క్షత్రియులు. ఇది 'రాచవాఁడు' (=క్షత్రియుఁడు) అను, ఏకవచనమునకు బహువచనరూపము. ("రాచవాఁడనఁగను రాజన క్షత్రియుఁ డొప్పు." ఆం. భా. 2-182)

(II) 'రాచవారు'—ఇది క్షత్రియు లను నర్థమునిచ్చు పదము కాదు. నిత్యబహువచనాంతము. అయ్యవారు; దొరవారు అను పదములవంటిది. ఏకవచనమునను 'రాచవారు' అనియే రూపము. ప్రభువు అని సంప్రదాయార్థము. ఏ జాతివాఁడైనను 'రాచవారు' కావచ్చును. భాషామర్యాద నెఱిగిన ప్రాచీను లందరునూ, ఈ రాచవారిని సముచితముగనే మన్నించినారు. ఆ మర్యాద నెఱుగని యిటీవలివారు కొందరు 'రాచవారి'ని 'రాచవాని'గా మార్చి కొంచెపరచినారు. క్రమముగా మనవిచేస్తాను.

(1) *పేషణిహనుమంత బిరుదాంకులగు రాచ
వారికి నెయ్యంపు వరసుతుండు" (శృం. నై. పీఠిక. 32)

---

* "పేషణియనఁగా సన్నెకల్లు — హనుమంతుఁడు సన్నెకంటిమీఁద పచ్చడినూఱిన నెట్లు నూఱునో శత్రువులను అట్లు నూఱెడువాఁడు — అని బిరుదార్థము" అని వే. వే. శాస్త్రిగారి వ్యాఖ్య.

హనుమంతుడు సన్నెకంటిమీద పచ్చడినూఱుటలో మొనగాడు కాబోలు! అందుకు ప్రమాణ మేమో?

ఈ పద్యములోని 'రాచవారు' క్షత్రియులు కారు; నియోగి బ్రాహ్మణులు. బహుజనము కాదు; ఒక్కఁడే.

'బిరుదాంకులు' - పూజ్యార్థమున బహువచనము. బిరుదాంకులును, రాచవారును పలువురగుచో, పలువుర కొక్కఁడే 'వరసుతుఁడు' కావలసి వచ్చును. అది అసంభవముగదా!

పేషణిహనుమంత బిరుదుగల - దొరవారికి - వరసుతుఁడు; అని ఆ పద్యపాదమున కర్థము.

'బిరుదాంకుఁడగు' అని ప్రాచీనపాఠము. 'బిరుదాంకులగు' అని శాస్త్రిగారి సవరణ.

(2) "రాజసంబున వలరాచరాచవారు
తేఁటిఱెక్కలగఱియమ్ముఁ దీడుకొనఁగ" (శృ. నై. 6-65)

అని వ్రాతప్రతిలోనుండగా 'రాచవారు' అనుట తప్పనుకొని వ్యాఖ్యాతలు 'రాచవాని' అని దిద్దినారు.

(3) "పావకలోముఁజూచి వెనుబాటు మొగంబునఁ దోఁపఁగుంభకో
పావిలచిత్తునట్లు మెలపారఁగ నిట్లను రాచవారలుఁ
దేవులు నిందునీవు చనుదెంచు టెఱుంగరు". (భోజ. 5-37)

రాచవారలుఁ = రాజయిన మీ తండ్రిగారును, *దేవులుఁ = రాణియైన మీ తల్లిగారును అని యర్థము.

---

* 'నారాయణీయాంధ్రవ్యాకరణము' లో, 'గాణపతసూత్రవివరణము'న— "ఈ పద్యమున దేవులనఁగాఁ ప్రభువులని యర్థము. స్త్రీవాచి కాదుగావున బహువచనము నిర్బాధము" అని యున్నది. (పు. ౧౨౧)

ఆ వివరణము సరియైనది కాదు. పద్యములోని 'దేవులు'—'దేవి'కి బహువచనము గాని 'దేవ' శబ్దమునకు బహువచనరూపము కాదు. కావున "దేవులు = ప్రభువులు" అను అర్థ మనుచితము.

"రాజును దేవులుం జెలులు" (నాసి. 2-144)

"నీ దేవుల యొప్పుఁజూచి" (భార. అర. 5-350)

"రాజును, దేవులనుగని సుముఖుఁడగుచు" (భార. అను. 2-308)

(4) "భద్రమా నీకు నీ బాహాభృతక్షితి
ప్రజలకు; లెస్సలా రాచవారు" (మను. 5-4)

'లెస్సలా రాచవారు' అంటే, రాజబంధువులందరూ బాగున్నారా? అన్నమాట. అంతేగాని క్షత్రియులందరును బాగున్నారా? అని కాదు.

(5) "స్యందనముం దురంగములు శౌరివెసం బలరాము చెల్లె లీ
యిందునిభాస్య యీమె నెటకెత్తుకపోయెదు రాకుమార యే
మందురు యాదవుల్ వినిన! హా! యిటువంటివె రాచవారితోఁ
బొందులు." (విజ. 3-147)

రాచవారితో పొందులు—అంటే, ప్రభువులతోగూడిన వ్యవహారములని భావము.

(6) "వడఁకుగుబ్బలిరాచవారి మూర్ధం బెక్కి" (కాశీ. 5-286)

(7) "వణఁకుగుబ్బలిరాచవారి కూరిమికన్య" (భీమ. 3-185)

వడఁకుగుబ్బలిరాచవారు అనగా, మంచుకొండదొరవారు అన్నమాట.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరించిన ఉత్తరహరివంశమున,—

(8) "ఒకచపలాక్షి లేఁజిగురుటూయెలఁ గోయిలరాచవారి నిక్కకు నెలయింప" (5-54) అని యున్నది.

*'కోయిలరాచవా' రనగా, కోయిలదొరవా రనియే యర్థము.

శ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రులవారి పరిష్కరణముతోను, వారి పీఠికతోను వావిళ్లవారు ప్రకటించిన 'బాలసరస్వతీయము'లో, సంజ్ఞా. సూ. ౨౭ క్రింద,—

(9) "చక్కఁదనము లోకజయ వైభవము వల
రాచవారు వడసె రాచరించి
చెలువ నద్రికన్య సేవించువారి కే
జాడనైనఁ గన నసాధ్యమెద్ది?"

---

* 'కోయిలరాచవారు' అను సమాసము 'అన్నదమ్ములు' అను సమాసమువంటిదేననీ, అన్నదమ్ములను సమాసములో అన్న యేకవచనమున నున్నను 'అన్నలు' అని బహువచనార్థము నిచ్చునట్లే, 'కోయిల' యేక

అని యున్నది. పద్యములోని 'రాచవారి'ని శ్రీ శాస్త్రులవారు 'రాచవాని'ఁగా మార్చలేదు.

శ్రీ నిడదవోలు వెంకట్రావుపంతులు (యమ్. యే.) గారు, తమ 'మించుపల్లె - తెలుఁగుపాలుపు' అను గ్రంథములో,—

(10) "పలరాచవారి ధనుశర,ముల కల్లెనలకును"
అని 'వలరాచవారి'ని వాడి యున్నారు.

(11) "...అజముఖ్యులైన వేల్పు
రాచవారలు నాకతిఁ గోచవాఱ
నితఁ డనఁగ నెంత" (చంద్రా. 3-33)

అజముఖ్యులైన - 'వేల్పు రాచవారలు' క్షత్రియులు కారు. దేవతా ప్రభువులు.

తిక్కనసోమయాజి మహాభారతమున 'రాచవారి'ని వాడి యున్నాఁడు. చూడండి.—

(12) "(యుధిష్ఠిరుండు) విదురసంజయుల నాలోకించి మీర లనుదినంబును నవధానంబుగలిగి - రాచవారి - యోగక్షేమంబు లేనెట్లు నిర్వహింపవలయుఁ బురజనంబుల భూజనంబులకర్జంబులు-రాచవారి-కెఱిఁగించి పంచినట్లు నడపంగలవార లని యప్పగించి." (శాంతి. 1-378)

ఈ రచనలోని 'రాచవా' రెవరు? ధృతరాష్ట్రుఁడు. ఒక్కఁడే. ఒక్కఁడైనను - రాచవారే. దొరవారని యర్థము. అంతేగాని క్షత్రియు లని కాదు.

---

వచనమున నున్నను పెక్కుకోయిలలనియే అర్థము నిచ్చుననీ—వీరబ్రహ్మం గారి దొక ప్రసంగము. ఆ ప్రసంగములో,— "సమాసములయందు పూర్వపదము బహుళమైనను నేకవచనముననే యుండును" అని యొక సిద్ధాంతము.

"కోయిలరాచవారు; అన్నదమ్ములు—అను సమాసములు రెండును ఒక తెగకు చెందినవనుట తప్పు. పూర్వపదము 'బహువచనమైనను' అని

తిక్కనరచనకు మూల మిది:—

"ధృతరాష్ట్రో మహారాజః, పితా మే దైవతం పరమ్
శాసనేస్యప్రియేచ్చైవ, స్థేయం మత్ప్రియకాంక్షిభిః
ఏతదర్థంహి జీవామి, కృత్వా జ్ఞాతివధం మహత్.
అస్య శుశ్రూషణం కార్యం, మయా నిత్య మతంద్రిణా
యదిచాహ మనుగ్రాహ్యో, భవతాం సుహృదాం తథా
ధృతరాష్ట్రే యథాపూర్వం, వృత్తిం వర్తితు మర్హథ.
ఏష నాథోహి జగతో, భవతాంచ మయాసహ
అస్యైవ పృథివీ కృత్స్నా, పాండవా స్సర్వఏవచ
ఏత న్మనసిక ర్తవ్యం, భవద్భి ర్వచనం మమ."

వలరాచ - రాచవారు అనగా 'వలరాచ దొరవారు' అని యర్థము కావున 'వలరాచ - రాచవాఁడు' అనుట సరికాదు.

## ౩౩. 'దొరవాఁడు'

సూ.ని. 'దొర' క్రింద,—'దొరవాఁడు = రాజసంబంధి' అని చెప్పి, అందుకు, నన్నె. కు. సం. లోని పద్యమును,—

"వాలిన దాయవారి దొరవారి ననేకులఁ గూర్చుకొన్నఁగా
కేల జయింపవచ్చు" (౧౧. ౯౧)

అన్నంతవరకే చూపినది.

పద్యము పూర్తిగా నుండిననేగాని సరియైన అర్థమేమో యేర్పడదు. కావున, తక్కిన భాగమునుకూడా, ఉదాహరించుచున్నాను.

"నని యేర్పడ నీకని మాఱువన్నెనో
నా, లలితామితోరునయనవ్రజతారకసంయుతాంగుఁడై
క్రాలు సహస్రలోచనుఁడు, కౌశికుఁ డీతఁడు తారకాహ్వయా."

---

యనవలసినచోట 'బహుళీమైనను' అనుట అంతకంటెను తప్పు. ఈ వ్రాతలు వీ. బ్ర. గారికి వ్యాకరణపరిచయము బొత్తిగా లేదనుటకు మంచి తార్కాణములు" అని శ్రీ వెంకటరామిరెడ్డిగారి విమర్శ.

(చూ. వివరములకు, 9-6.1947 త్రిలిఙ్గ)

దొరవారు - అనుమాటకు 'దొరకు సంబంధించినవాళ్లని యర్థము చేసికొని, 'వారి'కి ఏకవచనరూపము 'వాఁడు' గనుక దొరవారికి ఏకవచన రూపము 'దొరవాఁడు' అనుకొన్నది సూ.ని. - అట్లనుకొనుట పొరపాటు.

దొరవారు - అను పదానికి 'దొరయొక్క_వారు' అని యర్థముచేయుట తప్పు. దొరయొక్క పురుషుని - 'దొరవాఁడు' అనుటయు, దొరయొక్క పురుషులను - 'దొరవారు; దొరవాండ్రు' అనుటయు, దొరయొక్క స్త్రీని 'దొరది' యనుటయు భాషామర్యాద కాదు. అది యట్లుండఁగా, దాయవారి దొరవారు - అన్న రచనకు, పగవారియొక్క - దొరయొక్క-వారు అని యర్థముచెప్పుటయు నుచితము కాదు.

దొరవారు-అనగా దొరలే. 'వారు' స్వార్థమున ననుప్రయుక్తమైన పదము. కవలు; కవలవారు — అనుట వంటిది. దాయలు 'దాయవా' రయినట్లే, దొరలు 'దొరవా' రయినారు. దొరలనగా శూరులని ప్రకరణార్థము. ('The దొరలు answer to squires, or knights.' బ్రౌను.)

'దొరవారిన్ (= దొరలను = శూరవరులను), అనేకులను గూర్చుకొన్నఁగాక, వాలిన దాయవారిన్ (= అతిశయించిన శత్రువులను), ఎట్లు జయింప వీలగును? అనియెంచి, యింద్రుఁడు, తారకునిమీదికి అనేక తారక సముదయముతో వచ్చినట్లు - పద్యమున కల్పన.

అమితతారకసంయుతుఁడు — అన్నప్పుడు, (యోధులైన) అనేక తారకులతో కూడినవాడనియు, సహస్రాక్షుఁడు గావున—అనేక కనీనికలు కలవాడనియు రెండర్థములు. (తారకశబ్దముచేత శ్లేషచమత్కృతి.)

కావున "దొరవాఁడు = దొరకు సంబంధించినవాఁడు" అని సూ.ని. భావించినయర్థము సరిపడదు.

'అమితోరునయనవ్రజతారకసంయుతాంగుఁడై' అన్నవాక్యముండిననే గాని, 'దొరవారి ననేకులఁ గూర్చుకొనవలసిన అక్కరయేమో, పాఠకునికి బోధపడదు. కావున, సూ.ని., పద్యమును పూర్తిగా నుదాహరింపక— ప్రారంభముమాత్రము చూపివదలుట ప్రమాదము.

దేవరవారు - దొరవారు— అను పదములకు, ఏకవచనరూపములు 'దేవర' - 'దొర' అనియేగాని, 'దేవరవాఁడు' - 'దొరవాఁడు' అని కావు.

కావుననే అట్టి యేకవచనరూపములుగాని, దేవరవాండ్రు - దొరవాండ్రు- అను, బ.వ. రూపములుగాని భాషలో లేవు.

"దేవరవారు (రలు) = దేవర" అని సూ.ని. లోనే యున్నది. (చూ. దేవర.)

## ౩౪. 'పసులత్రొక్కుడు'

సూ.ని. లో 'తలకుమాయు' క్రింద,— శ్రీనాథుని చాటువు,— "దోసెఁడుకొంపలోఁ బసులత్రొక్కుడు" అని యున్నది.

'పసులత్రొక్కిడి' అని చాటుపద్యమణిమంజరి పాఠము.

'త్రొక్కిడి' శ.ర.లో లేదుగాని లోకమున నున్నది. గుంటూరు, నెల్లూరు మండలములలో సర్వజనవిదితము. శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారు, జయ : గ్రీష్మ 'పరిశోధన' పత్రికలో అల్లసానివారి అల్లిక జిగిబిగి అను వ్యాసములో,— "తండోపతండములుగా వచ్చు జనములతో నహోబలమున ద్రొక్కిడి యెక్కువై" అన్నారు. కావున దత్తమండలములలోను 'త్రొక్కిడి' అను వాడుక కలదు. శ్రీ 'దువ్వూరి'వారే నా వ్యాసమును విమర్శించుచు,— 'నిశ్చయదృష్టిలేక తొడత్రొక్కిడిగా వ్రాయించిన' అని, 'త్రొక్కిడి'ని వాడియున్నారు. కాబట్టి ఆ పదము గోదావరిమండలముననుు కలదన్న మాట. వారివీరిమాట లెందుకు ? సూ.ని. లో 'త్రొక్కిడి' లేదుగాని, "త్రొక్కిళ్లు = బాలక్రీడావిశేషము" అని యున్నది. 'త్రొక్కిడి' ఉన్ననేగదా 'త్రొక్కిళ్లు' యేర్పడుట ?

ఎందుకు విస్తరము : సూ. ని. శ్రీనాథునిరచనను మార్చుటయు, 'త్రొక్కిడి' అను పదమును చెప్పకపోవుటయు పొరపాటు.

రాపుడు, రాపిడి; దోపుడు, దోపిడి—అని యున్నట్లే, త్రొక్కుడు, త్రొక్కిడి— అని రెండు రూపములు నుండవచ్చు.

## ౩౫. 'తిగిచి'

సూ.ని. 'చాఁగఅగొను' క్రింద, ఉ.హరి. పద్యమును,— "నాఁగలి సాఁచుచుం దిగిచి నాగరథాశ్వభటావలిం గదణ జాఁగఅగొన్నఁ జక్కగ... (ఉ.ఉ.రా)" అని యుదాహరించి, ఇది శ.ర. పాఠ మన్నది.

శ.ర.లో 'దిగిచి' అని లేదు. 'దిగుచు' అని యున్నది. (వే.ప్ర. శాస్త్రిగారి ప్రతిలోను 'దిగుచు' అనియే పాఠము). శ.ర. లోని 'దిగుచు'ను, తాను 'దిగిచి'గా మార్చి, ఇది శ.ర. పాఠమనుట తగునా?

(జక్కుల)

"చాఁగరగొన్న జక్కుల" - అని శాస్త్రిగారి పాఠము. సూ.ని. ఆ పాఠమును చూపలేదు. చూపియుండవలసినది.

## ౩౬. 'పీఁట'

సూ.ని. లో 'చాఁగఱగొను'; 'దొర' అను రెండుపదములక్రిందను,—

"పెరిఁగినపాట్లతోడ నొక పీఁటపయిం దొరవోలె నెవ్వరిన్, సరకు గొనండు" అనియున్నది. (ఉ. హరి. ౪.౪౬)

పీఁటమీఁదదొరయేమి? ఎవ్వరినీ సరకుగొనకుండు టేమి? లోకములో 'పీఁటమీఁది దొర' అని యొక డున్నాఁడా? పోలె - అని యుపమించుటకు?

'ఒక పేఁటపయిం దొరవోలె' అని శాస్త్రిగారి పాఠము. ఆ పాఠమే సరియైనది. ఒక పట్టణమునకు అధికారియైనవాని (ప్రభువు) వలె ఎవరిని లెక్కచేయ కున్నాఁడని యర్థము.

సూ.ని., శాస్త్రిగారిచే పరిష్కృతమైన ఉ. హరి. ప్రతిని చూచినట్లు లేదు.

## ౩౭. 'ఉద్ది'; 'ఉద్దు'

శ.ర. 'ఉద్ది' క్రింద,— "ఉద్ది = సస్యవిశేషము. బహువచన మగుచో ధాన్యవిశేషము. విశేషణ మగునపుడు ఏకవచనముతో సమానము" అని చెప్పినది.

అట్లు చెప్పిన, శ.ర. 'వేఁపుడు' అను పదముక్రింద, పాంచాలీపరిణయ పద్యమును,— "పాడిబెల్లము చల్లి యుద్దుపొడి రాలిచి" (౪. ఆ.) అను పాఠముతో నుదాహరించినది. అచ్చుప్రతిలో పాఠము 'ఉద్దుపొడి' అనియే యున్నది. ఉండుగాక, శ.ర. తొలుత చెప్పినప్రకారము, 'ఉద్దులు'

ధాన్యమైనపుడు, ఆ ఉద్దుల-పొడి, ఉద్దిపొడి కావలెగాని, ఉద్దుపొడి అగు టెట్లు.* విశేషణమున (ఏకవచనరూపమయిన) 'ఉద్ది' రామే కదా రావలసినది. కందులపప్పు కందిపప్పు; మెంతులపొడి మెంతిపొడి, అగుట యెట్టిదో— ఉద్దులపొడి 'ఉద్దిపొడి' యగుటయు నట్టిదే. శ.ర. కర్త యీ విషయమును గమనించినట్లులేదు. గమనించియే యున్నచో, 'ఉద్దుపొడి'ని— 'ఉద్దిపొడి'గా సవరించియుండవలదా? సవరింపకపోవుట ప్రమాదము కావచ్చును గాని, సస్యవాచకమైన ఏకవచనరూపము 'ఉద్ది' అని శ.ర. చెప్పుటలో పొరపాటు లేదు.

శ.ర. కథ అట్లుండగా,— సూ.ని. "ఉద్దు (క. ఉద్దు) మినుము. (బ) మినుములు. ఉద్దుపొడి = మినుపపొడి. 'ఉద్దుపొడిరాలిచి' (పాంచా. ౪.౪౭) ఉద్దుపప్పు = మినుపపప్పు (వ్యవ)" అని వ్రాసినది.

సూ.ని. మతమున 'ఉద్దు' ఏకవచనము; సస్యవాచకము. అగుగాక. తాను, శ.ర లోని 'ఉద్ది'ని చూచెనా? లేదా? చూచియే యున్నచో— శ.ర. లో 'ఉద్ది' అని యున్నది. అది సరియైనరూపము కాదు-అని చెప్పవలదా? చెప్పకపోవు టేల? తాను 'ఉద్ది'ని వదలి 'ఉద్దు'ను గ్రహించుట కాధార మేమి? ఏమియుచెప్పక, ప్రామాణికుడైన ఒక నిఘంటుకర్త గ్రహించిన రూపమును, ఊరక త్రోసిరాజనుట సంప్రదాయమగునా?

---

* "కొన్ని శబ్దములకు ఏకవచనము లేదు. ఉదా॥ వడ్లు, పెసలు, అని స్పష్టముగ కం.వీ. సంగ్రహవ్యాకరణమున వక్కాణింపబడియున్నది. ఈ యేకవచన బహువచనరూపములు తెలుగు చదువుకొనువారికి ప్రారంభ విద్యార్థిదశయందే నేర్పబడుచున్నదిగదా! కావున శ్రీ దీ.వి. శాస్త్రిగారీమాత్రపు వ్యాకరణధర్మము నెఱుగకుందురా? ఉద్దులు అను పదమున కేకవచనము గలదనుటయు, అది 'ఉద్ది'కాని, 'ఉద్దు' కాదనుటయు సరికాదు" అని వీ.బ్ర. గారి దొక ప్రసంగము,

అది వ్యాకరణజ్ఞానము, గ్రంథపరిశోధనమును లేని, యొక్కువప్రసంగము.

ప్రౌఢ. వ్యా.లో,— "నిత్యబహువచనాంతమయిన శబ్దము వృత్తియందేకవచనాంతంబయగు. ఉ. అదరుటగ్గి." అని స్పష్టముగా చెప్పబడియున్నది.

ఎందుకు విస్తరము. 'ఉద్ది'యే యేకవచనరూపము. తిరువళ్లూరు మిషన్ హైస్కూలు పండితులు, ఉభయభాషాప్రవీణ శ్రీ ఉత్పల వేంకట రంగాచార్యులవారు, ''విశేషణమైనప్పుడు 'ఉద్ది' యను శబ్దమే (ఉద్దిచేను, ఉద్దిపప్పు)గాని ఉద్దుశబ్దము (ఉద్దుచేను, ఉద్దుపప్పు) నెవ్వఁడును పలుకుట లేదు" అని స్పష్టముగా చెప్పుచున్నారు. (చూ. 7 జూలై, 1947 - త్రిలిఙ్గ)

మఱియు, కర్నూలు మునిసిపల్ హైస్కూలు పండితులు శ్రీ మేడవరపు రామబ్రహ్మశాస్త్రిగారు ఇట్లు వ్రాయుచున్నారు :

''...సమాసమునఁ బ్రాతిపదికమాత్రమై 'ఉద్ది'యని వినిపించుటయు, ('ఉద్దులు' అని) ధాన్యవాచకమైనపిదప తప్పనిసరిగా సస్యవాచకమునై, మినుపపైరు 'మినుము' ఐనట్లు, ఉద్దిపైరు 'ఉద్ది' అని యేకవచనరూపమున సాధు వగుటయు నుపపన్నమగును. అపుడు శబ్దరత్నాకరవివరణము సమంజస మగుటయు, పాంచాలీపరిణయమునందలి 'ఉద్దుపాడిరాలిచి' అను నుదాహరణములోని 'ఉద్దు' అను రూపము అచ్చుపొరపాటుమాత్రమై, యా ప్రయోగముపై నాధారపడు సూర్యారాయనిఘంటువివరణము నిరాధార మగుటయుఁ దెల్లము.'' (వివరములకు చూ. 12 డిసంబరు 1949 త్రిలిఙ్గ)

---

శ.ర.లో,— ''సనగ (= సెనగ) సస్యవిశేషము. సనగలు (అని బహువచనాంతమైనపుడు) ధాన్యవిశేషము. వృత్తియందు 'అదరుటగ్గి' అన్నట్లే సనగపప్పు; సెనగపిండి అని యేకవచనాంత మగును'' అనియు చెప్పబడియున్నది.

''కంది; ఇది యేకవచనరూపము కాదు. 'విశేషణ'రూపము. విశేషణములకు లింగవచనవిభక్తు లుండవుగదా'' అని వీ.బ్ర.గారిది యింకొక ప్రసంగము. ఇదియు పై ప్రసంగమువంటిదే.

''విశేష్యంబునకుంబోలె విశేషణంబునకు లింగవిభక్తివచనంబులగు'' నని బాలవ్యాకరణము. (కారక. సూ. ౧౯)

(1) "కటుకులు గాని మానములు" (శృం.నై. 8-42)

(2) ''నానాతీర్థసతతసు, స్నానంబులఁ బల్లలైన జడలును''
(భార. అను. 5-25)

(3) "ఉప్పిఁగొప్పలుగాఁజేసి యావించిన కుడుములు''(కాశీ.3.ఆ.)

## ३౮. 'అక్కలి'

శ.ర. లో "అక్కలి = అల, తరంగము. వ॥ కడలిమొగయక్కలిం దగులువడిన జోగునుం బోలె నెదురునడవ మఱలంబఱవ లేక చీకాకుపడి." (కాశీ. ౧. ఆ.) అని యున్నది. మఱియు, "మొగ = అప్రాణివస్తుముఖము. మొగయక్కలి" అనియు నున్నది.

సూ.ని. యును, అట్లే— "అక్కలి = తరంగము, అల" అని చెప్పి, అందుకు,—

"తగులువడి యపుడు వడిసెడి
గగనమణిరథంబు దొరగలువడి నిలిచెఁ
బొగరు మొగకడలి యక్కలిఁ
దగిలి నిలువఁబడిన ఘనవితతియుం బోలెన్"

అను, కాశీఖండ (౧-౧౩౩) రచననే చూపినది. ఆ గ్రంథము ముద్రిత ప్రతిలో పై వచనము - పద్యముకూడా 'అక్కలి' యను పాఠముతోనే యున్నవి. కాని,

'అక్కలి = అల'

అన్న యర్థ మా రెండుస్థలములలోను సరిపడుటలేదు. ఏమందురా,—

జోగు (= పడవ) కాని, ఘనవితతి (= మబ్బులగుంపు) కాని 'అల' లో తగులుకొని— "ఎదురునడవ మఱలంబఱవ లేక చీకాకుపడి"

---

కంది-కందులు అయినట్లే, ఉద్ది బహువచనమున 'ఉద్దులు' అగును - అని నేననగా బ్రహ్మంగారి ట్లాక్షేపము తెల్పినారు,—

"కందులకు ఉద్దులకును నేమైన బోలికగలదా? కందులలో ఒక సున్నయుండి దకారము ఏకాక్షరహల్లుగా నున్నది. మఱి ఉద్దులలో ఆ సున్న లేదు. దకారము ద్విత్వముగా నున్నది. కావున ఉద్దులు, కందులు వంటిది కాదు."

పాపము ఆయనగారికి వ్యాకరణజ్ఞానము మట్టసము.—కంది, ఉద్ది - అను పదములు రెండును ఇదంతములు. బాల. తత్స. సూ. 45 ప్రకారము, రెండును బహువచనమున ఉత్వమునుపొందునవే. తండ్రి-తండ్రులు; తల్లి-తల్లులు-అను పదములస్వరూపమైనను ఆయనకు తెలియదు గదా!

యుండుట స్వభావముకాదు. కావున, ఆ రెండుస్థలములలోను నుండ దగినది - 'అక్కలి' కాదు. అది - 'అల'యును కాదు.

అక్కడ నుండదగినపదము— 'ఎక్కలి'. 'ఎక్కలి' యనగా, ప్రవాహవేగమున కొట్టుకొనివచ్చి మిట్టగా నేర్పడు ఇసుక(=ఇసుక దిబ్బ). "ఎక్కలి = ప్రవాహముచే కొట్టుకొనివచ్చి కమ్ముకొనిన యిసుక" అని శ.ర. లోనే యున్నది.

సముద్రముఖద్వారములందు, ఒక్కొక్కప్పుడు ఇసుక మేటపెట్టుటయు, పడవ లా యిసుకలో కూరుకొనిపోయి కదలమెదలలేక నిలిచిపోవుటయు కలదు. అట్లే, సముద్రముపై బర్వెడు మబ్బులుసైతము— ఇసుకతిన్నె లడ్డగించినప్పుడు గుట్టపడి యుండుటయు సహజమే.

కాబట్టి, కవిపాఠము 'ఎక్కలి'యే యనియు, ఆ యెక్కలి వ్రాతలో 'అక్కలి'గా మారి, అక్కడనుండి అచ్చునకు, అచ్చునుండి నిఘంటువులకు నెక్కినదనియు నా యభిప్రాయము.

## ౩౯. 'పొగరు'

'పొగరుమొగ' యన్నచోట 'పొగరు' కర్థమేమో తెలియుటలేదు.

శ.ర. లో,-"పొగరు=1 గర్వము; 2 దైర్ఘ్యము; 3 తీక్ష్ణగంధము" అనిమాత్రమే యున్నది.

నెల్లూరుమండలమున సముద్రతీరగ్రామములలో సముద్రపుపోటును, పోటువలన ముఖద్వారములయం దేర్పడు - ఇసుకదిబ్బను 'పొగరు' అనుట కలదు.

'పొగరు' హరివంశమున నిట్లు ప్రయోగింపబడియున్నది :

"అంబరశ్యామి (మ?)క యంబుధి పొగరుగా
బ్రమసి యెక్కెనొకాక బాడబాగ్ని,...
... ... అని యఖిలజనులు
బహువిధానుమానారంభపరతఁజూడ
నరుగుదెంచెఁ బక్షిప్రభుఁ డభ్రవీథి." (ఉ. ౫. ఆ.)

అంబుధిపొగ రన నర్థమేమో తద్జ్ఞులు తెల్పుదురుగాక.

## ౪౦. 'అంబు'; 'అంబుజ'

శ.ర. కర్త, "అంబు. వై. అమ్ము, బాణము" అని చెప్పి, "(చూ. బుజ.)" అన్నాడు.

'బుజ' తీసిచూడగా, అక్కడ– "బుజ.యు.దే.వి. కుండలీకరణము. వై.భుజము. 'బిసవల్లి సముద్భవ సౌకుమార్యకందళముల కంబుజల్ బుజలు. చమ. ౧. ఆ." అని యున్నది.

శ.ర. కర్త, అంబు విషయమున 'బుజ' చూడు మనుటలో భావ మేమో నాకు బోధపడలేదు. అక్కడి యుదాహరణలో నున్నది, 'అంబుజ' గాని, 'అంబు' కాదు; 'అమ్ము' అను నర్థముతో నక్కడ ప్రసక్తియును లేదు.

'అంబుజ(లు)' అన నేమో నా కర్థముకాలేదు. ఆ పదము, శ.ర.లో లేదు; ప్రౌఢ్యములో లేదు; సూ.ని.లోను లేదు.

శ.ర. కర్త 'బుజ = భుజము' అని చెప్పి, పై ప్రయోగము చూపినాడు. అందువలన "బిసవల్లి సముద్భవ సౌకుమార్య కందళములకు, అంబుజలు, బుజలు = భుజములు" అని యర్థ మేర్పడుచున్నది.

ఆ యర్థము నా బుద్ధికి సరిపడలేదు. అసలు "బిసవల్లి సముద్భవ సౌకుమార్య కందళము" లంటే యేమో నాకు గోచరము కాలేదు.

'బుజలు = కుండలీకరణములు' అను నర్థముకూడా, పై రచనకు పొసగదు. కాబట్టి శ.ర. వ్రాతయంతయు, అయోమయముగా నున్నది.

ఆ వ్రాతను సూ.ని. యెట్లర్థముచేసికొన్నదో యేమోగాని 'అంబు' క్రింద,– శ.ర. 'బుజ = భుజము' అనుట కుదాహరించిన, "బిసవల్లి...... కంబుజల్ బుజలు' అను రచననే 'కంబుజల్ బుజలు' అని తాలవ్యజకార

ములతో నుదాహరించినది. ఆ జకారముల నట్లు మార్చుటకు కారణమేమో చెప్పలేదు.

ఏమయినను, సూ.ని., శ.ర. వ్రాతల నెత్తి వ్రాసికొనుటేగాని, తాను స్వయముగా విచారించుట చాల తక్కువ.

## ४०. 'బుజయిడు'

శ.ర. 'బుజ' క్రింద,— "కా నొక్కటె దబ్బఱ, యని బుజయిడు పగిది నాభి యంగన కలరుఁ" (చంద్ర) అను ప్రయోగము నిచ్చినది. ఆ ప్రయోగము 'బుజయిడు' అను క్రియకు చూపవలసినదిగాని 'బుజ' యను విశేష్యమునకు చూపవలసినది కాదు. 'బుజ'ను ప్రత్యేకించి విశేష్యముగా తీసికొన్నచో, బుజనిడు-అనియు ననవచ్చును; కాని అపుడది క్రియయును కాదు; కుండలీకరించు-అన్న యర్థమును ఇయ్యదు. 'బుజయిడు' శ.ప. క్రియ. కావున ఆ క్రియలోని 'బుజ'ను వేరుపరిచి యర్థము చెప్పరాదు.

బుజయిడు-అన్న యర్థముననే, 'బుజవైచు'; 'బుజలువైచు' అన్న పలుకుబళ్లును కలవు.—

(1) "కవిలె నిచ్చినయప్పు జవిలి వ్రాయఁగఁ బోయి
బుజవైచె వేనూళ్ల(?) పూటలెక్క" (బహులా.5 ఆ.)

(2) విశ్వంభరాభోగవివిధమూర్త్యంతర
స్ఫురితానుభావంబు బుజలువైచి" (పాండు. 2-11)

బుజనువైచె; బుజలవైచి-అని వాడఁగూడదు.

## ४२. 'నీలాటిరేవు'

శుకసప్తతి ముద్రితప్రతిలో,—

"సాక్షాత్కరించిన జలదేవత యనంగ
నీలాటిరేవున నీటుచూపు" (౨. ४౧౦)

అని యున్నది. సూ. ని. 'నీలాటిరేవు' అను పదమును గ్రహింపలేదు; సరిగదా, మూలపదములలో 'నీరాటరేవు' క్రింద పై పద్యమును 'నీరాట రేవున' అను పాఠముతో పఠించి— "నీలాటిరేవు అని అపముద్రితము" అని ఆక్షేపమును తెలిపినది. పొరపాటు.

'నీలాటిరేవు' అను వ్యవహారము సుప్రసిద్ధము. శ్రీనాథుడా పదమును,—

*"నీలాటిరేవులోపల
మేలిమితోఁ దీర్చినట్టు మెఱసి నిలుచుచున్
దాలిమిని వాలుఁజూపుల
బాలామణి గుట్టు బైటపడఁగాఁ జూచెన్" (చాటు. మంజరి.)

అని ప్రాసస్థానమున వాడినాడు.

లోకవ్యవహారమునను, మహాకవుల రచనలలోనుగల—'నీలాటిరేవును' సూ.ని. గ్రహింపకపోవుటయేకాక, పైపెచ్చు ఆక్షేపించుట ధర్మమేనా?

---

* "ప్రాసయిబ్బంది కొఱకై శ్రీనాథుడు వాడిన వాడెగాక ఆతడు వాడినాడని... ఎల్లవారును 'నీలాటిరేవు' అనగూడదు. ఆ పదము నాతడొక్కడే వాడవచ్చును. ఇతరులువాడితే తప్పే. శుకసప్తతిలో 'నీలాటిరేవున నీటుఁజూపు' అన్నచోట, యతిప్రాసాది నిర్బంధము లేదుగనుక తప్పే. అపముద్రితమే. అందువలననే, సూ.ని. 'నీలాటిరేవు' అను పదమును జేకొనలేదు. అపశబ్దము నిఘంటువులం దెట్లుండును"—అని పీ. బ్ర. గారి ప్రసంగము.

ఎంతచక్కని ప్రసంగము! ఆహా!! మహాకవి శ్రీనాథుడు ప్రాస యిబ్బందికొఱకు - 'నీరాటరేవును'—నీలాటిరేవు - అన్నాడట! సిగ్గు! సిగ్గు! నీలాటిరేవు అనియే పద్యప్రారంభముగదా? మరి ప్రాసయిబ్బంది యెక్కడిది? ఏమో, ఆరహస్యము 'కవిరత్న...కవి' బిరుదాంకులైన ఆ బ్రహ్మంగారికే యెఱుక. ఆ పదమును శ్రీనాథుడొక్కడే వాడవచ్చునట! ఇతరులు వాడరాదట! ఎందువల్లనో? శుకసప్తతిలో అది అపముద్రితమేనట! అపశబ్దమేనట! అందువల్లనే సూ. ని. చేకొనలేదట!

సూ. ని. పొరపాటులను సమర్థించుట కిట్టి మహావిద్వత్కవి దాపరించుట ఆ నిఘంటువుయొక్క మహాభాగ్యముగదా!

## ౭౩. 'చెంద్రికవెట్టి'

సూ.ని. లో, 'చెంద్రిక' క్రింద,—

"ఇంద్రజురాక ధర్మజున కేర్పడఁగా శుభలేఖ వ్రాసి, వే చెంద్రికవెట్టి" (విజ, 3-130) అని యున్నది.

పూర్వతరముద్రణమునను, 'చెంద్రిక' అను పదముక్రింద, శ.ర. లోను, 'చెంద్రిక-చుట్టి' అని యున్నది. 'చెంద్రిక-వెట్టి' అనునది 'వేదం' వారి పాఠము. సూ.ని. తీసికొన్నది ఆ పాఠమునే. అది సరియైనపాఠము కాదు. 'చుట్టి' అనునదే సాధుపాఠము.

శ.ర. యు, ఆఁగ్లే సూ.ని. యు,— "చెంద్రిక = కమ్మపైదుద్దు, తాటియాకుజాబు మొదలగువానిమీఁది వలయము."—"దుద్దు = తాటాకు జాబుమీఁది చెంద్రిక" అనడమేగాని, అది పెట్టఁబడునదో, చుట్టఁబడునదో చెప్పలేదు.

చెంద్రిక 'చుట్టఁ' బడునది. *'పెట్టఁ' బడునది కాదు.

తాటాకుమీద జాబువ్రాసి, దానిని గుండ్రముగా చుట్టచుట్టి, ఆ చుట్ట వీడిపోకుండా మరియొకఆకుతో సంధిస్థానమున చుట్టి బిగింతురు. ఆ

* " 'బులుసు'వారు 'పెట్టి' అను పాఠమునే తీసికొని,- "చెంద్రిక పెట్టి = ఎఱ్ఱనిరంగుపెట్టి. శుభమును దెల్పు జాబులపై పసుపుతోగాని, కుంకుమతోఁగాని, నడుమను చివఱను గుర్తులుంచుట సంప్రదాయము" అని టీక వ్రాసినారు.

జాబువ్రాసి, కవరులోపెట్టి, అందున్నది శుభలేఖ యని తెలియుటకు కవరుమీద పసుపుతోనో - కుంకుమముతోనో గుర్తులుంచుట సంప్రదాయము. బులుసువారు పెట్టించిన గుర్తులో, కవరుక్రింద—(అనగా ఆ జాబుకు చుట్టు నట్టి 'చెంద్రికవన్నియసాలు' క్రింద) పడిపోవుచున్నవి. కవరులోని జాబు మీద ఏ గుర్తులుంచినను అవి చూచువారికి కనబడు టెట్లు? కనబడనప్పుడు అది శుభలేఖ యని తెలియు టెట్లు? వారిటీక సరియైనది కాదు.

వారు గమనింపలేదుగాని, ఆ జాబుమీద, ఎఱుపురంగువస్త్రము చుట్టుట, అందున్నది శుభలేఖ యని తెలియుటకే.

బిగింపునకే 'చెంద్రిక' యని పేరు. అదే 'దుద్దు'. కావున 'చెంద్రిక' చుట్టబడనదిగాని పెట్టబడునది కాదు.

ఈ క్రింది పద్యమున 'చెంద్రిక'కును తలపాగకును పోలిక చెప్ప బడినది.

"గరువుఁకొత్తఁ జెంగలువకచ్చుఘటించినమౌళిఁ జుట్టెఁ జెం
దిరిక తెలుంగునం బసిఁడితీగలునించిన జిల్గుపాగ" (మను. 5-58)

మౌళిన్, పాగన్ = తలగుడ్డను, చెందిరిక తెలుంగునన్ = కమ్మపై దుద్దువిధమున, చుట్టెన్ = చుట్టుకొనెను - అని యర్థము.

చెంద్రిక చుట్టబడునదిగాని పెట్టబడునది కాదని యీ పద్యమువలన ఏర్పడుట లేదా?

'చెంద్రికవన్నియసాలుచుట్టి' అన్న మాటకు, 'వేదం' వారు వ్రాసిన అర్థము.— "చెంద్రిక = *చంద్రకావి" అనిమాత్రమే. అందువలన, సూ. ని. 'చెంద్రికవన్నియ' ప్రస్తావమే యెత్తలేదు. ఆ 'సాలుచుట్టుట' యొక్క వృత్తాంత మేమనగా.—

తాటాకుకమ్మవ్రాసి, చుట్టగాచుట్టి, దానిని 'చెంద్రిక'తో బిగించి, ఆ మొత్తమున కొక యెఱ్ఱనిగుడ్డ చుట్టుదురు. అదే సాలుచుట్టుట. అదే ఆ జాబుకు 'కవరు'.

ఈ విషయమును బ్రౌను, 'చెంద్రిక' అను పదముక్రింద,—"The reddish envelope of a letter written on palm leaves. చంద్రిక చీరలు. A. 4" అని వివరముగా చెప్పియున్నాడు.

చెంద్రిక వన్నియసాలు ( = ఎఱ్ఱనిగుడ్డ) చుట్టిన తాటాకు జాబు చుట్టకు 'కమ్మచుట్ట' యని పేరు. విజయవిలాసకర్త, సూర్యమండలమును 'కమ్మచుట్ట'తో పోల్చినాడు; చూడండి.

"తనయుని పెండ్లి కేగవలె ధాత్రికి, దిక్కులవారి నెల్లఁ దో
డ్కొని చనుదెమ్ము నీవని కడుంగుఱిచేసి సురాధినాథుఁ డ
వ్వనపతి కంపినట్టి శుభవార్తలబంగరుకమ్మచుట్ట నా
దినకరమండలం బపరదిగ్గిరికూటముఁజేరె నయ్యెడన్" (3-92)

---

* 'చెంద్రకావి' అనవలెను.

## ౪౪. 'పాసెము'

'వేదం'వారి శ్బ్రం. నై. లో,—

"అరుదుగ నపు డొక్కొకయెడ
మరకతమణిపాత్ర గగనమండల మయ్యెఁ
జిరువడముల పాసెము శశ
ధరుఁడయ్యెఁ జుక్కలయ్యె ద్రాక్షఫలంబుల్" (౬-౧౨౩)

అని యున్నది. సూ.ని 'చిరువడము' క్రింద ఆ పాఠముతోనే యుదాహరించినది.

'పాసెము' అనుపాఠము తప్పు. 'పాకము' అని సరియైనపాఠము. శ.ర. లో 'చిరువడము' క్రిందనే యున్నది. 'వేదం'వారు చూడలేదు; సూ.ని. యును చూచినట్లు లేదు.

'పాసెము' పుట్టినవిధ మెట్టిదనగా.— వ్రాతప్రతిలోని 'పాకము' అచ్చులో 'పాశము'గా మారినది. వేదం-వారికి దొరికిన ప్రతులలో 'పాశము' అని యున్నట్లు వారే తెలిపియున్నారు. వారా పాశము, పాసెము (పరమాన్నము) అనుకొని, తెనుగు పదమున 'శ' ఉండరాదు గనుక 'సె'గా సవరించినారు, పొరపాటు.

అది 'పాక' మేగాని, 'పాసెము' కాదు, 'చిరువడములపాక' మనగా— గెనుసుగడ్డలతో చేసిన భక్ష్యవిశేషము. అది సొజ్జెఅప్పమువలె తెల్లగను - గుండ్రముగను ఉండును. అందువల్లనే చంద్రునితో పోలిక.

గెనుసుగడ్డభక్ష్యము చంద్రు డయ్యెను. దానిపొంత ఉంచబడిన ద్రాక్షపండ్లు చుక్కలయ్యెను - అని పైపద్యమున అర్థము.

వ్రాతలోను - అచ్చులోనుగూడా 'క' - 'శ' అను వర్ణములు రెండును తారుమారగుట తఱచుగా జరుగుచుండును.

'పంచకరపాట్లు' అనుపదము 'పిడుపర్తి' బసవపురాణము (౪-35)లో,—

"పంచశరుపాట్లుపడిరి విరించిముఖులు"

అని అచ్చైనది. అందు క-కారము శ-వర్ణముగా మారినదిగదా?

‘వేదం’వారి ఆ నైషధములోనే, ‘లోకేశకుటుంబిని’ - లోకైక కుటుంబినిగా మారియున్నది. ఆ మారినవిధము చూడండి :

“ఆశాస్యములైన యనే
కాశీర్వాదంబు లొసఁగి యఖిలేశ్వరి లో
కేశకుటుంబిని”

అని అసలుపాఠము. తాటాకులవ్రాతలో, ‘లోకేశ’ అను పదములోని ‘శ’ - ‘క’ వలె కనబడుటచేత, ‘లోకైక’ అయ్యుండుననుకొని పరిష్కర్తలు (క కారమును ‘శ’గా సవరించుటకు మారుగా, ‘కే’కు ఐత్వమిచ్చి) ‘కై’గా సవరించినారు.—

ఇట్లా పదములోని *‘శ’ - ‘క’గా మారిపోయినది. ప్రాసముతప్పిన సంగతియు పరిష్కర్తలు గమనించినారుకారు, అది ప్రమాదము.

ఏతావతా చెప్పవచ్చినది యేమనగా :— చిరువడముల - ‘పాశము’ లోని ‘శ’ను ‘క’గా సవరించుటకు బదులు వ్యాఖ్యాతలు ‘సె’-గా సవరించి అపార్థ కల్పనముచేసినారనీ; ఆ పాఠమును సూ.ని. గ్రహించుట తప్పనీ.—

## ౪౫. ‘ఇనువింతలు’

సూ.ని. ‘ఇను’ క్రింద,— శృ. నై. (ర. ౬౧) పద్యమును

“భూపాల మెఱుఁగుఁబోఁడుల
చూపులకుం డాయు నీదుసొబ గట్లగుటన్
మాపిన్నది యినువింతల
చూపుల నఱగంట వెఱచుచు న్నినుఁ జూచున్”

అను పాఠముతో నిచ్చినది.

---

* “ ‘క’, శ-అయినదని దీ.పి. శాస్త్రిగారు జోస్యముచెప్పినారు” అని పి. బ్ర. గారి ఆక్షేపము. (24-2-1947 త్రిలిఙ్గ)

ఆయనగారికి తెలియదు; చెప్పినను తెలిసికోలేరు. నేను చెప్పినది జోస్యమో, సత్యమో పై యుదాహరణలవలన స్పష్టమగుటలేదా? ఆయన గారి (18-11-1946 త్రిలిఙ్గ) వ్యాసములోనే, ‘ప్రతికూలుఁడు’ అనుపదము ‘ప్రతిశూలుఁడు’గా మారియున్నది.

'ఇనువింతల' అనునది వేదం-వారి పాఠము. సరికాదు. 'ఇసిజింతల' అని సరియైనపాఠము. శ.ర. లో 'ఇసిఱింతల' క్రింద నున్నది.

వేదం-వారికి దొరకిన ముద్రణములో 'యునువింతల' అని యుండఁగా, వారా పదమును 'యినువింతల' అని సొంతముగా సవరించినారు "ఇను వింతల = రెట్టి యాశ్చర్యముతోడి" అని టీకకూడా వ్రాసినారు.

ఇనువింతలు - అను వాడుక లోకములో లేదు. కావ్యములలోను కనబడదు. వ్యాకరణమర్యాదనుబట్టి (రెట్టి యను నర్థమున) ఆ పదము పుట్టుటకు మార్గమును లేదు.

అంతేకాక, ఆ పద్యములో 'ఇనువింతల - చూపుల'తో అక్కర యును లేదు. పైపెచ్చు - అట్టిచూపు లక్కడ పనికిరావు కూడాను. చూడండి.

కాంతాజనుల చూపులు అందమైన ఆ నలునితనువునకు *అంటుకొని పోవునట. అ ట్లంటుకొనిపోకుండుటకై, దమయంతి — ఇసిఱింతల (= చంచలములైన, నిలుకడలేని) చూపులతో చూచినదట. అదీ, అక్కడి యర్థము.

ఇనువింతలతో(=రెట్టి ఆశ్చర్యముతో) చూచువారు-నిశ్చలదృష్టితో-రెప్పార్పకచూతురు గాని, చంచలదృక్కులతో చూడరు. ("కనుఱెప్ప వేయ కక్కాంత మహాభిలాషఁ దటకాపడిచూచెఁ గుమారశేఖరుఁ" సారంగ. 2-37) అట్లు, నిశ్చలదృష్టితో చూచినయెడల, ఆ చూపులు -

---

* చూపులు తనువున కంటుకొనునని చెప్పుట కవిసమయము.

ఈ క్రింది ప్రాచీనరచన లందుకు ప్రమాణము.

(1) "వనితాజనులచూపు లను తూపులకుఁ దన
    ప్రన్ననిమేను లె(ల)ప్పంబుగాఁగ" (దశ. 1-60)

(2) "మీ పుష్పగంధి నెయ్యపుఁ
    జూపులకును లెప్పమైన సుకుమార వపు
    శ్శ్రీ పెంపునఁ దనరిన వసు
    ధాపతిసుతు సఖుఁడ నింద్రదత్తాహ్వయుఁడన్"
    (భోజ. 3-240)

తనువున కంటుకొనిపోవుట తథ్యము. కావున 'ఇనువింతలచూపులు' ప్రకరణవిరుద్ధములు.

*'ఇసిఱింతల చూపులు' ప్రకరణోచితములు. కావ్యములలో, చూపులకు - 'ఇసిఱింతలు' చెప్పుట కలదుగాని 'ఇనువింతలు' చెప్పుట కానరాదు.

(1) "ఏ పువ్వుఁబోఁడుల యిసిఱింతచూపుల
ఋషుల గట్టిమనంబు లిగురువెట్టు" (కాశీ. 3-౧౬౯)

(2) "మన తరలాక్షి సిగ్గు తెరమాటుననుండక దాఁటి దూఁటి పా
ఱినఁ గదియంగఁ బట్టి యిసిఱింతలచూపులఁ దన్నుఁ జూడఁగా"
(పి. శకుం. 3-౫౭)

'ఇనువింతల - చూపులు' ఒక్క వేదం-వారి నైషధములోతప్ప నా కెందును కనబడలేదు. సూ.ని. కిని కనబడినట్లులేదు. ఎందైనను కలవేమో పెద్దలు తెలుపవలెను.

అవి కనబడువరకును, శ.ర.లోని 'ఇసిఱింతచూపుల'పాఠమే సాధువు. సూ.ని. ఆ పాఠమునువదలి 'ఇనువింతలచూపుల' పాఠమును గ్రహించుట పొరపాటు.

ఇక్కడ ఒక విశేషము.—

'మెఱుఁగుఁబోఁడులచూపులకుఁ దాయు నీదుసొబగు' అన్నచోట, వేదం-వారు,— "చూపులకుఁ = నేత్రములకు, దాయుఁ = అంటుకొని పోవును. (కన్ను నీ కంటుకొనిపోవునని) వెలిచుచుఁ, నిను జూచును" అని టీకవ్రాసినారు.

అక్కడ 'చూపు' లనగా దృష్టులుగాని కన్నులుకావు. కావున ఆ టీకయును ప్రమాదమూలకమే.

---

* వా. ని., 'యిసిఱింతల' పాఠమునే గ్రహించి,— "యినువింతల- ముద్రితము. 'ఇనువింతల' వేదం. పా. ఇతర ప్రయోగముల ననుసరించి యిసిఱింతల యనునదే గ్రాహ్యము" అన్నది.— (చూ. ఇసిఱింతల క్రింద)

సూ. ని. ఆ మాత్రము విచారింపకపోయెగదా!

## ౪౬. 'ఎత్తుచు'

సూ.ని.లో,- 'చాఁగు' క్రింద.—

"సీ. ముంగాళ్లఁ జాఁగి పై ముచ్చుచూపులుపర్వ
బొమికల లెత్తుచుఁ బాటిపోవుశునుల" (ఆము. ౬.౧౮)

కావ్యములలోను, లోకవ్యవహారమునను గూడా,— ఎత్తుకొను; చేసికొను; తీసికొను; పుచ్చుకొను; నాటుకొను; కట్టుకొను; తప్పించుకొను మొదలగు క్రియలయొక్క క్త్వార్థకరూపములు.—

| | |
|---|---|
| ఎత్తుకొని; ఎత్తుక. | చేసికొని; చేసుక. |
| తీసికొని; తీసుక. | పుచ్చుకొని; పుచ్చుక. |
| నాటుకొని; నాటుక. | కట్టుకొని; కట్టుక. |

తప్పించుకొని; తప్పించుక.

అనురీతిగా నున్నవే గాని, ఎత్తుచు; చేయుచు; తీయుచు అనురీతిగా లేవు.

అనగా, 'రావణుఁడు సీత నెత్తుకొనిపోయినా' డన్న యర్థమున 'రావణుడు సీత నెత్తుచుఁ బోయినా' డనియు, 'వాడు పెండ్లిచేసికొని పోయినా' డనుటకు మారుగా — 'వాడు పెండ్లిచేయుచుఁ బోయినా' డనియు లోకమున నెవ్వరును అనరు.

(1) "లక్షపరిమాణముగల క్రిమిగుండమందు నాటుకయుండుꣳ"
(భాగ. 5 స్కం. 147)

అనుచోట, 'నాటుచునుండుꣳ' అంటే ఏర్పడే యర్థమేమో అక్షరాస్యులకు చెప్పనక్కరలేదు గదా!

(2) 'తప్పించుక తిరుగువాఁడు ధన్యుఁడు'.—

అనుటకు బదులుగా, 'తప్పించుచుఁ దిరుగువాఁడు ధన్యుఁడు' అని, యేమాత్రపు భాషాజ్ఞానముకలవాడును అనడు గదా!

మఱి మహాకవియైన శ్రీకృష్ణరాయడు,— "బొమికల లెత్తుచు... పోవుశునుల" అని యేల యనెను?

నిజానికి ఆ మహాకవి యట్లనలేదు.— "బొమికలెత్తుక... పోవుశునుల" అని సరిగానే అన్నాడు. శ.ర.లో 'బొమిక' అను పదముక్రింద, బొమికలెత్తుక' అను పాఠమే చూపబడి యున్నది.

మరి సూ.ని. 'బొమికలెత్తుచు' అనుటకు కారణ మేమంటారా? 'వేదం'వారు 'ఎత్తుక' అను రూపము వ్యాకరణవిరుద్ధమని 'ఎత్తుచు' అని సవరించి, వారి ప్రతిలో ముద్రించినారు. వారి ప్రతిలో నున్న ప్రకారమే సూ.ని. ముద్రించినది.

వేదం-వారు "కొంగవాల్నఱుకు లంగుళులఁబట్టుక" (ఆము. 6-21) అన్నచోటగూడా 'బట్టుచు' అని దిద్దివేసినారు. ప్రాచీనకవుల ప్రయోగములను మార్చివేయుట ఆ కవులకూ-భాషకుకూడా మహాపకారముచేయుటయగును —

'ఎత్తుక' - 'పట్టుక'-అను రూపము లసాధువులు కావు.— బాల, వ్యా. క్రి. సూ. 53 క్రింద, గుప్తార్థప్రకాశికాకర్తలు, "చేసికొని, చదువుకొని - ఇత్యాది క్త్వాంతంబులకు బదులుగా 'చేసుక' - 'చదువుక' ఇత్యాది క్త్వాప్రత్యయాంతసంగ్రహ రూపంబు లనంతామాత్యతిమ్మకవ్యప్పకవ్యాది లాక్షణికులచేఁ దమ గ్రంథములయందు వాడఁబడినవి" అని చెప్పి ఒక యిరవైయైదు ప్రయోగము లిచ్చియున్నారు.

'ఎత్తుక' అను పాఠము శ.ర. లో నున్నను గ్రహింపకపోవుట, ఆ పాఠమును సూచింపకపోవుట, *'ఎత్తుచు' అను అసాధుపాఠమును గ్రహించుట, సూ.ని. చేసిన పొరపాటులు.

## ౪౭. 'చీకుబండ'

సూ.ని. 'జీరుకుబండ' క్రింద,—

"చ. అలకలు నాసికామణియు......హస్తము లూఁది జీర్కుబం,
డల దిగజాఱి రొండొరుకడం దరలాక్షులు" (పారి. ౪.౩౮)

---

* ఎత్తుకొని-అను నర్థమున 'ఎత్తుచు' అనవచ్చుననియు, 'తప్పించుక తిరుగువాఁడు' అన్నను, 'తప్పించుచుఁ దిరుగువాఁడు' అన్నను అర్థ మొకటే ననియు - 'ఎత్తుక' అనుట తప్పనియు, వీ.బ్ర.గారి దొక పెద్ద రాద్ధాంతము. (చూ. 17 మార్చి 1947 త్రిలిఙ్గ) అది యర్థజ్ఞానములేని-కావ్యపరిచయములేని అనవసరపుగొడవ.

ఎత్తుక; పుచ్చుక-అనుట తప్పు కాదని బాలకవిశరణ్యము ఘంటాఘోషముగా చెప్పుచున్నది. వీరబ్రహ్మంగారిప్పుడైనను చదువుకొనుట మంచిది.

అను పద్యమునుచూపి, ఇది శ.ర. పాఠ మన్నది. అక్కడనే "జిర్కు బండ-అని కాళిందీకన్యాపరిణయమున అపముద్రిత" మని యొక మాట వ్రాసినది.

అట్లు సూచించుట మంచిదే; కాని, వేదం-వారి 'పారి' ప్రతిలో

"చీకుబండల దిగజాతి"

అని యున్నదే: అది తప్పా? ఒప్పా? తప్పైయైనచో, తప్పనిచెప్పకపోవు టేల? ఒప్పైయైనచో గ్రహింపకపోవు టేల?

ఆం. భా. (1-143)లో, "జీరకునాఁగను జీరకుపాటునా... స్థలన సమాఖ్యయై వెలయుచుండు" అని యున్నది. కాబట్టి 'వేదం'వారి పాఠము తప్పా.

## ౪౮. 'గగ్గులకాండ్రు'

సూ.ని. 'గగ్గులకాఁడు' క్రింద, 'పారిజాత' పద్యమును,—

"సీ. తలలువీడంగ విద్యాధరు ల్పఱచిరి,
గగ్గులకా డైరి ఖచరవరులు" (౫.౩౭)

అను పాఠముతో చూపినది.

పండితులచే సరిచూడబడి, పి.వి. రామయ్య అండ్ బ్రదర్సు వారిచే ప్రకటింపబడిన ప్రతిలోను, వేదం-వారిచే పరిష్కృతమై - ముద్రితమైన ప్రతిలోనుగూడా,—

"గగ్గుల-కాండ్రైరి"

అని యున్నది. 'కాండ్రైరి' యనుట ముమ్మాటికిని తప్పే. అయినప్పుడు, "వేదం-వారి ప్రతిలో 'కాండ్రైరి' యని, అపముద్రితము" అని సూ.ని. తెలిపియుండవలసినదే గదా? ఏల తెలుపలేదు? వేదం-వారిదే సరియైన పాఠమునుకొని తప్పాత్రోవత్రొక్కువారి గతి యేమి?

## ౪౯. 'చెంచుమల'

సూ.ని. "చెంచుమల చూఱకారుఁడు = చెంచుదుర్గమును కొల్లగొట్టినవాఁడు - బిరుదవిశేషము" అని చెప్పి, అందుకు,—

క. "చెంచుమలచూఱకారున
కంచితకరుణాతరంగితాపాంగునకున్"

అను, (నైషధ. 1-42) పద్యము నిచ్చి, ఆ ప్రక్కనే— "చెంచిమల అని వేదం-వారి పాఠము" అని సూచించినది. కాని, 'చెంచిమల' అనియే కాదు; కాశీఖండములో,— 'చెంచూమలచూరకార' యనియు నున్నది.

"అభ్యంచిత దయాధురంధర
చెంచూమలచూరకార చిరపుణ్యనిధీ" (3-247)

మరియు, హరివంశములో - 'చెంజిమలచూరకార' అని యున్నది.

"చెంజిమలచూరకార ధ
నంజయసమసత్త్వ" (పూర్వ. 7. ఆ.)

సూ.ని. యెరుగునా? యెరుగదా? ఎరుగకపోవుటగాని, ఎరిగి యున్నచో ఆ రూపములను చూపకపోవుటగాని తగునా?

మరి, 'చెంచుదుర్గ'మని సూ.ని. చెప్పిన యర్థము చెంచిమల; చెంచూమల; చెంజిమల-అను రూపములయందును సిద్ధించునా?

## ౫౦. 'గోవుకోడె'

సూ.ని. 'కోడె' యను పదముక్రింద, వరాహపురాణములోని సీస పాదమును,—

"ఆదిశాక్వరము విహారంబుసలుపు నీ
కొండచెంపల గోవుకోడెవోలె" (౬.౫౭)

అని యుదాహరించినది.

'గోవుకోడె' అనుట తప్పు. 'గోవకోడె' అనవలెను. 'గోవ' అనగా మనిషిమచ్చికలేని అడవిపసరము (= అసాధువు) అని యర్థము. నెల్లూరుమండలమున సముద్రపుటొడ్డున ముత్తుకూరుప్రాంతపు టడవులలో, అడవియావు లున్నవి. వాటిని గోవావులు (గోవ + ఆవులు) అందురు. అవి మనుష్యుల కలవికావు. ఎట్లో పట్టితెచ్చినను మచ్చికపడవు. గోవ = పొగరుబోతు అని, సూ.ని. లోనే యున్నది.

## ౫౧. 'జిడ్డి'

శ.ర. లో, 'పాలకి' క్రింద, శృం. నై. పద్యము. (౭-౧౪౫)

"పాయు తొలంగుమం చుభయపార్శ్వములన్ బగళంబుసేయుచున్
దోయజలోచనల్ గొలిచి తోఁజనుదేరఁగఁ బెండ్లికూఁతు ర
త్యాయతవైభవస్ఫురణ నంతిపురంబున కేగుదెంచెఁ బై
డాయఁగ దిద్దివైచిన కడానిముసుంగు పసిండిపాలకిన్"

అని యున్నది.—

వే. వే. శాస్త్రిగారు,— 'దిద్దివైచిన కడానిముసుంగు' అను శ.ర. పాఠమును గ్రహింపక,- 'జిడ్డివైచిన కడానిమెఱుంగు' అను పూర్వముద్రణ పాఠమును గ్రహించి,—శ.ర. ను చూచుకొని, 'జిడ్డి = మోటువస్త్రము'— అని యర్థము వ్రాసినారు.

సూ.ని. 'జిడ్డి' క్రింద, శాస్త్రిగారిపాఠమునే యిచ్చి,— 'జిడ్డి = మోటువస్త్రము' అనియే అర్థము చెప్పినది. చక్రవర్తిగారి పెండ్లికూతురు వచ్చు 'కడానిమెఱుంగు పసిండిపాలకి' మీద నేమి! మోటుగుడ్డ వైచుట యేమి! అని యాలోచించనైనను లేదు.

(ముసుంగు; మెఱుంగు)

అది యట్లుండగా,— శాస్త్రిగారి పాఠమున అర్థము సరసముగా లేదు. ఏమనగా:— కడాని = మేల్మిబంగారపు, మెఱుంగు = 'మెఱుగు గల, పసిండిపాలకిన్=బంగారుపాలకియందు - అని వారి పాఠమున నర్థము.

ఆ యర్థమున్న 'బంగారము' రెండుమార్లు వచ్చుటచేత *పునరుక్తి

* వీ. బ్ర. గారు,— పల్లకీ సామాన్యపుబంగారుతో చేయబడిన దనియు, దానికి కడాని (= మేలిమిబంగారపు) మెఱుగు పెట్టబడినదనియు అర్థము చెప్పినారు.

బంగారుపనివిషయమున వారిమాటకు విలువయియ్యవలసినదే; కాని, బంగారును అట్లు రెండుమార్లు చెప్పుటకంటె, పసిడిపాలకిమీద, కడాని (= బంగారు సరిగెగల) ముసుగు వేసినట్లుచెప్పుట సరసమనియు, మేల్మి బంగారుమెఱుగుగల పసిడిపాలకిమీద - 'మోటుగుడ్డ' కప్పినట్లు చెప్పుట అనుచితమనియు, అందువలన 'కడాని ముసుంగు' పాఠమే గ్రాహ్య మనియు నా యభిప్రాయము.

యేర్పడుచున్నది. మహాకవి శ్రీనాథు డట్లు నీరసపురచన చేసియుండు నను కొనుట భావ్యము కాదు.

'కడాని ముసుంగు' పాఠమున పునరుక్తిదోషము తొలగును. కావున ఆ పాఠమే గ్రాహ్యము.

(దిద్ది ; జిడ్డి)

'దిద్దివైచిన' - 'జిడ్డివైచిన' అను పాఠములు రెండును సరియైనవి కావు.— 'దిడ్డివైచిన' అని సరియైనపాఠము.

'దిడ్డి' యనగా, పాలకి మొదలగు వాహనములవాకిటికి అమర్చి యుండు పరదా.

"దిడ్డి - A little door, as of a palankeen" (బ్రౌను.)

శ.ర. లో, 'దిడ్డి' క్రింద, ఈ పద్య మున్నది.—

"నునుఁబైఁడి కావిచెఱఁగులఁ
బనుపడియెడి దిడ్డితోడిపల్లకి కదలెన్" (య. ౪. ఆ.)

'దిడ్డివైచు' అనునది జాను తెనుగు పలుకుబడి. శబ్దపల్లవము. దాని నట్లే వాడవలెను. ప్రాచీను లట్లే వాడియున్నారు. పాలికి మొదలగువాని వాకిలికి పరదా అమర్చుట - అని ఆ పలుకుబడి యర్థము.

(1) "పేఁడిపాలకీ, నప్పావుఁబోఁడినుంచి మెఱుఁగారెడు బంగరుఁబ్రాత పచ్చడం బొప్పఁగ దిడ్డివైచికొని యుబ్బుమెయిం గొనిపోయెన్ నింటికిన్" (పరమ. ౨-౩౭)

బంగరుబ్రాతపచ్చడంబు - దిడ్డివైచికొని, అనుటవలన పల్లకివాకిటి కడ్డముగా సమర్పబడునది *వస్త్రమని యేర్పడుటలేదా?

---

* "దీ. పి. శాస్త్రిగారు 'జిడ్డి'ని - 'దిడ్డిగా' మార్చుటయును, 'పరదాగుడ్డ' యని లేనియర్థమును కల్పించుటయును, ఆ కల్పనతో సూ. ని. నాక్షేపించుటయును 'దప్పు' గాదందురా? 'దిడ్డి'కి 'పరదాగుడ్డ' అని యర్థమును జెప్పుట తప్పు" - అని పి. బ్ర. గారి ప్రసంగము.

ఆ ప్రసంగ మజ్ఞానమూలకము. అది యట్లుండగా, వారు, 'జిడ్డి' యనగా— ఏనుగులు, గుఱ్ఱములు, పల్లకీలు మొదలగువానిపై - నుత్సవ

(2) "తగు వాహనముల నంతఃపుర కాంతల
నిడి దిడ్లువైపించు హెగ్గడులును." (క శా. ౨-౭౯)

సూ.ని. ఈ రెండుపద్యములను 'దిడ్డి' క్రింద ఉదాహరించినదేగాని, 'దిడ్డి' యొక్క అర్థమును సరిగా తెలిసికొననూ లేదు; 'దిడ్డివైచు' అనునది రూఢమైన పలుకుబడి - యని గ్రహించనూ లేదు. "దిడ్డి = పాలకి మొదలగువాని ద్వారము" అనిమాత్రమే వ్రాసినది.

పై పద్యములు రెండును 'దిడ్డివైచు' అను క్రియను చూపవలసినవిగాని, 'దిడ్డి'కి చూపవలసినవి కావు.

(3) "తొట్టుకొని సంజకెం ప
ప్పట్టున రవిఁబాసి సితగభస్తి నెదురుకో
నట్టె సిరివచ్చుటకునై
పట్టిన కెంబట్టుదిడ్డిపాలకిఁ బోలెన్" (రామా. 2-92)

కెంబట్టుదిడ్డిపాలకి, అంటే, ఎఱ్ఱ పట్టుపరదాగల పాలకి - యని యర్థము. అంతేగాని, ఎఱ్ఱని పట్టువాకిలిగల పాలకీ-అని కాదు.

---

సమయములలో - కప్పు, "ముఖమల్ - లేక పట్టువస్త్రములపై జరీబుటేదారిపనిగల దళసరివస్త్రము" అన్నారు. దానినే నట, శ.ర. 'మోటువస్త్ర' మన్నది.

ముఖమల్ వస్త్రమును, జరీపనిగల పట్టువస్త్రమును 'మోటువస్త్ర' మని యెవడైనా, 'మోటువా' డనవలసినదేగాని, శ.ర. యనునా?

వీ. బ్ర. గారు, "పట్టువస్త్రములపై జరీబుటేదారిపనిగల దళసరి వస్త్రము" అన్నారే! 'పట్టువస్త్రములపై...దళసరివస్త్రము' అంటే అర్థమేమో?

మరియు వారు,— "పైడాయఁగ జిడ్డివైచిన. పై అనగా పల్లకీపై నని యర్థము" అన్నారు. వే. వే. శాస్త్రిగారు,— "డాయఁగన్ = దగ్గఱఁగా" అన్నారు.

'పల్లకీపైన్ - దగ్గఱఁగా - మోటువస్త్రము వైచుట' యననేమో బ్రహ్మంగారే సెలవియ్యవలె.

కాబట్టి శ.ర. యును, అట్లే సూ.ని. యును – 'దిడ్డి' పాలకి మొదలగు వాని వాకిలి – అనుట సరికాదు.

మనకు ప్రకృతమైన శృం. నై. పద్యమున,— *"డాయఁగ దిడ్డి వైచిన కడానిముసుంగు పసిండిపాలకిన్" అను పాఠమున,– 'డాయఁగన్ – దిడ్డివైచిన = వాకిటికి కొంచెము అడ్డముగా పరదావేసినదియు, కడాని ముసుంగు = బంగారు జరీపనిగల అవగుంఠనము కలదియు – నైన, పసిండి పాలకిన్' అని యర్థము.

'దిడ్డివైచు' అను పలుకుబడితోడి ప్రాచీనరచనలను చదువుకొనియు, సూ.ని. ప్రాచీను లెవ్వరును వాడనిదియు, అనుచితార్థము నిచ్చునదియు నైన– 'జిడ్డివైచిన' అను అసాధుపాఠమును కైకొనుట పొరపాటు.

('పాయదోలంగుఁడు')

'పాయు తోలంగు మంచు' అన్న శ.ర. పా. సరికాదని చెప్పి, వేదంవారు,— పాయదోలంగుఁ డంచు' అను పాఠమును తీసికొని,— "పాయ = పాయలుగా, తోలంగుఁడు" అని టీక వ్రాసినారు.

'పాయదోలఁగు' అని యేకపదక్రియగా తీసికొన్నప్పుడు, 'పాయ = పాయలుగా, తోలఁగుఁడు' అని యర్థము చెప్పుట సంప్రదాయము కాదు.

---

* డాయఁగవైచు యనగా దగ్గరికి వేయుట (కొంచెముగా మూయుట) – 'తలుపుదగ్గరికి వెయ్యి' అను వ్యవహారము సర్వజనవిదితము.

"తలుపు దగ్గఱమూయఁ దడవయ్యె" అని, నవనాథచరిత్ర ప్రయోగము. (పుట. 155)

'దగ్గర' అనగూడదని నన్నాక్షేపించుచూ, వీ. బ్ర. గారు నోరు ఎక్కువగా పోగొట్టుకొన్నారు. (చూ. 12-12-49) త్రిలిఙ్గ)

'దగ్గర' అను వాడుకయు కలదని చెప్పి, అందుకు గ్రాంథ్యమును ప్రమాణముగా చూపినాను. వారు మరల నోరెత్తలేదు.

తెనుగుమాటలుకూడ సరిగా నెరుగనివారు సాహిత్యవిమర్శకులగుట – భాషాదౌర్భాగ్యముగదా!

'పాయు తొలంగుమంచు' అన్న, శ.ర. పాఠమే సరియైనది. ఆ పాఠమున 'పాయు'; 'తొలఁగు' వేర్వేరుపదములు. ఆ క్రియల నట్లు వేరు వేరుగావాడుట శ్రీనాథమహాకవికి పరిపాటి. ఆ పరిపాటి తిక్కన-నాచన సోమనాథాదులనాటికే యున్నది. వరుసగా ఉదాహరిస్తాను.

(1) "బెరసి భద్రమహాకాళిభృంగిరిటులు
పాయు బగళంబు తొలఁగు విచ్చేయుఁడనుచుఁ
బార్శ్వములయందు మిగుల నార్భటము సేయ" (భీమ. ౫-౨౫)

(2) "వేత్రహస్తులు, తలండు పాయుండు దొలంగుం డనుచు సందడి నెడఁగలుగఁజేయ" (హర. 4-92)

(3) "పాయు తొలంగు మంచు బెట్టాడెడుమాట లుప్పతిలె"
(ఉ. హరి. 1-123)

(4) "పాయు తొలంగుమం చాయతవేత్రహ
స్తులమొత్త మేలొకో తోడరాదు" (భార.విరా. 1-186)

ఇట్లు భారతరచనాకాలమునుండి శ్రీనాథునివరకును,— పాయు, తొలంగు,—అని వ్యస్తముగా వ్యవహృతమైన పలుకుబడిని 'పాయతొలంగు' అని, యేకపదక్రియగామార్చుట ప్రమాదముకాదా?

మరియొక విశేషము : సూ.ని. నైషధపద్యము నుదాహరించుటలో- ఈ ప్రారంభచరణమును వదలివేసినది. భాషకు, ముందుకాలమున-పరమ ప్రమాణము కావలసిన పెద్దనిఘంటువు, అట్లు చేయవచ్చునా? ఆ చరణ మునుసైతము గ్రహించి, 'ఇందులో పాఠభేదమున్నది. ఇది, శ.ర. పాఠము; ఇది, వేదంవారి పాఠము; ఇది ఒప్పు; ఇది తప్పు' అని స్వప్రమాణముగా నిర్ణయింపవలెగాని, అట్లు నిర్ణయించుటకు పాలుమాలి—ఆ చరణమునే మాటుపరిచి, దాటిపోవచ్చునా?

సూ.ని. అట్టిపని మరియొకతావునకూడా చేసినది. చూడండి. 'జమా ఖరుచులు', 'దినవహీ' అను పదాలకు 'హంసవింశతి'నుండి ఉదాహరణ చూపవలసివచ్చినది : ఆ ఉదాహరణపద్యము అచ్చుప్రతిలో ఇట్లున్నది.

"అనువుగ మిన్ననుం గడితపాళితమంబునఁ గట్టిపెట్టు శో
భనతర చంద్రదీధితులపంక్తి జమాఖరుచుల్గణించి యిం
తనుకొని కాలమాగణకుఁ డప్పుడు తీర్చి లిఖించినట్టి యా
దినవహిలేఖవ్రాలనఁగఁ జెల్వగుఁ జుక్కలుపర్వ నత్తఱిన్"

(1-142)

ఈ పద్యమున,— 'మిన్ననుం గడితపాళి' అనుటలో అర్థమేమో సరిగా నేర్పడుటలేదు*

అందువల్ల, సూ.ని. ఆ పాదమును చల్లగా తొలఁగద్రోసి, ఆ రెండు పదముల క్రిందను,— "చ...శో, భనతర......నత్తఱిన్" అని, తక్కిన మూఁడుపాదములను మాత్రమే ఉదాహరించి దాటుకొన్నది. మరియు, ద్వి. సం. అనుబంధములో 'గట్టి' క్రింద గూడా,—

---

* ఆ పాఠమున నర్థము సరిగా నేర్పడుటలేదు.—అని నే నన్నందుకు నా యపాండిత్యమును చెనకుచూ, 'కవిరత్న-కవి-వీరబ్రహ్మం'గారు, తమ పాండిత్యము నిట్లు వెల్లడించుకొన్నారు.

"పద్యము సరిగానే యున్నది. వారి కేల యర్థముకాలేదో? అందులకు నిఘంటు వేమి చేయగలదు? పద్యములకు నిఘంటువులు ప్రతి పదార్థములను వ్రాయువుగదా? అయినను, దీ.పి. శాస్త్రిగారి కర్థముకాలే దన్న యా పద్యమును దిలకింపుడు.—

"అనువుగ మిన్ననుం గడితపాళితమంబునఁ గట్టిపెట్టి"—

ఈ పద్యమున 'పాళి' అనుచోట నాయొద్దగల ముద్రితప్రతిలో 'పాళె' అని యచ్చుతప్పొక్కటిమాత్రమె యున్నది. మిగిలినభాగమంతయు సరిగానే యున్నది.— ఇక దీని యర్థమును చిత్తగింపుడు.

అనువుగన్ = చక్కగా, మిన్ను + అను = ఆకాశమనియెడి,— ద్రుతముమీఁద దిరిగి కొన్నియెడల 'న' కారము వచ్చుననుటను బట్టియు ద్రుతమునకు బరమైన పరుషములకు సరళములు రాగా నందలి ద్రుతము అర్ధబిందువో పూర్ణబిందువో యగునను సూత్రమునుబట్టియు "మిన్ననుం గడితము"గా నైనది. దీని పదవిచ్ఛేద మిట్లుండును.

"చ...తమంబున గట్టిపెట్టుళో, భనతర... న త్తఱిఁ"
అనియే యుదాహరించినది. అక్కడను తొలిపాదమును పూర్తిగా నియ్య లేదు. ఎందువల్ల? పాఠము సరిగా లేనందువల్లనే.

సందేహాస్పదములగు పాఠములజోలికి పోక దాటవేయువాడుక సూ.ని. కి ఉన్నది. ఇంకొక్క యుదాహరణము.—

వేదంవారి 'సారంగ' ప్రతిలో (౧-౭౭) పాఠము.—

"క...మీ రాయి త్తపడి వెసఁ రండనుచుఁ
జనవరులఁ జనవరులఁ
మన సరలఁ దొరల ననిపి మహీపతి దానుఁ."
అని యున్నది,

'మనసరలఁ' అంటే అర్థమేమో నాకు తెలియలేదు. అందువల్ల ఆ పాఠము సరియైనది కాదని తోఁచి, సూ.ని. లో, సరియైనపాఠము నిర్ణయింప బడియుండు ననుకొని, ఆదరబాదర ఆ గ్రంథము నెత్తి 'అయి త్తపడు' క్రింద చూతుగదా యేమున్నది? 'క...మీ రాయి త్తపడి వెసఁ రండనుచుఁ'

---

మిన్ను + అను + న్ + కడితము = మిన్ననుంగడితము. కడితపు + ఆళి = నీలపు పుటలుగల లెక్కలపుస్తక సముదాయమును, తమంబునఁ = చీకటిచేత, కట్టిపెట్టి = కట్టివెచి...అని యర్థము. అన్యదేశపదములతో నుండినను సలక్షణముగానున్న యీ వర్ణన దీ.పి. శాస్త్రిగారి కర్థము గాకపోతే సూ.ని. యేమి చేయగలదు? వీరి కర్థము గాలేదని నిఘంటువులు ప్రతిపదార్థములను వ్రాయవుగదా?"—

వారి వ్రాతఅంతయు తప్పులతప్ప. అనాత్మజ్ఞతాప్రయుక్తములైన, వీ. బ్ర. గారి వీరాలాపముల నటుంచి, వారి వ్రాతలోని దోషములను మాత్రము సంగ్రహముగా మనవిచేస్తాను.

ధాతుజవిశేషణమైన 'అను' లోని 'ను' ద్రుతమనుట మొదటితప్పు. ఆ ద్రుతముమీద మఱియొక నకారము వచ్చు ననుటయు, ద్రుతకార్యాది ప్రసంగముచేయుటయు రెండవతప్పు.

**N.B.:** — వారు చదివిన వ్యాకరణములో 'అను' లోని 'ను' ద్రుతమే. అందువల్లనే, వారు తమ వ్యాసములలో,— 'అను బూర్వకవి

అన్నంతవరకే యున్నది. నా కెక్కడ సందేహమో, ఆ నిఘంటువుకు అక్కడనే అనుమానము. అందువల్ల పద్యములోని ఆ భాగముజోలికిపోక, అవతలిది అవతలనే సర్దుకొన్నది. ఇట్టి వింకను గలవు. మచ్చు కొకటిరెండు చూపినాను.

అడిగినంత అర్థము; కావలసినంత గ్రంథసామగ్రి; అఖండమైన పాండిత్యము; దిగ్దంతులవంటి విద్వత్ప్రకాండులతోడ్పాటు కలిగి, గ్రాంథిక భాషారక్షణదీక్షతో — పాఠనిర్ణయము; శబ్దనిర్ణయము; అర్థనిర్ణయము— చేయుటకే పూనుకొన్న సూ.ని. వంటి బృహన్నిఘంటువు చేయదగినపనేనా? అది. గట్టిగా పరిశీలింపవలసినపట్టులలో తొలగదోసికొనిపోవు నిఘంటువులవలన లోకమున కేమి యుపయోగము?

---

ప్రయోగంబున'; - 'మిశ్రమ (?) సమాసమను పేర'; - అను ప్రశ్నకు' అని ద్రుతకార్యముచేసి వ్రాసియున్నారు.

'పుస్తకసముదాయమును చీకటిచేత కట్టివైచి' యనుట అర్థశూన్య ప్రసంగము. అది మూడవ తప్పు.

పుస్తకము తెరచియున్నచో అందలి యక్షరములు కనబడునుగాని మూసి-కట్టివేసినచో కనబడవు. ఈ చిన్న సంగతి తెలిసికొనుటకు 'కామన్ సెన్స్' చాలును; పాండిత్య మక్కరలేదు. 'కవిరత్న-కవి' బిరుదాంకితులును, మహాపండితులును అయినవారు ఇంతమాత్రము నాలోచింపక, 'లెక్కలపుస్తక సముదాయమును కట్టివైచి' యని యర్థము చెప్పుట నాల్గవ తప్పు.

'గట్టిపెట్టు'అను క్రియాస్వరూపము నెరుగక 'కట్టిపెట్టు'గా భావించి, అసందర్భపు అర్థము చెప్పుట అయిదవ తప్పు.

తమకు పరమప్రమాణమైన సూ.ని. 'గట్టిపెట్టు' అన్న పాఠమును గ్రహించియుండగా, తద్విరుద్ధముగా, 'కట్టి - పెట్టి' అనుట ఆరవతప్పు.

'మూడు మాటలు — ఆరు తప్పులు' అన్న సామెతకు తార్కాణగా నున్న యీపాటి పాండిత్యముతో, విమర్శలకు దిగుటయు ఇతరులను వెక్కిరించుటయు ఏడవతప్పు.

## ౫౨. 'తీఱు'

ఈ క్రిందివి, 'వేదం'వారి 'సారంగధర'నుండి సూ.ని. కెక్కిన యపపాఠములు.

సూ. ని. 'గీఁటు' క్రింద,— *"ముచ్చటఁదీఱునట్లుగా" (సారంగ. ౧-౧౧)అనియు, 'నిఱుప్రేమ' క్రింద,-"కాంక్షలుదీఱ"(౧-౧౩౦)అనియు ముద్రించినది.

కాంక్షలుతీరు; ముచ్చటతీరు - అనునప్పుడు 'తీరు' అను క్రియలోని రేఫము లఘువు. సూ. ని. లో 'తీరు' క్రింద లఘురేఫముతోనే చూపబడి యున్నది.

వేదంవారి ప్రతిలో గురురేఫముతో నున్నందున, సూ.ని. అపరిశీలితముగా ఆ పాఠముల నట్లే కైకొన్నది.

## ౫౩. 'ఓర్చు బెఱుంగక'

'ఆర్చు' క్రింద,— "ఓర్చు బెఱుంగకంటి" (౩-౧౭౫) అని యున్నది.

"ఓర్చు మెఱుంగకంటి" అని యుండవలెను.

## ౫౪. 'కాఱెనుపోతులు'

సూ. ని. 'దోరు' క్రింద,— "మడిసెజ్జ గాఱెనుపోతులు" అని యచ్చువేసినది. తప్పు.

'కారెనుపోతులు' అని యుండవలెను. సూ.ని. లో కకారము క్రింద 'కారుదున్న'; - 'కారెనుము'; - 'కారుపోతు' అని లఘురేఫము తోనే యున్నది.

## ౫౫. 'విన్నఁ గన్నఁ జోద్యము'

సూ.ని.— 'డబ్బు' క్రింద,—

* 'దీ'కు ముందు అరసున్న యుండరాదు. శాస్త్రిగారి ప్రతిలో లేదు.

"ఎంతసేసినది సేఁడిది విన్నఁ గన్నఁ జో
ద్యముగాదె మఱి దబ్బుదబ్బిన నిటు
వలె నుండవలె" (౩-౨౦౭)

అన్నది సరికాదు.

"ఇది విన్న కన్న చోద్యముకాదు" అని సరియైన పాఠము.

ఈ చోద్య మెన్నడును విన్నదీకాదు; కన్నదీకాదు.—అని కవ్యుద్దిష్టార్థము. లోకోక్తి కనుసరణము.

ఈ పలుకుబడికి ప్రయోగాంతరములు.—

(1) "తత్తనూ, విలసనమెన్నఁ గన్నదియు విన్నదిగా దిలలోన" (విజయ. 1-186)

(2) "వెనుక నెచ్చోటనెవ్వారు విన్నదియును
గన్నయదియునుగాక లోకములనెల్ల
నతిశయించిన సచ్చరితాద్భుతమున
కాకరంబైన దీ యిగురాకుఁబోఁడి" (నాసికే. 2-149)

(3) "ఆగఱువతనంబులాగు లేగరితలందును మున్ను కన్న విన్నవియె? దీని కలుదు లెంత యరుదులు" (ప్రభా. 3-52)

## ౫౬. 'అలవెనయంగజారుల'

'నజ్జునేయు'— అను పదముక్రింద,— "అలవెనయంగజారుల" (౧. ౧౦౧) అని సూ.ని. పాఠము.

'అలవెలయంగ'— అని సరియైన పాఠము,— (చూ. వివరములకు, 'జితకాశి', పుట. ౧౦౭)

## ౫౭. 'అధన్యుఁడు'

'చొప్పడు' క్రింద,—

"అధన్యుఁడు కాడన్యుఁ డ
సాధారణుఁ డతఁడు దైవసన్నిధి నతనిన్
శోధనచేసినఁగాక, య
శోధన యొండొకటి దలఁపఁజొప్పడ దింకన్" (౩-౪)

అని, సూ.ని. పాఠము.

'ఔధన్యుఁడు'; - 'దైవసన్నిధినిదగన్' అని సరియైన పాఠము.
(చూ. 'జితకాశి' పుట. ౩౭౨)

## ౫౮. 'అతనిన్'

'తోఁచు' క్రింద,— "దప్పి నివారించి యలంతదేర్చి యతనిం బెంపొందఁగాఁ జేయుచున్" (3-౧౯౪) అని, సూ.ని. పాఠము.

"అసువుల్ పెంపొందఁగాఁ జేయుచున్" అని సాధుపాఠము.

## ౫౯. 'కరచరణాదులకాజ్ఞ'

'ఆజ్ఞ' క్రింద,— "అయ్యర్జుని కరచరణాదుల కాజ్ఞ" (3-౨౧) అని, సూ.ని. పాఠము.

ఆజ్ఞ (= నఱుకవలసినదన్న యుత్తరువు) సారంగధరుని, కరచరణములకే - గాని, ఆదులకు (= నడుము, కంఠము మొదలగువానికి) కాదు. కావున సూ.ని. పాఠము తప్పు.

"అయ్యర్జుని వనిఁ గరచరణం, బాజ్ఞ"
అని సరియైన పాఠము. (చూ. 'జితకాశి' పుట. ౩౮౧)

## ౬౦. 'సారంగధరుఁడు'

'నుసులు' అను పదముక్రింద, సూ.ని.,—

"మధుఁడు సారంగధరుఁడు మన్మథుఁడు విధుఁడు
వసులపాఁతరలై వీరు నుసులనీయ
రెటుల నిటు తాళఁగలదని యెఱుఁగవైతి" (౨. ౧౨౫)

అను పాఠముతో ముద్రించినది.

'సారంగరథుఁడు'; 'ఎటులనీఁక' అని సరియైన పాఠము. (చూ. వివరములకు 'జితకాశి' పు. ౨౪౫)

ఇది పాఠ పరామర్శ.

---

# సాహిత్య సమీక్ష

## — తెలుఁగు నిఘంటువులు —

# అర్థపరామర్శ

పూర్వప్రకరణమున తెలుగు నిఘంటువులలోని పాఠ ప్రమాదములు కొన్ని చూపబడినవి. ఇందు, అర్థప్రమాదములు కొన్ని చూపబడుచున్నవి.

### 1. నీరుపదును

శ.ర. లో, ''నీరుపదును = కొంచెపు పదును. సీ. ఘుమఘుమాధిక రుతాకుంఠితాంభోరాశి, నిజసాయకమునకు నీరుపదును. చంద్రా. ౧. ఆ.''— అని యున్నది.

సూ. ని. ''నీరుపదను = కొంచెపుఁ బదను. ఘుమఘుమా...నీరు పదను. చంద్రా. ౧-౫౧'' అన్నది.

'పదును'ను 'పదను'గా మార్చడము; 'కొంచెపుపదును'ను 'కొంచెపుఁ బదను' అని సంస్కరించడము; ఆ సీసపద్యమునకు సంఖ్యను చేర్చడము తప్ప 'నీరుపదును' విషయమున, శ.ర. కంటెను, సూ.ని. చెప్పిన విశేష మేమీ లేదు.

'కొంచెపుపదును' అన్ననూ, 'కొంచెపుఁబదను' అన్ననూ మొత్తము మీద అర్థ మొకటే. అసలా యర్థము తప్పు.

అంభోరాశి; నిజసాయకమునకు, నీరుపదును = కొంచెపుపదును — అనుటలో అర్థము లేదు. సముద్రము, బాణమునకు పదు నెన్నటికిని కాదు.

శ.ర. కర్త, సూ.ని. కర్తలుగూడా పద్యమును పూర్తిగా చదివి, అర్థము నాలోచించినట్లు లేదు.

పద్య మిది:—

"పెళపెళ రవభగ్న భీమకోదండంబు భృగురాము వింటికిఁ బిలుపుదీము
ఘుమఘుమాధిక రుతాకుంఠితాంభోరాశి నిజసాయకమునకు నీరుపదును
కిలకిలధ్వని విశృంఖల రావణశిరోధి యాత్మబాహా ప్రతాపాగ్ని కరణి
కహాకహోత్థ సుబాహుఘనశిరఃఖండంబు కరలాఘవమునకు బిరుదుఘంట."

ఈ పద్యమున, భీమకోదండము – పిలుపుదీముగను, అంభోరాశి – నీరుపదునుగను, రావణశిరోధి – అరణిగను, సుబాహుశిరఃఖండము – బిరుదు ఘంటగను రూపింపబడి యున్నవి. మరి, ఆ రూపకములలో నొకటియైన 'నీరుపదును'కు, 'కొంచెపుపదును' అని యర్థముచెప్పుట యెట్లు సరిపడును? సరిపడనే సరిపడదు.

కాబట్టి 'శ్రీరాముడు–తన సాయకమునకు, నీరుపదును పెట్టుటకుగా వాడిన, *ఉప్పునీటిగుంట – అంభోరాశి' అని అక్కడ అర్థము చెప్పవలెను.

---

* ఉక్కుతో చేయబడు కత్తులు, కటారులు మొదలగు ఆయుధములను కొలిమిలో కాచి వాదరలను చక్కగా చరిచి, వేడిమీదనే నీటిలో ముంచుదురు. (అందుకుగాను, కొలిమియొద్దనే చిన్న గుంటత్రవ్వి నీటితో నింపియుంతురు) అట్లు ముంచుటను 'నీరుతాపుట' అందురు. నీరుతాపుటచేత వాదరకు గట్టిదనము, పదును వచ్చును. నీరులో ముంచినట్లే, చమురులో ముంచియు, పదునుపెట్టుట కలదు. వేడివాదరమీద పొట్టేటికొమ్మును రాచి – దాని చమురుచేత పదునెక్కించు పద్ధతియు కలదు.

ఆయుధమునకు పదును (Temper) ఎక్కించుటను సంస్కృతమున "పాయనసంస్కార" మంటారు.– అది మూడువిధములు :

సుశ్రుత శల్యతంత్రములో, శస్త్రపాయనములు – (Tempering) వాటి ప్రయోజనములు—అను (40) ప్రకరణమున ఇట్లు చెప్పబడి యున్నది:—

"తేసాం పాయనా త్రివిధా క్షారోదక తైలేషు." (వ్యా.–పాయన మనగా త్రాగించుట. ఇది క్షారజలతైలము లనువానిచే 3 విధములు.)

నీరుపదునులోను, మంచినీటిపదునుకంటే, ఉప్పునీటిపదును శ్రేష్ఠమట.

ఆయుధములను కాచి నీటముంచి పదునుపెట్టుట కలదనుటకు,—

*"సరగ మిన్నునుకమ్మరి సంజకొలిమి
బెట్టుగాఁ గాఁచి ♦బంగారుచుట్టువాలు
పదనుపెట్టఁగఁ గొనిపోయి పట్టలేక
విడిచెననఁ బ్రొద్దు పడమటికడలి మునిఁగె" (యయాతి. ౨.౬౭.)

శ.ర. కర్త 'నీరుపదును' అనుపదము 'నీరెండ'వంటి దనుకొన్నాడు, అందువల్లనే 'కొంచెపుపదును' అని యర్థము చెప్పినాడు. కాని, నీరెండ= ఈరెండ, అని యున్నట్లు నీరుపదును = ఈరుపదును, అని లేదు. కావున శ.ర. చెప్పినయర్థము తప్పు.

'కొంచెపుఁబదను' అననక్కరలేదు. ఆగమశాస్త్ర మనిత్యము కావున 'కొంచెపుపదను' అన్నను తప్పుకాదు.

మరియు, 'పదును' అను పదమును 'పదను' అని మార్చవలసిన అక్కరయు లేదు. ఎందువల్లననగా—మిక్కటము, మిక్కుటము; నిలకడ, నిలుకడ; నడచు, నడుచు; చెఱచు, చెఱుచు; పఱచు, పఱుచు; అదరు,

---

* ఈ పద్యము, సూ.ని. లో 'కమ్మరి' క్రింద నున్నది.

♦ "చుట్టువాలు-అనగా, ఆయుధము. యయాతిగ్రంథకర్త ఆయుధమును బంగారుదిగా చెప్పుట తప్పు. మిశ్రమ(?)లోహమైన 'ఉక్కు'ను గాచి నీటిలో ముంచిన పదునుగలుగునుగాని, సహజలోహమైన బంగారునకు పదును రాదు. మెత్తదనమే వచ్చును." అని వీ. బ్ర. గారి ఆక్షేపము.

ఈ యాక్షేపము 'కమ్మరి' చేయదగినదిగాని 'కవి' చేయదగినది కాదు. కవిదృష్టి వేరు; కవిసృష్టి వేరు. అది కవితావాసనలేని కమ్మరులకు, కంసాలులకు అంతుపట్టునది కాదు. వీ.బ్ర. గారు, 'చుట్టువాలు = ఆయుధ' మన్నారు. తప్పు. 'చుట్టువాలనగా - చక్రముగాని —ఆయుధము కాదు.

రామాయణమునను, చంద్రికాపరిణయమునను బంగారుబాణములు కలవనియు, కవులు మదనుని పూవుటమ్ములకును పదును పట్టింతురనియు, కాబట్టి బ్రహ్మంగారి యాక్షేపము సరియైనది కాదనియు, శ్రీ యేలూరిపాటి రామభద్రయ్యగారి మండలింపు. (చూ. 7-7-1947 త్రిలిఙ్గ)

అదురు - అని, యనేకశబ్దములకు రెండు రూపములు కనబడుచున్నవి. నేఁడు వ్యవహారముననున్న రూపము 'పదును'గాని 'పదను' కాదు. ఇట్లే 'అదను' వ్యవహారమున 'అదును'గా మారియున్నది. అంతేకాదు. పిడుక, పిడుచ, పిడుత-వంటి కొన్ని ఉకారమధ్యరూపములు 'పిడక, పిడచ, పిడత—అని అకారమధ్యములుగా' పరిణామమును పొందియున్నవి. నిఘంటువు తన కాలమున వ్యవహారసిద్ధములైయున్న రూపములను గ్రహించుట ధర్మము; మర్యాద. ఆ మర్యాద నెరిగినవాఁడు కావుననే శ.ర. కర్త 'పదును' 'పదను' అన్న రెండు రూపములను గ్రహించినాఁడు.

ప్రామాణికుఁడైన ఆ నిఘంటునిర్మాత చూపిన త్రోవనుబోక, వేరు త్రోవ త్రొక్కుటలో గుణ మేమి?

'కొంచెపుపదును'ను, కొంచెపుఁబదను - అని దిద్దిన సూ. ని. 'నీరు పదను'ను - 'నీరుఁబదను' అని దిద్దకపోవు టేల?

## 2. నీరుకావి

శ.ర. లో "నీరుకావి = కొంచెమెఱుపు" అని యున్నది. అంతే కాదు; "నీరు = అల్పము (నీరుకావి. మొ.)" అనియు నున్నది.

'నీరుపదును'లో జరిగిన పొరపాటే, ఈ నీరుకావిలోను జరిగినది.

శ.ర. లో జరిగిన పొరపాటును, సూ.ని. యథాక్షరము వ్రాసికొన్నది. ప్రమాదము.

కావి-యనగా ఎఱ్ఱరంగు; ఎఱ్ఱనిగుడ్డ. అది, నీరుకావి; చెంగావి; చంద్రకావి; చందనకావి; పట్టెడకావి; కదంబకావి-అని పలుతెరంగులు.-

"వ—చందనకావులును పట్టెడకావులును జెంగావులును గదంబ కావులును...అను పేళ్ళుగల పుట్టంబులుగట్టుకొని" (ద్వాత్రింశిక. 3-206)

ఆ కావులలో, చెంగావి మొదలయినవి అద్దకపురంగులు. (చెంగావి లోను పాలచెంగావి; చిలువేరుచెంగావి అని దినుసుభేద మున్నది.)

'నీరుకావి' అద్దకపురంగు కాదు; చలినీట పలుమారు తడుపుటచేత, తెల్లనివస్త్రమునకు సహజముగనే యేర్పడు ఎఱ్ఱదనము. మనుచరిత్ర (3-71)లో,—

"బెడఁగారు నీర్కావిపింజతోఁడ"

అన్నచోట, శ్రీ. అనంతాచార్యులవారు "నీర్కావి=నీళ్లలో నానఁబెట్టియుండుటచేతఁ గొంచెము పెళుసుదాళుగల దోవతియొక్క" అని, టీక వ్రాసియున్నారు.

శ్రీనాథమహాకవి, యీ 'నీరుకావి'నే, 'సలిలకాషాయ' మన్నాఁడు.

1. "నిర్నాభి బిలముగా నెఱి వీఁగు బొజ్జపై
సలిలకాషాయవస్త్రము ధరించి" (కాశీ. 7-186)

2. "కసటుపోఁ దెలినీటఁ గడిగి యాఁటార్చిన
సలిలకాషాయవల్కలము గట్టి" (హర. 7-111)

3. "గన్నేరుఁ *బూచాయఁ గనుపట్టు జిలుఁగైన
సలిలకాషాయవస్త్రంబు గట్టి" (శృం. నై. 8-103)

"సలిల కాషాయవస్త్రంబు = నీర్కావిదోవతి" అని యర్థము చెప్పి, వే. వే. శాస్త్రిగారు, 'నీరుకావిని' గురించి యిట్లు వ్రాసినారు.

'నీరు = అల్పము—నీరుకావి' అని సీతారామాచార్యులవారు వ్రాసినారు. 'నీ రెండ' అను వ్యవహారముబట్టి వా రట్లు తలఁచియుందురు గావలయు. ఈ ప్రయోగముం జూడఁగా నీర్కావి శబ్దమునందును ♦నీరు-అనగా జలమనియే శ్రీనాథుని అభిప్రాయముగాఁ గానిపించుచున్నది. వస్త్రములకు నీటిచేతనే కావింబట్టించుట ప్రసిద్ధము. కావున నిట అల్పార్థ కల్పన మనావశ్యకము." శృం. నై. సర్వంకషావ్యాఖ్య.

పై పద్యమును, సూ.ని. 'గన్నేరు' అను పదముక్రింద చూపినది. శృం. నై. నుండి పద్యపాదము నెత్తి వ్రాసికొన్నదేగాని వ్యాఖ్యానమువంక కన్నెత్తి చూడలేదు. అందువల్ల నీరుకావితత్త్వము తెలియలేదు.

---

* ఇది వేదం-వారి పాఠము. ఈ పద్యపాదమునే శ్రీ ప్రభాకర శాస్త్రిగారు, క్రీడా.పీఠిక. (పు. 18)లో, 'ఁబూఁజాయ' అను పాఠముతో ఉదాహరించియున్నారు.

♦ "సర్వత్ర నీరును జలమయముగా జెప్పరాదు" అని వీ. బ్ర. గారి దొక వ్రాత. (12 మే 1947 త్రిలిఙ్గ)

అది యర్థము తెలియని వ్రాత. నీరు జలమేగాని జలమయము కాదు.

సూ.ని.కి యేల తెలియలేదోగాని 'నీరుకావి' యను పదము తెనుగు దేశమున ఆబాలగోపాలవిదితము.

కం. వీరేశలింగంపంతులుగారి 'సంధి'లో, బ్రాహ్మణు డొకడు 'నీరుకావిదోవతి' పఱచుకొని ఆ పంచెమీఁద శయనించును. అక్కడ 'నీరుకావి' అను మాటకు S.S.L C. (1949) Notes వ్రాసిన ముగ్గురుపండితులు.—

"నీరుకావి = తడిపితడిపి నీడలో నాఱవైచుచుండుటచే గలుగు నెఱ్ఱరంగు''అనియు, ఐదుగురు పండితులు, "సంతతము నీటియందు ముంచుటచేత ఎఱ్ఱరంగుదాల్చిన వస్త్రము'' అనియు అర్థము వ్రాసియున్నారు.

మరియొక విశేషము.—మడికి, ఆచారమునకు, నీరుకావి దోవతులేగాని, చెంగావి మొదలగు ముదకపు రంగుగుడ్డలు యోగ్యములుకావు. అది వైదిక సంప్రదాయము. అందువల్లనే, కం.వీ. పంతులుగారు ఆ బ్రాహ్మణార్థపు బ్రాహ్మణుని పంచె 'నీరుకావిపంచె'గా చెప్పినారు.

ప్రాచీన కవులెల్లరును ఈ యాచారమును గమనించినవారే.—

(1) "కన్నెచెంగల్వ పూవన్నెమించిన నీరు
కావిదోవతికట్టు కటిఁ దలిర్ప." (విక్ర. 7-143)

(2) "*కటిఁ బ్రాఁతముదుకనీర్కావిదోవతిపంచె
భ్రూమధ్యమున నూర్ధ్వపుండ్రకంబు'' (జై.భా. 7-191)

(3) "గన్నేరుఁబూఁజాయ కరమొప్ప నీర్కావి
మడుఁగుదోవతి పింజెవిడిచికట్టి" (క్రీడా. పు. 14)

(4) "నిద్దమైన మడుంగునీర్కావిదోవతి
కనకమేఖలతోడఁ గటి ఘటించి.'' (కాశీ. 1-39)

నిరంకుశోపాఖ్యానమున, వైదికియైన నిరంకుశుడు కాముకుడై శృంగారవేషమును ధరించు ఘట్టమున.—

(5) "వదులునీర్కావిదోవతులు కట్టుటమాని,
వలిపెంపుఁజల్వ దోవతులుగట్టు'' (2-16)

---

* ఇది వావిళ్ల వారిప్రతి పాఠము. "కటిమధ్యమున నీరుకావి" అని చి.ని. పాఠమట. సూ.ని. ఆ పాఠమును గ్రహించినది. కాని, వా.ప్ర. పాఠమే ఉచితతరము.

(6) "నీరుకావులుగట్టి నీళ్లు దర్భలచేత
సవ్యాప సవ్యముల్ చల్లువారు" (రామ స్తవరాజము 2-74)

మనుచరిత్రలో,- 'బెడఁగారు నీర్కావిపింజె' తోడనున్న బ్రాహ్మణుడును వైదికిరో.

(7) "గడితంపు నీర్కావిమడుఁగు దోవతికటీ
రస్ఫురత్పీతాంబరంబుగాఁగ" (వరాహ. ౯-౪౬)

ఈ 'నీర్కావిమడుగు దోవతి' కట్టిన యతడును వైదికిరో.

అడిదము సూరకవి వైదికులను వర్ణించుచు,—

(8) "ప్రాఁత నీరుంగావి పంచెలు ముప్కముల్
కనుపింపఁగా డొల్లుకచ్చగట్టి" (చాటువు)—అన్నాడు.

కాబట్టి ఆచారపరులైన వైదికులు ధరించు నీరుకావి దోవతులు రంగువేసినవి కావు.

ఒకమాట.—

సూ.ని. సూరకవి చాటువును 'డొల్లు' అను పదముక్రింద నుదాహరించియు,- 'నీరుంగావి' అను రూపమును గ్రహించలేదు. కారణమేమో ?

శ.ర. లో, 'చేపట్టుకుంచ' మని యుండఁగా ఆ రూపము తప్పని, 'చేపట్టుఁగుంచము'గా దిద్దిన, సూ.ని. 'నీరుకావి'ని - 'నీరుఁగావి'గా దిద్దకుండుట సరికాదుగదా! (చూ. చేపట్టుకుంచము)

## 3. చాఱపప్పు

శ.ర. లో "చాఱపప్పు = జీడిమామిడి గింజలోనిపప్పు" అని యున్నది. దానినిబట్టియే కాబోలు, శ్రీ కొమాండూరు అనంతాచార్యులవారు మనుచరిత్ర (4-14) టీకలో *"చాఱపప్పున్ = జీడిమామిడిపప్పును" అని వ్రాసినారు. తప్పు.

---

* వావిళ్లవారి 'మను' టీకలోను,- "చాఱపప్పున్ = ముంతమామిడి పప్పును" అనియే యున్నది. అక్కడ కుండలీకరణమున— 'అరణ్యములయందు చాఱచెట్టనునది గలదు. దాని కాయలనుండి దీయుపప్పు జీడిపప్పుకంటెఁ జిన్నదిగను రుచ్యముగా నుండును. జీడిపప్పుగాఁ జెప్పుటకుఁ గారణము మృగ్యము' అనియు నున్నది.

(ప్రామాణిక గ్రంథములలోని ప్రమాదములు, పెద్దపెద్ద పండితులను గూడా పెడత్రోవలకు తార్చునుగదా!)

చాఅపప్పు; జీడిమామిడిపప్పు; భిన్నవస్తువులు.—

"వ. సెనగపప్పు బొరుగుపప్పు సారపప్పు జీడిపప్పు బాదంగిపలుకులు" (హంస. 1-105)

"చాఅపప్పు The pulp or inside of a sort of small filberts. జీడిమామిడిపప్పు = ముంతమామిడిపప్పు. Cushoonuts."
(బ్రౌణ్యము)

శ.ర. కర్త, బ్రౌణ్యమును సరిగా చూచియున్నచో, ఈ తప్పు జరిగియుండెడిది కాదుగదా? సూ.ని., శ.ర. మీద ఆధారపడక స్వయముగా విచారించి "చాఅపప్పు = ప్రియాలపుఁబప్పు" అని సరియైన యర్థమును వ్రాసినది. సంతసింపదగిన సంగతి.

## 4. గుజ్జెనగూడు

"గుజ్జెనగూళ్లు. (గుజ్జు + ఎన + కూళ్లు) 1. బాలక్రీడావిశేషము. 2. బాలిక లాడుకొనునప్పుడు గురుగులతో వండిన వంటకము" అని, శ.ర.

సూ.ని. యును, శ.ర. చెప్పిన యర్థములనే చెప్పి, అందు కుదాహరణలనుకూడా చూపినది. కాని 'గుజ్జెనగూటి'ని గూర్చి తానేమీ స్వయముగా ఆలోచించలేదు.

అసలు గుజ్జెనగూడు, 'కూడు' గాని ఆట కాదు. నెలలపిల్లలు తినుటకనువగునట్లు గుజ్జువలె మెత్తగా తయారుచేయు కూటికి 'గుజ్జెనగూడ'ని పేరు. పొరపాటున ఎసరెక్కువై అన్నము కొంచెము మెత్తనైనయెడల 'ఏమియీవేళ గుజ్జెనగూడు చేశారు' అనడ మిప్పటికిని వాడుకలో నున్నది.

ముందటిదినములలో, తల్లులు పసిపిల్లలకు ఉప్పు, వాము వేసి గుజ్జువలె అన్నము మెత్తగా (= గుజ్జెనగూడు) వండి, పెట్టెడివారు.

ఆ కృత్యమునే (తాము తల్లులైనట్లును - బొమ్మలు తమ పిల్లలైనట్లును, ఆ పిల్లలకు తాము గుజ్జెనగూళ్లు వండిపెట్టినట్లును) అనుకరించి బాలికలాడుకొందురు. ఆ యాటకే 'గుజ్జెనగూళ్లు' అని పేరు.

బొమ్మలు పెట్టి ఆడుకొనునపుడు, గుజ్జెనగూళ్లను బాలికలు వండినను, వండిన ట్లభినయించినను, అది క్రీడయే. 'గుజ్జెనగూళ్లు' అను క్రీడావిశేష మదే. తద్భిన్నమయినది మరియొకటి లేదు.

కాబట్టి, శ.ర. సూ.ని. కూడా, బాలక్రీడావిశేష మొక యర్థముగాను, బొమ్మలతో ఆడుకొను బాలికలు వంటచేయుట - ఆ వంటకము, మరియొక అర్థముగాను చెప్పుట పొరపాటు. గుజ్జెనగూడు 1. (ఏ. వ.) నెలల పిల్లలు తినుటకు తగినట్లు గుజ్జువలె మెత్తగావండెడి యన్నము. 2. (బ. వ.) తాము తల్లులైనట్లును, బిడ్డలకు గుజ్జెనగూళ్లు వండిపెట్టుచున్నట్లును బాలిక లాడుకొను ఆట.' అని, నిఘంటువు స్పష్టముగా వ్రాయవలెను.

శ.ర. కర్త గుజ్జెనగూళ్లు, ఏ రకపు బాలక్రీడయో వివరింపనందున, గూళ్లు = (పిట్ట) గూండ్లు అనుకొని అది, 'గుజ్జెనగూళ్లను కట్టుట' యను క్రీడగా కవిత్వము చెప్పుటయు నేడు జరుగుచున్నది.

పసిబిడ్డలకు గుజ్జెనగూళ్లు పెట్టు-అలవాటు పూర్వము కలదనుటను ఈ క్రింది రచన చక్కగా తెలుపుచున్నది.

రగడ. "చిరుదేంట్లకొసఁగె, గుజ్జెనగూళ్లు గొజ్జంగ" (మను. 3-84)

ఈ క్రింది రచనలు 'గుజ్జెనగూళ్ల' ఆటలను దెలుపునవి.

1. "పేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు
నబలలతోడ వియ్యంబు లందు,
గుజ్జెనగూళ్లను గొమరొప్ప వండించి
చెలులకుఁ బెట్టించుఁ జెలువు మెరసి."



(భాగ. 10. పూ. 1688)

2. "మతి యాడియాడి; తామర కెంపుఁ బీఁటపై
నోమనగుంటల నుజ్జగించి,
పాఁపమేపరిపచ్చ పన్నారుఁబోవులఁ
గులుకు గుజ్జనగూళ్లు గుడుచు టుడిగి." (యయా. 3-151)

బాలికలు వియ్యములందుట యెట్టి క్రీడావిశేషమో, గుజ్జెనగూళ్లు వండుట, వండించుట, చెలులకు పెట్టించుట, తాము తినుటయు నట్టి క్రీడావిశేషమే. బాలక్రీడలలో మూడువంతు లిట్టి యనుకరణములే.

'గుజ్జన' అనుటయు కలదు.—

"గుజ్జన Infantile, childish గుజ్జనగూడు. Doll's dinners. Children playing at cookery" (బ్రౌను.)

## 5. నారికురుపు ; నాడీవ్రణము

శ.ర. లో, "నారికురుపు = సెలపుండు, నాడీవ్రణము" అనియు, "నాడి = నారికురుపు" అనియు నున్నది.

సూ. ని. లో,— "నారికురుపు = నాడీవ్రణము, నరముమీఁద వేసెడి కురుపు" అనియు,— "నాడి = నారికురుపు" అనియు నున్నది.

శ.ర. నారికురుపును, నాడీవ్రణమనుట పొరపాటు.

సూ.ని. ఆ పొరపాటు నట్లే గ్రహించుట ప్రమాదము.

అది యట్లుండగా, శ.ర. 'నారికురు పంటే - సెలపుండు' అని చెప్పుచున్నను సూ. ని. "నరముమీఁద వేసెడి కురుపు" అనుట తప్పు.

సూ.ని. నాడీవ్రణము - నెరుగదు సరేగదా! నారికురుపునుగూడా యెరుగదన్నమాట!!

నారికురుపు, సెలపుండు - అవునుగాని, నాడీవ్రణము కాదు. నారికురుపు, నాడీవ్రణము - అనునవి భిన్నజాతివ్రణములు.

### 'నా రి కు రు పు'

'నారికురుపు' అను పదానికి 'నారిగల కురుపు' అని యర్థముగాని, 'నరముమీఁద వేసెడి కురుపు' అని కాదు. నారికురుపులో, నరమువలె సన్నని - ఇంచుమించు గజము పొడువుగల పదార్థమొకటి యుండును. అది-వింటి 'నారి'వలె, సన్నగను - పొడుగుగను ఉండుటవల్ల కాఁబోలు, దాని పేరు 'నారి' అన్నారు. ఆ నారి పూర్తిగా బయటపడువరకును కురుపుమానదు. అది-దినముల పేరట-తిన్న తిన్నగా-కొంచెము కొంచెముగా ఇవతలికి వచ్చునే గాని, ఒక్కమారుగా బయటపడదు. మనము లాగి తీయగూడదు. ఏ కారణముచేతనైనను 'నారి' నడుమ తెగినా, కురుపు సెలవేసి, భరింపరాని బాధను కలిగించును. ఈ వ్రణమువలన అంగవైకల్యము కలుగుటయు కలదు.

ఇంగ్లీషువైద్యులు, ఆయుర్వేదవైద్యులుకూడా, ఆ 'నారి'ని ఒక పురుగుగా నిర్ణయించినారు. ఇంగ్లీషులో నారిని, 'Guinea worm' అంటారు.

బ్రౌను,- "తంతికురుపు or నారిపుండు. The disease of having a worm in the leg అని" తెలిపి, నారికురుపునుగూర్చి యిట్లు వ్రాసియున్నాడు.

"నారికురుపు The guinea worm that breeds in the flesh of the leg, and is not extracted without great difficulty and danger"

నారికురుపును సంస్కృతములో 'స్నాయుకము' అంటారు. (శ.ర. లో లేదు.) స్నాయుకమునుగూర్చి 'యోగరత్నాకరము'లో, ఇట్లు చెప్పబడియున్నది.

"శాఖాసు కుపితోదోషశ్శోథంకృత్వా విసర్పవత్,
భినత్తి తత్ క్షతే తత్రసోష్మా స్నాయుం విశోష్యచ.
కుర్యాత్తంతు నిభంజీవం వృత్తం శ్వేతద్యుతిం బహిః,
శనైశ్శనైః క్షతాద్యాతి ఛేదాత్కోపముపైతి సః.
తత్పాతాచ్ఛోఫశాంతి స్స్యాత్, పునస్థానాంతరే భవేత్,
స స్నాయుకేతి విఖ్యాతః క్రియోక్తాతు విసర్పవత్.
బాహ్వోర్యది ప్రమాదేన జంఘయోస్త్రుట్యతి క్వచిత్,
సంకోచం ఖంజతాంచైవ ఛిన్నతంతుః కరోత్యసౌ".

'నాడీవ్రణము'

నాడి, అనగా-గొట్టము. లోలోపలనే వ్యాపించి, శరీరమును నాడివలె చేయునది నాడీవ్రణము.

"యశ్శోఫమామ మతిపక్వముపేక్షతేజ్ఞో
యోవావ్రణం ప్రచురపూయ మసాధు వృత్తః,
అభ్యంతరం ప్రవిశతి ప్రవిదార్య తస్య
స్థానాని పూర్వ విహితానితతః సపూయః
తస్యాతిమాత్ర గమనాద్గతి రిష్యతే తు
నాడీవ యద్వహతి తేన మతాతు నాడీ."—యోగరత్నాకరము.

"నాడిః (డీ) A fistulous sore, fistula, sinus. నాడీ వ్రణః"—"Sinus, an ulcer, a fistula" అని 'ఆప్టే' నిఘంటువులోను,- "నారీవ్రణము guinea worm నారికురుపు. తెల్లని దారమువలె 'నారి' బయలువెడలెడి యొకవిధమయిన కురుపు" అని వస్తుగుణదీపికలోను, తెలుపబడి యున్నది.

కావున "నారికుఱుపు = నాడీవ్రణము" అనుటయు, నారికుఱుపు-అంటే నరముమీద వేసెడి కుఱుపు అని అర్థముచెప్పుటయు సరికాదు.

## 6. తలమాటు

శ.ర. "తలమాటు = చేటు, నాశము" అని యర్థముచెప్పి,—

"అలఘు రఘువంశమునకుఁ,
దలమాటించుకయులేమి తథ్యముగా" (నిర్వ. ౯ ఆ.)

అను ప్రయోగముచూపినది.

సూ. ని. ఆ యర్థమునే, "భావినాశము, రాఁబోవుచేటు" అను మాటలతో చెప్పి, ఆ ప్రయోగమునే పఠించినది.

కాని, 'తలమాటు, అనుపదముకు మరియొక అర్థముకూడా ఉన్నది. చూడండి. భోజరాజీయకర్త యెట్లు వాడినాడో.

వ. "ఆ కడిందిరక్కసుండు...నీవేమి అంధకాసురభయంకరుఁడగు శంకరుండవో...వృత్రవినాశుండగు పాకశాసనుండవో, తలమాటుచాలని మనుజబాలుండవు...నెమ్మదింబొమ్ము" (5-118)

ఇందు, 'తలమాటుచాలని = తగినంత రక్షణలేని, మనుజబాలుడ" వన్న యర్థము స్ఫురించుచున్నది. (సరియైన అర్థమేమో యింకను విచారించవలెను.)

సూ.ని. మీదనే ఆధారపడువాడు, "తలమాటు చాలని = భావి నాశముచాలని, మనుజబాలుడవు" అనియే అర్థముచేసికొనునుగదా! ప్రమాద హేతువు కాదా?

సూ.ని. కేవలము-శ.ర. మీదనే ఆధారపడుటయు, భోజరాజీయము వంటి ప్రసిద్ధగ్రంథమునుగూడా సరిగా చదువకపోవుటయు న్యాయమేనా?

# 7. చన్ను

సూ.ని. "చన్ను = స్తన్యము, (ఇది లక్షణచే వచ్చిన యర్థము)" అన్నది. సరికాదు.

(పసిబిడ్డకు) - చన్నిచ్చు (= పాలిచ్చు) అన్న పలుకుబడిలోనేకాని విడిగా 'చన్ను'కు స్తన్యము (=చనుబాలు) అన్నయర్థము లేదు.

(1) "చెట్టుపల్ నెఱయుని చిలుకబోదలఁ బట్టితెచ్చి బిడ్డలుగఁ జన్నిచ్చి యిచ్చి." (నిర్వ. 8-85)

ఇందు, బిడ్డలను చెప్పుటచేత, చన్నిచ్చి = స్తన్యమిచ్చి, అని ప్రకరణమునుబట్టి యర్థము.

(2) "వనితా ముట్టకుమమ్మ, చన్నుగుడుపక వల్దమ్మ నీచన్ను మా తనయుం డొల్లఁడు" (భాగ. 10 పూ. 228)

ఇందును తనయసంబంధముచేతనే, 'నీచన్ను' అంటే, 'నీ స్తన్యము' అని యర్థము.

(3) "ఆవులు చన్నియ్యవయ్యెఁ గ్రేపులకు." (రం. రా. అయో.)

అంటే, ఆవులు దూడలను పాలుత్రాగనియ్యలేదని యర్థము. క్రేపులను చెప్పటంబట్టియే - చన్నియ్యవయ్యె-నన్న క్రియ కా యర్థము సిద్ధించినది.

ఆవు క్రేపుకు చన్నియ్యలే-దని యున్నదిగదా, యని - (ఆవు నాకు పాలియ్యలేదనడానికి మారుగా)— 'ఆవు నాకు చన్నియ్యలేదు' అనగూడదు. ఆముదములో చనుబాలు వేసి రంగరించు; నేపాళములు చనుబాలతో శుద్ధి చేయవలెను - అనవలసినచోట్ల, చనుబాలకుబదులు 'చన్ను' వాడవచ్చునా? వాడగూడదు. ఎందువల్ల? 'చన్ను'కు - 'చనుబాలు' అను అర్థము లేనందువల్లనే.

కంటిలోకి కొంచెము చనుబాలు కావలె ననడానికి మారుగా 'కంటిలోకి...చన్ను కావలె ననదగునా? అంటే, వెంటనే దవడశుద్ధి అవుతుంది, ఆదిరైనపిమ్మట - అమ్మా నేనా పదాన్ని (సూ.ని. ప్రకారము) లక్షణార్థమున వాడినా-నని చెప్పికొన్నను ప్రయోజనము కున్నగదా?

ఎందుకు విస్తరము. "చన్ను = స్తన్యము" అనుట తప్పు. అట్టి యర్థము, శ. ర. లోను లేదు; ప్రాణ్యమునను లేదు. చెప్పవలసిన విధ మేమంటే;

చన్నిచ్చు-అను పలుకుబడిని మూలపదములలో చూపి, ఇది శబ్దపల్లవ ధాతువని చెప్పి, యీ ధాతువున, చన్ను = స్తన్యము, ఇది లక్షణచేతవచ్చిన యర్థము అని వివరించవలె. అంతేగాని, ఊరక 'చన్ను = స్తన్యము' అని వ్రాయగూడదు.

## 8. కంపరము

శ.ర లో-"కంపరము = పాడె, ఖాటి" అని యున్నది. అందువల్ల, 'గౌరన హరిశ్చంద్ర'లో, కాలకౌశికుని పెండ్లాము రూపురేఖలు వర్ణించు ఘట్టమున,—

"మెదుకపట్టిన తల మెడ గండమాల
బుఱ్ఱముక్కును లొట్టపోయిన కన్ను
వెఱ్ఱిచూపును దెగి వ్రేలాడు చెవులు
మిడిపండ్లు చెక్కిటిమీఁది పుల్పిరియుఁ
బడి వ్రేలుచన్నులు బడబాకినోరు
[1]రోటువోయినచేయి, రొమ్ముకంపరము" (పుట. 172)

అన్నచోట, వే. వే, శాస్త్రిగారు, (శ.ర. ప్రకారము),

"కంపరము = శవవాహనము"

అని, లఘుటీక వ్రాసినారు. పొరపాటు. 'రొమ్ము శవవాహనము' అంటే అర్థమేమి? ఉత్తమకవియైన గౌరన,—

'రొమ్ము శవవాహనము'—'రొమ్ము పాడె'

అను నర్థముతో ఆ రచన చేసియుండునని, ఆంధ్రమల్లినాథు లెట్లనుకొనిరో! ఎట్లో అనుకొన్నారు; ఆచర్చ మనకెందుకు? మొత్తముమీద [2]ఆటీక తప్పు.

---

1. శ.ర. కర్త 'రోటువోవు' అను పదముక్రింద ఈ ద్విపద నుదాహరించియు 'కంపరము' క్రింద చూపడు. కారణ మేమనుకొందాము?

2. ఇట్టితప్పు లీ లఘుటీకలో చాలాఉన్నవి. (చూడండి: 'గౌరన హరిశ్చంద్ర - లఘుటిప్పణము.')

ఆ ప్రకరణమున 'కంపరము'నకు వణకు అని యర్థము. 'కంపము' అన్న యర్థముననే, *'కంపరము' గుంటూరు - నెల్లూరు, మండలములలో నున్నది. "పామును చూడగానే వొళ్లు కంపరమెత్తినది" ఇత్యాదిగ వ్యవహారము. కొలకాశికుని యిల్లాలికి, అన్ని యవలక్షణములతోపాటు(ఒక) రొమ్మునకు వణకురోగ మున్నట్టు వర్ణించినాడు, గౌరనమహాకవి: చతురతర రచన. ఆ రచనాచాతుర్యము నర్థముచేసికొనక, ఆ యింతి రొమ్మునకు విద్దూగముగా నొకపెద్ద 'శవవాహనము' నంటగట్టి, రసాభాసము చేసినారు, ♦లఘుటీకాకర్తలు.

శ.ర. కర్త, గౌరనరచనలోని 'కంపరము' నెరిగియు, తన గ్రంథమున చూపకపోవుట, గొప్ప పొరపాటన్నది యిక్కడ ప్రధానాంశము.

ఆ పొరపాటు సూ.ని. లోనైనా సరిచేయబడెనా? లేదు. సూ.ని. ఆ శ.ర. లోని 'పాడె-ఖాటీ'లనే ముందువెనుకలుచేసి, "ఖాటి-పాడె" అని యెత్తి వ్రాసికొన్నది. మరి విశేషమే మనగా 'పాడె'కు అర్థము తెలియని వారికొరకు కాబోలు ఒక 'శవవాహనము'నుకూడా అక్కడ చేర్చినది.

అంతేగాని, సూ.ని.లో 'కంపరము' నకు 'వణకు' అను అర్థమూ లేదు; అందుకు గౌ. హరి. ప్రయోగమునూ లేదు. ఆ సూ.ని. గౌ.హరి. ను కడగంటనైనను చూచి యుండదు. శబ్దములను అర్థములను, ఆ యా నిఘంటువులనుండి యెత్తి వ్రాసికొనుటేగాని, గ్రంథములను స్వయముగా చదివి, సంతరించు అలవాటు సూ.ని. కి చాలా తక్కువయని యింతకు ముందు నేను తెలిపియున్నానుగదా!

---

* ఆంధ్ర వారపత్రిక (1948 ఫిబ్ర. 18)లో,—'దేవుడు వరమిస్తే' అను కథానికలో, ఈరంకి వెంకటరావుగారు,— "ఆమె తన మరణానంతరం అనుభవించే బాధ తలుచుకుంటే ఆతనికి కంపరమెత్తింది"అన్నారు.

ఆంగీరస కార్తికభారతిలో 'వన్ సుమోరు' అనుకథలో,— "అతని శరీరం నఖశిఖపర్యంతం కంపరంపుచ్చుకుంది" అని యున్నది.

♦ ఆ టీక వేంకటరాయశాస్త్రిగారి సొంతము కాదని నా యభిప్రాయము.

ఆ యెత్తిత్రవాసికొనడములోను సమగ్రత లేదు సుమండీ; ఉన్న రెండు మూఁడు నిఘంటువులనైనను ఒక్కమాటు విప్పిచూచు ఓపికయును లేదు. చూడండి. ఆంధ్రవాచస్పత్యములో,—

'కంపరము = వడఁకునది, వేపథువు''

అనియున్నది. తనకంటె ముందు పుట్టినదీ : చక్కగా ప్రచారములో నున్నదీకదా ఆ కోశము; దానిని తాను తిలకింపకపోవు టేల? ఒక విశేషము:—

కంపరము, 'పాడె'యను నర్థమున, శ.ర. లో దేశ్యమని యున్నది. వేపథువు, అనునర్థమున ఆం. వా. లో, తత్సమము, అని యున్నది. సంస్కృతనిఘంటువులలో 'కంపర' శబ్దము కనబడదు. కాని తత్సమ చంద్రికలో,— 'కంప్రము'నకు రూపాంతరము 'కంపరము' అని యున్నది. (చూ. పుట. ౪౨౧)

## 9. అంటుపేను ; అంటుపోగులు

శ.ర. లో ''అంటుపేను = ఒక దినుసుపేను'' అని యున్నది.

దానిక్రిందనే, ''అంటుపోగులు = చెవినంటియుండెడి పురుషుల కర్ణభూషణము'' అని యున్నది.

సూ.ని. ఆ రెండుపదములను ఆవరుసలోనే గ్రహించి, అర్థమును వివరించుటలోమాత్రము - ఎందువల్లనో, ఇట్లు వినిమయము కావించినది.

''అంటుపేను = తలనంటియుండు చిన్నపేను,— అంటుపోగులు = చెవులకుపెట్టుకొను ఒక విధమగు పోగులు.''

సూ.ని. చేసిన యీ కుండమార్పు సరియైనది కాదు. ఏమంటారా,

డొల్లుపోగులు; అంటుపోగులు, అని పోగులు రెండువిధాలు. అంటు పోగులు, చెవికంటుకొని యుండును. ''అంటుపోగులు - Earrings that fit close.'' (బ్రౌను) డొల్లుపోగులు, ఆకృతిచేత పెద్దవై - చెవి కంటుకొని యుండక వ్రేలాడుచుండును. ఈ భేదము తెలియుటకే, పోగులకు 'అంటు' 'డొల్లు' అను విశేషణము లేర్పడినవి.

డొల్లుపోగులు కావ్యములలోను, ఉన్నవి.—

"అలవడు చల్వదోవతి యొయారపు గందపుఁబూఁత, డొల్లుపో
గులు" (హంస. ౧-౨౩౨)

అంటుపోగు లన్న యర్థమున నే 'తమ్మంట్లు' అనుపద మొకటి యున్నది. (తమ్మె + అంట్లు) తమ్మంట్లు = చెవితమ్మెల కంటుకొని యుండునవి, అనియే యౌగికార్థము.

"పునుక తమ్మంటులఁ బొలుచువీనులవారు
నొసలమిక్కిలిచూపు లెసఁగువారు"(పాండు. 1-165)

అంటుపోగులను (= తమ్మంటులను) ఊరక 'అంటుజోడు' అనికూడా అంటారు. అన్నియు, చెవికి అంటుకొని యుండుటనుబట్టి పుట్టినపదములే.

కాబట్టి, అంటుపోగులకు శ.ర. చెప్పినదే సరియైన అర్థము. దానిని సూ.ని. మార్చుట తప్పు.

ఇక 'అంటుపేను' సంగతి :

'అంటు'; 'పేను' భిన్నపదములు. పేనురూపమున మూడు-అవస్థలు.

1. ఈరు (గ్రుడ్డు)

2. అంటు (పిల్ల) ఇది తలకంటుకొనియె యుండును. అందువల్ల నే దానికా పేరువచ్చినది.

3. పేను (పెద్దది)

"ఎలయుసీత్కారములతోడ నీళ్లు గ్రుక్కి *యంటుసంటులుపరికించి యంట్లఁబొడిచె, గోరుముక్కల దిగదువ్వి తూరుపెత్తి, నెఱులఁగలిగిన పేల నన్నింటిఁ దిగిచె." (పాండు. 3-30)

'అంటు' అనుపదమును శ.ర. గుర్తించలేదు. అందువల్ల నే 'అంటుపేను' అనుట, అంటుపేను; ఈరుపేను, అన నక్కరలేదనియు. అంటు; ఈరు; అనవచ్చుననియు పై పద్యమువలన స్పష్టపడుచుండలేదా!

"చెలఁగి యీ ర్పేను మశకంబు చీమ నల్లి,
యల్పమనుబుద్ధి హింస సేయంగఁదగదు" (కాశీ. 6-89)

అన్నచోట, ఈరు; పేను, అని భేదము.

---

* 'అంట్లుసంట్లునుబరికించి యంట్లఁబొడిచి' అని శ.ర. పాఠము. 'అంటుసొంటులు' అని, సూ.ని. సవరణ.

పేలలో, అంటియుండు పేలు; అంటుకొనక-వ్రేలాడుచుండు పేలు, అని యిరుతెరగులు లేవు. కనుక నిఘంటువు 'అంటుపేను' అను పదమును గ్రహించుటయు, 'తలనంటియుండుపేను' అని యర్థముచెప్పుటయు సరి కాదు. ఒకదినుసుపేను అనుటయును సరికాదు.

## 10. ఈరుపెన ; చిక్కంటి

ఈ రెండును చాలా విచిత్రమైన శబ్దములు. వీటి చరిత్రను సూ.ని. విచారించి తెలుపవలసినది; తెలుపలేదు. పైగా అపోహలు చేసినది. ఎలాగంటే,—

"ఈరుపెన = ఈళ్లనీర్చెడి దువ్వెన"

అని యర్థముచెప్పి, ఈరుపెన ఈరునుండిపుట్టిన పదమని సూచించినది.

అట్లే, "చిక్కంటి (= చిక్కంటు = చిక్కంటె) = తలచిక్కు తీసికొనెడి దువ్వెన" అని యర్థముచెప్పి, ఆ పదమునకు 'చిక్కు' మూలపద మని తెలిపినది.

ఈరుపెనకు 'ఈరు'; చిక్కంటుకు 'చిక్కు' జనకపదములు కావు. అవి ప్రత్యేకపదములు.

ఈరుపెన, ఈళ్లనేకాదు పేలనుగూడా లాగివేస్తుంది. "ఈరుపెన or ఈర్పెన. A comb, for extracting the nits or lice" (బ్రౌను)

'చిక్కంట' చిక్కునేకాదు; అంటనుగూడా తీసివేస్తుంది. కాబట్టి, సూ.ని. చెప్పిన అర్థమూ - వ్యుత్పత్తికూడా సరియైనవి కావు.

తత్త్వమేమంటే - *ఈరుపెన యొక్క మొదటిరూపము, 'ఈరు పేను'. (ఈరు + పేను) ఈరు, పేను, తీయునట్టి సాధనమని భావము. ఈరుపేను కాలక్రమమున 'ఈరుపెన; ఈర్పెన' అయినది. అట్లే, 'చిక్కంటి' యొక్క మొదటిరూపము 'చిక్కంట'. (చిక్కు + అంట) చిక్కును, అంటను తీసివేయు సాధనమని భావము. అంట = అడ.

---

* ప్రౌ. వ్యా. లో 'ఈర్పెన; ఉప్పెన; కందెన; దువ్వెన; వడ్డెన; కృదంతము' లని యున్నది.

చిక్కంట కాలక్రమమున చిక్కంటు; చిక్కంటె; చిక్కంటి; చిక్కట్టు అయి, చికోల కూడా అయినది.

చిక్కంటుకు మూడు నాలుగు పండ్లకంటె యెక్కువ ఉండవు. (అది యినుముతోను, ఇత్తడితోనుగూడా చేయబడును) అందువల్లనే ఒక కవి దానిని త్రిశూలముతో పోల్చినాడు.

"తనకు జలంధరాంధకహారిబాహురిం
ఖత్రిశూలంబు చిక్కంటుగాఁగ" (చమ. మం. 2-31)

సూ. ని. లో. చిక్కట్టు; చికోల, అను రూపములు లేవు. ఆ రెండు రూపములనుగూడా చూపుచూ, బ్రౌను, చిక్కంటురూపము నిట్లు వివరించినాడు.

"A large comb with only three or four teeth and often made of iron: also called చిక్కట్టు and చికోల."

ఈరు, పేను, చిక్కు, అంట—అను పదములకు జన్యజనకభావము లేదనియు, అవి స్వతంత్రశబ్దములుగా నుండియు అట్లు ఏకపదత్వమును పొందిన విచిత్రశబ్దములనియు ఫలితార్థము.

## 11. గుణితము

శ. ర. లో "గుణితము సం. వి. అ. న. హల్లులతో అచ్చులను హల్లులను జేర్చిచెప్పుట. విణ. గుణింపఁబడినది" అని యున్నది.

సూ. ని. లో—"గుణితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. హెచ్చవేయబడినది. (సంఖ్య). ౨. హెచ్చింపఁబడినది. అధికముగాఁ జేయఁబడినది" అనిమాత్రమే యున్నది.

శ.ర. చెప్పిన విశేష్యార్థమును, సూ.ని. చెప్పక వదలివేయుటకు కారణమేమో తెలియదు. అట్లు గుణితమును విశేష్యముగా గ్రహించుటయు, ఆ యర్థము చెప్పటయు తప్పని సూ.ని. తలచెను కాబోలు! మరి సూచనగానైనను తెలుపకపోవు టేల?

అంత సులభముగా త్రోసివేయుటకు శ.ర. వ్రాత నిరాధారపువ్రాత కాదే.

1. 'గిడుగు'వారు పరిష్కరించిన అప్పకవీయము (వావిళ్ల-వారి ప్రతి)లో "క కారముతోడ నచ్చులుగూర్చి గుణించెడి విధము"ను చెప్పు పట్టున (పుట. 51) "ఇది స్వరగుణితము" అని చెప్పబడియున్నది.

2. వే. వే. శాస్త్రిగారు, పారిజాతాపహరణములో,—

"శరధిక్రోడనివేశ, శార్ఙ్గధర, శిష్టధ్యేయ శీతాంశుభా
స్కరనేత్రద్వయ, శుభ్రపంకరుహభాస్వన్నాభ, శూరాన్వయా."
(2-56)

అను పద్యములో—"గుణితక్రమమున్న" దన్నారు.

3. బ్రౌణ్యములో, "గుణింతము. గుణితము. Multiplication, Spelling." అని యున్నది.

4. ఇటీవల శ్రీ వేదము-సూర్యనారాయణశాస్త్రిగారు వ్రాసిన, శ్రీ వావిళ్ల-వారు ప్రకటించిన - సంస్కృతవ్యాకరణము పీఠికలో,—"అక్షర గుణితము దెలిసిన ప్రతి బాలుఁడును...అర్థము చేసికొనునట్లు...వ్రాయఁబడి యున్నది." అని, 'గుణితము', గుణింతమను నర్థమున ప్రయుక్తమై యున్నది.

5. సర్వజిత్ పుష్య భారతిలో, శ్రీ కాశీభట్ల కృష్ణరాయశాస్త్రి గారు-"ఈ వడిశబ్దము గుణితస్వీకృతాక్షరాకృతులకు నామకరణ మయ్యెను" అన్నారు.

ఇట్లు ప్రామాణికులైన పూర్వనిఘంటుకర్తలు చెప్పినట్టియు, ప్రాచీ నార్వాచీన లాక్షణికవిద్వద్వరేణ్యు లంగీకరించినట్టియు శబ్దార్థములను, సూ.ని. త్రోసిరాజనుట తగునా?

## 12. కలాపము

'కలాప' శబ్దమునకు, శ. ర. లో, 1. ఇరువదియైదు పేటలుగల స్త్రీల యొడ్డాణము. 2. నెమలిపురి. 3. అమ్ములపొది. 4. భూషణము. 5. సమూహము. అను నర్థములున్నవి.

సూ.ని.లో ౧. సమూహము. ౨. మయూరపింఛము. ౩. భూషణము, ౪. తూణము. ౫. వ్యాకరణభేదము. ౬. మొలనూలు-అనే యర్థము లున్నవి.

కాని, సారంగధరచరిత్రలో, "అయ్యిలాపతి కర్ణకలాపంబులుగాఁ గొన్ని దురాలాపంబులువల్కి౯న." (3-162) అన్నచోటి 'కలాపంబు'లకు ఆ రెండు నిఘంటువులు చెప్పిన అర్థములలో ఒక్కటియు సరిపడదు. జిజ్ఞాసువుగతి యేమి?

కర్ణకలాపంబులుగా, అంటే, చెవులకు ములుకులుగా, అనియర్థము. ఆప్టి-నిఘంటువులో "కలాపః. An arrow" అనియున్నది. (వివరములకు, చూ. 'జితకౌశి' పుట, ౪౬౭)

సూ. ని. సారంగధరచరిత్రను, ఆప్టినిఘంటువును గూడా సరిగా చూడలేదన్నమాట.

## 13. చనవరి

శ.ర. లో ఉన్నప్రకారమే, సూ. ని. యును, "చనవరి = చనవు గలవాఁడు." (ఆప్తుడు) అని, వ్రాసినది.

కాని, ఆ పదమునకు - 'చనవు + అరి = చనవుకలవాఁడు' అనే యౌగికార్థమును, ఒక పెద్ద నిఘంటువుచెప్ప నక్కరలేదు. ఆ యర్థమును తెలిసికొనుటకు మార్గాంతరము లున్నవి. పైగా - సూ.ని. చెప్పిన యర్థము ఈ క్రిందిరచనలలో సరిపోదు.

1. భారతములో, విరాటుడు-తనయొద్దికి కొలువుకోరివచ్చిన భీమునితో,-

> "నీ, కనుగుణమైన యానమును, నాసనముక్తా రుచిరాతపత్రముం
> జనవరికొల్వు నిచ్చెద." (విరాట. 1-220)

నన్నాడట. ఆ 'చనవరికొల్వున' కర్థమేమి? సూ. ని. మాట నమ్మి 'చనవుగలవానికొల్వు' అని చెప్పవచ్చునా?

2. గౌరన హరిశ్చంద్రలో, చంద్రమతిని అమ్మ ఘట్టమున,—

> "చతురులైనతికెక్కు సన్మంత్రులార,
> చనవరులార, యో సామంతులార,...
> కోమలి నమ్మెదఁ; గొనరయ్యమీరు" (2-389)

అని యున్నది.

మరి, హరిశ్చంద్రుడు—'ఓ చనవరులారా = చనవుగలవారలారా,- ఆప్తులారా, నా కోమలిని కొనండి' అనియే అనెనా?

3. "చలపట్టి దొరతోడ సరిపడ దనరాదు
చనవరితోఁ గంటు *కనఁగరాదు" (చాటు.మంజరి.పు. 166)

ఇక్కడ, చనవరితో = ఆప్తునితో - అని చెప్ప నొప్పునా?

విస్తరమెందుకు? చనవరి, అనుపదమునకు, రాజుదగ్గర - ఖుద్దున - నుండు సేవకుడు (=కొసావాడు) అని రూఢ్యర్థము. ఈ యర్థమును బ్రౌను, తన నిఘంటువులో,—"చనవరి-A courtier, a favourite, a pet" అని చక్కగా చెప్పియున్నాడు.

శ.ర. మీద నే ఆధారపడి వేదం వెంకట్రాయశాస్త్రిగారు,—

4. "జనవరులన్ జనవరులన్
మనసరులన్ దొరల ననిపి" (సారంగ. ౧-౭౭)

అన్నచోట, 'చనవరులన్ = స్నేహితులను' అనియే వ్రాసినారు. అక్కడను, చనవరులు - రాజకీయోద్యోగులేగాని - వట్టి స్నేహితులుగారు. (చూ. వివరములకు 'జితకాశి' పుట. ౫౨)

'చనవరుల'కు రాజుల పరిజనములోనే పరిగణనము:—

5. "నాయకుల్ గాయకుల్, చనవర్లున్ గణికాజనంబులును
బల్ సామంతులున్ మంత్రులున్." (చంద్ర. విలా. 3-11)

6. "నగరంబుపాలించు నరనాయకుండు
తగవరి ధర్మశాస్త్రముదెల్పువాఁడు,
చనవరియుఁ దలారి సారెదుర్గములఁ
దనకలినుంచు నాతఁడు వనంబరఁగు
వారల తెలుఁగు సర్వంబు నానాఁట
నేరుపాటుగవించె? యేకతంబునను" (రం. రా. అ. కాం.)

---

*'కొనఁగ' అని యుండనోపును.

7. "కవులు గాయకులు మాగధులు వేశ్యలు నటుల్
పరిహాసకులు ప్రోల బలసికొలువ,
... ... ... ...
దొరలు ప్రెగడలు చనవరుల్ తోడరాఁగ
... ... ... ...
హోళిదై వార నపుడు వాహ్యాళివెడలె" (రసి. మనో. 1-85)

8. "చనునే ప్రాప్యాంశమునకుఁ
జనవరి వటుపలుకఁ బ్రాప్యసంపదయెల్లన్
మునుమున్న గఁ దలమోపునఁ
గొనిచనవా మమ్మునడిగి కొనివచ్చితివాః" (కళత్. 3-28)

(చనవరివి = నిరంతర సంబంధము కలవాఁడవు.)

చనవరి-అను పదమును ఏయేకవు లేయే యర్థములలో వాడిరో పరిశీలించి తెలిసికొనకపోవుట యటుండ, సూ.ని. బ్రౌనునిఘంటువైన చూడక, శ.ర. లోని యర్థమునెత్తి వ్రాసికొనుటతోనే సరిపెట్టుకొన్నది.

ఒక విశేషము:—

సీ. "విడెముచొక్కపున నొక్కవేళఁ జొక్కినఁదన చేలచెఱంగునఁ జెమటఁదుడుచుఁ
గొలువుననుండి డిగ్గనడిగ్గునంతలో దండకై చేరి కై దండయొసఁగుఁ
'జనవరి'యై వడి జాఱెడురత్నభూషణము లప్పటికప్పు చక్కఁబెట్టుఁ
బేర్కొని తనుఁ జేరఁబిలిచిన స్వామి యేమానతియిచ్చెదరంచు నిల్చుఁ
జూచి వలదన్నమానక సురఁటివిసరు
నేమిమాటాడినను నుతియించుమిగులఁ
జిటికెలిడు జృంభణంబునఁ జేరి దివిజ
వైరి కగదారి, యిచ్ఛకదారియగుచు." (దశా. 2-131)

అను పద్యమును చదువుకొనియు, సూ. ని. చనవరి = 'ఆప్తుఁడు' అని వ్రాసినది!

మహాప్రభువుల కాప్తులైనవారు, తమ యుత్తరీయపుచెరగుతో-చెమట తుడుచుట; రా జావలించినపుడు చిటికెలువేయుట మున్నగుపనులు చేయు

దురా? ఆవులింతకు చిటికెలువేయుట సేవకకృత్యముగాని, ఆప్తకృత్యము కాదు.

1. "సాంగభంగంబైన యావులింతకువేల్పు లంగుళిస్ఫోటంబు లాచరింప
సౌఖశాయనికులై సంవర్తభృగ్వాదిమునులు హస్తాంభోజములు మొగుడ్ప
... ... ...
నిదురమేల్కాంచి కూర్చుండె నుదధినడుమ
విష్ణుఁడఖిలేశ్వరుఁడు శరద్వేళయందు"— కాశీ. 3-22

అఖిలేశ్వరుడైన విష్ణునకు - వేల్పులు, సేవకులగుదురా? ఆప్తులగుదురా?

2. "కమలినీ జృంభికలకు దిక్కాంతలెల్ల
హస్తతాళంబు లొనరించిరనఁగఁజెలఁగె
లలిత కాసారకూలకులాయచలిత
శకునపక్షజ పటపటస్వనము లధిప" (పారి. 2-67)

ఇందును, కమలిని యజమానురాలుగను, దిక్కాంతలు దాసీజనముగను ఉత్ప్రేక్ష.

3. "నెటికలుదిస్సి చేవిసికి నిక్కిరొయికించుక యావులించినన్
జిటికెలువేసి...వాసిగను...పొత్తులతొత్తులకేడ సత్తెముల్"
—బహులా. 5. ఆ.

ఇట్టి యుదాహరణ లెన్నియేని ఇయ్యవచ్చును. ఎందుకు విస్తరము: చనవరి-యను పదానికి చనవుగలవాడు - అనునది యౌగికార్థము; రాజకీయోద్యోగి - అనునది రూఢ్యర్థము. నిఘంటువు ముఖ్యముగా చెప్పవలసినది రూఢ్యర్థము నే. అట్టి యర్థమును, శ.ర., సూ.ని. చెప్పకపోవుట లోపము.

ఆవులింతకు చిటికెవేయుట ఆప్తకృత్యమని సూ. ని. భావించుట పొరపాటు.

చనవరి = రాజపురుషుడు, అనుట కింకొక్క యుదాహరణము.—

"గుత్త, చేలు గ్రామాంశములు నాధినేలలెల్లఁ, జనవరుల కమ్మఁజూపు"
(పాండు. 3-16)

"చనవరులకున్ = అధికారులకు" అని టీక.

## 14. దావలచేయి

సూ. ని. “దావలచేయి. వి. ఔ. (దా + వలను + చేయి = దాపటి వలని యందున్న చేయి) ఎడమచేయి, వామహస్తము” అని వివరించి అందుకు,

“ద్రోవది బంధురంబయిన క్రొమ్ముడి గ్రమ్మనవిడ్చి వెండ్రుకల్
దావలచేతఁ బూని” (ఉద్యో. ౩-౧౧౪)

అను భారతప్రయోగము నిచ్చినది.

మరియు, తిక్కన ‘దావలచేతన్’ అన్నమాటను ‘ఎడమచేతన్’ అన్న యర్థముననే వాడినాడనుటకు సాక్ష్యముగా,— “కేశపక్షం వరారోహా - గృహ్యావామేన పాణినా” అన్న మూలమునుగూడా ఉదాహరించినది.

కాని, దావలచేయి - యను పలుకుబడియు, దానికి, ఎడమచేయి - యను అర్థమున్నూ భాషావిదులొప్పదగినవి కావేమోనని నా సందేహము. ఎందువల్లననగా,—

(1) దావల = ఎడమ - అని యే నిఘంటువులోనూ లేదు.

(2) అదియునుగాక, ప్రక్క, వైపు - అను నర్థమునిచ్చు ‘వలను’ అను విశేష్యము, ఆ-ఈలతో సమసించునప్పుడు ఆ + వలను = ఆవల; ఈ + వలను = ఈవల - అను ‘ను’ లోపరూపమును పొంది, పిమ్మట విశేషణదశలో— (ఔపవిభక్తికము కావున) ఆవలి; ఈవలి - యని ఇత్వసహిత మగుచున్నది.

అట్లే, దా (పలి) + వలను = ‘దావల’యై, పిమ్మట (విణ) ‘దావలి’ అయితీరవలె. అప్పుడు ఎడమవైపుచెయ్యి ‘దావలిచెయ్యి’ యగునేగాని ‘దావల’ చెయ్యి కానేరదు. కావున “దా + వలను + చెయ్యి = దావల చెయ్యి” అనుట పొసగదు.

భాషలో ‘దావలచెయ్యి’ లేదుగాని *‘వలచెయ్యి’ యున్నది. ఐతే, అది కుడిచెయ్యి. (ప్రక్కచెయ్యి కాదు.) కవుల ప్రయోగములు చిత్తగించండి.

---

* వలను = కుడి. వృత్తియందు వలనుశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము ‘వల’. (చూ. శ.ర.)

(1) "అరుదుగా వలచేత నక్షమాలికయు" (రం. రా. అర.)
(2) "వలకేల్ తలక్రిందఁ జేర్చుకొని" (పం. 1-252)
(3) "వలకేల మ్రొక్కి" (సారంగ. 1-89)
(4) "వలకేల బంగారు జలపోసనముతోడఁ
ద్రన్నని పట్టుతోరము ధరించి" (క్రీడా. పుట. 14)
(5) "వెన్నుని వలకన్ను వేఁడివేలుపు" (అం. సం.)
(6) "చెప్పిన వెఱ్ఱిబోయ వలచే యటు సొన్పడు" (కేయూ. 4.75)
(7) "వలను = కుడి. వలనా హ స్తంబునఁ" (భద్రా. ౧. ఆ. ౭.ర.)

వలకన్ను, వలకేలు, వలచెవి, వలమూఁపు, వలమూల, వలవంక మొదలగు నుడులలోని 'వల'కు 'కుడి' యనియే యర్థము. (ప్రక్క యని కాదు.) కాబట్టి, 'వలచేయి' అను పదములో 'కుడి' యను నర్థమునిచ్చు విశేషణమైన 'వల'కు - మళ్లీ, 'ఎడమ' అను నర్థమునిచ్చు 'దా' యను విశేషణమును చేర్చుట చెల్లదు. చేర్చినచో 'ఎడమకుడిచేయి' యను విపరీతార్థ మేర్పడి ఆరచన హాస్యభాజనమగును. కావున తిక్కన అట్టి రచన చేసెననుట యుచితము కాదు.

అక్కడ, 'వెంద్రుకల్ - తా(ఁ) - వలచేతఁబూని' అని సుఖమైన యన్వయము కనబడుచుండగా:—

'దావల-చేత'

అని పదవిభాగముచేయవలసిన యక్కరయేమి? మూలములో 'వామేనపాణినా' అని యున్నదనియా? ఉండుగాక; తిక్కన ఆ మాట నట్లే తెనుగించినాడు - అని నమ్మక మేమి? ఆత డేమి మక్కికిమక్కి యనువాదకుడా? కాడుగదా? ఆయనయనువాదములో జరిగిన మార్పులకు - కూర్పులకు లెక్కయున్నదా?

మూలములో బృహన్నలకట్టుకొన్న *'శుక్లవసనము', తిక్కనరచనలో

* "త మన్వధావ ద్ధావంతం, రాజపుత్రం ధనంజయః,
దీర్ఘాం వేణీం విధున్వానః, సాధుశుక్లేచ వాససీ" (మూలము)
"లంబకేశభారుండును నాందోళితరక్తాంబరయుగళాంచలుండును నగుచు నతనివెనుకం బఱచు సమయంబున" (అనువాదము)

'రక్తాంబరము'గా మారిపోయినది. 'వామపాణి'—'వలచెయ్యి' (= కుడి చెయ్యి)గా మారుటొక యబ్బురమా?

ద్రౌపది తన తలవెండ్రుకలను కృష్ణునికి ఎడమచేతబట్టుకొని చూపిన దనుటకంటె 'కుడిచేత బట్టుకొని చూపినదనుటయే యుచిత'మని కవిబ్రహ్మ భావించెనేమో? 'ఆయనగా రనుసరించిన మూలప్రతి యెక్కడిదో! అందలి పాఠ మెట్లుండెనో!' యన్నవాద ముండనే యున్నదిగదా?

ఏమయినను 'దావలచేయి' యనుటమాత్రము పొసగదు. వావిళ్ల-వారి ముద్రణమునను, ఆనంద-వారి ముద్రణమునను గూడా—

'తాఁ - వలచేత'

అను నర్థ మేర్పడునట్లే, ఆ రెండుపదములును ఎడపడియే యున్నవి.

అది యట్లుండగా, ఉద్యోగపర్వమునకు టీకాతాత్పర్యములు వ్రాసిన కీ. శే., కొ. పార్థసారథిఅయ్యంగారు,—

"తాఁ - వలచేతఁ = కుడిచేతియందు-పూని"

అని టీకలోను, "వెండ్రుకలను కుడిచేతఁబట్టుకొని" యని తాత్పర్యములోను వ్రాసియున్నారు.

కావున, 'దావల చేతఁ'- అని విభజించుటయు, 'ఎడమచేతఁ' అని యర్థము చెప్పుటయు సరికాదు.

ఒక చిన్న మనవి:—

ఇంతకును సూ.ని. 'దా' క్రింద చెప్పదలచినది,— చెప్పవలసినది 'దావల'నా? 'దావలచేయి'నా? 'చే' క్రింద "చేయి = చే.వి.బొ. హస్తము" అని చెప్పిరియే యుండెనుగదా; మరల 'దా' క్రింద 'చేయి'ని చెప్పనేల?

ఆ పద్యములో 'దావలచేయి' యని యున్నందువల్ల నంటారా? అలా అయితే, ఇంకొక పద్యములో 'దావలకేలు' అనియు, వేరొకపద్యములో, 'దావలకాలనియు, మరియొకపద్యములో 'దావలముక్కు' అనియు నున్న దనుకొనుడు. మరి వరుసపెట్టి, దావలచేయి. దావలకేలు. దావలకాలు. దావలముక్కు అని పదములు వ్రాసుకొంటూ పోవడమేనా? నిఘంటువు పదములను తీసికొనవలసినపద్ధతి యదేనా? ఎన్నటికిని కాదు.

'దావల' (= ఎడమప్రక్కనున్న) యను విశేషణమొకటి యున్న యెడల, దానిని, మూలపదములలో చేర్చి, అర్థము చెప్పి ఆ యర్థనిర్ధారణ కొఱకు, ఆ 'దావల'తో కూడి ప్రయుక్తమెయున్న 'చేతి'నో, 'మూతి'నో ఉదాహరింపవలె. అంతేగాని, 'దావల'తోపాటు చేతిని, మూతిని మూల పదములలోని కెక్కింపరాదు.

'తా,(ఁ)వలచేత' అను తిక్కనరచనను సూ. ని. 'దావలచేత'గా భావించుటయు, 'ఎడమచేత' అని యర్థకల్పనము చేయుటయు, 'చేయి'ని 'దా' క్రింద చూపుటయు సరికాదని సారాంశము.

ఇక్కడ ఒక విశేషము. ఏమనగా :

'దావలచేతన్ = ఎడమచేతితో అనుటయే యుచిత'మని సమర్థింప బూని, వీ. బ్ర. గారు "పద్యములో కర్తృపదము 'ద్రోవది' యుండగా కవిబ్రహ్మ - తిక్కనసోమయాజి మరల 'తాన్' అను పదమును వాడునా? అట్లువాడుచో పునరు క్తిదోషము కాదా? అట్టిదోషము నా మహాకవి కంట గట్టుట తప్పుకాదా" అని *యాక్షేపము తెలిపినారు.

పాప మా యాక్షేపకులు భారతమును చదివినవారు కారు. అందు వలన 'తా' ప్రయోగసారస్యము నెరుగక అట్లి వ్రాత వ్రాసినారు.

కవిబ్రహ్మ 'తా' ప్రయోగము నెన్నితావుల నెట్లెట్లు చేసియున్నాడో ఆయన కేమెఱుక?

(1) "ఈ నెలఁతఁ గన్న మన్మథుఁ
డైనఁ జిగురుగొడుగుఁ బువ్వుటమ్ములపొదులున్
లోనుగ ♦సెజ్జలు సేయం
'దా' నియమింపండె విరహతాపము పేర్మిన్" (విరా. 2-28)

---

* చూడండి. 9 జూన్ 1947 త్రిలిఙ్గ.

ఆక్షేపము సరియైనది కాదని 7 జూలై 1947 త్రిలిఙ్గలో, శ్రీ ఉత్పల వేంకటరంగాచార్యులుగారును, 5 జనవరి 1948 త్రిలిఙ్గలో, శ్రీ యేలూరి పాటి రామభద్రచయనులుగారును సప్రమాణముగా మందలించి యున్నారు.

♦ 'సజ్జలు సేయన్' అని శ.ర. పాఠము.

(2) "దీని వసించుటఁ 'దా' నొప్పి పెంపున
నేపారు మందిరం బెద్దియొక్కొ" (విరా. 2-30)

(3) " 'తా' నుపలాలించుచుఁ బవ
మానుం డనుకూలమృదుగమనమునఁ బొలసెన్" (భీష్మ. 1-121)

(4) వ. "మనవారుఁ 'దా' మోపినభంగిం బెనంగుదురు" (,,-3-32)

(5) "వాఁ, డనితరవధ్యకాయుఁడగు నాయనఁ 'దా'ఁబడనేయు"
(,,-3-311)

(6) " 'తా' వినిపించెం బిత్రుదే
వావలి నత్రి నిజవంశుఁడగు నిమికిఁ దగన్" (అను. 3-191)

ఇకెన్నని చూపను? 'తా' ప్రయోగముగల తావులు తిక్కనరచనలో నేకొదు; ఎఱ్ఱాప్రెగ్గడ నన్నయ రచనలలో గూడా వందలకొలదిగ నున్నవి. అవియన్నియు పునరుక్తిదోషము లేనందురు కాబోలు. వీ.బ్ర. గారు! అనకేమి? 'కవిరత్న-కవి' గదా!!

## 15. అంగీకరించు

'అంగీకరించు' అను క్రియకు, శ.ర. లో— "సమ్మతించు; ఇయ్యకొను" అనియు, సూ.ని. లో— "ఒప్పుకొను; సమ్మతించు; స్వీకరించు" అనియు, అర్థములు చెప్పబడియున్నవి.

కాని, ఆ క్రియకు, 'పొందు' (= కలది యగు) అన్న యర్థముకూడా ఉన్నట్లు కావ్యములలో కనబడుచున్నది.

1. "మృదంగధిమిధిమి ధ్వానంబులకు నాడు యంత్రపాలికాసముదయంబు విమలమణి విమానమండలంబుననుండి గొండ్లిఁ బరిఢవించు తెలుగంటి తెలువల తెలంగు నంగీకరింప." (వసు. 6-9)

"తెలుగంటి ...... అంగీకరింపన్ = దేవతాస్త్రీలయొక్క రీతిని బొందుచుండఁగాను." అని టీక.

2. "తాను గోదండంబుభంగి నంగీకరించి" (కాశీ. 2-42)

3. "నిసర్గకాతరంబులగుకటాక్షవీక్షణంబులుపుష్పాంజలివిక్షేపభంగి నంగీకరింప." (కాశీ. 5-169)

4. "ఖండపరశు కంఠమూల కఠోర కాలకూటవిషమషీకలంకపంక చ్ఛాయాచ్ఛటాపటలంబుభంగి నంగీకరించుచు." (హర. 2-21)

5. "అయ్యష్టమూర్తి...మదనధ్వజంబునిగుడించి...నక్షత్రమండలం బను ముత్యాలగొడుగునకుం బసిఁడికొమభంగి నంగీకరింపఁజేసి."

(హర. పంచమాశ్వాసాంత్యభాగము.)

6. "అజాండకరండంబు వెండి *జలపోఁత గావించిన తెఱంగు నంగీకరించె" (పారి. 2-52) శ.ర. పాఠము,

'జలపోఁతగావించిన తెఱంగు నంగీకరించె' ననగా, జలపోత గావించిన విధమయ్యెను - అని సంప్రదాయార్థము.

7. "తారకలగుంపు జగజంపుగా శతపత్రశత్రుం డాతపత్రత యంగీకరింప" (ఆము. 7-66)

"ఆతపత్రత యంగీకరింపన్ = గొడుగు కాఁగా" అని, సంజీవనీ టీక.

ఈ క్రింది ప్రయోగములలో, అంగీకరించు = పొందు - అని యర్థము.—

8. "కాశియందు నిధనంబునొందు మానవుండు కైవల్యధనలాభంబు లంగీకరించు" (కాశీ. 5-26)

9. "అంగీకరించు మనుజుఁడు
సాంగోపాంగాధ్వరక్రియాఫలము వియ
ద్గంగాపులినంబున శివ
లింగార్చన మాచరించి లెస్సగ శౌరీ. (,,-5-42)

10. "సప్తగోదావర జలతరంగారోహ
కేళీసుఖంబు లంగీకరించి" (భీమ. 1-98)

---

* 'జలపూఁత' అని వేదం-వారి పా. కావ్యములలో 'జలపోఁత'; 'జలపోసనము' అను పలుకుబడులేగాని 'జలపూఁత' అని యున్నట్లు కనబడదు.

'దూసి' వారి ప్రతిలో "జలపూఁతగావించిన తెఱంగున నంగీకరించె" అని పాఠమున్నూ, "బ్రహ్మాండమను బరిణెను - వెండిమొలాము, కావించిన తెఱంగునన్ = చేసిన విధమున, అంగీకరించెన్ = సమ్మతించెను" అని టీకయున్నూ ఉన్నవి.

11. "కాలోచితకృత్యంబు లాచరించి, యొక్క సారథి నంగీకరించి, యరదంబు పూన్పించి" (భా. ఉద్యో. 4-340)

ఇక్కడ, 'సారథి నంగీకరించి' యనగా— సారథి నేర్పాటుచేసికొని యని యర్థము.

(సంపాదించు)

సంపాదించు - అను క్రియకును ఇట్టి యౌపచారికార్థము కలదు.

వ. "ఆ రంభోరువు......శుశ్రూషాతాత్పర్యంబునం బతి డెందంబున కానందంబు సంపాదించుచుండం బెద్దకాలం బరిగిన" (కాశీ. 3-213)

వ. "అధరబింబఫలారుణమరీచిమాలికలు రదనకుంద కుట్మలంబుల కనురాగంబు సంపాదింప."

ఈ రెండు తావులలోను, సంపాదించు = కలిగించు - అని యర్థము.

## 16. కుట్టిమము

శ.ర. లో—'కుట్టిమము = ఱాతికట్టనపు నేల, నెలకట్టు' అనియు, 'నెలకట్టు = ఱాతికట్టనపు నేల, కుట్టిమము' అనియు నున్నది.

'కుట్టిమము'నకు ప్రయోగము లేదు. 'నెలకట్టు'న కీ క్రిందిప్రయోగము చూపబడినది.

"అడుగుల నునుఁగాంతి నయ్యెడ పద్మరా
గంబుల నెలకట్టు కరణినొప్ప" (భా. విరా. ४. ఆ.)

సూ. ని. యును, అట్లె - కుట్టిమము = శిలారత్నాది నిబద్ధభూమి, నెలకట్టు' అన్నది. కుట్టిమమునకు కవిప్రయోగము నియ్యలేదు. 'నెలకట్టు= శిలారత్నాది నిబద్ధభూమి, కుట్టిమము' అని వ్రాసి 'అడుగులనునుఁగాంతి' అనే పద్యమునేకాక అదే యర్థము నిచ్చు మరిరెండు పద్యములనుకూడా ఉదాహరించినది.

శ.ర. తేటతెనుగుమాటలతో చెప్పిన యర్థమును, సూ.ని. సంస్కృత పదనిబద్ధ సమాసముతో చెప్పినది. అంతేకాని, కుట్టిమము, నెలకట్టు - అను పదములకు సరియైన, సమగ్రమైన అర్థమేమో వివరింపలేదు.

ఆ రెండు పదములకున్నూ, రాళ్లుపఱచిన - లేక రత్నాలుచెక్కిన - నేల (= భూమి, Land) అని, నిర్ధారణగా చెప్పుట సరికాదు. నేలయే కాదు, అట్టి సంస్కారమును (Pavement) పొందిన దే ప్రదేశమయినను, కుట్టిమమే (= నెలకట్టె). అది మేడఅడుగునేల కావచ్చును. ఏడంతస్తుల మహాడీమీది ప్రదేశము కావచ్చును; నడిమి అంతస్తులోని నడవ కావచ్చును; తుదకు—పడవలు, బండ్లు, విమానములు మొదలగువానిలోని స్థలమైనను కావచ్చును. ఈ క్రింది రచనల నరయునది.—

1. "హరిహయ చూడుమా తెలియు టబ్రముడగ్గఱిచూచికొని, యాం
గిరసునికైన నల్లయది కెంపులమేడలతోడి విస్ఫుర
న్మరకత కుట్టిమస్థలము మవ్వపులేఁజిగురాకు కెంపుమ
మ్మరమునఁ దేజరిల్లు నెఱమామిడిమ్రాఁకులతోడి తోఁటయో"
(ప్ర. ప్ర. 1-62)

ఇందలి కుట్టిమము మేడమీది ప్రదేశము.

2. "ఎడనెడ జాలకంబుల జడిగొన్నఁ బొడకట్టు వెన్నెలచేత నట్టువడి మణికుట్టిమంబులు తుడిచి." (ఉ. హరి. 5-136)
ఇందలి కుట్టిమములు మేడలోపలిభాగములు.

3. "ఒక్కనాఁడు భవాని యుబుసుపోకకుఁ బైఁడి
జలపోసనము కసీసంపుఁబట్టు
బంతిఁ గుట్టిమభూమిఁ బాణిపల్లవమున
నాస్ఫాలనముచేయు చాడుచుండ" (కాశీ. 6-161)

ఇందలి కుట్టిమభూమి - ఆటలాడుకొను చోటు. (Play Ground)

4. "కర్పూరరజమునఁ గలయఁ గుట్టిమములు
దీపింప ముగ్గులు దీర్చువారు." (నాసి. 2-163)

ఇందలి కుట్టిమములు, మేడల ముంగిళ్లు.

5. "ఉద్దామ కేకారవానుమీయమాన మరకత కుట్టిమస్థిత శిఖండి మండలమ్." (కాదం. పూ.)

ఇందలి కుట్టిమము సౌధముఖభాగము.

6. "పటికంపు నెలకట్టుపై నెక్క బెగడొందు
నింతి యిచ్చట గుట్ట లెట్టుదాఁటె" —కంచి శరభకవి - హరిశ్చంద్ర.

ఇక్కడ, నెలకట్టు = కుట్టిమము, సౌధోపరిభాగము.

7. "అంబుగ్రహణాగతోరుపథికాక్రాంతస్ఫురత్కుట్టిమం
బు...ఆబావి యొప్పుంగడున్" (హంస. 1-185)

ఇందలి కుట్టిమము బావిచుట్టును బండలుపరిచిన చోటు.

8. "దేహాంతంబున దివ్యయానగతుఁడై దివ్యార్క చంద్రద్యుతి
వ్యూహోద్భాసియు సర్వకామగము వజ్రోద్యద్గవాక్షాగ్ర ని
ర్వ్యూహంబున్ మణిబద్ధకుట్టిమమునై యొప్పారు యానంబునన్
మాహాత్మ్యంబెసఁగన్ జరించుసుఖియై మానాతిగాబ్దావలుల్."
—హరి. ఉ. ఆ. ౧౦. పుట. ౨౯౧.

ఈ పద్యమున విమానములో (మణులుపరిచిన ప్రదేశము =) కుట్టిమము-ఉన్నట్లు చెప్పబడినది. గమనించారా?

మరి కుట్టిమము (= నెలకట్టు) అంటే, "తాతికట్టనపునేల" అని, శ. ర. యును, "శిలారత్నాది నిబద్ధభూమి" అని, సూ. ని. యును, వ్రాయుట సరియగునా? సమగ్రమైన అర్థమగునా? ఆ నిఘంటువుల మీదనే ఆధారపడువారు, ఆ పదము - రాళ్లుపరచిన 'నేల'యందేగాని, ఇతరత్ర చెల్లదనియే అనుకొందురుగదా? అట్టి నిశ్చయముతో తప్పుచేయుటయు తటస్థించునుగదా? 'కదా'! అనుకొనుటయేల? ఆంధ్రమల్లినాథు వంతివారు అట్టియర్థమునే చేసికొని, కొండంతతప్పున కగ్గమైనారు. (వివరములకు. చూ. 'జితకాశి' పీఠిక. పుట. 26) ఇక సామాన్యులసంగతి చెప్పవలెనా?

## 17. నేర్పరి

సూ.ని. 'నేరుప(ర్ప)రి = నేర్పుకలవాఁడు, చతురుఁడు' అని చెప్పి, ఆ యర్థమును తెలుపు రెండు ప్రయోగములుకూడా, యిచ్చినది.

అయితే, "ఎంత నేర్పరివమ్మ యింతిరో నీవు". (బాణాసురయుద్ధము)

ఇత్యాది ప్రాచీనరచనలలో, 'నేర్పరి' యనుపదము - నేరుపుగల స్త్రీయందును ప్రయుక్తమైయున్నదే; ఆయర్థమును సూ.ని. చెప్పకపోవుటకు కారణ మేమి?

అట్లు మహతీవాచకమున ఆ పదమును ప్రయోగించిన పూర్వరచనలను సూ. ని. చూడలేదు కాఁబోలు - ననవచ్చునా? అట్లనుటకు వీలులేదు. ఏ మంటారా!

"చెలువకు బిడ్డకున్ట్లు విలసిల్లఁగ భిల్లపురంధ్రు లంతలోఁ
బిలువరెమంత్రసానిఁ దలపెట్టరె కాయముఁగూర్ప లేమకున్
జలకముగాఁపరే కొలనుచయ్యనఁద్రవ్వరె మందగామినిన్
నిలువఁగనీకురే, యనుచు నేర్పరులై కడుసంభ్రమించుచున్"
—కాళ. 3-౨౬.

అను పద్యమును 'కాయము' అను పదముక్రింద ఉదాహరించి యున్నది. పద్యములోనున్న - నేర్వరులైన (భిల్లపురంధ్రులు) స్త్రీలేనని, పురుషులు కారని, తెలిసికొని యుండదా? తెలిసికొనియే యుండును. తెలిసికొనియు నేల చెప్పలేదందురా?

శ. ర. లో 'నేరుపరి (= నేర్పరి) - సామర్థ్యముకలవాఁడు, సమర్థుఁడు' అనిమాత్రమే యున్నది. అందువల్ల, అంతమాత్రమే - సూ. ని. చెప్పినది. అందులో, 'సామర్థ్యముగలస్త్రీ' అన్న యర్థములేదుగనుక సూ.ని. చెప్పలేదు. తత్త్వమింతే.

శ.ర. కర్త ఆ యర్థమును చెప్పకపోవు టేల? అంటారా? అది పొరపాటు. ఆయనగారు 'సిగ్గరి' అన్న పదమునకు - లజ్జగలవాడు; లజ్జ గలది-అని యర్థము చెప్పియే యున్నారు.

సూ. ని. యైనను, నేర్పరి - అను పదమునకు — అర్థమును తాను స్వయముగా యోచించి వ్రాసియున్నచో ఈ పొరపాటు జరిగియుండదు. చూడండి :—

తెగువరి-అను పదమునకు, "౧. వాఁడిగలది. ౨. దానశీలము; దాత. 3. సాహసికుఁడు; సాహసికురాలు"—

అని వ్రాసియున్నది. తెగువరి-అను పదము, శ.ర. లో లేదు. సూ.ని. సొంతము. అందువల్లనే స్వయముగా యోచించి అర్థమును సమగ్రముగా వ్రాసినది.

నేర్పరి = నేర్పుగల స్త్రీ-అని, నిఘంటువు చెప్పకపోవుట ఒక గొప్ప తప్పా? అంటే, తప్పు కాదేమోగాని, లోపముమాత్ర మగును. నిఘంటువు చెప్పకున్నచో - నేర్పుగల స్త్రీ-అన్న యర్థమున 'నేర్పరి' అను పదమును వాడవచ్చునో, వాడరాదో, జిజ్ఞాసువునకు తెలియు టెట్లు?

శ.ర. కర్త 'నేర్పరి'ని మహద్వాచకముగామాత్రమే పఠించి యూరకొన్నందున మహతీవాచకముగా ఆ రూపమును వాడకూడదు కాబోలు ననుకొని, శ్రీ వేదం వేంకట్రాయశాస్త్రిగా రంతటి పండితులు "రాజకన్య నేర్పరురా లాయెను" అన్నారు. (చూ. 'జితకాశి'పీఠిక. పు. 29) కాబట్టి సూ.ని. 'నేరుపరి = నేర్పుకలవాడు; నేర్పుకలది' అని చెప్పక పోవుట లోపమే. ప్రమాదహేతువుకూడాను.

## 18. నట్టు

సూ.ని. 'నట్టు' అను పదమున కర్థము నిట్టు వివరించినది:

"నట్టు = తృణవిశేషము. దూర్వ, గఱికగడ్డి. ఉ. కుందురు నట్టు, గఱికనట్టు" (బ్రౌ.)

సూ.ని. 'నట్టు' అను తెనుగుపదమున కర్థము నెరుగకపోవుటే వింత. అది యట్లుండగా, బ్రౌను చెప్పిన యర్థమునైనను సరిగా తెలిసికొనకపోవుట అంతకంటెను వింత.

'నట్టు'కు - ఇల్లు; ప్రదేశము-అని రెండర్థములు. "నట్టునా గేహ తద్దేశనామ మెసఁగు" (అం, భా. 3-45)

కుందురునట్టు-అంటే, కుందురు ఎక్కువగా మొలచుచోటు. గరికె నట్టు-అంటే, గరికె ఎక్కువగా మొలచుచోటు.

ఇట్లే, గురుగునట్టు; దంతె( = దంతి)నట్టు మొదలయినవియును. కాబట్టి "నట్టు = తృణవిశేషము. దూర్వ, గఱికగడ్డి" అనుట సరికాదు. నట్టు-అను పదము, లక్షణచేత, ఒత్తుగా పెరిగిన గడ్డి-గాదము మొదలగు

మొక్కల మొత్తమునందును (ప్రస్తావమునుబట్టి) వర్తించును. నట్టులలో, కుందురునట్టు, గరికెనట్టు బలీయములు. అవి బలిసినచోట మరి పైరు పట్టదు. అవి ఒకమాత్రన చావవు. అయిదారు చాళ్లు దున్నినగాని నశింపవు.

ఈ యెల్లవివరమును, తెనుగునెరుగని వారికొరకు, బ్రౌనుపండితు డెంత చక్కగా వ్రాసియున్నాడో చూడండి.

"నట్టు - A spot of ground, Place, abode....A platform of earth, a terrace. The bent grass, that infests corn-fields.— "It is undescribed and of peculiar character : having widely-spreading perennial roots, or underground stems. There are two species : one species కుందురునట్టు in the రేగడ or black soil : and గరకనట్టు in the *mudub* or mixed soil. The largest species called పడవనట్టు requires (for its eradication) the large plough with twelve bullocks : the smaller is గంపనట్టు. It furnishes excellent food for cattle : and, could it be raised on the poorer lands alone, it would be extremely valuable.''

సూ ని. బ్రౌన్యమునైనను సరిగా చూడక 'నట్టు'కు తప్పర్థము చెప్పినది.

## 19. నీరువట్టు

"నీరువట్టు (నీరు + పట్టు) = దప్పిగొను. దప్పి, పిపాస'' అన్నది సూ.,ని.—దప్పి యనగా నీరుపట్టుట-కాదు; నీరువట్టుట, =( గొంతులోని, నాలుకమీది) తడియారిపోవుట.

"వట్టుట or వట్టిపోవుట To dry, become dry, be drained నీరయింకుట, నీరు యెండిపోవుట, తీశిపోవుట." (బ్రౌను)

"పదనుదివిసినకస్తూరి ప్రాఁచియలరు
పాయఁబాతినకూడు నీర్వట్టుమడుఁగు
గళితమణియగుసొమ్ము నై కొనఁబడియొ
దుర్విదగ్ధుండు గౌరవదూరుఁడగుచు." (పాండు, 3-22)

నీర్వట్టుమడుగు - అనగా, నీరెండిపోయిన మడుగు.—నోట తడిలేక పోవుటయే, దప్పియగుట.—

గీ. "పెదవిపై పెత్తు నాలుక పిడుచగట్టు
గొంతుతడిదీయు నక్కొండు గొంతదడవు
దాహమున నుదకములేక తడసెనేని." (దశా. 2-138)

ఆ. "రాత్రి జాగరణభరశ్రాంతులై వారు
నిద్రవొందియుండ నీరువట్టి
ధారుణీశ్వరుండు తన్మంత్రకలశోద
కంబులెల్లఁ ద్రావెఁ గడుపునిండ." (భార. అర. 3-202)

నీరువట్టి = నుత్తుకయెండి = దప్పిగొని యని యర్థము.

గీ. "తపసిఁగనుఁగొని శోషితతాలుఁడగుచు
నెండి తడిలేక నుత్తుక నెలుఁగు డింద
మంద భావలనిట్లను మనుజవిభుఁడు.

క. తోయములుదెమ్ము మాకు...ఘనచేతోయుత—
డప్పిజనించెను." (భాగ. 1-459)

క. "భూకాంత నీరువట్టునఁ
గాక వదన*మిలకరింపఁ గాన్పించిన పం
డ్లో కా కన వెలిపుచ్చలు
లోకములోఁగాచె నిట్లు లోబడెజనముల్." (వరా. ౧౦. ౩౦)

ద్వి. "మునినాథ నేఁబోయి ముదమొప్ప జలము
గొనివచ్చు నీలోన గుత్తుకమిడికి
మునికుమారుఁడు దాహమునఁ జచ్చెనేని."
—గా. హరి. పూ. 1810

నుత్తుకమిడికి, అంటే గొంతెండి, అని యర్థము.

---

* 'మిలుకరింప' అని నూ.ని. పా. ఇలకరచు, అనుక్రియకు 'ఈల కరచు' 'ఇలకరించు' అనునవి రూపాంతరములు. కావున 'ఇలుకరించు' అనుట సరికాదు. 'ఇలకరించు' శ.ర. లో లేదు. బ్రౌను, ఇట్లు వివరించి నాడు. 'ఇలకరించుట' ఈలకర్చుకొని వుండుట. అతనికి పండ్లు యిలక రించినవి. his jaws were set.

## నీరుపట్టుట

'నీరుపట్టుట' యనగా ఉన్ననీటికితోడు ఎక్కువ నీ రేర్పడుట. లేక నీరులేనిచోట, నీ రేర్పడుట.

వాడు నీరుపట్టినాడు, అంటే, క్రొత్తరక్తముపెట్టి ఆరోగ్యముగా నున్నాడనియు,- కురుపు నీరుపట్టినది, అంటే, చీముపోసినదనియు అర్థములు.

నీరుపట్టు = నీరుపోయు = రక్తముపెట్టు.

1. "ఇవ్విధంబున మెలఁగు నయ్యింతి యొంటి
   తిండికతమున నినుమడికండపట్టి
   నీరుపోసిన మేనితో నిలుపరాని
   మనసుచే జారభోగ మేమఱక తిరుగు" (శుక. 3-351)

2. "అనువొందనీరుపట్టిన మేని తళతళల్
   దిలకింపఁ దోలుచూలు తలిరుఁబోండ్లు" (దశా. ౮-౩౭)

నీరువట్టు; నీరుపట్టు, పరస్పరవిరుద్ధార్థక్రియలు. కాబట్టి, 'నీరు + పట్టు = నీరువట్టు' అనుట తప్పు.

సూ.ని. దప్పి, యనఁగా, గొంతు-ఎండుట, అన్న విషయమునుగూడా, ఎరుగదా? ఎరుగ కేమిగాని, (గొంతు)-'ఎండు' అను నర్థమునిచ్చు పదము 'వట్టు' - 'పట్టు' - యెరుగదు. అంతే.

## 20. తిమిరము

శ.ర. లో,— "తిమిరము. 1. చీకటి. 2. నేత్రరోగవిశేషము" అని యున్నది.

సూ.ని., తిమిరము = సం. వి. అ. పుం. ౧ చీకటి. ౨ అంధత్వము, నేత్రరోగవిశేషము.—అని చెప్పి, రెండవ యర్థమునకు,— "తిమిరంపు వయసుగుబ్బల, కొమరాలవు."—(మనుచ. ౪.౮౩) అనుపద్యము నిచ్చి,— 'తిమిరంపువయసు, కన్నుగానని వయస్సు, ఉత్కటమగు యౌవనము-అని భావము' అని వివరించినది. అక్కడనే 'తిమిరము = మదము-అని చిన్నయ సూరినిఘంటువు' అనియును తెలిపినది.

'తిమిరంపువయసు' అనుమాటకు, సూ ని. చెప్పినయర్థము సరియైనది కాదు.—

తిమిరము - విశేష్యమైనప్పుడు, తిమిరపు - వయసు = తిమిరము యొక్క-వయసు అగునేగాని, 'కన్నుగాననివయసు' కాదు.

తిమిరపు = నేత్రరోగముచేత కన్నుగానని-అని యర్థముచెప్పుటకు శాస్త్ర మొప్పదు.

అది యట్లుండనిండు: 'కన్నుగానని' అను జాతీయమునకు నేత్ర రోగముచే - అంధమైన = గ్రుడ్డియైన-అనియే నా అర్థము? అసలు, కనుట కును, కానకపోవుటకును వయసేమి కన్నులుగల ప్రాణియా? కాదు. కనుక కన్నుగానమిని, వయసుగలవ్యక్తికి చెప్పదగును గాని వయసుకు చెప్ప దగదు.

ఆ వ్యక్తి కన్నుగానకపోవుటకు, ఆ వయస్సు (ఉత్కటయౌవనము) వలన గలుగు పొగరు (మదము) కారణ మవుతుంది.

ధనము, వయసు, విద్య, ప్రభుత్వము మొదలగునవి మదహేతువులు.

(1) "లోకేశ మానినాం మౌఢ్యా ద్ధరిష్యే శ్రీమదం తమః"
భా. 10 స్కం 25 అధ్యా.

(2) ధన మదంబును వేదవిద్యా మదంబు
మోక్షలక్ష్మీ మదంబును ముదిరి కాద" (కాశీ. 7-155)

(3) "అల్పరాజ్యలక్ష్ములలనాంధబుద్ధికి" (భా. సభా. 2-22)

(4) అతఁడుఁ నృపశ్రీల రమించె హేమమయ చిత్రితహర్మ్యములం
బ్రియాకటాక్షాలసమందహాససురతామృతపానమదాంధబుద్ధియై."
(వాసిష్ఠరామా. 4-104)

(5) "యౌవనదర్పంబున విఱ్ఱవీఁగుచు" (భల్లా. 3. ఆ.)

మదము, గర్వము మొదలగువానివలన కన్నుగానకపోవుట యనగా-మంచిచెడ్డల విచారముచేయకపోవుట; భోగాముల నరయకపోవుట. అంతే గాని, నేత్రరోగముచేత దృష్టిచెడుట కాదు; గ్రుడ్డితనమును కాదు. అరయ మిని 'కన్నుగానమి'గా చెప్పుట ఆలంకారికమర్యాద. ఆ కన్నుగానమిని దృష్టిదోషముగాను, అందుకు మూలమయిన కామము, క్రోధము మున్నగు

గుణములను అంధకారముగాను, నేత్రరోగముగాను కవులు రూపించుచుందురు.

ఒకకొన్ని యుదాహరణములు :—

1. "అతను దర్పాంధకార మంతంత గవియఁ గన్నుగానక" (రామా. 5-70)

2. "అతిగాఢమైన క్రోధాంధకారంబునఁ
గన్నుల నంధుండుగాని వాఁడు." (కాశీ. 4-263)

3. "త్రినయన యతిగర్వతిమిరాంధు నన్నుఁ, గరుణఁ దప్పులు సైచి కావవేయనుచు" (బసవ. పు. ౧౧౪)

అంధకారముగా రూపకముచేయకయు చెప్పుట కలదు.—

4. "మానసాయండు రాజ్యగర్వంబునఁ గన్నుగానక" (దశ. కు. 2-4)

5. "వజ్రనాభుండు ప్రాభవాభిమానంబునఁ గన్నుగానమిఁ దన్నుఁ దా నెఱుంగకున్నవాఁడు." (ప్ర. ప్ర. 1-117)

6. "కటకట పుంద్రనందనుండుకన్నులఁగానకవచ్చి"(ఉ.హరి. 3.89)

కన్నులఁగానకవచ్చి, అంటే, బలగర్వమున ఎదిరిని తన్ను తెలిసికొనక వచ్చి-అని యర్థము.

7. "కండకావరమునఁ గానరు మరణంబు" (వేమ. 3-147)
కానరు = తెలిసికొననేరరు.

8. "పాపాత్ముండు మదాంధుఁడాతులువ" (భా. ఉద్యో. 3-45)

9. "తమియు మత్సరము డెందమున నంతంతకుఁ
బొడమి కానఁడు ప్రొద్దుపొడుపుగ్రుంకు" (పి. శకుం. 4-164)

10. "త, త్సంపన్నాంధున కంజనంబు వినుమీ దారిద్ర్య మాహింపఁగఁ." (భాగ. 10 పూ. 394)

ఇందు దారిద్ర్యమును అంజనముగా చెప్పుటచేత, ఆ యంధత్వము సంపన్నతయను నేత్రరోగమువలన కలిగినదని భావము.

11. "అజ్ఞానతిమిరాంధస్య, జ్ఞానాంజనశలాకయా
చక్షురున్మీలితంయేన, తస్మై శ్రీగురవేనమః"

ఇందు, 'అజ్ఞానము, తిమిరముగా = నేత్రరోగముగా - రూపకము చేయబడినది. ఎందువల్ల? మంచిచెడ్డల నరయజాలమి (కానమి) అజ్ఞానమూలకముగనుక, ఆ కానమిని దృగ్వ్యాపారముగాచేసి, దానికి మూలమయిన అజ్ఞానమును నేత్రరోగ మన్నాడు; కవి. అంతేగాని, నేత్రరోగమయిన 'తిమిరము'ను అజ్ఞానమునకే అంటించి,— తిమిరంపు టజ్ఞానము(= కన్నుగానని అజ్ఞానము) అనలేదు. కన్నుగానని ప్రాభవము; కన్నుగానని విద్య; కన్నుగానని సంపద, అనుట సంప్రదాయముకాదు. కనుకనే ఆ కవి, కన్నుగానని యజ్ఞానము - అనలేదన్నమాట.

మనకు ప్రకృతమైన 'తిమిరంపు వయసు'లోనో, సూ.ని. తిమిరమును వయసునకే అంటగట్టినది.

'తిమిరంపు వయసుగుబ్బల - కొమరాలవు' అన్నచోట, ఏర్పడవలసినది 'గుబ్బలపొగరు'గాని, మంచిచెడ్డల నరయజాలమి కాదు; అంధత్వము కాదు. కాబట్టి, తిమిరము= నేత్రరోగము, అంధత్వము-అన్న యర్థమక్కడ అనువుపడదు.

ఆ యర్థ మనువుపడదు గనుకను, అక్కడ అనువుపడునట్టి 'పొగరు' అను నర్థము సంస్కృత 'తిమిరము'నకు లేదుగనుకను, తిమిరవయస్సు-అను సిద్ధసమాసరచన కనబడదు గనుకను, ఆ 'తిమిరము' దేశ్యముగాని, తత్సమము కాదని నా మనవి.

'తిమిరంపు వయసుగుబ్బలు' అన్న మాటకు, జూలూరి—అప్పయ్యశాస్త్రిగారు, "తిమిరంపు = పొగరుగలిగిన, వయసుగుబ్బల = ప్రాయపు చన్నులుగల" అనియే టీక వ్రాసినారు. వారా పదమును తత్సమముగా గ్రహించియున్నచో 'పొగరు' అన్న యర్థమువచ్చుటకు మార్గమేది?

మరియు, బ్రౌణ్యమున ఇట్లున్నది:— "తిమిరంపు adj. of or belonging to the quality of darkness. Blooming proud, arrogant, చీకటిసంబంధమైన, నవయౌవనముగల, గర్వముగల N. 9-324 *తిమిరంపునిండు ప్రాయపు మోహనాంగుల గెరలించు సురతక్రీడనముల. Swa. 4-121. తిమిరంపు వయసుగుబ్బల కొమరాలవు. టీ. పొగరుగలిగిన."

---

* 'తిమిరంబునిండు ప్రాయము'-అని సరియైన పాఠము. (దశా.చ. 8-94)

చిన్నయసూరి నిఘంటువులో-"తిమిరము=మదము" అని యున్నదని, సూ.ని., యే చెప్పుచున్నది.

'సారంగ'లో, 'కాయములు, కొమరుఁ దిమిరపుఁబ్రాయములు' అన్న చోట, శ్రీ 'వేదం'వారి టీకలోను,-"తిమిరపుఁబ్రాయములన్ = మదము గల వయస్సులును" అనియే యున్నది.

అంతేకాక, వారు శృం.నై. (6-66)లో, 'ఒక్కగుబ్బల కొమరాలు చక్కవచ్చి' అన్నచోట,—" 'గుబ్బల' కొమరా లనుటచేతనే గుబ్బలు తెలియుచుండగా గుబ్బలంజెప్పుట తత్ప్రశస్త్యద్యోతనార్థము. ఒకపాటి జవ్వనమున వానియుదుటు చెప్పరానిదిగా నుండును.— 'తిమిరంపువయసు గుబ్బల-కొమరాలవు' అని మనుచరిత్రలోని వర్ణనయు నిట్టిదే." అని వ్రాసియున్నారు.

ఈ 'తిమిరపు వయసుగుబ్బల'నే, ముక్కుతిమ్మనార్యుడు,- "మబ్బుకొను వయసుగుబ్బలు" (పారి. 2-52) అన్నాడు. ఆ మాటకు, 'మూసి' వారు "మదించిన ప్రాయపుస్తనము" లనియు శ.ర. కర్త-"మబ్బుకొను = మంపుకొను" అనియు, నర్థము చెప్పినారు.

మబ్బు, మంపు, మదము, పొగరు, నిక్కు - సమానార్థకములే. గుబ్బలకు పొగరును, ఉదుటును చెప్పుట ఉచితము; పరిపాటియున్న.—

(1) "చనుఁగవపొగరు నీ జంటరైక ఝోయుంగు" (కలు. శ. 175)
(2) "...గుబ్బలపొగరునఁ, బెట్టెడురవికెలు పిగిలెనమ్మ" (కలు.శ, 101)
(3) "ఉదుటు గుబ్బలుగల తల్పుటురమునూచి" (ఆము. 2-10)
(4) "ఉదుటుఁజన్నులపయి నుఱుకు నగ్గలికల
మనసొగ్గనీయని మూర్ఖ్యములను." (విప్ర. 3-87)
(5) "చన్నులనిక్కు..." (జాహ్న. 4-55)
(6) "నిద్దంపుఁజనుదోయి నిక్కుదోఁప." (కువల. 2-80)
(7) "అతివ కుచంబులున్, మెఱుఁగుటూరును, వేనలియున్,...
నిక్కెడు, నీల్గెడు, విఱ్ఱవీఁగెడున్" (విజ. 1-99)

కుచములునిక్కుట - పొగరువలననే.—

పూర్వ టీకాకర్తలును, పూర్వ నిఘంటుకర్తలును, ఇటీవలి పండితులలో 'ఆంధ్రమల్లినాథు' డనిపించుకొన్న శ్రీ వెంకట్రాయశాస్త్రిగారు

కూడా - తిమిరంపువయసు = 'పొగరుగలిగిన' వయసు అని స్పష్టముగా వ్రాసియుండగా, సూ.ని. అది గమనింపక,—"తిమిరంపు వయసు = కన్ను గానని వయస్సు" అనుట యుచితమగునా?

నా ముఖ్యమయిన మనవి యేమనగా.—

తిమిరము - అను పదము సంస్కృతమున నున్నట్లే తెనుగునగూడా ఉన్నది. అరి, అంగి, కరము, తమి, తరి, దరి, మనువు, మాత్ర మొదలగు పదములవలెనే—అటు సంస్కృతమునను, ఇటు తెనుగునను ఒక్క రూపమునే యుండి భిన్నార్థము నిచ్చుచున్నది. కాబట్టి నిఘంటువులు 'తిమిరము'ను దేశ్యముగా గ్రహించి— మదము, పొగరు అని యర్థముచెప్పి, అందుకు ఉదాహరణగా, 'తిమిరంపు వయసుగుబ్బల-కొమరాలు' పద్యమునే చూపుట యుచితము.

కీ. శే. త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరవారు, తమ మొయిలురాయబారములో, (ఉద్దామాని యౌవనాని = "గాఢతిమిరంపు టెలజవ్వనముల పెంపు" అన్నారు.

'తిమిరము' విశేషణముగా సంస్కృతమునను ఉన్నదేమో!

(తిమిరవిచారము)

తిమిర మనగా నేత్రరోగమనీ, ఆరోగము 'అంధత్వ'మనీ సూ.ని. చెప్పినది. కాని, తిమిరము కేవల మంధత్వము కాదు. అది యొక తెరగు దృష్టిదోషము. ఆదోషము కంటియొక్క నాల్గవపటలము నాక్రమించి నపుడు 'తిమిర' మనబడును.

ఆదోషము సంభవించినపుడు కన్నులకు చీకటి క్రమ్మినట్లుండును. కాని, సూర్యచంద్రులు, నక్షత్రములు, మెఱుపులు, నిర్మలమగు తేజస్సుగల మణులు మున్నగు వస్తువులును కనపడుచునేయుండును. తిమిరము ముదిరినయెడల 'కాచము'; 'నీలిక' అనబడును. లింగనాశమనియు చెప్పబడును. లింగనాశమనగా, నేత్రేంద్రియనాశ మని అర్థము.

> "తిమిరాఖ్యస్స వై దోషశ్చతుర్థపటలంగతః,
> రుణద్ధి సర్వతోదృష్టిం లింగనాశ మతఃపరమ్.
> అస్మిన్నపి తమోభూతే నాతిరూఢే మహాగదే,

చంద్రాదిత్యౌ సనక్షత్రావంతరిక్షే చ విద్యుతః,
నిర్మలాని చ తేజాంసి భ్రాజిష్ణూ న్యథపశ్యతి."
—మాధవ నిదానము.

కాబట్టి, "తిమిరము = అంధత్వము" అనుట సరికాదు. నిఘంటువు ఆ పదమునకు సరియైనయర్థమును - వివరింపదలచుకొన్నచో,—

'తిమిరము = కంటిలోని నాల్గవ పటలమును గలుగు దృష్టిదోషము.' అని వ్రాయవలెను; లేదా అంతపని మనకెందుకనుకొన్నచో (శ.ర. వలెనే) 'నేత్రరోగము' అని దాటిపోవలెను.

అంతేగాని అనుచితార్థమును, అస్పష్టార్థమును, వ్రాయగూడదు.

నానార్థరత్నమాలలో, "ధ్వాన్తే౽క్షిరోగే తిమిరమ్"అని మాత్రమే యున్నది.

## 21. చూర్ణకుంతలము

శ. ర. లో "చూర్ణకుంతలము = అలకము, నెఱికురులు( = చుట్టవెండ్రుకలు, వక్రకేశములు)" అని యున్నది.

సూ. ని. లో—"చూర్ణకుంతలము-సిందూరాది చూర్ణమును ధరించు కురులు - అలకలు, నెఱికురులు" అని యున్నది.

*సూ. ని. పద్ధతిప్రకారము 'Hyphen' లోనిది యౌగికార్థము; పిమ్మటిది రూఢ్యర్థమును కావలె. మరి, యౌగికార్థములో, సిందూరాది చూర్ణమును ధరించిన కురులు, రూఢ్యర్థమున, 'నెఱి (=వంకరయైన, కుటిలమైన) కురు' లగుట యెట్లు?

యౌగికార్థములోని 'పంచెపుగుజ్జము' రూఢ్యర్థములో - 'కుంటిగుఱ్ఱ' మగుటయు నుండునా?

---

* 'Hyphen'లో చెప్పబడునది యౌగికార్థమని, సూ.ని. పండితులలో నొకరైన దు. సూ. నా. శాస్త్రిగారు తెల్పియున్నారు. (చూ. ఆంధ్ర సాహిత్యపరిషత్పత్రిక. పార్థివ చైత్ర-ఆషాఢములు. పుట. 30)

'చూర్ణకురుంతలములు' అయితే-సిందూరాది చూర్ణమును ధరించుకురులు కావలె; కాకపోతే-నెతికురులు కావలె. అంతేగాని, రెండును అగునా? ఆ రెండును భిన్నార్థములగుచో, ఆ రెండర్థములను ౧. ౨ అని అంకెలువేసి వేరువేరుగా చెప్పవలెగాని, ఒకటి యౌగికార్థముగా, రెండవది-రూఢ్యర్థముగా చెప్పుట యెట్లు?

అసలు, యౌగికార్థములో ఇవి 'కురు' లనీ, ఇవి 'గిరు' లనీ యేర్పడునా? ఏర్పడదే. చూడండి.—

*'వజ్రి' అను పదానికి 'వజ్రము (అను ఆయుధము) కలవాడు' అని యౌగికార్థము; 'ఇంద్రు'డని రూఢ్యర్థము. అంతేగాని-వజ్రముగల యింద్రుడని యర్థముకాదు. అట్లే మదావళి శిఖావళి శబ్దములకు - మదముకలది; శిఖకలది యని యౌగికార్థములు. ఏనుగనీ-నెమలియనీ రూఢ్యర్థములు. రెండర్థములను కలిపి, మదముగల యేనుగు; శిఖగల నెమలి—అని చెప్ప గూడదు.

కాబట్టి చెప్పవలసివస్తే—'సిందూరాదిచూర్ణమును ధరించునవి' అని యౌగికార్థమునూ, 'కురులు' అని రూఢ్యర్థమునూ చెప్పవలె. అంతేగాని-రెండర్థములను జోడించి, 'సిందూరాదిచూర్ణమును ధరించుకురులు' అని చెప్పి, ఇది యౌగికార్థమనుట తప్పు. సిందూరాదిచూర్ణమును ధరించు కురు లంటే - నెతికురు లనుట అంతకంటెను తప్పు.

శ.ర. కర్త చెప్పలేదుగాని, రూఢియౌగికముల తత్త్వమును, బ్రౌను పండితు డిట్లు తెలిపియున్నాడు.

"యౌగిక Customary, usual, common, proper, regular (as the sense of words depending upon their derivation or construction) సాధారణమైన, శబ్దవ్యుత్పత్తినిపట్టిన.—రూఢి or రూఢి

* వే. వే. శాస్త్రిగారు, గౌ. హరి. లఘుటిప్పణములో (పుట. 41) "వజ్రివి = వజ్రాయుధముగల యింద్రుడవు" అనియు, 'సారంగధర' లఘుటీకలో (పుట. 151) "మదావళి = మదపుటేనుగు" అనియు వ్రాసి యున్నారు.

యైన. Certain, notorious, usual, or customary. Peculiar (as opposed to యౌగిక, that is, etymological or radical) the రూఢ్యర్థము or usual meaning of పంకజము is a lotus but the యౌగికార్థము or literal sense is mud-born. నిశ్చయమైన, ప్రసిద్ధమైన, అనన్యసాధారణమైన, లోకరూఢిఅయిన, universally known."

ఇక,—సింధూరాదిచూర్ణమును ధరించు కుంతలములను - చూర్ణకుంతలము లనుట కలదేమో విచారింతము.

లోకములో, స్త్రీలు కుంతలములందు పుష్పొడి మొదలగు సుగంధ చూర్ణములను ధరించుటకలదు. అందుకు ప్రమాణముగా,—

(1) "పరువంపుపుష్పొడి బాగుగాఁదీర్చిన
యలకలపైఁ బొలుపార నలికి" (హరి. ఉ. పు. 106)

(2) "సీమంతపథమునఁ జిగురొత్తునప్పుడు
రమణీయసింధూర రజముసొబగు." (కాశి. 7-75)

(3) "కురులలోఁ గదియంగఁ గ్రొత్తపుష్పొడిపచ్చి
మేదించినించెను మెలఁతయొకతె" (యయా. 5-101)

(4) "చుంబనా దలకచూర్ణదూషితం శంకరోపి నయనం లలాటజమ్."
(కు. సం. 8-19)

ఇత్యాదిరచనలును కలవు. అయితే—కుంతలములందు చూర్ణమును ధరించు ఆచారమునుబట్టి, చూర్ణకుంతలశబ్దము పుట్టియుండునా? అలా అయితే, చూర్ణమునుధరించుటమాట యెట్లయినను, కుంతలము (=కురు) లందు కుసుమములను ధరించుట సహజముగదా.

చూర్ణమును ధరించుటచేత - చూర్ణకుంతలము లైనప్పుడు, కుసుమములను ధరించుటచేత-కుసుమకుంతలములును కావలసినదేగదా! అయినవా? ఎందును కనబడవే!

మరియు, మగువలు కుంతలములందు పలుతెరగుల భూషణములను ధరించుట జగద్విదితముగదా; మరి 'భూషణకుంతలము'లనియు ననవచ్చునే. అట్లెవరైనా అన్నారా? అనకపోవు టేల?

భాషాప్రపంచములో 'చూర్ణకుంతలములు'మాత్రమే యుండు టేల? కుసుమకుంతలములు; భూషణకుంతలములు లేకపోవు టేల?

అది యట్లుండఁగా, స్త్రీలు, సిందూరాదిచూర్ణమును కురులయందు వలెనే - కుచములయందును అలదుకొందురు. ఆ యంశమును స్పష్టము చేయుచున్నవి యీ క్రిందిరచనలు.

- 1. "కదాచిత్ కుచచందనచూర్ణ ధవళితోర్మిమాలం......సావరోధ జనో జలక్రీడయా గృహదీర్ఘికాణా మంభశ్చకార." (కాదంబరి. పు. 57)

2. "క్వచి మ్మార్ణోద్గారీ క్వచి దపిచ సాలక్తకపదః,... స్త్రియో నానావస్థం ప్రథయతిరతం ప్రచ్ఛదపటః" (అమరు.౯౫) (పై శ్లోకములోని చూర్ణము కుచములమీదిదే - చూ. వ్యాఖ్య.)

3. "పద్మా పయోధరతటే పరిరంభలగ్న కాశ్మీరముద్రితమురో మధుసూదనస్య" (కృ. క.)

4. "గోపీజనస్య కుచకుంకుమముద్రితాంగం గోవింద మిందువదనం శరణంభజామః"

5. "కుచకుంభములమీఁది కుంకుమతోరాయు
హారంబు లరుణంబులగుచు మెఱయ" (భాగ. 10 ఉ. 228)

6. "అలరుగుత్తులనిండ నలరు పుప్పొడిగుబ్బ
కవలపైనలఁదు గందవొడిఁ బోల." (చంద్రి. 2-73)

7. "చోళేంద్రత, న్వీరాజత్కుచపాళి *కుంకుమముకం బెట్ట వన్నెగావించెఁగా, వేరితోయము కృష్ణరాయఁ డహితోర్వీనాథ రక్తప్రభల." (పారి. పీఠిక. 18)

స్త్రీలు, సిందూరాదిచూర్ణమును కుంతలములందు ధరించుట యెట్టి పరిపాటియో, కుచములయందు ధరించుటయు నట్టి పరిపాటియేయనుట కీ చూపిన గ్రంథోదాహరణము చాలుఁగదా!

---

* 'మంజులకం బెట్ట' అని వేదం-వారి పాఠము. 'కుంకుమము కం బెట్ట' అని వావిళ్ల-వారి పాఠము. ఉచితతరము.

శ్రీ 'సూరి'వారు వేదంవారిపాఠమునే తీసికొన్నారు.

చూర్ణమునుధరించు కుంతలములు - చూర్ణకుంతలము లైనట్లే-చూర్ణమును ధరించు కుచములు - 'చూర్ణకుచములు' కావచ్చునుగదా! కాకపోవుటకు కారణమేమి?

ఏమియునులేదు; 'చూర్ణకుంతలములు (సిందూరాది) చూర్ణమును ధరించుటవల్ల అయినవి కావు. కుసుమములనుధరించు కుంతలములు - 'కుసుమకుంతలములు'; భూషణములు ధరించునవి - 'భూషణకుంతలములు'; చూర్ణమును ధరించు కుచములు - 'చూర్ణకుచములు' కాకపోవుటే అందుకు సాక్ష్యము.

చూర్ణకుంతలములలో (సిందూరాది)చూర్ణ మున్నదనుకొనుట పొరపాటు. చూర్ణకుంతలములు - వట్టి కురులేగాని, చూర్ణముతో ఏలాటి సంబంధముకలవియును కావు. చూడండి.

కాళిదాసమహాకవి, కు. సం. (5-55)లో,—

1. 'లలాటికాచందన ధూసరాలకా" అన్నాడు. (లలాటికా తిలకః తస్యాశ్చందనేన ధూసరాః ధూసరవర్ణా అలకాః చూర్ణకుంతలాః యస్యాస్సా" అని, మల్లి. వ్యాఖ్య.)

అట్లే, తెనాలిరామకృష్ణకవి, ఉద్భటారాధ్యచరిత్రలో,—

2. "రాలుపుప్పొడి ధూసరములైన చూర్ణాలకంబులు కొనగోళ్లఁగలయ దువ్వి." (1-101) అన్నాడు.

చూర్ణకుంతలములు (సిందూరాది)చూర్ణమును ధరించినవేయైనయెడల ఆ చూర్ణముచేతనే, ధూసరములో - ధూమ్రములో అయ్యుండును గదా? అట్లయ్యేయున్నయెడల, మరల, 'లలాటికా చందనము' చేతను, 'రాలు పుప్పొడి'చేతను ధూసరములైనట్లుచెప్పుట తప్పుకాదా? అట్టితప్పును కాళిదాసమహాకవీ - రామకృష్ణకవీ చేసినట్లు భావించుట సాహసముకాదా?

3. "పృథాసుతా స్తేపి రథాధిరూఢా ద్విధా విచార్యైవ పురాన్నిరీయుః శరైర్విధాతుం ద్విషతోపి చూర్ణాం స్తత్సుభ్రువామప్యలకా నచూర్ణాన్"
(భా. చం. 2-136)

"తే పృథాసుతా అపి రథేష్వధిరూఢాస్సంతః శరైః ద్విషతః శత్రూన్ దుర్యోధనాదీన్ చూర్ణాన్ లవచ్ఛిన్నా నిత్యర్థః తేషాం ద్విషతాం సంబంధి

నీనాం సుభ్రువాం స్త్రీణా మలకాన్ చూర్ణకుంతలాన్ అచూర్ణానపి వైధవ్యేన కుంకుమాదిచూర్ణరహితాంశ్చ విధాతుమ్" (వ్యాఖ్య)

పాండవులు తమ శత్రువులభార్యల 'చూర్ణకుంతలము' లను - చూర్ణరహితములు చేయుటకు—అనగా వాండ్లను విధవలను చేయుటకు బయలుదేరినారట. సధవలు, చూర్ణకుంతలములందు చూర్ణమును ధరింతురు; విధవలు ధరింపరు-అనుటవల్ల ఏమి యేర్పడుచున్నది?

సధవలకువలెనే విధవలకును చూర్ణకుంతలము లుండుననియు, అవి స్వభావసిద్ధము లనియు, ఆ చూర్ణకుంతలములయందు చూర్ణమును ధరించుటయు, ధరింపకపోవుటయు ఇచ్ఛాధీనమనియు, చూర్ణమును ధరించినను-ధరింపకపోయినను అవి 'చూర్ణకుంతలము'లే ననియు, ఏర్పడుట లేదా?

కీచకుడు గాసిపెట్టినప్పుడు ద్రౌపదియొక్క చూర్ణకుంతలములు చెల్లాచెదరైనవట.—

4. "విలులిత చూర్ణకుంతలతయా చక్రవాతాకులీకృతవాలపూలికా చమరీమృగీవ,......యాజ్ఞసేనీ మందం మందం తదేవభవన మభిజగామ."

(భా. చం. 6-47)

అప్పుడు, సైరంధ్రిగానున్న ద్రౌపది, కురులందు సిందూరాదిచూర్ణము నలంకరించుకొను దశలో నున్నదా? లేదుగదా! మరి, ఆమె కుంతలములు - చూర్ణకుంతలము లెట్లయ్యెను? చూర్ణమును ధరింపని యా కురులను - కవి, చూర్ణకుంతలము లని యెట్లనెను?

5. "భయోత్సృష్ట విభూషాణాం తేన కేరళయోషితామ్,
అలకేషు చమూరేణు శ్చూర్ణ ప్రతినిధీకృతః." (రఘు. 4-54)

"...భయేన పరిహృతభూషణానాం, కేరళయోషితాం, అలకేషు చమూరేణుః - సేనారజః చూర్ణప్రతినిధీకృతః-చూర్ణస్యకుంకుమాది రజసః ప్రతినిధీకృతః..." (వ్యాఖ్య)

కేరళదేశకాంతలు రఘువువలని భయముచేత, అలకలయందు సిందూరచూర్ణాదిభూషణములను ధరింప మానినారు, రఘువుసేనల కాలిత్రొక్కిడికి చేగినదుమ్మే వారి యలకలకు (= చూర్ణకుంతలములకు) సిందూరాదిచూర్ణ మయినది.

చూర్ణమును ధరింపకపోయినను ఆ కొంతల అలకలు - చూర్ణకుంతలములే; ('అలకా శ్చూర్ణకుంతలాః'-గదా); మరి యపు డర్థమేమి?

6. "క్రియా ప్రబంధా దయ మధ్వరాణా
మజస్ర మాహూత సహస్రనేత్రః,
శచ్యాశ్చిరం పాండు కపోల లంబా
న్మందారశూన్యా నల కాంశ్చ కార." (రఘు. 6-23)

ప్రోషితభర్తృకయై యున్న కారణమున శచీదేవి కేశసంస్కారమును చేసికొనుటలేదు. కుసుమములను - సుగంధచూర్ణములను ధరింపకున్నను- ఆ మెకురులు 'అలక'లే- అనగా - చూర్ణకుంతలములే. అది యెలాగండీ!

ఎందు కింకను విస్తరము; చూర్ణకుంతలశబ్దము - చూర్ణమును ధరించుటనుబట్టి యేర్పడ్డది కాదు. ఆ శబ్దములోని చూర్ణము సిందూరాదిచూర్ణమున్నూ కాదు. అసలా చూర్ణము - విశేషణముగాని, విశేష్యము కాదు.

చూర్ణము = వక్రము

చూర్ణకుంతలము - విశేషణ పూర్వపదకర్మధారయము.

గురుబాలప్రబోధికలో,— 'అలకా శ్చూర్ణకుంతలాః' అన్నచోట- "చూర్ణాః కుటిలాః కుంతలాః చూర్ణకుంతలాః, కుటిలములైన వెంట్రుకలు. చూర్ణక్ష్వేదేచ కుటిలే-అని రభసుఁడు" అని చెప్పబడియే యున్నది.

అంతేకాదు, క్షీరస్వామి (అమరకోశోద్ఘాటన) టీకయందును, "అల్యంతే భూష్యంతేఽలకాః - చూర్ణకాఖ్యాః కేశాః (చూర్ణకుంతలాః) చర్చరాఖ్యాః కురలాశ్చ." - అని యున్నది.

శబ్దకల్పద్రుమములో, "కురలః - చూర్ణకుంతలః" అనియు, ఆప్టి-నిఘంటువులో, "కురలః - A curl, a lock of hair; చర్చరీకా - చర్చరీ—Curled hair; చర్చరీకః. Decoration or curling of the hair" అనియు నున్నది.

ఇక్కడ ఒక విశేషము :—

సూ.ని. లో, చర్చర కురల శబ్దములు లేవుగాని "చర్చరి = అరాళ కేశములు, నెఱికురులు; చర్చరీకము = కురులను నెఱులుగా దీర్చుట" అని యున్నది.

అందువలన - చూర్ణకుంతలములు, 'చర్చరము' లైనను, 'చర్చరు' లైనను, అరాళకేశములేగాని - సిందూరాదిచూర్ణమును ధరించు కురులు కావని, సూ.ని. వ్రాతనుబట్టియే యేర్పడుచున్నది.

అది యట్లుండగా, విశేష్యమయిన 'చూర్ణము'నకు పర్యాయములైన క్షోదము, క్షోదితము, వాసయోగము, పిష్టాతకము, ధూళి మొదలగు సంస్కృతపదములతోగాని, చూర్ణార్థకములైన, గందవోడి, బుక్కాము, నుగ్గు, నుఱుము, దుమ్ము, దూళి మొదలగు తెనుగుపదములతోగాని కూడిన కుంతలములు, కురులు కావ్యములలో కానరావు.

అనగా—క్షోదకుంతలములు, పిష్టాతక కుంతలములు; గందవోడి కురులు, దుమ్ముకురులు, దూళికురులు అనురీతి ప్రయోగములు లేవన్నమాట.

కాని, విశేషణమైన 'చూర్ణము'నకు పర్యాయములైన వక్రము, కుటిలము, అరాళము - అను సంస్కృతపదములతో గూడిన కుంతలములూ, అలకలూ-కావలసినన్ని యున్నవి. చూడండి :—

(1) "వక్రాలకంబుల్ మనోహరలోలాక్షులు చూప కవ్వలిమొగం బైనంత నేమాయె." (రామలింగనిచాటువు)

(2) "కుటిలాలక యెడమకన్ను కుడికన్నాయెఁ." (చాటు-రత్నా.)

(3) "కుటిలవృత్తివహించెఁ గుంతలములు." (ఆము, 5-7)

(4) "బాలిక రచిత ప్రణామ మునురీకృతపాణి పయోరుహాళిమా లిక కుటిలాలకాలిక." (ఉ. హరి. 5-169)

(5) "అరాళ కుంతలాచసా జటాభిరేవ భీషణః" (విశ్వ. 538)

(6) "రక్తపీతకపిశాః పయోముచాంకోటయః కుటిలకేశి, భాంత్యమూః" (కు. సం. 8-45)

(7) "చూర్ణాలకంబుల ప్రుక్కుఁ జక్కఁగఁ దీర్చి." (శృం. నై. 7-172)

(8) "భ్రూచాపేనిహితః కటాక్షవిశిఖోనిర్మాతు మర్మవ్యథాం
శ్యామాత్మాకుటిలః కరోతు కబరీ భారోపి మారోద్యమం
మోహం తావ దయంచ తన్వి తనుతాం బింబాధరో రాగవాఞ్
సద్వృత్తః స్తనమండల స్తవ కథం ప్రాణైర్మమక్రీడతి.
(గీతగో. 3 స. 7-6)

చూర్ణకుంతలములనే, తెనుగున,— నెఱికురులు, ఉంగరపుకురులు, ఉంగరపు వెంౘ్రుకలు - అంటారు.—

(1) "నెఱికురులుఁ విలోలసిత నేత్రయుగంబును." (భా.ఆది. 7-74)
(2) "నెఱులై యొప్పు వినీలకేశములు." (హరి. పూ. 5-119)
(3) "మరునికా, లాయస చక్రపరంపర
లో యన నుంగరపుఁగురులు యువతికి నమరుఁ." (ఆము. 5-9)
(4) "తోకతోక మాటలుఁ నోసలఁ దుంపెసలాడెడు నుంగరంపు వెంౘ్రుకలు." (కవిరా. 2-47)
(5). "ముంగురు లుంగరాలు, చనుమొగ్గలు బంగరుబొంగరాలు" (చాటు - రత్నా)
(6) "కుంతలాంచదరాళికుంత లాగరుగంధి
కుంతలామోదము ల్క్రాల్లలాడి." (శశాం. 2-28)

కుంతలదేశములోని - అరాళకుంతలలు - అగరుగంధి కుంతలములు కలవారట.

నెఱికురులనే, కుటిలాలకములు; అరాళకేశములు; చూర్ణకుంతలములు—అనుచుందురనియు, చూర్ణకుంతలశబ్దములోని 'చూర్ణము' వక్రార్థకమైన 'విశేషణము'గాని, సిందూరాది చూర్ణార్థకమైన - 'విశేష్యము' కాదనియు, అందువల్ల, సూ.ని. Hyphen లో చెప్పినయర్థము సరియైనది కాదనియు, ఉదాహృత గ్రంథసామగ్రివలన నిస్సంశయముగా నిర్ణయమైనట్లేకదా!

సూ.ని. బ్రౌణ్యము నెందుకు చూడలేదోగాని, అందులో,—"చూర్ణకుంతలములు - Curls, ringlets" అనియు,— "అలకలు - Ringlets, curls - చూర్ణకుంతలము"లనియు కలదు.

అంతేకాదు; ఆప్టి - నిఘంటువులోకూడా,—"చూర్ణకుంతలః - a curl, curly hair" అనే యర్థమున్నూ, 'సమంకేరళకాంతానాం చూర్ణకుంతలవల్లిభిః' (విక్రమాంక. 4-2) అనే ప్రయోగమున్నూ ఉన్నవి.

మరియు, క్షీరస్వామిటీకాసహిత నామలింగాను శాసనములోను, ఇంగ్లీషు అర్థములతో వావిళ్లవారు ప్రచురించిన అమరకోశములోనుకూడా,-

"చూర్ణకుంతలాః—Curls" అని యున్నది. సూ. ని. తిలకించితేగా! శ.ర. లోని యర్థమునెత్తి వ్రాసికొని, చల్లగా సాగిపోతే సరిపోయేది. ఎక్కువపనిపెట్టుకొని, సూ.ని. చిక్కుపడ్డది.

కుంతలములకు వక్రతయే అందము. (ఆవక్రత సహజముగా లేనివారు సంస్కారవిశేషములచేత కలిగించుకొనుటయును కలదు.) అందువల్లనే కవులు కుంతలములను వర్ణించునప్పుడు కుటిలతను తప్పక చెప్పుచుందురు.

ఒక కొన్ని యుదాహరణములు:—

1. "స్వభావవక్రాణ్యలకాని తాసామ్." (రఘు.)

2. "యస్యాధిమౌళిసవిధం ప్రథమం సమేత్య,
తిష్ఠన్కురూద్వహసుతో యుధి సాహ్యమర్థీ;
రేజే పరీక్షితుమివోత్సుకతాం దధాన
స్తత్కుంతలే నిజమనస్యపి వక్రిమాణమ్." (భా. చం. 8-10)

"దుర్యోధనః నిజేమనసి, తస్య శౌరేః కుంతలే కచేపి ద్వయోః వక్రిమాణం కౌటిల్యం తత్తారతమ్యమితియావత్ పరీక్షితు ముత్సుకతాం దధాన ఇవే త్యుత్ప్రేక్షా." (వ్యాఖ్య.)

శ్రీకృష్ణుని శిరోజములూ దుర్యోధనుని మనస్సూ, సహజవక్రములన్నమాట.

3. "కమలలోచనకుంతలములు వక్రములని
తనువల్లికకుఁ జక్కఁదన మొసంగె." (విక్ర. 4-17)

4. "కాంతాలకములందఁ గౌటిల్యసంచార
మతివల నడపుల యందఁ జడిమ,
రామచంద్రుఁడుపాలించు రాజ్యమందు" (భాగ. 9-335)

5. "కుంతలాధిపుచిక్కఁ కుటిలత్వ మెడలించె
సింధురాడ్భంగంబు క్షితికిఁదెల్పె,
... ... రాజవాహనుండు." (రాజ. విజ. 2-75)

6. "అళినీల కుటిల కుంతలములకాంతియు
...తలఁచి తలఁచి...ముదితయందుఁ
దనదు హృదయంబు నిలుపుటఁజేసె." (భార. ఆది. 3-27)

7. "వక్రాలకంబుల వలుఁదపిఱుందుల
దర్పగద్గద భాషితములఁ జేసి,
జనుల చిత్తములకు సంక్షోభ మొనరించు
కామినీజనము కలిగి." (భా. ఆది. 8-74)

8. "మందోదరీ కుటిల కోమలకేశభార
మందారదామ మకరందరసం పిబంతః" (ప్రసన్న. రా. 1-61)

9. "కురులఁ గుటిలతఁగావించెఁ, గుచములందుఁ
గఠినతవిధించె, సారసగర్భుఁడెలమి." (బిల్హ. 2-119)

10. "జలదేవతాహస్త చామరానిలములు
కుటిలాలకములకు గొండ్లిగఁజప" (కాశీ. 5-5)

11. "ఏతాః కరోత్పీడిత వారిధారా దర్పా త్సఖీభి ర్వదనేషు సిక్తాః
వక్రేతరాగ్రై రలకై స్తరుణ్య శ్చూర్ణారుణాన్ వారిలవాన్ వమంతి"
(రఘు. 16-66)

"ఏతాః తరుణ్యః వక్రేతరాగ్రైః జలసేకాత్ ఋజ్వగ్రైః అలకైః కరగైః చూర్ణైః కుంకుమాదిభిః అరుణాన్ వారిలవాన్ వమంతి వర్షంతి"
(వ్యాఖ్య.)

తడియుటచేత అలకలు వక్రేతరాగ్రము లైనవం టే, తడియకముందు వక్రాగ్రము లనియేగదా అర్థము?

12. "కుసుమోత్ఖచితా న్వళీభృత శ్చలయన్ భృంగరుచ స్తవాలకాన్,
కరభోరు, కరోతి మారుత స్త్వ దుపావర్తనశంకి మే మనః."
(రఘు. 8-53)

"కుసుమైః ఉత్ఖచితాన్ గ్రథితాన్ వళీభృతః భంగీయుక్తాన్ కుటిలా నిత్యర్థః. భృంగరుచః నీలాన్ తవ అలకాన్ - చూర్ణకుంతలాన్, "అలకా శ్చూర్ణకుంతలాః." ఇత్యమరః. (మల్లి. వ్యాఖ్య.)

అలక లనగా - చూర్ణకుంతలములే ననియు, అవి కుటిలములై యుండుట స్వభావ మనియు, పై కాళిదాసరచనవల్లను, మల్లినాథవ్యాఖ్య వల్లను తెల్లమగుచుండలేదా?

ఇన్నిమాట లెందుకు; అలకలను వక్రములుగానే చెప్పవలెనని కవి కల్పలతా శాసనము. (అనగా అది కవిసమయమన్న మాట.) చూడండి.

"వక్రా న్యలక ఫాల భ్రూనఖాం కోంకుశ కుంచికాః."

శిరోజములు మెత్తనై కుటిలములై యుండుట శుభలక్షణమట.—

"స్నిగ్ధ నీల మృదు కుంచితైకజా
మూర్ధజా స్సుఖకరా స్సమంశిరః" (వరాహమిహిరుడు)

ఇట్లెక్కడపట్టినను కుంతలములకు కుటిలతను చెప్పుటయు-చెప్పవలె ననుటయు, కనబడుచున్నదిగాని, సిందూరచూర్ణధారణమును స్వభావముగా చెప్పుటయు - చెప్పవలె ననుటయు, నెందును కనబడదు. చూర్ణమును ధరించుట, పువ్వులను - భూషణములను ధరించుటవంటి ఒక సంస్కార విశేషమేగాని, అది కుంతలములకు సహజలక్షణము కాదు. కుసుమములను ధరించుటయున్నను 'కుసుమకుంతలము' లనుట లేదు గావునను, భూషణములను ధరించుటయున్నను 'భూషణకుంతలము' లనుట లేదు గావునను, చూర్ణమును ధరించుటనుబట్టి 'చూర్ణకుంతలము' లనుట అనువుపడదనియు - చూర్ణకుంతల శబ్దమునకు - కుటిలకుంతలము లని యర్థముచెప్పుటే యుచిత మనియు ఇక్కడ గమనింపవలసిన యంశము.

అరాళము, కుటిలము, వక్రము అను విశేషణములతో కేశములను చెప్పుట పరిపాటియని సూ.ని. గమనింపలేదు. గమనించియున్నచో ఆయా పదములక్రింద సూచించి యుండవలసినది. అది నిఘంటుమర్యాద.

ఆప్టి-పండితుడు 'అరాళ' శబ్దముక్రింద "అరాళకేశి- a woman with curled hair - భిత్వానిరాక్రామదరాళకేశ్యాః— రఘు. 6-81" అని వివరించియున్నాడు.

బ్రౌను-పండితుడు— "అరాళము - Bent, curved, crooked. కుటిలమైన, వంకరయైన, రా. 5-297. అరాళంబులైన కుంతలజాలంబులును." "కుటిలము - Curled as hair - కుటిలాలకములు, Curly tresses. కుటిలకుంతలి or కుటిలాలకి, a girl with curly locks." అనియు చక్కగా చెప్పియున్నాడు. సూ.ని. చెప్పకపోవుటకు కారణ మేమి? ఏమియును లేదు. శ.ర. చెప్పలేదుగనుక తానును చెప్పలేదు.

## కర్మధారయము

ఇక్కడ ఒక్క మనవి :— అలకశబ్దమునకు, కుటిలకుంతలములని యర్థము. కుటిలత లేని సామాన్య-కుంతలములందును, ఆ శబ్దమునకు వాడుక కలదు. అంతేగాని, సిందూరాదిచూర్ణము ధరించు కురు లన్నయర్థమున 'అలక'కు వాడుక లేదు. అందువలన, అలకశబ్దార్థము బోధించు - చూర్ణ కుంతలములకు - సిందూరాది చూర్ణమును ధరించు కురులని యర్థముచెప్పుట యొప్పదు; గాని, చూర్ణమునుధరించు కుంతలములను నర్థమునసే కల్పింపబడిన - చూర్ణకుంతలశబ్దమున కా యర్థముచెప్పుటలో తప్పు లేదు. ఆ యర్థమున నది మధ్యమపదలోపి కర్మధారయసమాసము.

శబ్దకల్పద్రుమములో—"చూర్ణం వాసయోగ స్తద్యుక్తః కుంతలః చూర్ణకుంతలః, శాకపార్థివాదివ త్సమాసః" అని యుండనే యున్నది. బహుశః - దానిని బట్టియే సూ.ని. ఆ యర్థమును గ్రహించియుండవచ్చును. గ్రహించుటలో తప్పు లేదుగాని-అది నెతికురుల నెడి యర్థమునిచ్చు 'చూర్ణకుంతల'శబ్దమునకు - యౌగికార్థమనుటమాత్రము సరి కాదు; తప్పే యగును.

అల కా శ్చూర్ణకుంతలాః-అన్నచోట, అలక లనగా - చూర్ణమును ధరించు కురులు, అని కొందర రర్థము చేసికొన్నారు. కాని, యది గ్రహింపదగిన యర్థము కాదు.

అందువల్ల నే, శబ్దకల్పద్రుమకర్త, అలకశబ్దమునకు,—

"అలతిభూషయతిముఖ మలకః - భంగీయుతః కేశః"

అని తా నర్థముచెప్పి, అందు కుపబలకముగా,—

"అలతి భూషయతి ముఖమిత్యలకం - ఇతిభరతః; కుటిలకుంతలః ఇతి సుభూతిః; (సారసుందరీ), తత్పర్యాయః చూర్ణకుంతలః - ఇత్యమరః" అని, భరతసుభూత్యమరకారుల యభిప్రాయముల నుదాహరించి,—

కర్పూరాదేః క్షోదశ్చూర్ణం తస్యకుంతలాః—చూర్ణకుంతలాః తద్ధితత్రన్యస్యతే - ఇత్యన్యే" అని సూచించి వదలినాడు.

ఇతరనిఘంటుకర్తలు, బ్రౌను; సీతారామాచార్యులు; ఆప్టికూడా ఆ యర్థమును గ్రహింపకపోవుటయు నందువల్ల నే.

చూర్ణపర్యాయములైన క్షోద పిష్టాతకాది శబ్దములతోఁగూడి క్షోదకుంతలములు - పిష్టాతక కుంతలములు-అను, మధ్యమపదలోపి కర్మధారయములు భాషలో కనబడకపోవుటయే, అది సమంజసమైన యర్థము కాదనుటకు ప్రబలనిదర్శనము కదా.

ఏతావతా, చూర్ణకుంతలశబ్దములోని 'చూర్ణము' ఈ యలజడికంతకును మూలము. అది విశేష్యమనీ - సింధూరాదిచూర్ణమనీ కొందరు పెద్దలు భావించినారు. పొరపాటు. వారి వీరి మాట యెందుకు; ఆంధ్రమల్లినాథులును ఆ పొరపాటుకు లోనైనారు. చూడండి: శృం. నై. లో,-

1. "ఒక్క వరవర్ణిని చూర్ణాలకంబు లను నీల కజ్జలంబులకు దీపజ్వాలంబుగా మనశ్శిలా చిత్రకంబు నొసలఁ హత్తించె." (6-44)

అన్నచోట, "చూర్ణ అలకంబులు = పరిమళద్రవ్యచూర్ణమును వహించెడి ముంగురులు" అని టీక వ్రాసినారు.

వారు చూర్ణశబ్దమునుగూర్చి విచారింపకపోయినను, శ్రీనాథరచనకు మూలమైన శ్రీహర్షరచననైనను సవిమర్శముగా తిలకించియున్నచో అట్లు వ్రాసియుండరు.

"లలాటికాసీమని చూర్ణకుంతలా బభుః స్ఫుటం భీమనరేంద్రజన్మనః,
మనశ్శిలా చిత్రక దీపసంభవా భ్రమీ భృతఃకజ్జల ధూమవల్లయః."
(15-33)

అని మూలము.— "భైమ్యాః చూర్ణకుంతలా వక్రమండలీ భూతాః కేశాః" అని వ్యాఖ్య.

2. "ఫాలభాగంబుపైఁ బఱతెంచునప్పుడు
కమనీయ చూర్ణాలకములువోలె,
... ... ...
హోమధూమంబు బాలపై నొయ్యఁబొలసి." (6-103)

అన్నచోటగూడా, వారు కమనీయ చూర్ణాలకములను 'చూర్ణకమనీయాలకములు'గా తారుమారుచేసి "చూర్ణ = గందవొడిదాల్చెడి, (కమనీయ =) అందంపు, అలకములఁ = ముంగురులను" అని టీక వ్రాసినారు.

కాని, మూలము, వ్యాఖ్యానము ఇట్లున్నవి:

"తయా ప్రతిష్ఠాహుతి ధూమపద్ధతి
గ్గత్వా కపోలే మృగనాభిశోభితాం
యయాదృశో రంజనతాం ప్రశుతౌ శ్రితా
తమాలలీలా మలికేలకాయితా." (16-41)

"తతో పూర్వార్ధ్వతరం గచ్ఛన్తీ అలికే లలాటే అలకాయితా చూర్ణ కుంతలవ దాచరితా తత్తుల్యాజా తేత్యర్థః." (వ్యాఖ్య)

హోమధూమము చుట్టలుతిరిగి నొసటిపై వ్యాపించినప్పుడు - అలకల వలె (= ఉంగరములు తిరిగిన ముంగురులవలెఁ) నున్నదని ప్రకరణోచితమయిన అర్థము. అంతేగాని 'గండవొడిదాల్చెడి-ముంగురుల'వలె నున్నదని యర్థము కాదు.

ధూమమునకును కేశములకును సామ్యము కవిసమయసిద్ధము. కొన్ని యుదాహరణములు :—

1. "భర్మహర్మ్య శ్రీల ఖేలా సంభ్రమో చ్ఛ్వసిత విశరారు కేశబంధం బులో యనంగ బంధురంబులగు మంథరగంధవహ విహరణ విస్ఫురకాలా గురు ధూపధూమంబులును." (కళా. 2-9)

2. "అగరుధూపపుఁబొగల్ పొగరారు కురులుగా
నవగవాక్షము వీక్షణములు గాఁగ." (రామా. 6-103)

3. "నెఱి మిగులఁగలిగి నలుపై
తఱచై మదనప్రతాప దావాగ్నిశిఖల్
మెఱయు నవధూమ మనఁగాఁ
జెఱవకుఁ గచభరమువచ్చె దేవుని కరుణన్." (కాళ. మా. 1-53)

4. "ఆవర్తధూమచికుర ధు
రావహముగ శ్రుతిమనోహరస్వరము శుభాం
గా విష్కృతంబునై భా
మావేషము దాల్చె నపుడు మఖవాటి తగన్." (రామా. 3-18)

5. ప్రాసాద కాలాగురు ధూమరాజి స్తస్యాః పురో వాయువశేన భిన్నా
వనాన్నివృత్తేన రఘూద్వహేన ముక్తా స్వయం వేణి రివాబభాసే."
(రఘు. 14-12)

కుంతలములకు ధూమసామ్యము, వాటికి సహజమైన నీలిమచేతను చూర్ణత (=వక్రత)చేతనేగాని-(సిందూరాది) చూర్ణమును ధరించుటచేత కాదు.

కేశధూమసామ్యమును ఆంధ్రమల్లినాథు లెరుగరా? ఎరుగుదురు. నైషధములో,— "ఒక్క యలివేణి పెన్నెఱివేణిపై నెగయుచున్న ధూపధూమాంకురంబుఁ గనుంగొని కుటిలకచచ్ఛటాభ్రాంతిం గొనగోళ్ల దువ్వంబోయినఁ జెలులునవ్విరి" (6-44) అన్నచోట—"కుటిల...తిఁ= వంకరవెండ్రుక సమూహమనెడి భ్రమచేత, [ధూమము ఉంగరము లుంగర ములుగా నుండుటంజేసి *కుటిలకుంతలభ్రమ]" అని వ్రాసియేయున్నారు.

వచ్చినచిక్కెల్ల, 'చూర్ణకుంతల'శబ్దములోని 'చూర్ణము' విశేష్య మనుకొనుటలోనే.

ఐతే, "చూర్ణాలకములు = పరిమళద్రవ్యచూర్ణమును వహించెడి ముంగురులు, గందవొడిదాల్చెడి ముంగురులు" అని ఒకటికి రెండుతావులలో వ్రాసిన ఆ శాస్త్రిగారే,—

"చూర్ణాలకంబుల సుక్కుఁజక్కఁగఁదీర్చి." (శృం.నై. 7-172) అన్నచోట,—"చూర్ణ అలకంబుల = ముంగురులయొక్క, ('అలకాశ్చూర్ణ కుంతలాః" అమ.) ♦సుక్కు = ముడుతను" అని వట్టి ముంగురు లనియే వ్రాసినారు. ఎందువల్లనో?

---

* చెలులు, ధూపధూమమును 'కుటిలకుంతలములు'గా భ్రమించిరే గాని 'సిందూరాదిచూర్ణమునుదాల్చిన కుంతలములు'గా భ్రమింపలేదన్న విషయ మిక్కడ ముఖ్యముగా గమనింపవలసినది.

♦ సుక్కు = చిక్కు-అనుట యుచితము. శ.ర. లో 'సుక్కు =చిక్కు'అనియే యున్నది. కురులు, ముంగురులు-చిక్కువడుట స్వభావము. ఆ చిక్కును 'ముడుత' అనుట జాతీయముకాదు.

1. "చికురజాలంబులు సిక్కువడఁగ" (భాగ. 8-393)
2. "కుంతలేశ్వరుఁడు చిక్కుపడంగ" (పారి. 1-13)
3. "చిక్కువడు ముంగురులు దీర్చి" (దశా. 4-67)

ఒక విశేషము:—

'సింధూర చూర్ణాదులను ధరించునవి' యన్న వ్యుత్పత్త్యర్థము గలది, 'అలక' శబ్దము కాని, 'చూర్ణకుంతల' శబ్దము కాదు.

"అలకా శ్చూర్ణకుంతలాః" అన్నచోట, గు. బా. ప్రబోధికలో,— "అల్యంతే భూష్యంత ఇత్యలకాః. అల భూషణే. అలంకరింపఁబడునవి. "అలకా యక్షనగరే౽లకో౽స్త్రీ చూర్ణకుంతలే." అని రత్నమాలిక. 'స్వభావవక్రా ణ్యలకాని యోషితాం' అని ప్రయోగంబును" అని తెలియ జెప్పియున్నది.

నగలు, పూలు, సింధూరాదులును - భూషణములనియే పరిగణనము.

కచధార్యము; దేహధార్యము; పరిధేయము; విలేపనము—అని స్త్రీభూషణములు నాలుగువిధములు. అందు, పూలు-పుష్పాఁడి-మొదలయినవి కచధార్యములు.

అలకశబ్దమునకు - (సిందూరచూర్ణాది) 'భూషణములను ధరించునవి' యని వ్యుత్పత్త్యర్థము; చూర్ణకుంతలములు(=నెఱికురులు) అని రూఢ్యర్థము. ఈ యర్థమును, సూ.ని. తారుమారు చేసినది.

'చూర్ణకుంతలములు = వక్రకేశములు' అని యర్థముచెప్పిన ప్రాచీన నిఘంటుకర్తలు, 'చూర్ణము = వక్రము' అని చెప్పకపోవుట, ఆ తారు మారునకు మూలము.

చూర్ణకుంతలము శబ్దమనియు, దానికి 'సిందూరాదిచూర్ణమును ధరించుకురులు' అని యౌగికార్థమనియు, 'అలకలు, నెఱికురులు' అని రూఢ్యర్థమనియు వ్రాయుట సరికాదు.

సిందూరాదిచూర్ణమును ధరించుకురులు-అను నర్థమున 'చూర్ణకుంతలము' మధ్యమపదలోపి కర్మధారయమును, 'కుటిల కేశములు' అను నర్థమున,

---

4. "నీ నెఱికురుల్ చెలియ రే మలినుండు చిక్కుపఱిచె"
(ఉ. రా. 4-227)

5. "కురులు చిక్కుడలించి తలయంటి" (యయా. 4-89)

6. "చేరఁగరార నీ కురుల చిక్కుడలించెద" (శశా. 2-84)

విశేషణ పూర్వపదకర్మధారయమును కదా! మరి, నిఘంటువులు, పుత్రశోకము; జవ్వాజిసెట్టి; వంటలరంగమ్మ-వంటి,—(మధ్య. కర్మ.) సమాసములను, కుటిలకుంతలములు, నల్లనిగుఱ్ఱము వంటి, (వి. పూ. కర్మ.) సమాసములనుగూడా మూలపదములలో చేర్చి అర్థముల్రాయుపద్ధతి కలదా? అట్టి పనికి పూనుకొన్నచో ఆ నిఘంటువు పూర్తియగుట యెన్నియుగాలకు? అట్టి పనివలన ప్రయోజన మేమి?

"లేములేదు, 'చూర్ణకుంతల' శబ్దమును, అమరుడు—'అలకాః చూర్ణకుంతలాః' అని తన నిఘంటువులో పఠించినాడు. అందువల్ల ఇతర నిఘంటుకర్తలును ఆ శబ్దమును గ్రహించినారు" అంటారా!

అమరుడు— 'అలక' లనగా - చూర్ణకుంతలములు అని యర్థము చెప్పినాడు. అంతేగాని అదియొక శబ్దముగా చెప్పలేదు. ఒకపదమును చెప్పి, దానికి వ్యస్తపదములతోగాని, సమస్తపదముతోగాని, అర్థమును వివరించుట అమరకారుని పద్ధతి.

చూడండి :—

"దవో వనహుతాశనః"—దవః-శబ్దము; వనహుతాశనః - అన్నది యర్థము.

"కటాక్షో౽పాంగదర్శనే",-కటాక్షశబ్దమునకు, అపాంగదర్శనే-అన్నది అర్థము.

"చూచుకంతు కుచాగ్రంస్యాత్"— చూచుకశబ్దమునకు-కుచాగ్రమని యర్థము. (సూ.ని. 'కుచాగ్రము' నొక ప్రత్యేకశబ్దముగా చెప్పినది. అట్లుచెప్పుట సరికాదు.)

"ధమ్మిల్ల స్సంయతాఃకచాః"— ధమ్మిల్లశబ్దమునకు - సంయతాః కచాః-అన్నది అర్థవివరణము.

అట్లే, "అలకాః చూర్ణకుంతలాః" అన్నచోటను,— అలకాః - శబ్దము; చూర్ణకుంతలాః - అన్నది యర్థము.

అమరుడు, 'అలక' లనగా 'చూర్ణకుంతలము' లని యర్థముచెప్పి, "తే లలాటే భ్రమరకాః" (తే అలకాః లలాటోపరి పతితాశ్చేత్ భ్రమరకా ఇత్యుచ్యంతే) అనియు చెప్పినాడు.

అనగా—ఆ యలకలే నొసటిపైబడినప్పుడు భ్రమరకము లనబడు నన్నాడు.

కాబట్టి, అతడు 'చూర్ణకుంతల' శబ్దమును ప్రత్యేకశబ్దముగా పఠించినాడనుట పొసగదు.

'చూర్ణకుంతలము' కుటిలకుంతలమువంటి సమాసము గనుక, నిఘంటువు మూలపదముగా తీసికొనఁగూడదు. 'చూర్ణము (విశేషణము)=వక్రము, కుటిలము' అని చెప్పి, అందుక్రింద - చూర్ణకుంతలశబ్దమును చూపవలెను.

ఆప్టిపండితుడు, 'చూర్ణ' శబ్దమును మూలపదముగా చూపి, దాని కుండు అర్థములు చెప్పి, పిమ్మట Compound Words క్రింద—1. చూర్ణకారః. 2. చూర్ణకుంతలః. 3. చూర్ణఖండః. 4. చూర్ణపదం. 5. చూర్ణపారదః. 6. చూర్ణముష్టిః. 7. చూర్ణయోగః - అను పదములను చూపి యున్నాడు. (సూ.ని. లో—4, 6, 7 పదములు లేవు.)

సారాంశము:—

అలకలు, చూర్ణకుంతలములు-అను పదములకు, నెఱికురులు (=వక్రకేశములు) అని యర్థమేగాని, 'సిందూరాదిచూర్ణమును ధరించు కురులు' అని కాదు.

సిందూరాదిచూర్ణమును ధరించుకురులనుగూడా—'చూర్ణకుంతలము' లనవచ్చునుగాని, ఆ ల్లైవరును అన్నట్లు కనబడదు. అనియున్నచో అది సమాసము గాని, అలకపర్యాయపదము కాదు. నిఘంటువు మూలపదములలో గ్రహింపదగినది కాదు.

గ్రహించినను, 'చూర్ణకుంతలములు. ౧. నెఱికురులు. ౨. సిందూరాదిచూర్ణమును ధరించుకురులు' - అని భిన్నార్థములు చెప్పవలెనేగాని— ఒకటి యౌగికార్థముగా - ఇంకొకటి రూఢ్యర్థముగా చెప్పరాదు.

## 22. చూర్ణము

సూ. ని. "చూర్ణము = గంధపొడి; స్త్రీలు అలకలయందు పెట్టుకొను కుంకుమాదికము." అన్నది.

'గందవోడి' అని చెప్పితేచాలు. స్త్రీలు అలకలయందు పెట్టుకొను నదియు ఆ గందవోడే. అది భిన్నవస్తువు కాదు. కావున 'స్త్రీలు అలకల యందు పెట్టుకొను కుంకుమాదికము'' అని ప్రత్యేకముగా వివరింప నక్కర లేదు.

అది గందవోడియొక్క ఉపయోగమును తెలుపుట యనుకొందమా ? అది బొత్తిగా పొసగనిమాట. ఎందువల్లనంటే, అలా తెలుపదలచు కొన్నచో, ఆ గందవోడిని స్త్రీలు కుచములయందును పెట్టుకొందురు. కావున, ''స్త్రీలు కుచములయందు పెట్టుకొను కుంకుమాదికము'' అని కూడా చెప్పవలెను. సూ.ని. చెప్పలేదు.

మరియు నా గందవోడిని, పెండ్లిండ్లలో, తలఁబ్రాలు సమయమున, వధూ వరులు, ఒండొరులపై చల్లుకొందురు. ఆ గందవోడిని 'బుక్కా'మందురు.

''అబ్జవైరికి నిసికిఁ బెండ్లైనచోట
జంపతులకైన తలఁబ్రాల సమయమందు
భూమిపైఁబడినట్టి బుక్కామనంగఁ
బొలుపువహియించెఁ జక్కఁగాఁ బూర్వసంధ్య''
(బుద్ధచరిత్ర. 3-౧౦౨)

కాబట్టి, గందవోడి యుపయోగమున ఈ యంశమునుగూడా చెప్ప వలసి యుండును.

మరియు,—లజ్జామూఢలయిన స్త్రీలు, ఆచూర్ణమును - రత్నదీపముల నార్పివేయుటకు చల్లుదురట!

''అర్చిస్తుంగా నభిముఖమపి ప్రాప్యరత్నప్రదీపాన్
హ్రీమూఢానాం భవతి విఫలప్రేరణా చూర్ణముష్టిః''
(మే. సం. 2-7)

'చూర్ణస్య కుంకుమాదేః ముష్టిః' (మల్లి. వ్యాఖ్యా.)

మరి, 'స్త్రీలు రత్నదీపముల నార్పుటకుగాను, తెలివితక్కువగా చల్లు కుంకుమాదికము' అనికూడా నిఘంటువు చెప్పవలసినదేకదా! సూ.ని. యీ విషయముల నేల చెప్పలేదు?

ఎందుకు గ్రంథవిస్తరము. శబ్దముయొక్క యర్థము నేగాని, ఆయా వస్తువుల యుపయోగమును చెప్పుట నిఘంటుకృత్యము కాదు. (అసాధారణ విషయములలో తప్ప.)

'చూర్ణము'నకు 'పొడి'యనునది సామాన్యార్థము. 'పరిమళద్రవ్య చూర్ణము (=గంధవొడి)' యనునది విశేషార్థము. నిఘంటువు చెప్పవలసినది ఆ రెండర్థములనే. 'పొడి'యొక్క ఉపయోగమునుగాని, గంధవొడి యొక్క ఉపయోగమునుగాని చెప్ప నక్కరలేదు. చూడండి. శ. ర. "చూర్ణము = గంధవొడి, పొడి" అనిమాత్రమే చెప్పినది.

ఆప్టే - పండితుడును, "చూర్ణః - ర్ణమ్. Powder, Flour, Dust. Aromatic powder, pounded sandal, camphor etc" అన్నాడే గాని, ఆ యా వస్తువుల ఉపయోగాలు చెప్పలేదు. కాబట్టి సూ.ని. త్రొక్కినత్రోవ సరియైనది కాదు.

## 23. కిన్నరకంఠి

శృం.నై. (6-30) వ్యాఖ్యలో, ఆంధ్రమల్లినాథులు,- "కిన్నరకంఠి = కిన్నరుల కంఠమువంటి కంఠము గలది" అన్నారు.

'కంఠము గలది' యని చెప్పుట యొప్పదని కాబోలు, సూ. ని., "కిన్నరకంఠి = కిన్నరుల కంఠస్వరమువంటి కంఠస్వరము గలది. మధుర కంఠముగల స్త్రీ; స్త్రీ" అన్నది.

'కంఠ' మన్నను 'కంఠస్వర'మని యర్థమగును. కావున సవరింప నక్కరలేదుగాని, అట్లు సవరించి- అర్థము స్పష్టపరుచుట మంచిదే. కాని బహుకంఠ(స్వర)ములతో ఒక కంఠ(స్వర)మును పోల్చుట యుచితము కాదు.

మల్లినాథుఁడు,- 'కిమిదం కన్నరకంఠి సుప్యతే' (రఘు. 8. ६४) అన్నచోట,— "కిన్నరస్యేవకంఠోయస్యాస్సా కిన్నరకంఠీ" యని, ఒక కిన్నరుని కంఠ(స్వర)ముతోడి పోలికనే, చెప్పినాడు.

కాని, స్త్రీకంఠమును, కిన్నరుని (=పురుషుని) కంఠముతో పోల్చుటయు నుచితముకాదు. కావున, కిన్నర (స్వరము)వంటి కంఠ(స్వర)ము కలది, యని చెప్పనొప్పును.

'కిన్నర'— ఒక తెరగువీణ. వీణాస్వరముతో స్త్రీకంఠస్వరమునకు పోలిక చెప్పుట కలదు,

శ్రీ దూసి రామమూర్తిశాస్త్రిగారు, 'పారిజాత' (2-89) టీకలో,-- "కిన్నరకంఠి=వీణాస్వరముంబోలు స్వరముగలదానా" అనియే వ్రాసినారు.

శ్రీ. వె. సదాశివశాస్త్రులవారు, చం. ప. (3-90) టీకలో,— "*కిన్నరకంఠి = కిన్నెరవంటి కంఠముగలదానా" అనియే వ్రాసియున్నారు. స్త్రీకంఠమును వీణాస్వరముతో పోల్చుట కలదనుటకు, ఒకకొన్ని ప్రాచీన రచనలు,—

(1) పుష్పబాణవిలాసము.—

"తన్వీ సా యదిగాయతి శ్రుతికటు ర్వీణాధ్వని ర్జాయతే" (౨౧)

"గాయంత్యాః తస్యాః కంఠస్వరే శ్రూయమాణే వీణాధ్వనిః శ్రావ్యతాం జహాతీ త్యర్థః. వీణాస్వనమ ప్యతిశేతే తదీయకంఠస్వర ఇతిభావః" అని వ్యాఖ్య.

---

* వా. ని.—"కిన్నరకంఠి = కిన్నరధ్వనివంటి మధురకంఠధ్వనికల స్త్రీ; స్త్రీ." అని చెప్పినది. సూ. ని. చెప్పిన యర్థముసరిగాదని సంస్కరించినదని వేరుగాచెప్ప నక్కరలేదుగదా!

"వీణ ఒకేస్వరముపలుకక యేడుస్వరములుపలుకును. అందు ప్రధాన శ్రుతు లేడైయైనను ఇరువదిరెండు శ్రుతులు పలికింపబడును. అట్లు అనేక స్వరములు పలుకు వీణాస్వరముతో . స్త్రీకంఠస్వరమును బోల్చుట యనుచితము; హాస్యాస్పదము" అని వీ. బ్ర. గారి ఆక్షేపము.

వీణ యనేకస్వరముల నొక్కమారేపలుకు ననుకొనుట అవివేకము. కామినీకంఠస్వరమును వీణానినాదముతో పోల్చుటలో గల సారస్యము సాహిత్యజ్ఞానము, లోకజ్ఞానము కలవారికిగాని గోచరింపదు. ప్రాచీన రచనల నెఱుగనివారికి, కావ్యమర్యాద తెరుకపడదు— అని నా సమాధానము.

(చూ. 3-1-49 త్రిలిఙ్గ)

(2) బిల్హణీయము.—

"దూరేతిష్ఠతు వల్లకీకలరవః ప్రస్తావనాచే ద్గిరామ్"

'యామినీపూర్ణ యొక్క... వాక్సు వీణానినాదమును... అతిశయించు చున్నదని తాత్పర్యము" అని వేదం. పండితుల వ్యాఖ్యానము.

(3) చంద్రాలోకము.—

"అకారణా త్కార్యజన్మ, చతుర్థీ స్యా ద్విభావనా
శంఖా ద్వీణా నినాదోఽయ, ముదేతి మహ దద్భుతమ్"

"అత్ర శంఖత్వేన కామనీయః కామినీకంఠ స్తంత్రీ నినాదత్వేన తద్గీతం చాధ్యవసీయత ఇత్య కారణా త్కార్యజన్మ" (కువలయానందము)

(4) మనుచరిత్ర (బ్రౌనుప్రతి).—

"కలమధురవీణా నిక్వాణంబులరాణం ద్రాణఁజెరచు విన్నాణంబుల గొల్పు తెలుంగుల వేల్పుగాణలువాడు లక్ష్మీనారాయణుల కళ్యాణంపు పాటలు" (౫. ౭౬)

"కిన్నరీ నిక్వాణంబులరాణ=కిన్నరీవీణెలయొక్క మ్రోతవైఖరిని" అని, జూలూరివారి టీక.— "కిన్నరీ=కిన్నెరలనెడి వీణెలయొక్క" అని అనంతాచార్యులవారి టీక.

(5) వసుచరిత్ర :—

"కిన్న, రీనినా దానుకారి శారీశుకాది
ఘోష ఘుమఘుమితంబైన కోనఁగనియె" (౨.౨౪)

'కిన్నరీ = తంతెకట్టువాద్యభేదములలో నొకటైన కిన్నెరయొక్క' అని టీక.

(6) పారిజాతాపహరణము :—

"తలిరాకుఁబోఁడి యొక్కతి
జలకమునకు వేళయనుచు శౌరికి వీణా
కలకలములఁ గలకల నగు
పలుకుల మెల విన్నపముగావించెన్" (2-5)

'కిన్నరి' యన్నను వీణే :—

"తతవాదకసమీరహత కిన్నరీరుతుల్
కిన్నరీరుతులు నేకీభవించె" (వసు. ౧-౧౪౯)

## 24. చిరువడము

శ. ర. లో— "చిరువడము = (చిరుగడము) తియ్యకంద" అని యున్నది.

అట్లే, సూ.ని. యును, "చిరువ(గ)డము = ఒకజాతిదుంప, మధుర కందము" అన్నది. అంతేగాని, అసలు వస్తువేదో గుర్తించలేదు.

'చిరుగడము' అంటే, గెనుసుగడ్డ. చిరగడదుంప; చిలగడదుంప- అనియును వాడుక. కీ. శే. వేదం వేంకటాచలయ్యరుగారు, ఈ దుంపను గురించి యిట్లు వ్రాసియున్నారు:

"మోహానదుంపలు:— వీటికి ఇంగ్లీషులో 'Sweet potatoes', అనగా 'తీపుగల ఉరళగడ్డ' అని చెప్పుదురు. ఆంధ్రదేశమున ఒక్కొక్క భాగమున ఒక్కొక్క పేరుగలదు. కందమూలాలు, చిరగడదుంపలు, మోహానదుంపలు, గనుసుగడ్డలు"— (వివరములకు, చూ. ప్రజోత్పత్తి ఆషాఢ భారతి.)

వేంకట్రాయశాస్త్రిగారు, శృం. నై. (౬-౧౨౩)లో,— "చిరువడములు = చిరువడము లనెడి భక్ష్యవిశేషము" లన్నారు. ఆ యర్థమునకు వారి యూహాయే ఆధారము.

ఆం. భా. (౨-౬౨)లో- "చిరుగడంబనఁగను జెలఁగు మధురకందంబు" అని యున్నది. అందువల్ల నేకాబోలు, శ. ర. "చిరుగడము (=చిరువడము) = తియ్యకంద" అన్నది. కాని అట్లనుట సరికాదు. తియ్యకంద; దురదకంద - అనునవి మరియొక దినుసు దుంపలు. అవి 'సూరణ' జాతికి చెందినవి. కావున, చిరుగడము = మధురకందము, గెనుసుగడ్డ— అని చెప్పవలెను. గెనుసుగడ్డను సంస్కృతమున 'ఆలువు' అందురు. (చూ. శ.ర.) బ్రౌన్యములో,- "చిరుగడము. A sort of edible root; the same as గెనుసు. వకజాతిదుంప" అని చెప్పబడినది.

చిరుగడము - గెనుసుగడ్డయేగాని, భక్ష్యవిశేషము కాదన్నది మనకు ప్రకృతము. అందుకీ క్రింది గ్రంథమంతయును ప్రమాణము.

(1) "రాజనలతోడ శృంగబేరములతోడఁ
*జిరుగడపుఁ బెండలముతోడఁ జేమతోడ
నొప్పు నాలుగు పొలములం దుపవనములు" (భీమ. 2-56)

'చిరగడము' (= గెనుసు) పెండలము జాతిలోనిది. అందువలన - 'చిరగడపుపెండల'మనియు వ్యవహరింపబడును.

(2) "చమురుకొవళ్లు రాజనపు బియ్యంబులు
చెఱకు కోలలు కంద చిరుగడములు,...
గసగసలు చారపప్పు ద్రాక్షాఫలములు
గొనుచుఁ బ్రజలేఁగి రవనీశు కొలువునకును" (రుక్మాంగద. 3-6)

అడవిజాతులవారు రాజుకు కానుకగా - చిరుగడములు తీసికొని వెళ్లిరట. ఆ చిరుగడములు - భక్ష్యవిశేషము లేనని - ప్రాజ్ఞులు భావింతురా!

(3) శాలిగ్రామ నిఘంటుభూషణమను హిందీసంస్కృతకోశములో - "పిండాలు, స్వాదుకందః. హిం. శకర్‌కంద్. తెలుగు. చిరగడ" అని యున్నది.

(4) వస్తుగుణదీపిక - యను వైద్యనిఘంటువులో,—"గెనుసుగడ్డలు - చిరగడము, చిరగడదుంపలు, (ఎఱుపురంగు గలవి) Dioscorea Purpura.

---

* 'చిరువడము, చిరుగడముయొక్క రూపాంతరము' అన్న శ. ర. కర్త వ్రాత తప్పనీ, అవి భిన్నపదార్థములనీ, చిరువడము = చిన్నవడ, చిటిగారె యనీ, చిరుగడము = చిన్నగడ, బొంగు; దొమ్మరిసాని యాడునది యీ 'గడము'మీదనే - అనీ,—— వీ.బ్ర. గారిదొక వాదము.

అది తెనుగుమాటల ముక్కు-మొగ మెరుగని విపరీతవాదమనీ, వడ; గడ అను పదములను 'వడము' - 'గడము' అనుటయు, లఘురేఫయుక్తమైన 'చిరు' శబ్దమునకు 'చిన్న' అని యర్థముచెప్పుటయు—అందుకు తార్కాణమనీ నా సమాధానము. (చూ. 15-11-1948 త్రిలిఙ్గ)

ఆ బ్రహ్మంగారు చదివిన చదువులో—— కలవడము, కలువడము అనునవికూడా, (వడములే=) వడలే, గారెలే కాబోలును!

కలవడము = కలలోవచ్చే గారె; కలువడము = కల్లుతోచేసిన గారె- అని అంటారేమో-వారు. ఏమయినా అంటారు. వారిని కాదనువా రెవరు?

సం. రక్తపిండాలు, రక్తాలు, హిం. పిండాల్. వీనిని మాదీఫలపు దుంపలనియు, గెనుసుగడ్డలనియు నందురు. చిరగడదుంపలు (తెలుపురంగుగలవి) The white or country Potato'' అని వివరింపబడియున్నది.

(5) ఆంధ్రదీపికలో— "గెనుసుదుంప = చిరగడపు దుంపలలో భేదము'' అని తెలుపబడియున్నది.

(6) ఆంధ్రపదపారిజాతములో,—"చిరగడము = ఒకజాతిదుంప, గెనుసుదుంప = చిరగడపు దుంపలలో భేదము'' అని యున్నది.

కాబట్టి, వేదంవారు, "చిరువడములు = చిరువడములనెడి భక్ష్య విశేషములు'' అనుట తప్పు. సూ. ని. ఆ తప్పును, లోకమునకు తెలుపక పోవుట తప్పు. ఒప్పుగా భావించియే యున్నచో, తానా యర్థమును గ్రహింపక విడుచుట తప్పు.

## 25. చేవెలుఁగు

శ.ర.లో, "చేవెలుఁగు = దివటీ. దివటీ = కరదీపిక'' అనియున్నది.

సూ.ని. "చేవెలుఁగు. ౧ ఎదుటివస్తువుబాగుగా కనఁబడుటకై చేతితో కంటికికావించెడి అడ్డు, హస్తావరణము :— క. 'దీవించి యతని వదనముఁ జేవెలుఁగిడిచూచి' (హర. ౨-౪౯)—చ. 'చే, వెలుఁగునఁజూచు చూపుగల వృద్ధమహీసురుఁడు,' (విక్ర. ౨-౧౫౫.)''— అనిచెప్పి,— ౨. కరదీపము, కాగడా, దివ్వటీ (శ.ర.)" అన్నది.

'చేవెలుఁగు'నకు, సూ.ని. చెప్పిన మొదటి యర్థమే సరియైనదిగాని, శ.ర. నుండి తీసికొన్న రెండవయర్థము సరియైనదికాదు.

చేవెలుఁగు తత్త్వమును పరిశీలింపక, శ.ర. కర్త 'వెలుగు'నకు, 'దివియ' అని యర్థముచేసికొని, 'చేవెలుఁగు' = చేదివియ = కరదీపిక = దివటీ', అని, అంచెలమీద అర్థము నూహించినట్లున్నది. కాని, వెలుఁగునకు, దివియ, దీపము అను నర్థములులేవు. అందువల్లనే కరదివియ; చేదివియ; కాలుదివియ; కోలదివియ; నడదివియ, అన్న పలుకుబడులేగాని, ఆ యర్థమున,—కరవెలుఁగు; కాలువెలుఁగు; కోలవెలుఁగు; నడవెలుఁగు, అన్న పలుకుబడులు లేవు.

చేవెలుఁగు = దివటీ, అనుటకు, శ.ర. వ్రాతయేగాని, మరి ఆధారము లేదు. అట్టి నిరాధారపువ్రాతను పరిగ్రహించు టెట్లు? శ.ర. ప్రామాణికుడు కావున, ఆయనగారివ్రాతను త్రోసివేయజాలక తీసికొన్నామంటారా?

అలాఅయితే శ.ర. లో,—

'చాఱపప్పు = జీడిమామిడిగింజలోని పప్పు.'— 'తఱపి = తరుణము అనియుండగా, ఆ వ్రాతను బొత్తిగాత్రోసివేసి, సూ.ని.— "చాఱపప్పు = ప్రియాలపుఁ బప్పు" "తఱపి = ముదురు"—అనుట యేల?

ఇంకొకమాట : మనకు శ.ర. కర్త యెట్టి ప్రామాణికుడో, 'ఆంధ్ర మల్లినాథులు'ను అట్టి ప్రామాణికులేకదా! వారు, ఆముక్తమాల్యదా సంజీవనీ వ్యాఖ్యలో, (౪-౭) — "చేవెలుఁగు = (చేవ + ఎలుంగు) పటిమగల కంఠస్వరము; (పాఠాం. చేయెలుంగిడి – చేతితో కూడుకొన్న యెలుఁగు కావించి – చేయెత్తి కూకవేసి)" అని సెలవిచ్చి యున్నారే. ఆ వ్రాతను గ్రహింపక, సూ.ని. నిరాదరించు టేల?

ఎందుకు పెక్కుమాటలు? ఎంతటి పెద్దలకును ప్రమాదముతప్పదు. ఆ పెద్దలయందు మనకెంత అభిమానము – గౌరవము ఉన్నను వారి ప్రమాదములను, ప్రమాణముగా గ్రహించుట తగదు. అది శ్రేయము కాదు.

## 26. నడదివియ

శ.ర. "నడదివియ = దివటీ" అనిచెప్పి,-

"నడదివియలుసేసె నగరికి మాణిక్య
మకుటముల్ పూనిన మనుజపతుల" (భార.విరా. ౫. ఆ.)

అను ప్రయోగమును చూపినది.

సూ. ని. "నడది (దీ) వియ (నడ + దివియ) కరదీపిక, దివటీ, కాఁగడా" అనిచెప్పి, —

"నడదివియలు... ... పతుల" (భార. విరా. ౫-౭౧)

వ. "నడదివియలై మకుటారవిందరాగంబులు వెలుంగ నలుగడల సామంతసందోహంబు గ్రందుకొన"...(మనుచ. ౫-౩౨౦)

వ. "ముందఱంజను మూర్ధాభిషిక్తుల మణిగణంబులను నడదీవియలం గూడి. నైష. ౬-౯౦." అను ప్రయోగములను చూపినది.

శ. ర. కర్త–'నడదివియ'ను సరిగా గమనించక 'దివటీ' అన్నాడు. ప్రమాదము.

(ధర్మరాజు) మాణిక్యమకుటములు పూనిన మనుజపతులను, (తన) నగరికి, నడదివియలు చేసెన్ = నడవనేర్చిన దీపములుగా చేసెను. (అనగా వీథులవెంట నడిపించెను) అని భారతరచన కర్థము.

కవి, ధగధగ మెరయు మణికిరీటములతోడి మనుజపతులకును, చక్కగా వెలుగు దివియలకును పోలిక చెప్పినాడు. దివియలవలె వెలుగుటయే కాక, మనుజపతులు - నడచుటయును కలదు గావున, నడదివియలతో పోలిక. లోకములోలేని 'నడదివియల'తో ఉపమించుటచేత-అభూతోపమ. ఏతావతా తేలిన సారమేమి?

శ. ర. కర్త "నడదివియ = దివటీ" అనుట పొరపాటు. ఆ పొర పాటును గమనింపక, సూ. ని. ఆ శ.ర. వ్రాత నక్లేయెత్తి వ్రాసికొన్నది.

'నడదివియ'కు, శ. ర. యిచ్చిన భారతప్రయోగము చాలదని కాబోలు, సూ.ని. మనుచరిత్రనుండి, నైషధమునుండి, మరిరెండు ప్రయోగ ముల నిచ్చినది! అసలర్థము నెరుగక, యెన్ని ప్రయోగములిచ్చి యేమి ప్రయోజనము?

వెంకట్రాయశాస్త్రిగారి టీకలును, శ.ర.మీద ఆధారపడి యుండునవే కావున వాటిమాట అటుండుగాక. మనుచరిత్రకు, మహానుభావుడు బ్రౌను వ్రాయించిన దివ్యమైన టీకయున్నదే! సూ.ని. ఆటీక చదివికొని 'నడదివియ' యర్థమును తెలిసికొనియుండగూడదా?

చూడండి. ఆ టీక యెంత చక్కగా నున్నదో;-

*"నడదివియలై = నడకగల దివిటీలో అన్నట్టుగానే, కిరీటముల యందలి పద్మరాగమణులు ప్రకాశించగా...రాజసమూహము సందడి చేయుచుండగా."--

---

* వావిళ్లవారి టీకలోను,- "నడదివియలై = గమనముచేయుచున్న దీపము"లై అని సరియైన అర్థమే యున్నది.

ఇక్కడ నింకొక్క విశేషము :—

ఆ మనుచరిత్ర వచనములో 'చేదివియలు (=దివిటీలు)' వేరుగా చెప్పబడి యున్నవి. చూడండి.—

"నడదివియలై ... క్రందుకొన,... అందంద గ్రందుగా మండు చేదివియలు, చెందొవలునుం గా...నృపతిపథయమునాహ్లాదంబు" (౫-౯౯) (బ్రౌను, ౧౮౫౧ లో అచ్చువేయించిన ప్రతి.)

సూ.ని. ఆ వచనమును సమగ్రముగా చదువనైనను లేదుగదా!

ఇక, శృం. నై. లోని 'నడదివియల'ను చూతాము.— "ముందఱం జను మూర్ధాభిషిక్తుల మణికిరీటంబులను నడదివియలతోడం గూడి గంధతైలధారాభిషేక ప్రదీపితంబులగు కరదీపికా సహస్రంబులు...సంధ్యాంధకారంబు దూరంబుసేయ." (౬-౮౦)

"మూర్ధాభిషిక్తుల=రాజన్యులయొక్క ... నడదివియలతోఁ గా, కరదీపికాసహస్రంబులు = చేతిదీపముల (దివ్వటీల)వేలు." (సర్వంకషావ్యాఖ్య)

ఆంధ్రమల్లినాథుల - సర్వంకషావ్యాఖ్యలోను, నడదివియల రూపము స్పష్టముగాలేదు. కాకపోయినను - నడదివియ లనగా నడచుదీపము లని సరిగానే తెలుపబడినది.

సూ.ని. నైషధవచనమునుగూడా సమగ్రముగా చదువలేదు. చదివియున్నచో - నడదివియలు; కరదీపికలు వేరుగా చెప్పబడియున్న సంగతి గ్రహించియుండదా? అవి భిన్నవస్తువులని తెలిసికొనియుండదా?

ఇంతకును, సూ.ని. నడదివియ = కరదీపిక, దివిటీ, కాగడా, అనుట తప్పు.

'నడదివియ = నడచునట్టి దివ్వె' అనుట ఒప్పు-అని ఫలితాంశము.

## 27. నడకొలఁకు.

సూ.ని. "నడకొలఁకు=నడబావి. (నడ+కొలకు) దిగుడుబావి." అని యర్థముచెప్పి, అందు కీ క్రింది పద్యమును ఉదాహరించినది.

"ఒడికపుఁ దన సొబగున కె
క్కొడు చెన్నులు గలుగఁజూచి కొల నా యన్నుల్
నడకొలఁకు లంచు వారికిఁ
గడువేడుకఁ దమ్మితావి కానుకఁజేసెన్" (య. 3-౨౪)

ఆ యన్నులు, నడకొలఁకులంచున్ = దిగుడుబావులని, కొలను (కర్త) ఆ యన్నులకు, తమ్మితావిని - కానుక చేసినవట! ఇది, సూ. ని. ఊహించిన యర్థము. సరిగా నున్నదా?

ఆ స్త్రీలు దిగుడుబావులైతే - కొలను ఆ దిగుడుబావులకు కానుక చేయవలసినపనియేమి?

అసలు, 'నడకొలఁకు=నడబావి', 'దిగుడుబావి' అనుటయే తప్పు. నడకొలకు-అనగా, నడువనేర్చిన కొలకు-గాని, నడబావి కాదు; దిగుడుబావి కాదు.

ఆయన్నులు కొలనుకంటెను మిన్నగా చెన్నులు కలిగియున్నారనియు ఇటునటు తిరుగుచున్నందున — నడువ నేర్చిన కొలకులో — అన్నట్లున్నా రనియును — ఉత్ప్రేక్ష.

కొలను, తాను నడువ నేరనిది; కావున, నడువనేర్చిన ఆ కొలకులను పెద్దచేసి, కానుక లర్పించినదని భావము.

సూ.ని.కి పదార్థమే తెలియలేదు. ఇక పద్యార్థము తెలియు టెట్లు? భావము తెలియు టెట్లు?

సూ.ని. కొలను అంటే, బావి అనుకొనుట వింతగాలేదా? లోకములో, చేదుడుబావులు; దిగుడుబావులు అని బావులు రెండువిధములు. దిగుడు బావులనే నడబావులంటారు.

"చేదుడుబావి—a draw well, in which the bucket is raised by the hand. నడబావి. "A well with steps down into it" (బ్రౌను)

మరి, కొలకులలోకూడా, నడకొలకులు; చేదుడుకొలకులు- అని రెండువిధము లున్నవా? లేవే! సూ.ని. నడకొలకును-నడబావిగా భ్రమించు టకు కారణ మేమి?

'కొలఁకు'నకు సరసి-యని, యర్థముచెప్పి,— "కొలను కొలఁకు నాఁగ సరసి వెలయు"నన్నఆం. భా. (1-63) పద్యమును కూడా ఇచ్చియున్నదే!

అది యట్లుండఁగా, 'ఒడికపు=ఒడికమైన, తన=తనయొక్క, సొబగు' అన్నచోట—'ఒడికపుఁదనసొబగు' అని నుగాగమ సంధికార్యమును జరిపిన దేమిటికి? ఆ 'తన' త్వార్థప్రత్యయము కాదే? తన ఒడికపుసొబగు-అనిగదా అక్కడ అన్వయము?

ఇంతవిచారణ పెట్టుకొన్నవా రెవరు? అచ్చుపుస్తకములో 'పుఁదన' అని యున్నది. సూ.ని. అట్లే కాపీవ్రాసికొన్నది. అదేమీ? అంటే 'పుఁదన' అనియే పాఠమంటుంది?

మరియొక మాట:—

అచ్చులో ఉన్నప్రకారము, సూ.ని. "కానుకఁజేసెఁ" అన్నదిగాని అట్లనుటయును తప్పే. 'కానుకచేసెఁ' అనిగాని, 'కానుకసేసెఁ' అని గాని అనుట ఒప్పు.

'కానుకచేసెఁ' అనునది ఏకపదక్రియ. కానుకగా చేసెను—అని యర్థము. కానుకను + చేసెను, అని వ్యస్తముగా భావించుట పొరపాటు.

ఆ సూ.ని. యే, 'కానుక' క్రింద, "రాజమార్గచిరత్నరత్నసౌధ శ్రీలు, గడురక్తిఁ గుంకుమకాన్కసేయ" (ఉ. రా. ౧-౫౩౯) అని పఠించి యున్నది. కాని, మళ్లీ 'కైకానుక' క్రింద,—"నీకుఁ గైకాన్కఁజేసెద నేఁడుదాని" (శుక. ౨-౨౫౯) అనియే ముద్రించినది. అది తప్పు.

"కైకాన్కచేసెద"

అనుట సాధువు. శ.ర.లో, 'కాన్క' క్రింద,-"గుములుగాఁ బొలుచు పూగములఁ జెన్నొందు పూగములఁ గొన్నింటిఁ గైకాన్కచేసి" (చంద్ర.) అనియేయున్నది.

## 28. నడగోట

సూ.ని.—"నడగోట = నడకకల కోట" అని యర్థముచెప్పి, ఆ యర్థమునకీ క్రిందిపద్యమును చూపించినది.

సీ. రంగదుత్తుంగతరంగ సంఘాతంబు
నడగోటల తెఱంగు నడపుచుండ. (ప్రభా. ౧-౬౪)

అంతేకాదు; నడకొండ; నడతాడి; నడదీఁగె; నడపీనుఁగు; నడమామిడి-అను పదములుగూడా మూలపదములలో పఠించి, నడకగలకొండ; నడకగల తాటిచెట్టు; నడకగల తీఁగె; నడచునట్టి శవము; నడకగలమామిడి చెట్టు; అని యర్థములుకూడా వ్రాసినది.

నిజానికి, నడిచేకోటలు, నడిచేకొండలు, నడిచేచెట్లు, నడిచేశవాలు, లోకములో ఉన్నవా? లేవుగదా. మరి లోకములోనే లేనివాటినిగూర్చి యింతగా తడవనేల? ఎరుగని అమాయికప్రజలు నడిచే-శవాలు, చెట్లు, కొండలు, కోటలుగూడా ఉంటవికాబోలు ననుకొనరా! ప్రమాదహేతువు కాదా!

శ.ర. 'నడదివియ'ను గ్రహించలేదా? అట్లే, సూ.ని. 'నడగోట' వగైరాలను గ్రహించినది. తప్పేమీ, అంటారా?

నడదివియ-అనగా, నడచునట్టి దివియ-అని, శ.ర. గుర్తించలేదు. అది, ఒకరకమైన కాగడా-అనుకొన్నది. అందువల్ల ఆ పదమును గ్రహించినది. అంతేగాని, నడచుదివిటీ-అని తెలిసికొనియుంటే గ్రహించియుండదు.

నడ (=నడచు) అను విశేషణముతో కూడిన 'నడగొండ' మొదలగు పదములు కైకొనదగినవి కావన్న భావముతోనే శ.ర. వదలినది. అంతేగాని ఆ శబ్దములను సూ.ని. యెరిగినమాత్ర మెరుగక కాదు.

నడగోట; నడగొండ ప్రభృతులు, కవులు చమత్కారముకొరకు కల్పించుకొన్న శబ్దములుగాని సహజములు కావు. వాని యర్థమూ-అందలి చమత్కారమూ, వివరించుపని, ఆయా రచనలకు వ్యాఖ్యానములువ్రాయు పండితులదిగాని, నిఘంటుకర్తలది కాదు.

ఆ పదములు గ్రంథస్థములై యున్నవి కావున, నిఘంటువుగ్రహించి అర్థము చెప్పినది. తప్పేమి అంటారేమో?

అలా అయితే, సూ.ని. గ్రహించిన 'నడగోట'కు, మీదా క్రిందా,- 'జంగమోద్యాన' మొకటీ; 'చరసౌధ' మొకటీ, ఉన్నవి. చిత్తగించండి:

1. "ఆలోలశైవాలజాల లాలిత్యంబు
జంగమోద్యానవేషము వహింప,
డిండీరమండలాఖండ సౌభాగ్యంబు
చరసౌధచయవిలాసము భజింప."

సూ.ని. ఆ రెండు పదములను గ్రహించి,— జంగమోద్యానము = నడకగల తోఁట.— చరసౌధము = నడకగల మేడ;— అని యేల అర్థము వ్రాయలేదు ?

అంతేకాదు — ఆ విరాటపర్వపద్యములోనే 'నడదివిసుల' క్రింద 'సచేతన త్యాగధ్వజము' లున్నవి. చూడండి.—

2. "ప్రీతార్థి జనుల సచేతనత్యాగధ్వ
జములుగా నన్ని దేశములఁ బఱపె."

మరి, నిఘంటువు 'సచేతనత్యాగధ్వజము' అను పదమునుగూడా మూలపదముగా గ్రహింపవలసినదేనా ? (సూ.ని. సకారముక్రింద గ్రహించును కాబోలు !)

3. ధనాభిరామములో,——

"నడపాడనేర్చిన నవకంపులత లనఁ బొలుపొందు వెన్నెల బొమ్మలనఁగ" (౨-౨౩)

అని యున్నదట. (సూ.ని. యే 'నడపాడు' క్రింద చెప్పినది.)

వకార మింకను రాలేదు గనుక 'వెన్నెలబొమ్మల'మాట పోనిండు. సూ.ని. 'నడపాడనేర్చినలతలు = నడవనేర్చిన తీగెలు' అని నకారముక్రింద చెప్పకపోవు టేల?

4. "జంగమరోహణాద్రి సదృశంబులు తత్పురిఁగల్గు భద్రసా
రంగవరేణ్యముల్" (చంద్రి. పరి.)

5. "జంగమవల్లులో, యమృతసాగరవీచులో" (భాస్క. రా.)

ఇత్యాదిరచనలను సూ.ని. యెరుగదా? "జంగమరోహణాద్రి = చరించురోహణపర్వతము; జంగమవల్లి = చరించుతీవె" అని, జకారము క్రింద, వ్రాయక వదలుటేల?

6. కళాపూర్ణోదయములో,—“చరన్మహాద్రినాఁ, బట్టగుచుక్ గడుక్ మెఱయు పట్టపుటేనుఁగునెక్కి—” (8-77) అని యున్నదిగదా.

‘చరన్మహాద్రి = నడచుచున్న పెద్దకొండ’ అని సూ. ని. వ్రాయక పోవుటేల?

7. “ఇటులుండ వద్దెమో, చక్కెరబొమ్మ యంచు సరస ప్రతిభాషల నిచ్చగింపుచుక్.” (హంస. 1-84)

అన్న పద్యమును సూ ని. చూచియుండలేదు కాబోలు! చూచియే యున్నచో—‘చక్కెరబొమ్మ = పంచదారతో చేసినబొమ్మ’ అని వ్రాసి యుండెడిదేకదా!

ఇంకొక్క మనవి:—

మాఘకావ్యములో, ‘పతత్పతంగ ప్రతిమస్తపోనిధిః’ (౧-౧౨) అని యున్నదిగదా. మరి, గ్రంథస్థమైయున్నదని ‘పతత్పతంగ’ శబ్దమును పుచ్చుకొని, నిఘంటువు, ‘పడుచున్నసూర్యుఁడు’ అని యర్థము వ్రాయ వలసినదేనా? ఏ నిఘంటువైనా వ్రాసినదా? సూ.ని. ఘకారముక్రింద వ్రాయునా?

ఎందు కింకను విస్తరము.—కవులు చమత్కారప్రియులు. వారు తమ చమత్కృతినిర్వహణార్థము సృజించుకొను శబ్దములు చిత్రవిచిత్రములు. వాటితత్త్వము వేరు; వాటియర్థము వేరు; వాటి ప్రయోజనము వేరు. సామాన్యశబ్దములవలె వాటిని నిఘంటువు తీసికొని ముక్కకు ముక్కగా అర్థముచెప్పుట ప్రమాదము.

“శ్రీ చన్గొండలు రెండు నండగొని” అని యున్నదిగదా యని—నిఘంటువు,— ‘చన్గొండలు = చన్నులనెడి కొండలు’ అని యర్థము వ్రాయ వచ్చునా? వ్రాయగూడదు. అట్లే నడగోట; నడమామిడి: మొదలగు పదములనుగూడా-నిఘంటువు గ్రహించగూడదు. అర్థములు వ్రాయకూడదు.

## 29. నిలక

సూ.ని. ‘నిలక’ అనుపదానికి ‘నిలుపు’ అనియర్థముచెప్పి ఆ ప్రక్కన (చి.ని., శ.ర, బ్రౌ.) అని సూచనచేసి పోయినది. అంతేగాని - ఆపదము

నకు సమగ్రమైన అర్థమేమో, ఆ పదమును లోకము వాడుచున్న విధ మెట్టిదో తెలుపలేదు.

చి.ని. (చిన్నయసూరి నిఘంటువు) నాకు లభించలేదు. శ.ర.లో "నిలక = నిలుపు. (ఇదినాకు నిలకయియ్యలేదు.") అనియున్నది. ఇది యననేమో తెలిసికొనదగిన మార్గ మంచులేదు. కాని బ్రౌణ్యములో,— "నిలక Standing. యీయేరు నిలకయివ్వదు. I cannot keep my footing in the current" అని చక్కగా చెప్పబడియున్నది.

చూచారా, బ్రౌణ్యమునుచూచేవరకూ-'నిలక' తత్త్వము తెలియలేదు. ఎంతో డబ్బుపెట్టి, సూ.ని. వంటి పెద్దనిఘంటువు కొనియు, సామాన్య శబ్దార్థములకును, ఇతరనిఘంటువుల నాశ్రయింపవలసివచ్చుట శోచనీయమైన విషయముకాదా?

బ్రౌణ్యములో చక్కగానున్న వివరణము, శ. ర. లో అరగొర యగుటయు, ఆ యరగొరయు, సూ.ని. లో అదృశ్యమగుటయు ఎందువల్ల?

నిఘంటువు, ముఖ్యముగా - మూలపదములలోనే - చెప్పవలసినది 'నిలకయిచ్చు' అనుక్రియను. అది శబ్దపల్లవక్రియ. దాని స్వరూపము నెఱుగని పెద్దలు-దు.సూ.నా.శా. వంటివారు—ఇచ్చు, క్రియ; నిలక, కర్మ. కావున- 'నిలకనిచ్చు' అనవలెనని వాదింతురు. అట్టివాదమున కవకాశములేకుండు నట్లు నిఘంటువు, నిలకయిచ్చు - అను క్రియనే చూపవలెను.

ప్రవాహవేగము కాలానననీయకపోవుటను తెలుపు సందర్భముననే (సామాన్యముగా) ఈ క్రియకు వాడుక. బ్రౌనుదొర, శ.ర. కర్త, వారి ధర్మమాయని, ఆ వాడుకను ఉదాహరణ వాక్యములోనైనను తెలిపినారు. సూ.ని. ఆమాత్రమును తెలుపకపోయెగదా!

## 30. కుటిలము

కుటిలము - అనుపదమునకు, లోకవ్యవహారమున 'జబ్బు' అనే యర్థ మున్నది. ఆ యర్థమును గ్రహించి బ్రౌను, కుటిలము-అను పదముక్రింద,— "యింకా దేహములో కుటిలమువున్నది. the illness is not yet entirely

cured" అని ఉదాహరణతోఁగూడా చెప్పినాడు. సూ.ని. యీ యర్థమును చెప్పలేదు. కారణ మేమిః

లోకవ్యవహారమునను-ఒకనిఘంటువులోనుగూడా, ఉన్న యర్థమును గ్రహింపకపోవుట పొరపాటు కాదాః

'పొరపాటో,గ్రహపాటో-ఆయర్థమును శ.ర, చెప్పలేదు;కనుక నేనును చెప్పలేదు' అంటుంది కాబోలు! సూ.ని.—ఒప్పుకోదగిన సమాధానమగునాః

## 31. నడనిచ్చు

సూ.ని. 'నడచు' అను పదము క్రింద, "నడనిచ్చు = నడువనిచ్చు" అని యర్థము చెప్పి,—

"అడుగైన నడనీక యాఁకవెట్టినసిగ్గు
సంపూర్ణమదధార సరణిఁబోదల." (కళా. ౪-౧౦)

అను పద్యము నిచ్చినది.

అచ్చుపుస్తకములో, పాఠము 'నడనీక' అని యున్నది. కనుక సూ.ని.యు, 'నడనీక' అనియే అన్నది. అయితే, ఇంతకును ఆ పదము, పడనీక; చెడనీక; పడనిచ్చు; చెడనిచ్చు, వంటి క్రియయే అగునాః అగుచో నిఘంటువు, అదియొక పదముగా గ్రహించి, అర్థము చెప్పనేలః

అట్టిక్రియ కాక, దారియిచ్చు; తెరువిచ్చు; నడకయిచ్చు; నిలక యిచ్చు వంటి శబ్దపల్లవక్రియ యగునాః అలా అయినచో 'నడనిచ్చు' అనగూడదు. 'నడయిచ్చు' అనవలెను. అప్పుడు, పాఠము 'నడయీక' అని యుండవలెను. నడయిచ్చు - అను క్రియ, 'నడయాడు' వంటిదగును. అప్పుడు 'నడ' విశేష్యముగాని, క్రియ కాదు. అందువలన ఆ క్రియను 'నడ' క్రింద చూపవలెగాని 'నడచు' క్రింద చూపగూడదు.

బ్రౌణ్యములో "నడ - Trip or journey. పడవ మూడు నడలు వచ్చినది the boat made three trips. అని చెప్పబడియున్నది.

"నడ = నడచెడి త్రోవ" (ఆంధ్రదీపిక)
"నడ = నడక, గమనము" (శ.ర.)
"జడధు లెల్లను కాలినడలుచేసె" (వసు. 1-46)

ఈ ప్రమాణములనుబట్టి,— నడయీక = ప్రయాణము సాగనీక, (కదలనీక) అని యర్థము చెప్పదగునని యేర్పడుచున్నది; 'నడ' విశేష్య మనియు స్పష్టమగుచున్నది.

నడ, యనగా- 'నడక'యే. ఏపు నడకయిచ్చ్యలేదు - అను వాడుక ఆబాలగోపాల విదితము.

"ఎగువ వేదగిరి - దిగువ జొన్నవాడ - నడుమ పెన్నాదేవి-నడకియ్య వమ్మ" అను రీతి (గేయ) రచనలునూ కలవు.

## 32. కౌలుదివియ

బ్రౌనుదొరగారు, "కౌలుదివిటి - a burning torch" అన్నారు. తప్పు.

ఆచార్యులవారు, శ.ర.లో "కౌలుదివియ = కొఁగడా" అన్నారు. అదియును సరికాదు. దివియయే, కొఁగడా అయ్యుండగా- మరి 'కౌలు' అనుట యెందుకు ?

సూ.ని. "కౌలుదివియ = నడచువారికి దారిచూపుటకై యుపయోగించు కొఁగడా; కొఁగడా" అని రెండర్థములు చెప్పి, యీ క్రింది పద్యమును చూపినది.—

"వారు సంభ్రమించి వడిఁగాలుదివియలు గొనుచు....నృత్తశాలఁ జొచ్చిరి. భార. విరా. 3-౭. (ప్రాఁతప్రతి. చి.ని.పా.)"

కౌలుదివియ తత్త్వము, సూ.ని. కిని తెలియలేదు. నడచువారికి దారి చూపుట కుపయోగించు కొగడా, కొగడా, భిన్నము లనుకొనుట పొర పాటు. కొగడా, దారిచూపుట కుపయోగించదా? దారిచూపుటకు కౌలు దివియనే ఉపయోగింపవలెనా?

గొడవ యెందుకు. 'కౌలుదివియ' (=కౌలుదివిటీ) రాచమర్యాదకు చెందినది. ప్రభువులు నడచునప్పుడు, దివిటీలు పట్టినవాండ్లు నిటూన నిలుచుండి నడవక, వంగి, దివిటీలను నడచువారి మోకాళ్లక్రింది కుండునట్లు వంచి, ముందుపోవుచుందురు. అట్లు పట్టెడుదివిటీకి 'కాల్దివిటీ' యని వ్యవహారము.

కాలిదివిటీ మర్యాద, గద్వాలాదిసంస్థానములలో ఇప్పటికిని కలదు. వెనుకటికి, వేములవాడ భీమకవి పెట్టిన శాపముచేత రాజ్యమును కోలుపోయిన రాజకళింగగంగు, దరిద్రుడై భిక్షమెత్తుకొనుచు - ఒకనాటి రాత్రి కటికిచీకటిలో దారికానక ఒకగోతిలో పడి "ఛీ! కాలిదివిటీలేని బ్రదుకేమి బ్రదుకురా" అని విసుగుకొన్నాడట. (వివరములకు, చూ. చాటు. మంజరి. పుట. 76)

సూ.ని. యీ కథనైనను వినలేదు కాబోలు! చాటుపద్య మణిమంజరి వంటి ప్రసిద్ధ గ్రంథమునుగూడా, సూ.ని. యెరుగకుండుట వింత కాదా?

కాలుదివిటీని గ్రహించిన శ.ర. 'పగలుదివిటీ' నేల గ్రహింపలేదో? అదియు కాలుదివిటీ వంటిదే.

పగలు దివిటీ, కావ్యములలో నున్నది.—

1. "ధ్వజవాతహతి నార వైద్యుతాగ్నులఁ జూడి
*పగలుదీవెలవారు పంజులెత్త" (మను. 5-52. జా. ప్ర.)

2. "అల విరిపింటిదంట ముదమారఁగ నీ వెనువెంటరా ధరా
స్థలిపడిఁజేరి యామని యుదారతపఃక్రమమెల్ల మాన్చి యు
జ్జ్వలగతివచ్చు నీకుఁ జెలువా యొనగూర్చు వహింప నీ సురా
బలలు శిరోనతిం బవలుపంజులు చంద్రికపావడక్ రహిన్"
(చంద్రికాపరి. 2-52)

---

* ఈ పద్యమును, సూ. ని. 'దీవెలవాఁడు' అను పదమున కుదాహరణగా చూపినది. పొరపాటు.

పద్యమున నున్నది 'పగలుదీవెలవారు' గాని, వట్టి 'దీవెలవారు' కారు. "పగలు దివియలవారు=పగలు దివిటీలుపట్టువాండ్లు" అని, అక్కడ జూలూరివారి టీక. "పగలు దివ్వెలవారు = దినవేళను కాఁగడాలు పట్టువారు" అని వావిళ్లవారి టీక.

అది యట్లుండగా — 'దీవెలవారు' అను, బహువచనరూపమునకు, ఏకవచనరూపముగా, సూ.ని. "దీవెలవాఁడు" అనుట తప్పు. దివ్వెలు -

'కొలుదివియ' (=కొళ్లకు ముందు పట్టు దివిటీ). 'పగలుదివియ' (=పగటి దీవిటీ) అనునవి-మర్యాదాచిహ్నములుగాని, దివిటీ దినుసుభేదము కొదనియు, సూ.ని. వ్రాసినయర్థము తప్పనియు సారాంశము.

కొల్దివియ తత్త్వము తెలియనందుననే, సూ. ని. భారతపద్యమును గ్రహించుటలోను-తప్పు చేసినది.

వావిళ్ల-వారిప్రతిలోను, ఆనంద-వారిప్రతిలోనుకూడా,—
"వారు సంభ్రమించి వడిఁ గోలదివియలు గొనుచు"

అను సాధుపాఠ మగపడుచుండగా-సూ.ని. దానిని తోసివేసి, ఎక్కడనో-పాతప్రతిలోనున్న "కొలుదివియలు" అను అసాధుపాఠమును తీసికొన్నది. చిన్నయసూరి నిఘంటువులోను-'కొలుదివియలు' అనుపాఠమే యున్నదట. ఉండుగాక. అది సరియైనపాఠమగునో కాదో పరిశీలించిగదా పరిగ్రహింప వలసినది.

పై పద్యములో 'దివియలు' గొనుచుపోయినవారు కావలివారు. కావలివారు ప్రయోగించునవి 'కోలదివియలు'గాని 'కొలుదివియలు' కావు. (కొలుదివియలతత్త్వము చెప్పితినిగదా.)

'కోలదివియ' యనగా -(కొష్ఠ దీపిక=) దివిటీకిమారుగా కాల్చి పట్టుకొనెడు వెలుతురుకట్టెల కట్ట. (చూ. శ.ర.)-వెలుతురుపుల్ల గాలిలో గనగన మండును. వెలుతురుచెట్టునే 'కొరిమిపాల' అంటారు.—

"కొరిమిపాల - The torchwood tree, used for torches. దివిటీకఱ్ఱ" (బ్రౌణ్యము.)

---

అనేకమైనప్పుడు వాటిని పట్టువాడు ఒక్కడగుట యెట్లు? అట్లనుట సరికాదు.

దివిటీఁడు; దివిటీవాఁడు - అన్నట్లే, 'దీవె (=దివ్వె)వాఁడు' అన వలెను. (సూ. ని. 'దివ్వటీలవాఁడు = దివ్వెలవాఁడు' అనికూడా - అని యున్నది. తప్పు)

అడపమువాడు; కొరాంజివాడు; జారివాడు; గొడుగువాడు; గుజ్జుపు వాడు అన్న పదములెట్టివో—దివిటీవాడు అనునదియు నట్టిదే.

కొవలివాండ్రు 'కోలదివియల'నే వాడుదు రనుటకు :

1. "కోలదివియలవెలుఁగు దిక్కులకునిగిడి
తొడరి పురవీథిఁజీఁకటిఁ దొలఁగఁదోలఁ
బటురయంబునఁ దలవరిబలమురాక
చూచి యొక్కింతచిత్త సంక్షోభమెసఁగ" (దశకు. 5-90)

2. "తలవరులు, కోలదివ్వెలవారిఁ గొంచు నవ్వీథిఁ
బదపదఁడిచె దొంగపదపంక్తి చొప్పు,
వదలకుండనిరాఁగ." (గౌ. హరి. ఉ. 2319)

3. "ఆలీలఁ గొరవిదయ్యంబుల దివ్వె
గోలలవారిఁగాఁ గొని గస్తుదిరిగి." (గౌ. హరి. ఉ. 1668)

కోలదివియ, యనగా - కఱ్ఱదివిటీ. కోలదివియ (= కోలదివ్వె)నే, దివ్వియకోల, దివ్వెకోల, అంటారు. దివ్వెకోల = దివిటీకఱ్ఱ. దివ్వియ కోలను, ఆం. భా. కర్త, 'దివ్వెనకోల' అన్నాడు.

"జుంజురు దుందురు సురుడు దివ్వెనకోల,
యనఁ గాప్తదీపి కౌహ్వాయము చెలఁగు." (2-165)

భారత-పద్యములోని కొవలివారు పట్టినవి 'కోలదివియలే = కఱ్ఱ దివిటీలే.'

ఇంతయెందుకు. శ. ర. కర్త "కోలదివియ = వెలుతురుకట్టెల దివిటీ" అని యర్థముచెప్పి, అందు కుదాహరణగా పై భారతపద్యమునే— "కోలదివియలుగొనుచు" అను పాఠముతో చూపియున్నాడు. అంతేకాదు ఆ పద్యమునకు మూలమైన,— "సహసైవ సమాజగ్ము రాదాయోల్కాః స్సహస్రశః"-అను శ్లోకమునుగూడా ఇచ్చియున్నాడు.

ఉల్కలనగా - మండెడుపుల్లలు = కోలదివ్వె లన్నమాట.

కాబట్టి, 'కాలుదివియల' పాఠము తప్పు. సూ.ని. 'కాలుదివియ'కు చెప్పిన యర్థమున్నూ తప్పే.

నడచుట 'కాలి' పనిగనుక, నడచువారికి దారిచూపుటకు 'కాలు దివియ' తప్ప మరియొకదివియ పనికిరాదనుకొన్నది సూ.ని.; దారి కన

బడుటకు వెలుతురు ప్రధానము. "ఎలుకను పట్టుటకే పిల్లి అయితేయేమి" అన్నట్లు, వెలుతురిచ్చుటకు ఏ దివియయైన నేమి? కాలిపనికి - చేతిదివియ పనికిరాదా?

ఎందుకు పనికిరాదూ? దొంగను పట్టుకొనుటకై బయలుదేరిన తలవరులు, 'శంకర. హరిశ్చంద్ర'లో - చేదివియలతోనే బయలుదేరినారు. సూ. ని. చూచియుండదు.

"అవ్వీటితలవరు లత్యుగ్రకరవాల
హస్తులై పదపదం డనుచు నిగిడి
చేదివియలుఁబూని చెచ్చెరనే తేర," (5-115)

మరియు, నక్షత్రకుని బుజాన నెక్కించుకొని కటికిచీకటిలో కారడవిలో నడచిపోవుచున్న హరిశ్చంద్రునికి, అతనిచేతి ఖడ్గమే 'కర దివ్వె'యై త్రోవచూపినదట. వినండి, గౌరనకవి పల్కులు :—

"కరమునఁబూనిన ఖడ్గప్రకాశ
మరుదుగాఁ గరదివ్వెయై త్రోవఁజూప" (ఉ. 1856)

ఈ ద్విపదను సూ.ని. యెరుగదా? 'కరదివ్వె' క్రింద ఉదాహరించు కొనే యున్నదే, దారి నడచువారికి-చేదివ్వెలు(=కరదివ్వెలు)ను పనికివచ్చునని యేల గ్రహింపలేదో!

ఒక విశేషము : కాలిదివిటీ, ఒకనికి మరియొకడు పట్టవలసినదేగాని ఎవనికి వాడు పట్టుకొనుట పొసగదు. కావున కావలివారు కాలిదివిటీలతో పోయినట్లు చెప్పుపాఠము తప్పు.

## 33. ఇను

సూ.ని.—* "ఇను = రెట్టి, ద్విగుణితము, అధికము" అని యర్థము చెప్పి, అందుకు, వేదం-వారి శృం.నై. లోని, 'ఇనువింతలచూపుల' (౫.౬౧)

---

* వా.ని. 'ఇను' క్రింద, సూ.ని. చెప్పినట్లే అర్థము చెప్పి, అందుకా శృం.నై. పద్యమునే చూపి, 'ఇనిటింత' క్రింద 'ఇనువింతల' పాఠము సరియైనది కాదన్నది. అది సరియైనపాఠము కాదని యెరిగియు, 'ఇను' క్రింద చూపనేల?

పద్యమును చూపినది. ఆ పాఠము తప్పు. (చూ. 'పాఠపరామర్శ'లో, ౪౫)

'ఇను' కు సూ. ని. చెప్పినయర్థము లేదు; రాదు.— 'రెట్టి'యను అర్థము రావలెనంటే, 'ఇనుమడి' (=ఇమ్మడి = ఇబ్బడి) అనవలెను.—

(1) "ద్విగుణమున కభిఖ్యలగు నిబ్బడిమ్మడి
జంట దంట దుగయు జమిలి రెట్టి,
ఇనుమడి యన," (అం. సం. మాన. 42)

(2) "ఇనుమడి యేండ్లు లిద్ధరణి యేలునుపాయము సేయువాఁడ"
(విక్ర. 4-45)

(3) "ఒంటి, తిండికతమున నినుమడి కండపట్టి." (శుక. 3-351)

(4) "అఖిలజనులు...ఉత్సవోన్మత్తభావ, మిమ్మడిరై
ప్రమోదమ్మునం దేలిరి" (భా. అశ్వ. 3-౧౧౯)

(5) "మహార్ణవంబుల విష్కంభంబులు క్రమంబున నొకటి కొకటి రెట్టియై యుండు;...ద్వీపంబుల విష్కంభంబులును...ఒకటికొకటి యినుమడియై యుండు." (భా. భీష్మ. 1-27)

ఈ వచనమున 'రెట్టియై' యనియు, ఆ యర్థముననే 'ఇనుమడియై' యనియు ప్రయోగింపబడియుండుట గమనించునది.

(6) "అనినఁ గృపాచార్యుం డీ
యినుమడిదివసములఁదీర్ప నేనోపుదు." (,,-ఉద్యో. 4-414)

ఇనుమడిదివసములన్-అనగా, రెట్టింపుదినములలో-నని యర్థము.

(7) "దీనికి నినుమడుంగగుం బ్రతిబలముం, గనినప్పుడు నా
రూపంబు" (భా. ఆర. ౭-౩౪౫)

ఇనుమడుంగగున్ = రెండింతలగు నని యర్థము.

ఇట్లు, రెట్టి (ద్విగుణము) అన్న యర్థమున, గ్రంథములలో సర్వత్ర-'ఇనుమడి' (=ఇమ్మడి, ఇనుమడుఁగు) కనబడుచున్నదేగాని, వట్టి 'ఇను' నా కెందును కనబడలేదు. సూ.ని. కిని కనబడినట్లు లేదు. కనబడియున్నచో ఉదాహరించి యుండడా?

మరియు, 'ఇను'-వృత్తియందు 'రెంటి' కాదేశముగా వచ్చునేగాని 'రెట్టి'కి రాదు. (చూ. బా. వ్యా. అచ్చి. ౨౮), అదియును - మడుఁగు, మాఁడు, నూఁడు-అను పదములకేగాని, అన్ని పదములకును రాదు.

శ.ర.—"ఇను వృత్తియందు హల్లుపరమగుచో రెంటి కాదేశముగా వచ్చునది. (ఇనుమడి, ఇనుమాఁడు మొ.)" - అనియే చెప్పినది.

కవులప్రయోగములును అట్లే కనఁబడుచున్నవి.—

(1) "కర్ణుం, డినుమాఁడు లోకశరముదాఁడుఁగునే పరులు నగక్షా"

(భా. కర్ణ. 3-3౧౭)

(2) "ఇనుము విఱిగనేని, నినుమాఁడు ముమ్మాఱు
కాఁచి యతుకనేర్చుఁ గమ్మరీఁడు" (వేమన)

ఇనుమాఁడు, ఇనుమడుఁగు-అనుపదములకు, రెండుమాఁడులు, రెండు మడుఁగులు-అని యర్థము. కావున 'ఇనువింతలు' అంటే, రెండువింత లగునేగాని, 'రెట్టివింతలు' కాదు.

'రెండువింత'లన్న యర్థమునకైనను, 'ఇనువింత' లనఁగూడదు. ఇను మాటలు, ఇనుగుజ్జములు, ఇనుచెట్లు-అన్నవా రిప్పటికి లేరు.

అది యట్లుండఁగా—'ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగా నగు' (సమా. ౧౭) నన్న సూత్రముప్రకారము,—ఇనుమాఁడు, ఇనుమడుఁగు - అయినట్లే, (ఇను + వింతలు) ఇనువింత-అని యేకవచనాంతము కావలసినదే గాని, ఇనువింతలు-అని బహువచనాంతముగా నుండరాదు.

కాబట్టి, ఇనువింతలు-అను రూపమే తప్పు. ఆ రూపమునకు, 'రెట్టివింత'లని యర్థము చెప్పుటయును తప్పే.

వేదంవారు, శ.ర. లో నున్నపాఠము నెఱుఁగక, "స్థితస్య గతిశ్చింత నీయా" అన్నట్లు, అక్కఱకు కల్పించుకొన్న అసంగతపాఠముపై నాధారపడి,— సూ. ని. 'ఇను' అనుపదమునకే, రెండు, - రెట్టి-యని రెం డర్థములు చెప్పుటయు, 'ఇను'కు 'ఇనుమడి'కి కూడా 'రెట్టి' యని ఒక యర్థమునే చెప్పుటయు సరికాదు.

## 34. చేపట్టుకుంచము

శ.ర.—"చేపట్టుకుంచము = ఎవ్వ రేది కోరినను దానిని నెఱవేర్చువాఁడు" అని యర్థము చెప్పి,—"చేపట్టుకుంచ మక్షీణరంగదభంగ శృంగార శాస్త్ర ప్రసంగలోలుఁ, డమ్మహారాజదేవేంద్రుఁడు" (శుక. ౧. ఆ) అను పద్యమును చూపినది.

సూ.ని.—"చేపట్టుఁగుంచము = చేతిలోని కుంచమువంటివాఁడు. ఎవ రేదికోరిన అది యిచ్చువాఁడు" అని యర్థము చెప్పి,—"చేపట్టుఁగుంచ... దేవేంద్రుఁడు" (శుక.) "చేపట్టుంగుంచమైన చెలువు నొకనిఁజేపట్టి" (శుక.) అను పద్యములను చూపినది.

చేతిలోనికుంచము ఎవరేదికోరిన అది యిచ్చునది కాదు. అట్టిచ్చు గుణము దానికి లేదు. కావున సూ.ని. చెప్పిన వ్యుత్పత్త్యర్థము సరియైనది కాదు.

చేపట్టుకుంచము అను నుడికి—చేత పట్టుకొనుట కనువైన (=చేతిలో నిముడునట్టి) కుంచము; అని అవయవార్థము. ప్రాభవాదులచేత మహోన్నతుడయ్యును - సులభుడైనవాఁడు అని ఆ యర్థమునుబట్టి యేర్పడు భావము.

అది యెలాగంటే: కుంచము ఆకారముచేత చాలా పెద్దది. అద్దశేరువలె, శేరువలె చేతికరపునది కాదు. అంతేకాక, ధనముగాని ధాన్యముగాని విస్తారముగా పట్టునది. *(14 శేర్లు = 1 కుంచము) కావున మిక్కిలి బరువుకూడాను. అందువల్ల, ఆకారవిపులతచేతను, ద్రవ్యభారముచేతను కూడా, కుంచము చేపట్టునకందుట అసంభవము.అందెనేని ఆశ్చర్యజనకమును, ఆనందదాయకమును నగు విశేషము.

---

* "కుంచమునకు 8 సేర్లే. దీ. పి. శాస్త్రిగారి కుంచమునకు 14 సేర్లుగా నైనది. వారి 14 సేర్లకుంచ మెందలిదో? ఎంతగొప్పదో" అని వీ. బ్ర. గారి యాక్షేపము.

నాది నెల్లూరుజిల్లా కుంచము. 14 సేర్లదే. అది యెంతగొప్పదో, వారు వచ్చి - కనులార చూచి తెలిసికొందురుగాక—అని నా సమాధానము.

అశ్లో, ప్రాభవాదులచేత నున్నతుఁడైనవాఁడు, ఆశ్రితులకు సులభుఁడగుట అరుదు. సులభుఁడయ్యోనేని అది గొప్ప విశేషము.

మహారాజైనవాఁడు-ఆశ్రితసులభుఁడగుట, కుంచము చేపట్టున నిముడుట వంటిదని సారాంశము.

ఆశ్రితసులభుఁడైన మహారాజునకు - చేపట్టుకుంచముతో పోలిక. కాబట్టి, సూ.ని. చెప్పిన అవయవార్థము, భావముకూడా తప్పే. 'చేపట్టుకుంచము—చేతిపట్టున ఇముడు కుంచము - (ఔపమ్యవాచకము.) ఆశ్రిత సులభుఁడని భావము' అని చెప్పుట ఒప్పు.

సంపన్నుఁడును, ఉదారుఁడును నగువాఁడు సులభుఁడగునేని ఆశ్రితుల కోరికలు తీరుటలో ఆశ్చర్యమేమున్నది?

"చేపట్టుంగుంచమైన చెలువు నొకనిఁజేపట్టి" అన్న పద్యమున,— చేపట్టుకుంచమైన-అంటే, చెప్పినట్లు వినువాఁడైన, లోబడియుండువాఁడైన- అని యర్థము.

ఆ శుకసప్తతిలోనే,— "చేపట్టుకుంచమగుచు, వాఁడు వర్తింప" (2-204) అనియు నున్నది.

చేపట్టుకుంచమగుచు-అంటే, *వశవర్తియై - అనియే అర్థము.

"దాత నెఱజాణ, స్నేహింపఁదగువాఁడు చేపట్టుకుంచంబు ధనరాశి వాఁడు పేదలకుదిక్కు, మనపాలిదేవుఁ డితఁడు విడకు మని కూఁతు నదలించి విటుగుఱించి." (బహు. 5. ఆ.)

ఈ పద్యములో,-దాత, చేపట్టుకుంచము-అను విశేషణములు రెండును వాడబడినవి. చేపట్టుకుంచము - అను పదానికే, 'మహాదాత' యని యర్థమగునేని, మరల 'దాత' యని వేరుగా చెప్పనేల? అది పునరుక్తి కాదా?

ఎందు కింకను చర్చ. చేపట్టుకుంచమునకు, 'ఎవ్వరేదికోరిన అది యిచ్చువాఁడు, దాత' యని యర్థము చెప్పుట యుచితము కాదు. సులభుఁడు,

---

* వా.ని, "చేపట్టుఁగుంచము = వశుఁడు, సులభుఁడు" అని చెప్పి, అందు కీ పద్యమునే యుదాహరించినది.

వకుఁడు, లోబడినవాఁడు - అని చెప్పుటయే యుచితము. అందు కింకొక్క మంచి యుదాహరణము :—

శ్రీ వేలూరి శివరామశాస్త్రి గారు 'దివ్యజీవన' మను గ్రంథములో,— 'చేకొద్దికుంచము' అను నానుడిని వాడియున్నారు. కథాసందర్భ మేమనగా— 'మాదలేను' అనునత డొక మేయరు. 'జేవరు' అనునతడు పోలీసుఇన్స్పెక్టరు (మేయరుక్రింది ఉద్యోగి.) మాదలే నొక కేసులో చిక్కుకొనును. జేవరు, మాదలేనును బందీచేయుటకు వచ్చి, ద్వారముకడ నిలిచియుండును. అప్పుడు మాదలేను లేచి, ఆతనిని చూచి,—'నే నిఁక మీ చేకొద్దికుంచమను' అనును. అనగా నే నింతకుముందు నీ కధికారి నైనను ఇపుడు నీ చేతిలో చిక్కినాను. ఇక నీ యిష్టమువచ్చినట్లు చేయ వచ్చును - అని ఆ మాట కర్థము. అంతేగాని,-'నీ వేదికోరిన అది యిచ్చు వాడ' నని కాదు.

కాబట్టి సూ.ని. చెప్పిన యర్థ మొప్పదు.

చేపట్టుకుంచమన్నను, చేకొద్దికుంచమన్నను అర్థ మొక్కటే. చేకొద్ది కుంచము సూ.ని. లో లేదుగాని, కావ్యములలో నున్నది.—

"కరతలామలకంబు కైవల్యసంపద,
యింటఁజేరినపంట యీప్సితంబు,
ఓడఁగట్టినదూల మీఁదులేనిశుభంబు,
చేకొద్దికుంచ మశేషభూతి." (చంద్రా. 1-57)

'నీరుంగావిపంచెలు'; 'చేపట్టుంగుంచము' అను ప్రయోగములు క్వాచిత్కముగా నున్నను, నీరుకావి; చేపట్టుకుంచము - అనుటలో తప్పు లేదు. మార్చివ్రాయ నక్కరలేదు. (వివరములకు, చూ. 'ఆంధ్రభాషాను శాసనము. సంధి. 2(3)

చేపట్టుకుంచము - అను పదమును చెప్పి, 'చేపట్టుఁగుంచ' మనుటయు కలదని చెప్పిన చాలును.

## 35. తరిపాలు

'తరి' అను పదముక్రింద, సూ.ని. "తరిపాలు = (తరుచుటవలనఁ గలుగునది వెన్న) తరిగలపాలు - మిక్కిలి వెన్నగలపాలు" అని వివరించి,

అందుకు "చిక్కని తరిపాలు దానపుడు కంఠముమోవఁగఁ ద్రావఁజేయ" అను 'సారంగధర' (౩-౧౯౫) పద్యమును చూచినది.

పద్యములోని పాలు 'మీఁగడపాలు' గాని 'వెన్న(గల) పాలు' కాదు. కాచినపాలతోఁడను, పెరుగుతోఁడను, కూడియుండునది 'మీఁగడ' కాని వెన్న కాదు. పసిబిడ్డలు సైతం మెరిగినసంగతే. గ్రంథప్రమాణ మనవసరము. అయినను పాఠకవినోదమున కొక కొన్నిరచనలు.–

1. "...కొండకవ్వంబు గుత్తి జిఱజిఱందిరుగు వేగంబున...... మిసిమి గల మీఁది మీఁగడపాలతేట నిగ్గుఁ దుంపరల పరంపరలవలన" (భాగ. 8-208)

2. "పాలమున్నీటిలోపలి మీఁదిమీఁగడ
మిసిమి జిడ్డునఁజేసి మేనువడసి" (,,–,,- 266)

3. "తొలఁకి మింటికిఁబొంగు దుగ్ధపాథోరాశి
కరడులమీఁది మీఁగడలమెఱుఁగు" (మను. 5-44)

4. "ఆరంగాఁగిన పాలమీఁగడలు, హస్తాబ్జంబులందేవి, లీ
లారమ్యంబుగఁ దోడిబాలురకునెల్లం బెట్టి తానుంగొనెఁ" (హరి. పూ. ఆ. ౫)

5. "మీఁదిమీఁగడ మాత్రమే గ్రహించిన దధి
యంటి వైచిన కలవంటకములు." (పాంచా. 4-59)

6. "నెఱజాతి పాలమున్నీటి మీఁగడనిగ్గు
దేలువార్వము చొప్పుటాలు ద్రాక్ష" (ఉ. హరిశ్చ. 3-131)

'సారంగధర'లో, గొల్లవాడు, సిద్ధునకు తెచ్చియిచ్చినవియును–మీఁగడ పాలే,—

7. "కనలునిప్పులమీఁద కమ్మనిపాక
మొదవి మీఁగడగట్టనొయ్యనఁగాఁచి ... మార్తాండు
డుదయించువేళను యోగిముఖ్యునకు
ముదమార నిడి" (నవనాథ. పు. 32)

8. "కలశాబ్ధిమీఁగడల జిడ్డెతేఁగించెడు కమ్మగాడ్పు" (ఆము. 4-10)
మీగడపాలు త్రాగుటకు కమ్మగానుండును. మీగడలేనిపాలు చప్పగా నుండును. త్రాగుట కింపుగానుండవు.

'గొడగూచి'యను నొక పసిబిడ్డ, యీశ్వరునిముందు పాలుంచి 'ఆరగించవయ్యా' అన్నది. ఆయన ఆరగించలేదు. అపు డాబిడ్డ పలికినపలుకు లివ్వి:

9. "పా లేల యారగింపవు లింగమూర్తి
కాఁచుటచాలదో కమ్మవల్వమినో...
మీఁదుపోయినవనో, మీఁగడలేదో" (బసవ. పు. 70)

మధురపదార్థములలో పాలమీగడయేగాని, పాలవెన్న చేరదు. —

10. "పాలమీఁగడ శర్కరపానకంబు
పూవుఁదేనియ యైన నీ మోవియందుఁ
దనరు మాధుర్యమునకు దీటనఁగరాదు" (ఇందు. పరి. 6-139)

లోకవ్యవహారమునను, కావ్యములలోనుగూడా, 'మీగడపాలు' 'మీగడ పెరుగు'కలవుగాని, వెన్నపాలు; వెన్నపెరుగు-అనుపలుకుబడి యెందునులేదు.

(1) "మీఁగడ పెరుగు = మీఁగడతోడి పెరుగు, శ్రీఘనము." (శ. ర.)

(2) "వేవిన నిద్ర మేలుకని వేఁబోకబానకు నేర్పుతోడఁ బై
మీవడఁబుచ్చి, కవ్వమిడి, మిట్టచనుంగవ రాయిడింప మేఁ
దీవ నటింప నెన్నడుము దీలుపడం, గటిగుల్కఁగాచముల్
*జోవలఁబాడఁ జల్లఁ దరుచుక్ వడి ధర్షణి రజ్జుపాణియై."
—పంచ. వేం. ౧.౫౯౦.

'మీగడపాలు' అనియేగాని 'వెన్నపాలు' అని వ్యవహారములేదు గనుకను, పాలతోనుండునది మీగడగాని, వెన్నకాదు గనుకను, "తరిపాలు=వెన్న(గల)పాలు" అనుట సరికాదు.

పాలతో నుండునది మీగడ యగునుగాక. ఆ మీగడలో వెన్న యుండలేదా! మరి 'వెన్నపాలు' అనడానికి ఆక్షేప మేమి? అంటారా?

* "జోవలువాడ...వడిఁదర్షిణి" అని, శ.ర. పా. (చూ. 'జోవ') 'జోవడఁబాడ' అని, మూ.ని. పా.

ఆక్షేపమేమీ లేదు; ఆ వెన్నలో - నెయ్యి ఉంటుందికదా? మరి, నేతిపాలు; నేతిపెరుగు, అనకపోవడ మేల? అను ప్రశ్నకు సమాధానము చెప్పవలసియుంటుంది.

మరొక్క సంగతి:—సూ.ని. "తరి = వెన్న, తరిపాలు=వెన్నగల పాలు" అన్నదిగదా, మరి, శుకసప్తతి (2-334)లో,—

"సంకటి తరివెన్నమజ్జిగలు, కంకటిపైఁ బవలింటి నిద్రలుకా"

అని యున్నదే. అక్కడి, తరివెన్న; తరిమజ్జిగ అను పదముల కర్థ మేమి? (సూ.ని. శుకసప్తతిని చూడలేదా? చూచియున్నచో ఆ పదములను తీసికొనకపోవు టేల?) సూ.ని. పద్ధతిప్రకారము - తరిమజ్జిగ = వెన్నమజ్జిగ; తరివెన్న = వెన్నవెన్నయే కదా కావలసినది? అట్లగునా? ఎన్నటికిని కాదు.

తరిమజ్జిగ-యనగా, కవ్వము మొదటి మజ్జిగ. (=చిలుకుచుండగానే తీసికొను మజ్జిగ.) అది తియ్యగా ఉండును. బ్రౌను "తరిచల్ల. Sweet butter milk" అని చెప్పియేయున్నాడు. అట్లే, తరివెన్న-అంటే, అప్పుడు చిలికి యెత్తినవెన్న. అదే నవనీతము.

అలాగే, *తరిపాలు-అంటే, మీగడతోఁగూడి తియ్యగానుండుపాలు అని సంప్రదాయార్థము.

## 36. దేవాయుధము

సూ.ని.— "దేవాయుధము = దేవతల ఆయుధము" అని అర్థము చెప్పినది. ఎందుకండీ! ఆ యర్థము నొక పెద్దనిఘంటువు చెప్పవలెనా?

---

* తరిపాలనగా తరిపిపాలనీ,- తరిపిపాలనగా పశువీనిన నెలదినముల లోపలిపాలనీ,- తరిపియనగా నెలలోపలి దూడయనీ—వీ. బ్ర. గారి వ్రాత.

దూడను 'తరిపి' యనుట తప్పనీ, 'తఱపి' యనవలెననీ, 'తఱపి' యనగా, ఆరునెలలు దాటిన ముదురుదూడగాని నెలలోపలిదూడ కాదనీ,— బ్రహ్మంగారు, తెనుఁగెరుగని తెనుగు పండితులనీ, బ్రౌన్యములో,—"తరిపి or తరిపిదూడ A sucking calf, a calf a year old." అని యున్నది చూచుకోవలసినదనీ—నా సమాధానము. (చూ. 6-12-1948 త్రిలిఙ్గ)

దేవాయుధశబ్దము కొంచెము చరిత్ర కలది. సంగ్రహముగానే మనవిచేస్తాను.

ఆశబ్దము - అముక్తమాల్యదలో ఇట్లు ప్రయుక్తమై యున్నది.

"పసలేదు నిలరోరి పాతకులారని
దేవాయుధంబులు ఱూవువారు" (7-13) వేదం. ప్రతి.

బ్రౌనుదొర—, "దేవాయుధములు - A. 6. 100. Stones and cudgels అనగా రాళ్లున్ను దుడ్డుకఱ్ఱలున్ను; దేవశబ్దమునకు యజ్ఞము అర్థముచేసి యజ్ఞమందు ఆయుధములు, రాళ్లు - దుడ్లు మొదలైనవి గలవు గనుక ఆ సంబంధమునుబట్టి యీ పదము ప్రయోగించినారు" అన్నాడు.

శ. ర. కర్త 'ఱూవు' క్రింద పైపద్యపాదము నుదాహరించియు దేవాయుధశబ్దమును గ్రహించనే లేదు. (ఇట్టి ప్రమాదములు శ.ర. లో ఎన్నో యున్నవి.)

వావిళ్లవారిటీకలోను, "దేవాయుధంబులు = పాషాణములు దుంట కట్టెలును, (ఇక్కడ దేవశబ్దమునకు యజ్ఞమని యర్థముచేసి దాని యాయుధ ములు దారుమయములుగాను బాషాణమయములుగాను నుండును గనుక ఱాలును దుంటకట్టెలు ననవచ్చును") అనియేయున్నది.

సంజీవనీ వ్యాఖ్యానమునకు పూనుకొన్న - ఆంధ్రమల్లినాథులుకూడా వావిళ్లవారి (కాదా, బ్రౌనుదొరగారి) నుడుగులనే యందుకొని,—

"(ఆ దొంగలమీఁదికి) దేవాయుధంబులు - దేవ = యజ్ఞమందు ఉపయోగింపఁబడు - ఆయుధంబులు = పోటుముట్లను (అనఁగా *కొయ్య గొణత-రాయి - రప్ప - ఇట్టివానిని)" అనియే సెలవిచ్చినారు.

అయితే ఒక విశేషము : వారి వ్యాఖ్యానము ప్రకటితమైనపిమ్మట, దేవాయుధతత్త్వము నెరిగిన వే.ప్ర. శాస్త్రిగారు వారినిదర్శించి 'అయ్యా, దేవా యుధమనగా శాపము, తిట్టు; గాని, రాయి-రప్ప కాదు. దేవతలు-ఋషులును, శాపాయుధులు; 'దేవాయుధంబులుఱూవువారు=తిట్టువారు' అని సముచిత

---

* "దేవాయుధంబులు - మనుష్యులుచేసినట్టి కత్తి కటారి లోనగునవి కావు; మఱి దేవుఁడుచేసిన ఱాలు కట్టెలు లోనగునవి" అని- సంజీవనీకర్తల పదప్రయోజన వివరణము.-సరియైనది కాదు.

మైన అర్థము''అని మనవిచేయఁగా, వారా మనవి నొకపాటిగా - అంగీకరించి,-''దేవాయుధంబులు='శాపములు' అని కొందఱు. దేవతలు గీర్వాణులు గదా'' అనియొక చిన్న సవరణముక్క- గ్రంథముఖభాగమున - కొన్ని ప్రతులలో - అంటించి ఆ శాస్త్రిగారిని తృప్తిపఱచినారు. అంతేగాని, వారి మతమున 'దేవాయుధము'లంటే రాళ్లు-రప్పలేగాని, శాపములు, తిట్లు, కావు. అందువల్ల నేగదా-''దేవాయుధములు = శాపములు-అని కొందఱు'' అని తేలబలుకుటయు - తాము చెప్పినయర్థము తప్పని యొప్పుకొనక పోవుటయును?

యజ్ఞములయందు ఆయుధము లుపయోగింతురనియు, ఆ యాయుధములు రాళ్లు-రప్పలు-తుంటకట్టెలనియు ఆంధ్రమల్లినాథులను భావించుట చిత్రము కాదా!

ఇట్లు దేవాయుధ శబ్దమునుగూర్చి యింతగొడవ నడచియుండఁగా, 'రాళ్లు-రప్ప'లని కొందరును - 'తిట్లు-శాపసారము'లని మఱికొందరును- పెద్దలర్థములు చెప్పియుండఁగా, ఏదీయెఱుగక, ఏకోశమునూ చూడక, ఏ వ్యాఖ్యానమును చదువక, ఏ విమర్శను పరికింపక, సూ. ని. ముక్కకు ముక్కగా,—— ''దేవాయుధము = దేవతల ఆయుధము'' అని యర్థము వ్రాసి యూరకొన్న దే ధర్మమేనా? నిఘంటువు చేయవగినపనియే నా?

దేవాయుధము = దేవతల ఆయుధము; రాక్షసాయుధము = రాక్షసుల ఆయుధము; యక్షాయుధము = యక్షుల ఆయుధము; నరాయుధము= నరుల ఆయుధము.——అని ప్రతిపదటీకలు నిఘంటువులు వ్రాయవలెనా? అట్లు వ్రాయుట కలదా? అట్లు వ్రాయఁబూనుకొన్నచో తెమలు టెన్నటికి? ఆ వ్రాతవలన ప్రయోజనమేమి?

దేవాయుధశబ్దమును తా నెక్కడనుండి తీసికొన్నదో - అక్కడ ఏ యర్థమున ప్రయుక్తమైయున్నదో సూ.ని. చెప్పవలదా?

నిజానికి, దేవాయుధములు - శాపములే గాని, రాళ్లు-రప్పలు కావు.- ''గీర్వాణాః = దేవతలు. శాపరూపమైన వాక్కు- బాణముగా కలవారు'' అని అమరము.

కాబట్టి, నిఘంటువు,—దేవాయుధము = శాపము, తిట్టు-అని చెప్పి, ప్రమాణము చూపవలెను.

సూ.ని. కి, దేవాయుధశబ్దమున కర్థమూ తెలియదు. 'ఆముక్త' ప్రయోగమూ తెలియదు. తెలిసియున్నచో - ఏల చెప్పదు?

## 37. కపిల

"కపిలము = పింగళవర్ణముగల వృషభము, పుల్లయెద్దు" అనియు,- "కపిల = కపిలగోవు, పుల్లావు" అనియు వ్రాసిన సూ. ని. యే,— "కఱి యావు = నల్లావు, కపిలధేనువు" అని వ్రాసినది. కఱియావు - కపిలధేను వగుట యెట్లు? లక్ష్మీనారాయణీయములో "కఱియావు = నీలధేనువు" అని యున్నది.

శ.ర. లో, కపిల = పుల్లావు-అనియే యున్నది.

సూ.ని. లో నైనను, "కఱి = నల్లనిది"; "కపిలము = పింగళవర్ణము కలది" అని యున్నదే కాని, "కఱి = కపిలము" - "కపిలము = నల్లనిది" అని లేదే!

'ఆముక్త'లో— "కపిలగవిసర్పిఁ బృథుదీపకళికఁదీర్చి" (5-92) అన్నచోట సంజీవనీకర్తలు "కపిలగవి = పుల్లావుయొక్క—" అనియేఅన్నారు.

కపిలవర్ణము (=పుల్లవన్నె) 'ఎఱుపు'లో చేరునేగాని 'నలుపు'లో చేరదు. రఘువంశములో (వసిష్ఠుయైన) నందిని, ఎఱ్ఱనిదిగానే వర్ణింపబడినది.

"లలాటోదయ మాభుగ్నం పల్లవస్నిగ్ధపాటలా
బిభ్రతీ శ్వేతరోమాంకం సంధ్యేవ శశినం నవమ్." (1-83)

శబ్దకల్పద్రుమములో,—

"కపిలా - గోవిశేషః ఇతి హేమచంద్రః—
సా తు స్వర్ణవర్ణా ఇతి పురాణమ్..." అనియు,—

ఆప్టి నిఘంటువులో,—

"కపిల Tawny, reddish కపిలా a brown cow" అనియు నున్నది.

ఇన్నిమాటలెందుకు? భార. అను. లో, ఇట్లున్నది.—

"సమానవత్సాం కపిలాం ధేనుం దత్వా పయస్వినీమ్,
సువ్రతాం వస్త్రసంవీతాం బ్రహ్మలోకే మహీయతే." (౭౦-౯)
"సమానవత్సాం కృష్ణాంతు ధేనుందత్వా పయస్వినీమ్,
సువ్రతాం వస్త్రసంవీతా మగ్నిలోకే మహీయతే." (౭౦-౧౩)

కపిలధేనువును దానముచేస్తే బ్రహ్మలోకము, కృష్ణ (నల్ల) ధేనువును దానముచేస్తే అగ్నిలోకము, ప్రాప్తించును-అనడమువల్ల-కపిల కృష్ణవర్ణములు భిన్నములని స్పష్టపడుటలేదా?

ఐతే ఒకమాట:—

కపిలగోవంటే నల్లావని కొందరనుట కలదు. అంతేగాక, బ్రౌణ్యములో - "కపిలము - Dun, dark in hue, tawny, brass colour" అనియు నున్నది. దానినిబట్టి, సూ. ని. కపిలాశబ్దము, పుల్లావునందును నల్లావునందునుగూడా చెల్లుబడియగునని భావించెనేమో! అలా అయితే, కపిలము-క్రింద, పుల్లయెద్దు ప్రక్క నొక నల్లయెద్దును, కపిల-క్రింద, పుల్లావువెంట నొక నల్లావునుచేర్చి యుండవలెగదా! చేర్చలేదే! 'కపిలము= పింగళవర్ణము; నలుపు' అనియును వ్రాసియుండవలసినదే! వ్రాయలేదే!

ఏమయినను, "కపిల = పుల్లావు, నల్లావు" అనుట యుచితముకాదు. ఎందువల్లనంటే; కపిల, అయితే - పుల్లావు కావచ్చును; కాకపోతే - నల్లావు కావచ్చును-అనేపక్షమున,—

"మొదవులలోనెల్లఁ *గపిలమొదవు వరిష్ఠంబు" (అను. 3-19) అన్న భారతవచనమున కర్థమేమి?

బాలవ్యాకరణములో - నిర్ధారణషష్ఠికి ఉదాహరణముగా,—"గోవుల లోపల కపిల బహుక్షీర" (కార. 16) అన్నచోట, నిర్ధారణం బేమని?

ఎటుచూచినను కఱి=(నల్ల)యావును, కపిలధేను వనుట కాధారము కనబడలేదు. పెద్దలు పరిశీలింతురుగాక.

* ఈ సమాసమును-అనింద్యగ్రామ్యముగా గ్రహింపవలెనా? లేక, 'కవిలమొదవు' అని మార్చవలెనా?

## 38. అతివాసము

శ.ర. లో 'అధివాసరము' ప్రకృతియనియు, 'అతివాసము' వికృతి యనియు, రెండుపదములకును - 'శ్రాద్ధదినమునకు ముందుదినము' అని యర్థ మనియు నున్నది.

సూ.ని. లో, 'అధివాసరము' లేనేలేదు; సరిగదా 'అతివాసము' అ. పుం.అనియు 'శ్రాద్ధదినమునకు పూర్వదినమునందుచేయు ఉపవాస'మని యర్థ మనియు నున్నది.

శ.ర. వ్రాత అంతా తప్పేనా? సూ.ని. వ్రాత అంతా ఒప్పేనా?

'శ్రాద్ధదినమునకు ముందుదినము'; 'ముందుదినముచేయు ఉపవాసము; అను రెండర్థములలోను, మదరాసుప్రాంతమున 'అధివాసరము' వాడుకలో నున్నదని తద్జ్ఞులవలన వినికి. (ఆ వాడుకనుబట్టియే శ.ర. కర్త ఆ పద మును గ్రహించెననుట స్పష్టము) తెనుగుదేశమున 'అతివాసము' చాల తావులలో నున్నది. 'అతివాస' మపశబ్దమనుకొని పెద్దలు 'అధివాస' మనుటయును కలదు.

'అతివాసము' వ్యాకరణమునకు లొంగనిదని కాబోలు, శ. ర. కర్త దానిని 'వికృతి' యనుట.—శాస్త్రము ననుసరింపని పదములనూ, సంస్కృతమునలేని యర్థమును తెనుగుననిచ్చు పదములనూ పండితులు వైకృతములక్రిందను, దేశ్యములక్రిందను చేర్చుట పరిపాటి. (చూ. 'అను మానము', శ.ర )

కాని, అది సరియైనమార్గము కాదు. ఏమయినను అవి సంస్కృతశబ్దములే.

'ఆప్టి' పండితుడు,—"అతివాసః Fast on the day preceding a Sraddha" అన్నాడు.

'కిట్టెల్' కన్నడ నిఘంటువులో,—"అతివాస (సం) Fast on the day before performing the Sraddha" అని చెప్పి, "అతివాసర (= అతివాస) మైసూరుప్రాంతమున వాడుక" అని తెలిపినాడు.

బ్రౌను,—"అతివాసము. The fast observed on the day preceding the ceremony in which oblations are presented to the manes of departed ancestors" అనిచెప్పి,-"శ్రాద్ధమునకుముందు వొక్కప్రొద్దువుండేదినము" అనికూడా చెప్పినాడు.

ఇట్లు, [ అధివాసరము; అతివాసరము; అధివాసము; అతివాసము— అను నాలుగు పదములును దేశమున వాడుకలో నున్నవి. నాలుగును సాధు శబ్దములే. నాలుగును పూర్వోక్తములయిన రెండర్థములలోను వాడబడు చున్నవి. ఆ రెండర్థములును వైదికసంప్రదాయమునుబట్టి యేర్పడినవి; అనగా, రూఢము లన్నమాట.

ఉదా.— (1) తద్దినము = శ్రాద్ధము.

(2) బ్రాహ్మణార్థము=శ్రాద్ధభోజనము (పితృకార్యములయందు భోజనమునకుఁ బోవుట. శ.ర.)

శ్రాద్ధాదిపదములూ - వాటి అర్థములూ యెట్టివో, అట్టివే-'అతివా' సాది పదములునూ - వాటి యర్థములునూ.

సూ.ని. యెఱుఁగదుగాని, అస్థిసంచయనమును 'చిన్నదిన' మనుటయు, ఉత్తరక్రియలను 'పెద్దదినము'; 'దినము' అనుటయు వ్యవహారమున నున్నది. 'దినవారాలు' — 'దివసా' లనుటయును కలదు.

బ్రౌను, "దినవారములు Funeral ceremonies. దివసవారం - ఉత్తరక్రియలు or కర్మాంతరము" అని తెలిపియున్నాడు.

శ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు, తమ 'ఉపయుక్త వాచకము' (పు. 83)లో,— "మృతినొందినవాఁడు వైతరణీనదినిదాటు నిమిత్తము 'దినవార'కర్మములో గోదానముఁ జేతురు" అని వ్రాసియున్నారు.

కాబట్టి, 'అతివాసము'; 'దినవారము' - మున్నగు శబ్దములన్నియు తెనుగున రూఢ్యర్థకములు. అవయవార్థము కుదురదన్న హేతువుచేతగాని, ఆ యా యర్థములను సంస్కృతనిఘంటువులు చెప్పలేదన్న కారణముచేత గాని, తెనుగునిఘంటువు లా పదములను త్రోసివేయుట తగదు.

చూడండి :—(1) క్రియ; (2) గతి - అను పదములు తెనుగులో 'విధము' అను నర్థమున ప్రయుక్తములగుచున్నవి. వాటి కా యర్థము

---

(1) 'జతుకాష్ఠక్రియ నొప్పు సంస్కృతపు శ్లేషల్' (శ్రీనివాస విలాసము. (2) 'తద్గతి కావ్యమెల్ల నగునే నోహో యనం జేయదే?'(రా.పాం )

సంస్కృతనిఘంటువులలో నుండదు. అట్లని ఆ పదములను విడనాడవలసిన దేనా?

*అర్థవిపరిణామమును పొందిన సంస్కృతశబ్దములు,— అవసరము; ఫలహారము; ఆలయము; మధుపర్కము-వంటివి తెనుగులో అనేక మున్నవి. వాని నన్నిటిని, తెనుగునిఘంటువు శిరసావహింపవలెగాని త్రోసిపొడరాదు. ఆ యర్థములు సంస్కృతనిఘంటువులలో లేకపోయినను మనకు పరిగ్రాహ్యములేగాని - పరిత్యాజ్యములు కావు.

"తెలుగులో చేరినతర్వాత తెలుగువారి వాడుకనుపట్టి వాటిఅర్థము, ప్రయోగము నిర్ణయించవలెను; గాని, సంస్కృతభాషాలక్షణమునుబట్టి నిర్ణయించ వల్లకాదు." (చూ. భాషాభేషజము. పు. ౧౬౭)

అతివాసమువంటి శబ్దములు తెనుగులో ననేకమున్నవి.—

'గోముఖము' అనగా కలాపి (=పేడనీళ్లు) అట. "కలాపి కలయంపి చానపి యన గోముఖాఖ్యలై యలరుచుండు" (ఆం. భా. 2-23)

ఆ పదమున కా యర్థ మెట్లు సిద్ధించినదో కొంచెము విచారించండి.

ఒక చిన్న మనవి:—

దక్షిణదేశమున 'జానువాసము' అను పద మొకటి శిష్టవ్యవహారములో సుప్రసిద్ధముగా నున్నదట. ఆ పదానికి వివాహమునకు ముందుజరుగు, 'వర పూజ' అని యర్థమట! ఆ పదానికి ఆ యర్థ మేలా సిద్ధించినదో యెవరైనను చెప్పగలరా?

అట్లే, ఆ దేశముననే, మద్యమునకు 'గంగాసాగరము' అను వ్యవహార మొకటి యున్నది. ఆ పదమును, శ్రీత్యాగరాజస్వామి,—

---

* చూ. శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారి 'అర్థవిపరిణామ పద్ధతి'. ('గిడుగు'వారి వ్యాససంపుటి. పుట. ౨౨౯)

"చక్కని రాజమార్గము ఉండగా,
సందులుదూఱ నేలనె మనసా;
చిక్కనిపాలు మీఁగడ యుండగ,
ఛీయను 'గంగాసాగర' మేలా?"

అని తన కృతిలో ప్రయోగించియున్నాడు.

*"గంగాపాయీ జహ్నుః,
సాగరపాయీతు కుంభసంభూతః,
గంగాసాగరపాయీ
గంగాధరసోమయాజీ" (అని యొక చాటువు)

విద్వాంసులారా, గోముఖము - 'పేడనీళ్లు' అయ్యుండగా 'గంగా సాగరము' మద్య మయ్యుండగా, 'జానువాసము' వరపూజ అయ్యుండగా, 'అతివాసము' (=అతివాసరము) శ్రాద్ధదినమునకు పూర్వదినమగుటలో వింత యేమి? విప్రతిపత్తి యేమి?

లోకవ్యవహారసిద్ధములయిన యెల్లపదములనూ ఎల్లయర్థములనూ సంతరించి జిజ్ఞాసువులకు తెలియజెప్పవలసిన బృహన్నిఘంటువు, (సూ.ని.) శబ్దరత్నాకరము, ఆంధ్రవాచస్పత్యమువంటి ప్రసిద్ధ నిఘంటువులు చెప్పిన పదములనూ అర్థములనూ గూడ చెప్పక, తోసివేయుట ఒప్పగునా!

'అతివాసము'ను వికృతియన నక్కరలేదు. ఆ పదానికి శ్రాద్ధదినమునకు ముందటి దినము' అని యర్థముచెప్పుటలో తప్పులేదు. సూ.ని. 'అధివాసరము'; 'అతివాసరము'అను పదములను పరిత్యజించుట భావ్యముకాదు.

## 39. పాఱెడునీళ్లకుఁ గట్టవేయుట

సూ.ని. 'నీరు' క్రింద,-"పాఱెడునీళ్లకుఁ గట్టవేయుట=అసాధ్యమగు పని చేయఁబూనుట" అని యర్థముచెప్పి, అందు కీ క్రిందిపద్యము నుదాహరించినది.

---

* ఈ శ్లోకమును మిత్రులు బ్ర॥ శ్రీ కల్లూరి వీరభద్రశాస్త్రిగారు నాకు దయచేసినారు.

"భూపతిమందరాద్రిఁ బువుఁబోఁడివరిం చిట తేకమున్నె యే
రూపునఁ బల్కినందగు; వరుండు ప్రియాంగనఁ బెండ్లియాడి కా
మోప నవీనభోగములఁ బొందెడువో (?) సతులార మీర లీ
పాపపుమాటలాడుదురె పాఱెడునీళ్లకుఁ గట్టవేతురే."

—రుక్మాం. ౪–౨౪.

'భూపతి, ఆపువుబోడినివరించి యిక్కడికి తేకమునుపు–ఎట్టులాడినను ఆడవచ్చునుగాని, ఆమెను పెండ్లియాడి ఇక్కడికి తెచ్చుకొని ఆమెతో సుఖింపబోవుచుండగా, రాజును మీరిట్టి పాపపుమాట లాడవచ్చునా? పాఱెడునీళ్లకు కట్టవేయవచ్చునా?' అన్నది రుక్మాంగదునిభార్య – తన సవతులతో.

ఇందు అసాధ్యపుపని చేయఁబూనుట యేమున్నది? ఏమియును లేదు. 'పాపపుమాట లాడుదురె?' అంటే, ఆడగూడదని యర్థము. ఆ యర్థమును బలపరచునదే – 'పాఱెడునీళ్లకు కట్టవేతురే' అను లోకోక్తి. కట్టవేతురే? అనగా, కట్టవెయ్యగూడదన్నమాట.

సూ. ని. ప్రకరణమును గుర్తించలేదు. రాజుయొక్క అభీష్టమున కడ్డపడుట తగదు–అని ప్రకరణార్థము.

నీళ్లకు పాఱుట స్వభావము. ఆ పాఱుదలకు అడ్డుగా కట్టవేయుట, ఆ స్వభావమును నిరోధించుట. కాబట్టి పాఱెడునీళ్లకు కట్టవేయుట–యనగా – స్వాతంత్ర్యభంగము చేయుట; స్వభావము నడ్డగించుట–యగును గాని, "అసాధ్యమగు పనిచేయఁబూనుట" కాదు.

నీళ్లు పాఱుచున్నయెడల కట్టగట్టుట అసాధ్యముగదా–అని ఊహ చేసినది కాబోలు సూ ని.! అట్టిఊహ పసిబిడ్డలు చేయదగినది కాని, లోకజ్ఞులైన ప్రౌఢపండితులు చేయదగినది కాదు.

కట్టవేయుట పాఱెడునీళ్లకుగాక పాఱనినీళ్ల కెందుకు?

## 40. తెరువుపెసర

సూ. ని. "తెరువుపెసర=(తెరువు + పెసర) నడచుదారిలో మొలచు పెసర. (ఇది త్రొక్కుడుచే శీఘ్రముగా నశించును) అనిచెప్పి, అందు కీ క్రింది పద్యమును చూపినది:

"కాన నిక్కంపుఁగూరిమి గణికయందుఁ
బొరయ దిలఁబొర్సెనే నది తెరవుపెసర" (కవిక. ౪-౧౨౨)

"(ఇట అచిరస్థాయి, క్షణభంగురము అని భావము)" అనియు వ్రాసినది.

తెరవుపెసర - అన్న నుడికి, 'తెరవులో మొలచు పెసరమొక్క' అని యర్థము కాదు; అది త్రొక్కుడుచే శీఘ్రముగా నశించును—కావున, క్షణభంగురము-అని భావమును కాదు.

తెరవుపెసర-అనఁగా, తెరవులోనుండు పెసరచేను. ఆ చేనిపంట (= పెసరకాయలు) ఆ తెరవున వచ్చే-పోయే తెరువరులకే (ముప్పాతిక మువ్వీసము) చెల్లు. పోతే, చెనుగలవానికి దక్కునది ఒక్క వీసమే.

గణికకూరిమియు నట్టిదే. తెరవుపెసరవంటిదే నన్నమాట. గణిక కూరిమిని సందుసుళ్లు సెందరో పొందుచుందురనియు, ఆ కూరిమిలో అల్పాల్పమే- ఆ గణికను నమ్ముకొనియుండువానికి దక్కుననియు భావము.

## 41. చేతడియాఱు

సూ. ని. "ఆఱు = (స్వేదాదులు)పోవు" అని యర్థముచెప్పి అందు కుదాహరణగా,—

'చెలువ కుమారుని న్వడుగు చేసిన చేతడియాఱకుండఁగా.'
(హర. ౨-౧౦౩.)

"చెక్కుల దిగజాఱు చెమట యాఱఁగ..."(చంద్రా. ౨-౧౧౩.)

అను రచనలను చూపినది.

'చెమటయాఱఁగ' అన్నచోట నెట్లో, అట్లే, 'చేతడియాఱకుండఁగా' అన్నచోటను అర్థముచేసికొన్నది సూ.ని.; దాని మతమున 'చేతడి' కర్త; 'ఆఱు' క్రియ. కాని, 'చేతడియాఱకుండఁగా' అన్నచోట 'తడియాఱుట'తో ప్రసక్తిలేదు. వడుగుచేయుటకును-చేయి తడియగుటకును సంబంధము లేదు.

'చేతడియాఱకుండఁగా' అను నానుడికి 'వెంటనే' అని సాముదాయి కార్థము.

"చెలువ, కుమారుని న్వడుగు సేసిన చేతడియాఱకుండఁగాఁ
బాలుపసలారఁగా నిరుగుపొరుగులవారల భాగ్యసంపదల్
కుల మభివృద్ధిఁజెంద మన కూరిమినందనుఁ బెండ్లిసేయఁగా
వలయు ననంతరక్షణమ వైభవమొప్పఁగ ముక్తికన్యతోన్."

వడుగుచేసిన చేతడియాఱకుండఁగాన్ = వడుగుచేసినవెంటనే - అని ప్రకరణార్థము.

కాళహస్తిమాహాత్మ్యములో, రాజు - ఒక దాసికి తలగొరిగింపగా, శివునికరుణచేత ఆ దాసికి మరల వెంటనే శిరోజములు మొలచినవి. అందు కచ్చెరువుపడుచూ, ఆ రాజిట్లన్నాడు:

"ఆజ్ఞ వెట్టించి చేతడియాఱ దిపుడు
దీని కెబ్భంగి మోహనంబైనవేణి, గలిగె" (1-54)

ఆజ్ఞ వెట్టించునపుడు చేయి తడియగునా? కాదుగదా; మరి రాజలా యనుటలో అర్థమేమి?

ఆజ్ఞ పెట్టించి=దీనితల గొరిగించి, చేతడియాఱదు=ఒక్క నిముసమైనను కాలేదు. ఇంతలో దీనికింత చక్కని తలకట్టు ఎట్లువచ్చినది? అని యర్థము.

కాబట్టి, 'చేతడియాఱు' అను పలుకుబడికి,—చేతడి=చేతిలోనితడి, ఆఱు = ఆఱిపోవు, అని ముక్కలుముక్కలుగా అర్థము చెయ్యగూడదు. అది యొక జాతీయము. ఆ పలుకుబడిని మొత్తముగా అట్లే గ్రహించి అర్థము చెప్పవలెను.

*ఈ యర్థమును సూ.ని. గుర్తించలేదు. శ.ర. కర్తయు నెరుగడు.

## 42. గీయు

శ.ర. లో, "గీయు = గీఁతగీయు" అని యున్నది.

సూ. ని. "గీయు = గీచు ౧. చివ్వు, చెక్కు" అని యర్థముచెప్పి, అందు కుదాహరణగా,—

---

* వా.ని. "చేతడియాఱు=చేయి యాఱునంత ఆసల్యమైన లేకుండు. స్వల్పకాలము" అని చక్కగా చెప్పినది.

*"గీసి గొజ్జఁగనీరుపోసి నూతనక్రొత్త
చిఱుబంతిపసుపులోఁ జేవ నలఁది." (హం. ౩-౧౦౪)

"నలువ సన్నంబుగా దీని నడుముగీసి," (నైష. ౩-౧౯౧)

వ. "మఱియు నుత్తాలంబులగు తాలంబులం గిరాతజాలంబులు గీసి..."
(చంద్రా. ౨-౭౪)

అను రచనలను చూపినది.

కాని, తాటాకులు - వెదురుబద్దలు మొదలగువానిని కత్తితో వారి, సరిపరుచుటను, తాటిచెట్టు - ఈతచెట్టు మొదలగువానిని (కల్లుకై) కత్తితో చీరుటను, తెలుపుక్రియ-కీయు-పరుషాదిగాని, 'గీయు'అని సరళాది కాదు. పై పద్యములలోనిది ('కీయు') పరుషాదిక్రియయే. అందలి కీ-గీ, యగుట కళాకార్యము.

"కీసిన వెదురుసలాకల
నేసిన యిరుదలశిఖండి నిడుమంచమునం
దోసరిలి" (క్రీడాభిరామము)

ద్వి. "ఒసవుగా ముసుఁగిడ్డ యోరగొంగడియుఁ
గీసిన గుదియయు." (నవ-చరిత్ర. పు. 27)

మున్నగు రచనలను చూచునది.

చలుపు; చాగిలి; తోవ; తూఱు మొదలగు పరుషాదిపదములు, కాల క్రమమున - వ్యవహారమున, సలుపు; సాగిలి; దోవ; దూఱు, అని సరళాదులుగా మారినట్లే—కీయు-వ్యవహారమున, గీయు-గా మారినది.

బ్రౌను, వ్యావహారిక ప్రధానుడు గావున 'గీయు' అను సరళాది రూపమునే తీసికొని, అర్థము నిట్లు వివరించినాడు :

**"గీయుట to scratch, or scrape. To strip off leaves: to tap a palm tree by cutting lines in it. ఆకులుగీసే కత్తి, a large knife for stripping off leaves; a pruning knife."**

గీటు గీయుటలోని క్రియ సరళాది, (గీయు)
చెక్కుట, చీరుటయను నర్థమిచ్చు క్రియ పరుషాది, (కీయు)

---

* 'కీసి' అని, వే. ప్ర. శాస్త్రిగారి పాఠము.

గీయు-అను నర్థమున 'గీచు' అను రూపమున్ను కలదు; కాని, కీయు-అను నర్థమున 'కీచు' లేదు.

మరియు, 'గీయు' నకు - గీసి; గీచి, అని క్త్వార్థకరూపములు రెండున్నవి. కాని 'కీయు' నకు 'కీసి' అను రూప మొక్కటే; 'కీచి' అను క్త్వార్థకరూపము లేదు.

## 43. రేవంతుఁడు

శ.ర. లో—"రేవంతుఁడు. సం. వి. అ. పుం. అశ్వశిక్షకుఁడు" అని యున్నది. కాని, ప్రయోగము లేదు.

మనుచరిత్రలో—"అవల్గతురగబహువిధారోహకళా, రేవంతునకు" అన్నచోట, జూలూరివారు,—"...రేవంతునకున్ = అశ్వమును శిక్షించి చక్కగా నడిపించేవాఁడైనటువంటిన్ని" అని టీక వ్రాసినారు.

ఇతరటీకలును, ఈయర్థమునే చెప్పినవి. బ్రౌను, తననిఘంటువులో-"రేవంతుడు - A horse-breaker. అశ్వశిక్షకుడు." అని యర్థము చెప్పి, "రేచి పట్టఁగ లేరు రేవంతులైన" అను ప్రయోగమునుగూడా ఇచ్చియున్నాఁడు.

అశ్వశిక్షకుడన్న-యర్థమున 'రేవంతు'డను తత్సమపద మొకటియున్నదేమో (సంస్కృతనిఘంటువులలో కనబడదు) కాని, అశ్వహృదయమునెరిగినవాడు, నలునికి జోడైనవాడు, రేవంతుడను పేరుగలవాఁ డొకఁడున్నాఁడు.

అశ్వారోహణనైపుణ్యమున నలుని, రేవంతుని, ఉపమించిచెప్పుట కావ్యములలో పలుతావులలో కనబడుచున్నది.

(1) "వాహ్యాళిభూమి రేవంత నైషధులట్లు
హయరత్నముల నెక్కి యాడనేర్చు" (భీమ. 1-66)

(2) "అంత జయంతుఁ డెంతయు రయంబున దేవహయంబు నెక్కి రే
వంతునిరీతి చోదనలు వల్గనముల్ రవగాల్చెలంగ" (శశాం. 5-44)

(3) "వాహా, రోహణరేవంత! లలితరూపజయంతా!"
(కాన్యా. సం. 6-244)

(4) "అరుదే యల్లయనొడ్డభూవిభుఁడు వాహారోహరేవంతుఁ డం,
పరుదారన్." (శివలీలావిలాసము)

(5) "ధైర్యామర సానుమంతుండును, దురంగమ రేవంతుండును... నైన గణపతిదేవ మహీనాథునకు" (శాసన. మంజరి. పు. 79)

పై రచనలలోని, రేవంతుడు - ఆపేరుగల ఒక ప్రత్యేకవ్యక్తిగాని, అశ్వశిక్షకుడు (=సాహిణి) కాడు.

'పురాణనామచంద్రిక' యనుగ్రంథములో,— "రేవంతుడు - ఒక గుహ్యకుడు' అనియున్నది.

కిట్టెల్ - కన్నడ నిఘంటువులో,— "రేవన్త Name of the fifth Manu of the present Kalpa; Name of a King." అనియున్నది.—

'రేవంతుఁడు = అశ్వశిక్షకుఁడు' అనుట కాధారమేమో ఇంకను చూడవలెను.

## 44. చాఁదుసేయు

సూ.ని.—'చాఁదు' క్రింద, హరవిలాసములోని,—

"మూల్గుటెమ్ములతోడ ముదుకగాకుండఁగఁ
జాఁదు బాగున నల్లచారుగాఁచి" (౨-౧౨౧)

అను పద్యమును,—*"చాఁదుసేసిన నల్లఁజారుగాఁచి" అను పాఠముతో గ్రహించి,—"చాఁదుసేసిన = పలుచనచేసిన" అని యర్థముచెప్పినది.

చాదు, (చారుకంటెను) చిక్కగానుండునుగాని పలుచగా నుండదు. కావున 'చాదువలె పలుచనచేసి' అనుట సరికాదు.

నల్ల(=రక్తము)ను, ముందు (నీళ్లుకలిపి) పలుచనచేసి, పిమ్మట, చారు కాచినట్లు చెప్పుటయు సరికాదు.

---

* సూ.ని. లో, ఈ యర్థ ముండుట చూడక, (22-వ పుటలో,)— "సూ.ని. తీసికొన్న "చాఁదుసేసిన నల్లన్" అను పాఠాని కర్థమేమో" అని వ్రాసియున్నాను. పొరపాటు.

♦'చాఁచుబాగున (=చాఁచువలె చిక్కగా), నల్ల చారగాఁచి' అను పాఠమే సరియైనది.

## 45. చీములుగట్టు

సూ.ని.—"చీములుగట్టు = చెవులు - చీములుపట్టినట్లు బాధించు" అని యర్థముచెప్పి, అందు కీ పద్యమును చూపినది.—

"పుడమి జనంబులెల్ల నినుఁ బ్రువ్వఁగఁదిట్టఁగ వించునుక్క నో
చ్చెడుమది యెప్పుడుం జెవులు చీములుగట్టెడుఁ గౌరవేశ్వరా."
(భా. ఉ. 2-10)

లోకులు నిన్ను తిట్టు తిట్లు వినుటచేత, మనసూ - చెవులూ బాధపడు చున్నవి-అని పద్యభావము.

కాబట్టి, 'చెవులు...బాధించు' అని యర్థముచెప్పుట సరికాదు. *'చెవులు...బాధపడు' అని చెప్పవలెను.

## 46. ముఱ్ఱు ; ముఱ్ఱుఁబాలు

ఆం. భా. (2-258)లో,—"ముఱ్ఱు నాఁగఁ బీయూష నామంబు" అని యున్నది. (పీయూష మనగా - ఈనిన యేఁడుదివసములలోని యావు పాలు, జున్నుపాలు-అని, గురుబాల ప్రబోధిక.)

శ.ర. లో,—"ముఱ్ఱు = ముఱ్ఱుఁబాలు = ఆవులుఁలోనగునవి యీనిన తర్వాతి మూఁడుదినములలోని పాలు" అని యున్నది.

కాని, 'ముఱ్ఱు'-ఈనిన యేడుదినములలోనిపాలూ కాదు; మూడు దినములలోనిపాలూ కాదు. అది పాలకు పూర్వరూపము. పసరమునకు చూడిముదిరినకొలదిని ము ఱ్ఱేర్పడుచుండును. అది తొలుత పల్చగానుండి క్రమక్రమముగా చిక్కబడుచూ - జిగటలు సాగుచుండును. ఆసన్నప్రసవ

---

♦ వా.ని. లో,—సూ.ని. పాఠమే, సూ.ని. అర్థమే యున్నవి.

* వా.ని.—"చీములుగట్టు = (చీముపట్టినపుండుకలవానివలె) బాధ చెందు" అని చెప్పి, పైపద్యమునే చూపినది.

మైన పశువును పిదికిన వచ్చునది 'ముఱ్ఱు'. అది కొంచెము పసుపువాళుగా నుండును.

ఆ ముఱ్ఱే ప్రసవానంతరము పాలుగా మారును. పశు ఈనినపూట పిండినపాలు పచ్చగాను - చిక్కగాను ఉండును. అవ్వే ముఱ్ఱుఁబాలు.— (ముఱ్ఱుతోఁగూడినపాలు-అని ఆ మాట కర్థము.)

ఆ మొదటిపూట పాలను పశువులతొట్టిలోఁ పోయుదురుగాని కాచి యుపయోగించుకొనరు, ఎక్కువభాగము ముఱ్ఱుగా నుండుటయే దానికి కారణము. తరువాత అయిదారురోజులలో (పూటకు పూటకు ముఱ్ఱుభాగము తగ్గుచూ) పరిశుద్ధమగు పాలేర్పడును. ముఱ్ఱుపాలు కాచినంతనే విరిగి గడ్డకట్టును. ఆ గడ్డకే 'జున్ను' అని పేరు. ముఱ్ఱుపాలనే - జున్నుపాలందురు.

కాబట్టి, "ముఱ్ఱు నాఁగఁ బీయూషనామంబు" అనుటయు,— "ముఱ్ఱు = ముఱ్ఱుఁబాలు" అనుటయు పొరపాటు.

శ.ర.-"జున్ను=జున్నుఁబాలు, *పియ్యూష" మన్నది. అదియును పొరపాటే. 'జున్ను' - 'జున్నుఁబాలు' భిన్నపదార్థములు.

'జున్నుఁబా' లనగా—జున్ను కాదగిన పాలని యర్థము. ఆ పాలను కాచినపిమ్మట నేర్పడునది-జున్ను.

జున్ను, జున్నుపాలు-వేరువేరు పదార్థము లనుటకు,—

"కమ్మనిజున్ను, మంచినెయి, గట్టిది మీఁగడతోఁ బెరుంగు, చొక్కమ్మగు జున్నుపాలు" (హంస. 2-111)

---

* 'పియ్యూషము' ఇది వ్యావహారికరూపము. —"త్రయక్షపానీయ పీయూష...ప్రభృతులను గియ్యలు పెట్టరాదు" అని,-అప్పకవి హెచ్చరిక. (2-226). శ.ర. కర్త, మూలపదములలో 'పీయూష' మన్న రూపమునే చేర్చినాడు. అర్థవివరణాదులలో వ్యావహారిక పదములను వాడవచ్చునని తెలుపుటకు 'పియ్యూష' మన్నాడు.

## 47. చూఱకారుఁడు

శ.ర. లో, "చూఱకారుఁడు. మి.గ్రా.విశే. కొల్లపెట్టినవాఁడు. 'వ. అనవరతసుకవి నికరస్తోత్ర వచనరచనాసమయ నిర్వికారుండును, చెంచుమల చూఱకారుండును' వి. పు. ౧ ఆ. (ఇది బిరుదుపేరు. బిరుదుపేళ్లు లక్షణమునకు కట్టుపడియుండవు.)" అని యుండగా,— సూ. ని. 'చెంచుమల చూఱకారుఁడు' అను పదమును మొత్తముగా-మూలపదముగా-గ్రహించి "చెంచుదుర్గమును కొల్లగొట్టినవాఁడు. బిరుదవిశేషము" అని యర్థము చెప్పినది. పైగా, "మిశ్రము-విశేష్యము" అన్నది.

'చెంచుమల చూఱకారుఁ' డని, శృం.నై. లో ఉన్నందున, సూ.ని. గ్రహించెనందురా? అలా అయితే,—

'చెంచూమల చూరకార' అని కాశీఖండములోను,—

'చెంజిమల చూరకార' అని హరివంశమునను,—

ఉన్నవే. ఆ పదములనుగూడా సూ.ని. గ్రహింపకపోవు టేల?

మరియు, గ్రంథములలోను, శాసనములలోను—('చెంచుమల చూఱకారుఁ' డొక్కఁడే కాఁడు) ఎన్నోరకముల చూఱకార లున్నారు. చూడండి :

1. 'పగమణ్డల మాఱకార' (శాసన పద్యమంజరి. పు. ౧౧)
2. 'కటకపురీచూరకారి-హారి' (మల్ల అనంతభూపాలుని శాసనము.)
3. 'వాణీమనో - భాండారోద్ధత చూఱకార' (కవులషష్ఠము)
4. *'సరస్వతీమనోభండార చూఱకారుండును' (కావ్యా. సం.)

---

* వావిళ్లవారి ప్రతిలోను, శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారి ప్రతిలోను,— 'భండారచౌర్యకారుండును' అని యున్నది. కాని, శత్రుదుర్గములను, భండారములను, చూఱగొనుట శూరలక్షణముగాని, చోరీచేయుట శూరలక్షణము కాదు. 'చూరకార' అనునది బిరుదవిశేషము గాని, 'చౌర్యకార' అనునది కాదు. కావున కవిపాఠము 'భండార చూఱకారుండును' అనియే యుండుననియు, అందు సమాసము తప్పగునని పూర్వ

సూ.ని. ఈ 'చూఱకారసమాసముల నన్నిటిని-అశ్లీలకైకొని అర్థములు వ్రాయునా? (కకారముక్రింద - 'కటకపురీ చూఱకారుఁడు=కటకపురమును కొల్లగొట్టినవాఁడు'-అని వ్రాయకపోవు టేల?)

ఇక్కడ ఒక్క చిన్న మనవి :—

సూ.ని. లో 'చూఱకారుఁడు' అను పదమే లేదే; చూఱకారుఁడు - లేకుండానే, 'చెంచుమల చూఱకారుఁడు' ఎలా వచ్చాడు? చూఱకారుఁడు= కొల్లగొట్టువాడు, అని ఒకముక్క వ్రాసియుంటే,—

"చెంచుమల చూఱకారుఁడు = చెంచుమలను కొల్లగొట్టినవాడు."
"కోయమల చూఱకారుఁడు = కోయమలను కొల్లగొట్టినవాడు."
"వంకాయల చూఱకారుఁడు = వంకాయలను కొల్లగొట్టినవాడు."
"వల్లకోటి చూఱకారుఁడు = వల్లకోటిని కొల్లగొట్టినవాడు."

అని తానర్థములు వ్రాయవలసిన అక్కఱయుండదే. మరి తా* నా పదమును చెప్పక వదలివేయు టేల?

---

పరిష్కర్తలు 'చౌర్యకారుండును' అని సవరించియుండురనియు నా యభిప్రాయము.

ఈ విషయమై శ్రీ శాస్త్రిగారికి వ్రాయగా, వారు 'మారకారుండును' అని యుండుటయే యుచితము. కాని, నా కట్టిపాఠము లభింపలేదన్నారు. వ్రాతప్రతులలో, పాఠము— 'చూఱకారుండును' అనియే యుండునని నా నమ్మకము.

* "చూఱ తెలుగు పదమును - కార సంస్కృతమును నగుటచేత నిది గ్రామ్యమయి సమాసము నింద్యముగా నున్నది. అందుచే 'చూఱకారుడు' అను పదమును నేకవియు నుపయోగింపడు. కావున దీనిని సూ.ని. మూల పదముగా దీసికొనలేదు. కాని; బిరుదరూపమున 'చెంచుమల చూఱకారుడు' అనునది యాక్షేపింప దగనిది. ఏలయన, బిరుదనామములును, శాసన లిఖితములును శాస్త్రనియమములకు గట్టుబడియుండ వందురు. గనుక నియ్యది యేకపదముగానే భావింపబడును. అందుచే నీపదమును, సూ.ని. మూల

అది యట్లుండగా, 'చెంచుమలచూఱకారుఁ'డెవడో, (అనగా అతని పేరేమో) తెలుపక, సూ.ని. ఆ సమాసానికి ప్రతిపదార్థము వ్రాస్తుంది; యెందుకండీ?

ఎందుకంటే, యెన్ని పేర్లని వ్రాస్తుంది? చెంచుమల చూఱకారుఁడు, అనవేమారెడ్డి కావచ్చును; వీరభద్రారెడ్డి కావచ్చును; విష్ణుపురాణపు రాఘవరెడ్డి కావచ్చును; మామిడి సింగనమంత్రి కావచ్చును; బెండపూడి అన్నయమంత్రి కావచ్చును. మరి యింకొకరును కావచ్చును. దానికి నియమేమున్నది? చెంచుమలను చూరగొనుటలో, ఏమాత్రము సంబంధము కలవాడైనను – చెంచుమల చూరకారుడే. ఇట్టి పదమును నిఘంటువు గ్రహింపవచ్చునా? గ్రహించేయెడల, 'చెంచుమలచూఱకారుఁడు = అనవేమారెడ్డి ప్రభృతులు'; 'పరమండలచూఱకారుఁడు=మహామండలిక భీముడు'

---

పదముగా గ్రహించి యర్థమును జెప్పుట తప్పుగాదు"– అని వీ. బ్ర. గారి వ్రాత.

1. 'చూఱకారుడు' గ్రామ్యమట! సమాసము నింద్యమట! అందువలన సూ. ని. గ్రహింపలేదట! అయితే, శ. ర. మూలపదముగానే గ్రహించినదే; తప్పేనా?

2. 'చూఱకారుడు' అను పదము నేకవియు నుపయోగింపడట! 'పరమండల చూఱకార'; 'కటకపురీ చూరకార' అను ప్రయోగములను నేను చూపియే యుండగా, "ఏ కవియును ప్రయోగింపడనుట తెలివితో కూడిన మాటయేనా?

3. 'చూఱకారుడు' నింద్యమట! 'చెంచుమల చూఱకారుడు' అనింద్యమట! అది యేలాగు?

నింద్యసమాసముతో కూడి యేర్పడు సమాస మనింద్యమగునా? 'అల్పదంతః' అనునది దుష్ట (నింద్య) సమాసముగదా. 'ప్రసిద్ధాల్పదండు' అని గాని, 'మేటియల్పదండు' అనిగాని సమాసము చేయుచో సాధువగునా? వీ. బ్ర. గారి వ్యాకరణమున నగును కాబోలు!

4. 'చెంచుమల చూఱకారుడు' ఏకపదమట! నిజమేనా? ఈ రీతి వ్రాతలు వ్రాయువారును పండితులేనా?

ఇత్యాదిగా పేరులు వ్రాయవలసివచ్చును. వ్రాయవచ్చునా? ఎన్నటికిని వ్రాయగూడదు. నిఘంటువు తీసికొనవలసినది – 'చూఱకొర' పదమునుగాని, చెంచుమల మూఱకొరుఁడు; పరమండల చూఱకొరుఁడు–వంటి పదములను కాదు. 'చూఱకొరుఁడు' అనుపదమును (శ.ర. కర్త వలెనే) మూలపదముగా చూపి, దానిక్రింద, ఆపదముతోఁగూడిన పదములను చూపవలెను. అది నిఘంటుమర్యాద. సూ.ని. త్రొక్కినది తప్పుత్రోవ.

మరియు, 'చూఱకొరుఁ'డన్నను,– 'చెంచుమల మూఱకొరుఁ' డన్నను విశేషణమే అవుతుందిగాని, విశేష్యమేలా అవుతుంది. శ.ర. కర్త విశేషణమంటే, "కాదు; అది విశేష్య"మన్నది, సూ.ని. *కొంటెమేమో!

* "ఈ ప్రశ్నయుబట్టియే వింతపడవలసివచ్చినది. ఏలయన: 'చూఱకొరుడు' అనుపదము, సూ. ని. చెప్పినట్లు విశేష్యమె (Noun) కాని, శ.ర. కర్త చెప్పినట్లు విశేషణము (adj) కాదు. విశేషణములకు లింగవచన విభక్తు లుండవు. కాని, యీ 'చూఱకొరుడు' పుంలింగము, ఏకవచనము, ప్రథమావిభక్తియు నయి యున్నదిగదా. కావున విశేష్యమేకాని విశేషణము గాదు. విశేషణమని చెప్పుట ప్రమాదము" అని వీ.బ్ర.గారి వ్రాత.

చూఱకొరుడు విశేషణ మనుట ప్రమాదమగుచో, ఆ ప్రమాదము, శ.ర. కర్తదియగునేగాని, నాది కాదు. కావున నా ప్రశ్నకు వింతపడవలసి వచ్చినదనుట తెలివితక్కువ.

చూఱకొరుఁడు – పుంలింగమట! వారిపాండిత్యమున అది అకారాంత పుంలింగము కాబోలు! కాబోలు బోలు బోలు!!

లింగవిభక్తివచనములుండు శబ్దము లన్నియు–విశేష్యములేనట! అలా అయితే, లింగవిభక్తి వచనములు గల,— శివంకరుఁడు; ప్రియంవదుఁడు; నాందీకరుఁడు; కృపాళుఁడు–మొదలగుపదములు, నిఘంటువులలో విశేషణములుగా చెప్పబడియున్నవే! వానిగతి యేమి? బ్రహ్మంగారి శాసనము ప్రకారము, నేటినుండియు, వాటిని విశేష్యములుగా భావింపవలసినదేనా? అట్లు భావించు 'యంబ్రమ్మలు'ను ఉందురా?

చూఱకొరుఁడు (కొల్లగొట్టువాడు) గుణమును తెలుపుపదము గాని, సంజ్ఞావాచకము కాదు. కావున, విశేష్యము (Noun) అనుట తప్పు. అసలది బిరుదపదము. బిరుదులు విశేషణములుగాని విశేష్యములు కావు.

కారు (కారుఁడు) అను సంస్కృతశబ్దము మాఱు-అను వైకృతముతో సమసించుట వ్యాకరణవిరుద్ధము. అందువల్లనే, శ.ర. కర్త-(ఇది బిరుదు పేరు. బిరుదుపేళ్లు లక్షణమునకు కట్టుపడి యుండవు) అని వివరించి యున్నాడు. సూ.ని. ఆ వివరమును చెప్పక, విడిచినది. అది యెందువల్ల? మరియొక విశేషము - మాఱుకారుఁ డన్న మిశ్రసమాసము కేవల సంస్కృతశబ్దములతోను కలసి-సమసించును. తప్పుకాదు. ('పరమండల మాఱుకారుఁడు'; 'కటకపురీ మాఱుకారుఁడు'; 'సరస్వతీమనోభండార మాఱుకారుఁడు' అను సమాసములను చూపియేయున్నాను గదా.) ఈ యంశమును, శ.ర. కర్త చెప్పలేదు. సూ.ని. యైనను చెప్పెనా? లేదే!

"లక్షణగ్రంథమైన కావ్యాలంకారసంగ్రహమున గల "సరస్వతీ మనోభండార చౌర్యకారుం" డను పదములోగల సలక్షణమైన 'చౌర్య కారుం'డను పదమును మాఱుకారుఁడని దిద్ది, విలక్షణ మొనరించి, యాకవి కెనలేని కళంకమును మన దీ. పి. శాస్త్రిగారు గూర్చినారు గదా!" అని వీ.బ్ర. గారి మరియొక వ్రాత.

వారు సామాన్యసమాసజ్ఞానముకూడా లేనివారు.—"నీరు + ఆట = నీరాట, నీరాటము (స్నానము)—'నీరాటవనాటములకుఁ - బోరాటం బెట్లు గలిగె' (భాగ)."— "నీరు + ఆమని = నీరామని (వర్షఋతువు). ఈ రెండును తత్సమసమాసములు" అనియు,—

"వలరాజు. 'వల'యనునది తెలుగు. 'రాజు' అనునది మిశ్రమ సమాసము." అనియు,—

"రాజు + ఆజ్ఞ = రాజాజ్ఞ. ఇందలి 'జా' ఆకారముతోఁ గూడి యున్నను తత్సమశబ్దమగుటచే తాలవ్యమైనది." అనియు, - అన్నవారు. అట్టివారికి విశేషవిధిగల బిరుదుసమాసముల తత్త్వ మెట్లాకళింపు కాగలదు?

'భండారమాఱుకారుఁ' డనుటయే ఒప్పు. 'చౌర్యకారుఁ' డని దిద్దుటయే తప్పు.

తిక్కన, నిర్వ. రా. (2-102)లో,—"పాండిత్యసుభగుఁ డ్రిభువన, పెండేరు" అన్నాడు.

'త్రిభువన పెండేరుఁడు' అనుట తప్పని, దిద్దివేయవచ్చునా? దిద్దుచో, అది యవివేకమును - భాషాద్రోహమును అగును.

## 48. చేటపెయ్య

"చేటపెయ్య=దూడచచ్చిన ఆవు చేపుటకై చచ్చిన దూడచర్మమును కుట్టి దానిలో గడ్డిపెట్టి చేసినదూడ, కృత్రిమవత్సము" (సూ.ని.)

దూడచచ్చిన ఆవుచేపుటకే కాదు, దూడచచ్చిన బఱ్ఱెచేపుటకును - చేటపెయ్యను-తయారుచేయుట కలదు. కావున, *"చేటపెయ్య=చచ్చిన దూడచర్మమును కుట్టి - లోపల గడ్డిపెట్టి - చేసిన దూడ" అని చెప్పుట యుచితము.

చేటపెయ్య-యొక్క తొలిరూపము 'చేఁతపెయ్య' అయ్యుండు ననియు, అది, 'చేఁతగట్టు'వంటి పదమనియు, చేఁతపెయ్యయే-కాలక్రమమున 'చేటపెయ్య' అయినదనియు నా యభిప్రాయము. పెద్ద లేమంటారో!

శ.ర. లో "చేఁత = కృత్రిమము; చేఁతగట్టు = కృతకాద్రి"-అని యున్నది.

---

* వా.ని. "దూడపోయినవెనుక దాని చర్మముతోఁ జేయు కృత్రిమవత్సము" అనియే చెప్పినది.

'చేటపెయ్య'ను గూర్చి, వీ.బ్ర. గారిట్లొక వ్యాఖ్యానము చేసినారు:—

"చేటుయొక్క విశేషణరూపమే చేట.— "చేటు. Ill, ruin, waste, spoiling, to be ruined or destroyed." (బ్రౌ),— చేటు-అనగా, 'చెడు' అని యర్థము. చేటుచెందినపెయ్య-అని భావము. ఇందుల కొకటిరెం డుదాహరణములు :—

'వారు పైనెత్తివచ్చినఁ బోరి కోప
మనిన ధృతిచేట కాక పొం దగునె చెపుమ.' (ఉద్యో. 2-215)

'చేటుగోరుచున్న చెనటివి నీవు' (సుగ్రీవ. పు. 15)

బ్రహ్మంగారివ్రాత నా కేమీ బోధపడలేదు. 'చేటపెయ్య'లోని 'చేట'కును, పై యుదాహరణలకును సంబంధమేమో తెలియలేదు.

'చేటు'కు 'చేట' విశేషణరూపమట! నిజమేనా?

వారిది 'చేటవ్రాత' యగునో! 'వ్రాతచేట' యగునో! విద్వాంసులు నిర్ణయింతురుగాక.

# 49. నిలువునీరు

సూ.ని. 'నిలువు' క్రింద, 'నిలువు నీరునఁబండినట్లు' అను నానుడినీ— "సమృద్ధమైన నీరునిలిచిన చేనిలో పండిన పైరురీతిగా" అన్న యర్థమునూ వ్రాసి, ఆ యర్థమునకు,—

"చెలఁగి యమ్మకొక్క యొక్క యొచ్చెమ్ములేక
నిలువు నీరునఁబండిన ట్లలరినాఁడు." (౨-౮౨)

అను 'సారంగధర' పద్యమును చూపినది. పద్యమును - అర్థమునుగూడా, సూ.ని. వే. వే. శాస్త్రిగారి గ్రంథమునుండి గ్రహించినది.

"నిలువు...నట్లు = మానిసి ప్రమాణపు నీళ్లునిలిచినచేనిలో పైరు పండినరీతిగా" అని, శాస్త్రిగారి టీక.

'ఒకట నొచ్చెమ్ములేక'-అని, తంజావూరిప్రతి పాఠము. ఏ యంశ మునను లోపములేక, నిలువు = ఈశరీరము, నీరునఁబండినట్లు = నీటఁ బెరిగినదో యన్నట్లుగా, (సారంగధరుడు) అలరినాఁడు=ఒప్పియున్నాడు- అని నేను వ్రాసిన టీక. (చూ. పుట. ౧౩౭)

(1) చెట్టునఁ బుడికినట్లు, (2) పులుమెసవిబలిసినట్లు-అను నానుడు లెట్టివో,—'నీరునఁ బండినట్లు' అను నానుడియు నట్టిదే.

పైరుగాని, చెట్టుగాని పెరుగుటకు 'నిలివెడు' నీరక్కరలేదు. తగు మాత్రమున్న చాలును. నీరు మితిమీరియున్నచో నీరుచిచ్చుపడి చెట్లు చేమలు నశించును. కావున ఆ నానుడిలోని 'నిలువు'నకు,— శరీరము (ఆకృతి) అని యర్థముచెప్పుట యుచితముగాని, 'నిలివెఁడు' అని చెప్పుట యుచితముకాదనీ, చెప్పవలసిన అక్కరయులేదనీ నా యాశయము.

---

(1) "ఏ వేషము ధరియించిన
నా వేషము తనకు నందమై యద్ధాత్రీ
దేవుఁడు చెట్టునఁబుడికిన
భావంబున నుండు రూపు ప్రాయము కలిమిన్." (కాశీ. 7-232)

(2) "పులుమెసవి బలిసినట్లుండు పుండరీకములు"
(పిడు. బస. పురా. 7-252)

## వీరబ్రహ్మంగారి విపరీత పాండిత్యము

'నిలువు' అను పదాన్ని గురించి, వీ.బ్ర.గారు వ్రాసిన వ్రాతలు చిత్రవిచిత్రములుగా నున్నవి. అందు వారి పాండిత్యము విపరీతముగా వెల్లివిరిసినది. గ్రంథవిస్తరభీతిచే, ఒక కొన్ని యంశములనుమాత్రమే యుదాహరించుచున్నాను.

### 1. నిలువు – అవయవార్థము

"నిలువు అను శబ్దము తన యవయవార్థమునే కాక, సందర్భోచితముగా ననేకార్థములను సూచించును" అని యొక వ్రాత.

తెనుగుమాట; ఏకపదము – అయిన 'నిలువు'కు అవయవమేమి? అర్థమేమి?

### 2. నిలువు – శబ్దపల్లవము

"నిలువు అనేకార్థములను సూచించునట్టిదై, శబ్దపల్లవము(Idiam)గా వ్యవహరింపబడుచుండును" అని యింకొక వ్రాత.

శబ్దపల్లవసంజ్ఞ క్రియలకేగాని,– నిలువు, నీరు, నిప్పు, నీటు మొదలగు విశేష్యములకు లేదు.

ఆ క్రియలలోను, ధాత్వాదుల కనుప్రయుక్తంబులై విలక్షణార్థాభిధాయకంబులగువానికేగాని,–వచ్చు, పోవు, తిను, వంటి యేకపదక్రియలకు శబ్దపల్లవ సంజ్ఞ చెల్లదు.

కావున, ఏకపదమును–విశేష్యమునైన 'నిలువు' శబ్దపల్లవ మనుట వ్యాకరణగంధ మెరుగని దుబారా ప్రసంగము.

### 3. నిలువు (Idiam)

తమకు సంస్కృతాంధ్రములయందే కాక, ఆంగ్లమునందును పాండిత్యము కలదని తెలుపుకొనుటకు కాబోలు, నిలువు–శబ్దపల్లవ మని చెప్పుటతో తృప్తిపడక 'Idiam' అనికూడా సెలవిచ్చినారు.

శ్రీవారికి సంస్కృతాంధ్రములయందుగల పాండిత్య మేపాటిదో ఆంగ్లమునగల పాండిత్యమును ఆపాటిదిగనే యున్నది. అర్థముమాట

అటుండగా 'ఇడియమ్' అనుమాట వ్రాయవలసినతీరు, అనగా గుణింతము (Spelling) గూడా వారు సరిగా నెరుగరు.

Idiam అని వ్రాసినారు; తప్పు.

Idiom అని వ్రాయవలెను. (ఇడియమ్ లోనిది 'ఒయమ్' గాని 'ఎయమ్' కాదు.)

ఆంగ్లమున నైనను ఒక్క పదము 'ఇడియమ్' అనిపించుకొనదు. విలక్షణార్థమునిచ్చు కొన్ని పదములకూడికకు 'ఇడియమ్' అని వ్యవహారము. ఆ పదమునకు ఆంగ్లభాషలో వివరణ మిట్లున్నది.

"Idiom—'One's language; the way of expression, natural to a language; an expression peculiar to it."

కాబట్టి, "నిలువు-శబ్దపల్లవ"మనుట యెట్టితప్పో, 'ఇడియమ్' అనుటయును అట్టితప్పేనని పర్యవసానము.

## 4. నిలువు-హృదయము

'నిలువు అనేకార్థముల నిచ్చు'ననుచూ వారిచ్చిన యుదాహరణములునూ, చెప్పిన అర్థములునూ ఇట్లున్నవి.—

"నిలువెల్ల కాదయ - ఇట నిలువు అనగా శరీరమును కాదు. ఆకారమునుగాదు. దయకు స్థానభూతమైన హృదయమని యర్థము. 'దయార్ద్రహృదయు' అని కలదుగదా"-అని వారి వ్రాత.

'దయార్ద్రహృదయ' యనుట లోకమున కలదుగావున, 'నిలువెల్లకాదయ' అంటే హృదయమంతయును దయ యని యర్థమట! ఇది శబ్దార్థము నెరిగిన వ్రాతయేనా? ఆయన నిఘంటువు నైనను చూచుకో గూడదూ?

(1) శ. ర. కర్త, నిలువు = ఆకృతి యని అర్థముచెప్పి, అందు కుదాహరణగా, "నిలువు దయామయంబు" అను రామాభ్యుదయ పద్యము నిచ్చినాడు.

(2) బ్రౌనుదొర, 'నిలువు' అను పదముక్రింద,—

"కమలంబు మోము కన్నులు
కమలంబులు కేలుఁగవయుఁ గమలము లడుగుల్
కమలంబులు నిలువెల్లను
కమలాకృతి మించెఁ బుడమికన్నియ బళిరే" (రామా. 4-67)

అను పద్యమును చూపించి, "కమలంబులు నిలువెల్లను. She was lovely all over: her whole figure was roses" అని యర్థము చెప్పినాడు.

(3) "నిలువెల్లను గల్ల - కామి నిజమురిగలఁడే" (భాగ. 9-571)

శ. ర. కర్త 'నిలువు = ఆకృతి' యని చెప్పియుండగా, బ్రౌను పండితుడు 'నిలువు = figure' అని తెలిపియుండగా, శ్రీ వీరబ్రహ్మముగా రొకరు 'నిలువు = హృదయ'మనుట విపరీతముగా లేదా?

## 5. నిలువు = చూపులు, మాటలు, చేతలు.

"ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ. ఇందు, నిలువు అనగా శరీరమునుగాదు, విషమనగా... విషమునుగాదు. నిలువెల్ల విషమనగా, హృదయప్రేరితములై చూచు చూపులును, ఆడు మాటలును, చేయు చేతలును విషతుల్యములైన పాపభూయిష్ఠములని యర్థము. కావున ఇక్కడ నిలువు-అనగా, చూపులు; మాటలు; చేతలు." అని వారి యింకొక వ్రాత.

సూ. ని. 'నిలువు = శరీరము' అని యర్థముచెప్పి, అందుకే 'సుమతి' పద్యమునే యుదాహరించినది.

బ్రౌను, 'వాని నిలువెల్లా విషము' అనేమాటకు "he is a villain from head to foot" అని యర్థముచెప్పి, అక్కడ 'సుమతి' పద్యమును గూడా సూచించినాడు.

అసలు 'ఖలునకు నిలువెల్ల విషము' అనేమాటకు "సర్వాంగం దుర్జనే విషమ్" అన్న సంస్కృతవాక్యమే మూలము.

అది యట్లుండగా, సుమతిశతక పద్యమునకు,—

"శిరసి విషం స్యాత్ఫణి న
స్తిష్ఠే త్పుచ్ఛేతు వృశ్చికస్యాహో!
న శిరసి నహి పుచ్ఛేవా
వపుషి ఖల స్యాఖిలే విషం హి స్యాత్"

అని సంస్కృతానువాదము.

కాబట్టి వీ. బ్ర. గారివి 'అస్తావిస్తే'పు వ్రాతలుగాని సరియైనవి కావనీ, వారు సుమతీశతక పద్యమునకైనను సరిగా అర్థముచెప్పగలవారు కారనీ

అట్టివారు శబ్దార్థచర్చలకూ, పాఠనిర్ణయాలకూ పూనుకొనుట తప్పనీ అంటే, పెద్ద లంగీకరింపరా?

## 6. పునరుక్తి; ఛందస్సు

“నిలువు = శరీరము, అని యర్థముచెప్పెయెడల, శరీరవర్ణనము సీసచరణములలోను ఉన్నదిగావున పునరుక్తిదోషము తటస్థించి ఛందశ్శాస్త్రరీత్యాగూడా తప్పగుచున్నది” అని వారిదొక ప్రసంగము.

పునరుక్తి వాక్యదోషముగాని, ఛందోదోషము కాదు. ఆ దోషము పద్యముననే కాదు, ఛందస్సుతో సంబంధములేని గద్యమునను ఉండవచ్చును. కావున “పునరుక్తితటస్థించి ఛందశ్శాస్త్రరీత్యా తప్పగును” అనుట శకార సంభాషణమును తలపునకు తెచ్చు అసంబద్ధ జల్పనము.

అదేమికర్మమోగాని ఆ బ్రహ్మకవిగారిబుద్ధికి - అర్థగ్రహణమున - వక్రగమనమేగాని, ఋజుగమనము లేదు. చూడండి.—

“నెమ్మోని, మిసమిసల్ గడు మిఱుమిట్లుగొనఁగ”

అని వేదం-వారి పాఠము.—“మిఱుమిట్లుగొలుప” అని నా సవరణ.

నా సవరణ నాక్షేపించుచూ వీ.బ్ర. గారు గిలికినవ్రాత యిదీ.—

“కొనఁగ అనుటయే సరి. ‘కొలుప’ అనుట సరికాదు. ‘కొనఁగ’ అను క్రియకు ‘మిఱుమిట్లు’ కర్మయు; ‘మిసమిసలు’ కర్తయునై యున్నవి. ‘మిసమిసల్ - మిఱుమిట్లను-కొనఁగ’ అని చక్కనియర్థము కనబడుచుండగా శ్రీ దీ.పి. శాస్త్రిగారు,— మిసమిసలే (పద్యమునలేని) కనులకు మిఱుమిట్లు గొలుపుచున్నవని వ్రాయుట యసంగతము కాదా?”

మిఱుమిట్లుగొనునవి కన్నులో - కాంతులో,—ఆయనకు తెలియదు. ‘మిఱుమిట్లుగొను’ అనునది అకర్మకక్రియయన్న జ్ఞానమూ-ఆయనకు లేదు. మిసమిసలు-కర్తయట! మిఱుమిట్లు-కర్మయట! కొను-క్రియయట! ఆయనా పండితుడే! ఆయన వ్రాతలకును బదులు వ్రాయవలసినదే!! గ్రహచారము!!!

(1) ఆ సారంగధరలోనే.—

"నలుదెసల్ మిఱుమిట్లుఁగొలుపు జేహచ్ఛాయ
తలఁగఁ ద్రోయఁగరాని బలముగాఁగ" (౨-౩౫)

అని యున్నది.

(2) భాగవతములో,—

"హేతివ్రాత దీధితులు... వియచ్చరకోటి నేత్రంబులకు
మిఱుమిట్లుఁగొలుప" (10. ఉ. 401) అనియు, —

"మిక్కుటంబుగ దృష్టి మిర్మిట్లుఁగొనఁగ" (,,-1306) అనియు నున్నది.—

(3) ఆంధ్రభాషార్ణవములో,—

"కనులు చెదఱంగఁ జీఁకట్లు గ్రమ్మెననుట
కలయ మిఱుమిట్లుగొనె నన" (3-109) అని చెప్పబడియున్నది.

ఏదియు నెఱుగక,— పనికిమాలిన వ్రాతలతో భాషారాధకులను బాధించు వీ.బ్ర. గారిని విద్వల్లోకము మందలింపవలదా?

## 50. నీరుకొలఁది తామర

సూ.ని. 'తామర' క్రింద నీరుకొలఁది 'తామర' అను సామెతనుచూపి, "చెఱువులోని నీ రెంత హెచ్చుగానున్న తామరపూ వంతయెత్తుగా లేచును" అని యర్థము వ్రాసినది. ఆ యర్థమునకు,—

"తమవిద్య నెవ్వరేమా,త్రము గనఁజాలుదురు వారిదండను దన్నా
త్రమప్రకటింతురుబుధులు, త్తములమహిమ నీరుకొలఁదితామరసుమ్మీ"

అను (కళా. ౨-౯౯) పద్యము నుదాహరించినది.

పై సామెతకు సూ.ని. చెప్పినదేనాయర్థము? ఆ యర్థము ఉదాహృత పద్యమున సరిపడినదా? 'ఉత్తములమహిమ నీరుకొలఁది తామర' అన్న మాటకు, 'చెఱువులోని నీరెంత హెచ్చుగానున్న తామరపూవంత యెత్తుగా లేచును' అని యర్థముచెప్పితే, ఏమి తేలినట్లు? ఏమి తెలిసినట్లు?

సూ.ని. చెప్పినది ఆ సామెతలోనిమాటల కర్థమగునేగాని, ఆ సామెతకుగల సంప్రదాయార్థము కాదు. ఎదుటి శక్తిసామర్థ్యములకు తగినట్లును, ఎదుటి హృదయమునకు సరిపోవునట్లును వర్తించుట-యను నర్థమున వాడబడునది యీ సామెత.

'ఉత్తములమహిమ నీరుకొలఁది తామర' యనగా,—తామర, నీటి హెచ్చుతగ్గులనుబట్టి, ఎత్తుగాలేచుచు - క్రిందకిదిగుచు నుండు విధముననే, ఉత్తములయొక్క మహిమయు, ఎదుటివారి ప్రజ్ఞయొక్క న్యూనతాధికతల ననుసరించి, ప్రకటమగుచుండునని భావము.

"మగఁడే కొలఁదిగ నడిపినఁ
దగ నట్లే నీరుకొలఁది తామరవై యే
పగిది న్నడచెదవో, నీ
దగునేరుపు చూతుమింక నలరుంబోఁడీ" (యయా. 4-129)

అన్నచోట, "నీరుకొలఁది తామరయై-నడచుట" యనగా, మగనిమనసు ననుసరించి మెలగుట, యని భావము.

సామెతలు భావప్రధానములు గాని - ప్రతిపదార్థ ప్రధానములు కావు. కావున సూ.ని. వ్రాసినఅర్థము సరియైనది కాదు.

నీరు హెచ్చుగా వచ్చినప్పుడు - ఎత్తుగాలేచునది తామర పువ్వొక్కటే కాదు, తామరఆకులు-కాడలుకూడా లేచును. కాబట్టి - 'నీరుకొలది తామర' అన్నచోట, 'తామర = తామరపువ్వు' అనుట సరికాదు.

## 51. కమ్మపంజు

శ.ర. లో,—"కమ్మపంజులు = పంజులకమ్మలు. "వ. కమ్మపంజుల వజ్రంపుఁజకచకల వకవకలు వీడుకొని (స్వా. 3. ఆ.)" అనియున్నది.

సూ.ని.,— "కమ్మపంజు = పంజులకమ్మ - రత్నములు కూర్చుటచే దివిటీవలె వెలిఁగెడికమ్మ" అన్నది.

ఆ రెండువ్రాతలును ప్రమాదమూలకములు.—

'కమ్మపంజు' అనగా, కమ్మయొక్క పంజుగాని, పంజులకమ్మ కాదు. (పంజు = కమ్మలోపొదిగిన రత్నాల మొత్తము.) అందుకీ క్రింది ప్రాచీన రచనలు ప్రమాణము.—

(1) "క్రొమ్మించు నిర్మించు కమ్మపంజుల తళ్కు-
లుదిరి చెక్కులతోడఁ జవుఁబలాడ." (రా.వి. 3-125)

(2) "కలికి చెక్కులడాలు కమ్మపంజుల మేలు
తళుకుల కపరంజి జళుకు గులుక" (,,-3-130)

(3) "వెలలేని నీరుకెంపుల కమ్మపంజు డాల్
తేటచెక్కులఁ బిల్లదీఁపులాడ." (పాంచా. పరి. 2-14)

(4) "చెలి యటు చూచి లేచి తన చేడియపై నొరగెం జలద్ద్విగం
చలములు గ్రమ్మ 'పంజు'నుసానలఁదీరఁ, బదాఱువన్నెగం
టలమొలనూలు జాఱ." (రా.వి. 3-129)

ఈ పద్యమున 'పంజు', చూపులకు పదునుపెట్టు సానగా చెప్పబడినది.

'సాన'గా చెప్పబడిన 'పంజు' కమ్మలోపొదిగిన మణుల మొత్తమే ననుట నీ క్రిందిపద్యము స్పష్టముచేయుచున్నది.

"వెలఁదికి మణితాటంకము
లలరుఁగ దిగ్విజయకాంక్ష నతనుఁడు చూపు
మ్ములుకులు నిశాతములుగా
నలవడ వడిఁ దీడు శాణయంత్రము లనఁగన్" (నరస. పుట. 333)

శ.ర. కర్త గమనింపలేదుగాని, ఆయనగా రుదాహరించిన 'స్వా. మను.' వచనము లోను, 'కమ్మపంజుల = కమ్మలతాలూకు పంజులలోని - వజ్రంపు చకచకలు' అనియే అర్థము.

పంజు-గల కమ్మ 'పంజుకమ్మ'; అదే 'పంజులకమ్మ'యును.—

(1) "పంజులకమ్మ యనఁగ రత్నతాటంక మెసఁగు" (ఆం.భా.2-148)

(2) "చేర్చుకక్క యమర్చి చెక్కులను జొక్కపు పంజుల కమ్మలుంచి" (పాంచా. 2-7)

(3) "నును పెక్కు జిగిచెక్కులను మిక్కుటపుఁ డెక్కు
గ్రమ్మెడు పంజులకమ్మ లలర" (హంస. 2-4)

(4) "బంగరుఁదళ్కుఁజెక్కులను బంజులకమ్మల డాలు చిందుద్రొక్కంగ" (ఉ.రా. 3-81)

(5) "తమ్మికెంపుల పంజులకమ్మదోయి" (యయా. 4-90)

"పంజులకమ్మ - Large earrings worn by women" అని బ్రౌణ్యమునను, "పంజులకమ్మలు = రత్నములుచెక్కిన కమ్మలు" అని శ.ర.లోనుగూడా చెప్పబడియున్నది.

పంజులకమ్మను, ఊరక 'పంజు' అనుటయును కలదు.—

(a) "పంజు. A sort of earrings". (బ్రౌను)

(b) "పంజు = రత్నములు చెక్కిన తాటంకము". (ఆంధ్ర.పారి.)

కమ్మలో నుండు భాగములు మూడు.—

1. పంజు (రత్నాలు పొదిగిన భాగము). 2. గొట్టము. 3. చీల. కమ్మచీల; కమ్మగొట్టము - అనుమాట లెట్టివో 'కమ్మపంజు' అనుమాటయు నట్టిదే. అది, ష.త. సమాసము.

(పంజు; దివిటీ)

'పంజు'కు 'దివిటీ' యను నర్థముకూడా కలదు. దానిని చూచి, సూ.ని. 'కమ్మపంజు'కు "రత్నములు కూర్చుటచే దివిటీవలె వెలిఁగెడు కమ్మ" అని అర్థము చెప్పినది. పంజు (= దివిటి)వలె వెలిగెడి కమ్మ 'పంజుకమ్మ' కాక, 'కమ్మపంజు' ఎట్లయినదో సూ.ని. చెప్పలేదు.

అసలు, కమ్మతో దివిటీకి పొత్తు గలుపుట *పొరపాటు.

కమ్మలనుగూర్చిన ప్రస్తావనలో 'పంజు'కు దివిటీ యని యర్థము చెప్పుట - మజ్జిగన్నముతింటూ సైంధవము తెమ్మంటే గుఱ్ఱమును తోలుకొని వచ్చుటవంటి దగును.

కావున అట్లనుటకంటే, 'కమ్మపంజు'కు, కమ్మరూపమైన పంజు (= రత్నాల కట్టడము) అని విగ్రహముచేసి, రత్నతాటంకము అని యర్థము చెప్పుట యుచితమని నాకు తోచుచున్నది.

అప్పుడు, కమ్మపంజు = పంజులకమ్మ, అనుటయును సముచితమే యగును. అంతేగాని, కమ్మపంజు = పంజువలె వెలిఁగెడు కమ్మ, అనుట మాత్రము సరికాదు.

---

* ఈ పొరపాటుకు వేదం.వారి, 'సారంగధర' (౩. ౧౪౪) లఘుటీక మూలము. (చూ. 'జితకాశి' పుట, ౪౫౭)

సూ.ని. 'పంజు' తత్త్వమును సరిగా విచారించ లేదు.

పంజుతత్త్వ మేమనగా :—'పంజు' అను క్రియ యొకటి యున్నది. 'పంజుట' యనగా చెల్లాచెదరుగ పడియున్న గడ్డి, గాదము మొదలైన వానిని చక్కపరిచి, కొంచెముకొంచెముగా పోగుచేయుట. కళ్లములో ఎద్దులచేత తొక్కించిన గడ్డిని, 'పంజి' పోగువేయుదురు. ఒక్కమాటు 'పంజి' (=చక్కపరిచి) తీసిన కసవుమొత్తము ఒక 'పంజ' అనబడును. 'పంజ' - (మానము); పంజెఁడు - (పరిమాణార్థకము).

ఒక పంజ పచ్చిగడ్డి; ఒక పంజెడు ఎండుగడ్డి-ఇత్యాదిగా వ్యవహారము.

'పంజు' అను క్రియయు; పంజ; పంజెడు; అను పదములును, గుంటూరు మండలములోని పల్లెలలో నేటికిని వాడుకలో నున్నవి. పంజి (=ఒకటిగా చేర్చి)న కసవు మొదలగునవి కట్టగా కట్టబడిన కిమ్మట 'పంజు' అనబడును.

కసవుకట్ట యగుచో—కసవుపంజు.

విడవలికట్ట (=గంట) యగుచో - విడవలిపంజు.

గుడ్డలకట్ట (=చుట్ట)యగుచో - గుడ్డపంజు. (ఇదే దివిటీ, కాగడా.)

రత్నములకట్ట (=కూర్పు)అగుచో-రత్నాలపంజు. (ఇదే కమ్మపంజు.)

**N.B.** రతనాలుపొదిగిన యే వస్తువైనను 'పంజు' అనబడును. ఉ॥ పాలకి పంజులు.

కాలక్రమమున 'పంజు' స్వతంత్రశబ్దమై కసవుకట్టకును; విడవలి గంటకును; గుడ్డలుచుట్టి చేయబడు-దివిటీకిని; రతనములుకూర్చి కట్టబడు కమ్మకును; మణులుతాపిన పాలకీదండెకును; ప్రతినిధియై, ప్రాచీనకావ్య ప్రపంచమున విశ్శృంఖలవిహారముచేసినది. తద్జ్ఞులు (వారె పండితులు) దానిని చూచినవెంటనే గుర్తించి ప్రకరణోచితమైన యర్థముతో గ్రహించెడివారు.

1. "నూరెలవెలుఁగు పంజులు శరీరన్యస్త
   భూషామణిస్ఫూర్తిఁ బ్రోదిసేయ." (వేం. పంచ. 4-345)

ఈ పద్యములోని పంజులు, దివిటీలు.—

2. "పంజుజాడల నేఁగు పదవి రోసినఁగల్గెఁ
   బంజుజాడల నేఁగు పదవి యిచట." (రామా. 5-41)

ఇందు, మొదటి పంజు - దివిటీ; రెండవ పంజు - విడవలి గంట.—

3. "దృగం, చలములు గ్రమ్మి 'పంజు' నునుసొనలందిర."
(రా.వి. 3-129)

ఇక్కడ, పంజులు - కమ్మలో చెక్కిన రవ్వలు. (కమ్మపంజులు.)

4. "కడలియం దేకోదకము వేళఁ బుట్టిన
పవడంపుఁదీఁగల పంజుతోడ,
వేనవేల్ యోజనంబుల విరివినొప్పు
లక్షకోటిశిలాకికోలం కృతంబు
తారకోస్థూలషాట్కికస్థాపితంబు
విష్ణునకుఁబట్టె వెనకయ్య వెల్లగొడుగు." (కాశీ. 4-294)

ఇక్కడ, పంజు - అనగా పగడపుతీగెలతో (నవరత్నములతో)ను చేయబడిన నగిషీపని - యని యర్థము.

5. "పసిఁడితీఁగల కీలుపంజుల డాలు
పసనైన ముత్యాల పల్లకీ లేవి?" (గా. హరి. ఉ. 2232)

(కీలుపంజుల...పల్లకీలు, అని యీ రచనలో చిన్న శబ్దచిత్రము.)

ఇక్కడ పంజులు = రవ్వలుచెక్కిన పాలకీదండెలు.

'పంజు' ఇట్లు స్వతంత్రముగా - అనేకార్థముల నియ్యగల శబ్దమని గుర్తించి, మహానుభావుడు బ్రౌనుదొర, ఈ క్రింది విధముగా వివరించి, భాషారాధకుల కృతజ్ఞతకు పాత్రమైనాడు.

"పంజు-A torch, a sort of fire work. A sort of earring. పంజుసేవ. The torch dance. Some times పాలకీయొక్క పంజులు. the poles of a palankeen. (బ్రౌన్యము.)

బహుజనపల్లివారు బ్రౌనుదొరగారి గ్రంథములోని పదములనన్నిటిని కైకొనలేదు. వే.వే. శాస్త్రిగారివలెనే సూ.ని. పండితులును బహుజనపల్లివారి వ్రాతలమీదనే ఆధారపడిరి. ఇక పంజుతత్త్వము తెలియు టెట్లు?

పంజుకమ్మ-వలెనే పంజుమంచమును కలదు.—

"మాటుగాపైచిన మాంజిష్ఠతెర యెత్తి
పంజుమంచమడిగ్గె మంజుఘోష" (హర. 7-137)

పంజుమంచ మనఁగా రత్నాలుచెక్కిన మంచమని యర్థము.

పంజువాచూరులును గలవు.—

"రాజిల్లు నవపుష్యరాగరత్నముల
మొగడలు వైడూర్యముల మించు పంజు
పగడంపు వాచూరు." (నవనాథ. పు. 45) ముద్రితప్రతి.

'వైడూర్యములన్ = వైడూర్యములచేత, మించు = అతిశయించు నట్టి, పంజు = చెక్కడపుపనిగల, పగడపువాచూరు' (ఇంటిముంజూరు) అని యర్థము.

సూ.ని. 'పంజుకమ్మ=కమ్మపంజు' అనెగదా, అట్లే, పంజుమంచము = మంచము (పు) పంజు; పంజువాచూరు=వాచూరుపంజు, అనియుననునా?

రత్నములు పొదిగిన కమ్మలన్నియు 'పంజులకమ్మ'లే యనియు, ఆకృతిభేదమునుబట్టి, అటుకుల కమ్మలు; బవిరెకమ్మలు; తూట్లకమ్మలు; దుద్దుకమ్మలు; అని వివిధములనియు 'పంజు' పదము వానియం దెల్ల వర్తించుననియు సారాంశము.

బంగారురేకుమీదనే అటుకులనుపోలు నొక్కులు చుట్టునుకొట్టి నట్టనడుమ నొకరాయి (కెంపుగాని, పుష్యరాగముగాని) బిగించి చేయబడు కమ్మలు 'అటుకుల కమ్మలు'. (సూ.ని. యెరుగదు.) సూ.ని.లో తూట్ల కమ్మలును లేవు.

వర్తులాకారముగా తయారుచేయబడునవి 'బవిరెకమ్మలు'. తామర దుద్దులవలె నిర్మింపబడు కమ్మలు, దుద్దుకమ్మలు. (సూ ని. ఈ యౌగికార్థ మును చెప్పియుండవచ్చును. ఎందువల్లనో చెప్పలేదు.)

"కమలకర్ణికలు బంగారంపుదుద్దుల
మరువుఁజూపఁగఁ గర్ణముల ఘటించి." (ఉద్భటా. 1-92)

'పంజు' అనుటచేతనే అది కసవుపంజో, రతనాలపంజో, ప్రకరణ మునుబట్టి తెలియదగియున్నను - 'కసవుపంజు' - 'వజ్రాలపంజు' - 'వైడూ ర్యాలపంజు' అని వ్యవహరించినను తప్పుకాదు.

1. "ఇల్లు గట్టెడుచోట జల్లులు కసవుపం
జాలు సమానంబులు క్షోణిరమణ." (రా.వి. 3-40)

2. "తమ్మికెంపుల పంజుల కమ్మదోయి" (యయా. 4-90)

ఇట్లే తక్కినవియు నని గ్రహించునది.

ఈ విపులచర్చవలన తేలినదియేమనగా.— 'పంజులకమ్మ'కు — 'రత్నములు కూర్పుటచే జివిటీవలె వెలిఁగెడి కమ్మ' అని — యౌగికార్థమును చెప్పుట అనుచితమనియు.— 'రత్నాలకూర్పు (=కట్టడము)నకు - 'పంజు' అని పేరు; అట్టి పంజుగలకమ్మలు - 'పంజు కమ్మలు' అని చెప్పుట యుచిత మనియును.—

('పంజుకమ్మ'లకు - 'కట్టడపుకమ్మ'లను వ్యవహారము లోకమున నున్నది. సూ.ని.లో లేదు).

## 52. ఖండించు

శ.ర. లో,—"ఖండించు = ఖండనముచేయు, నఱకు" అనియు,— "ఖండితము = నఱకఁబడినది" అనియు నున్నది.

సూ. ని. లో,-"ఖండించు = ఖండములుచేయు" అనియు, "ఖండితము = ఖండింపబడినది. ౧. నఱకఁబడినది. ౨. విఱువఁబడినది. 3. (యుక్తులచే) నిరాకరింపఁబడినది. (వాదము)" అనియు నున్నది.

మరి, "కప్పిపుచ్చరాదు ఖండించియాడరాదు" (సారంగ. ౨.౨౪౫) మొదలగు స్థలములలో,-'ఖండించి యాడరాదు = నఱకి, ఖండములుచేసి ఆడగూడదు' అనియేనా అర్థము? కాదు.

ఖండించియాడరాదు-అనగా,- ఇది యిట్టిది యని నిష్కర్షగా చెప్ప వీలులేదు-అని అక్కడ అర్థము.

ఈ యర్థమును, శ.ర. ప్రమాదవశమున చెప్పకపోయెగాక. సూ.ని. చెప్పకపోవు టేల? 'సాగంధిక'ను గూడా సరిగా పరికింపలేదనియేగదా దానివల్ల ఏర్పడునది?

సారంగధరను చూడకపోయిన పోయెగాక; ఖాన్యమునైనను చూచెనా? లేదు.

ఖాన్ను,— "ఖండించుట- To decide, settle, determine.- ఖండింపు. Settlement, bargain.- ఖండింపుచేయుట.—To settle a bargain, to bargain, to appraise." అని వివరించియున్నాడు.

అటు ఖాన్యమునను, ఇటు వ్యవహారమునను, కావ్యములలోను ఉన్న, ఖండించు; ఖండింపు; అను పదములను-అర్థములను సూ.ని. చెప్పకుండుట పొరపాటు.

## 53. ఉల్ల

సూ. ని. "ఉల్ల = నాతిదూరము నాతిసమీపము కాని స్థలమందు" అని యర్థము చెప్పి,—

"ఉల్ల పద్మాకరము పొంతనుండి" (భా. అర. ౬-౧౨౪) అను ప్రయోగమును చూపినది.

ఉల్ల-అనగా, అదిగో ఆ కనబడుచున్న-అని యర్థము. అంత దూరము కాని, అంత దగ్గర కాని స్థలమందు-అన్న యర్థము రావలెనని ఆ 'ఉల్ల'కు అర్థము వ్రాసినవారి యుద్దేశము.

కాని వారు వ్రాసిన వాక్యము, వారి యుద్దేశమునకు విరుద్ధమైన యర్థమునిచ్చునదిగా పరిణమించినది.

ఎట్లనగా: నాతిదూరము కానిదియు, నాతిసమీపము కానిదియునైన స్థలమందు-అని వారి వాక్యమున కర్థము.

నాతిదూరము (న+అతిదూరము) అనగా, అతిదూరము కానిది.

నాతిదూరము కానిది-అనగా, అతిదూరము కానిది కానిది.—అంటే, అతిదూరమైనది-అనియే యర్థము. (ద్వౌనఞౌ ప్రకృతమర్థం గమయతః.)

అట్లే, నాతిసమీపము కానిది-అను వాక్యమునకును, అతిసమీపమైనదనియే యర్థము.

కావున, అతిదూరము అతిసమీపమునైన స్థలమందు - అని వారి వాక్యమిచ్చే యర్థము.

ఆ యర్థము పైపద్యమున సరిపడదు. అందలిభావమున కది విరుద్ధము. అది యట్లుండఁగా, ఒకవస్తువే, ఒక సమయమున నే అతిదూరమునను-అతిసమీపమునను ఉండుట అసంభవము.

ఎందుకింకను చర్చ? సూ.ని. వాక్యములో తప్పున్నది.—

ఉల్ల = నాతిదూరము నాతిసమీపము అయిన స్థలమందు – అనవలెను; లేదా, అతిదూరము అతిసమీపము కాని స్థలమందు–అనవలె. అంతేగాని, 'నాతిదూరము నాతిసమీపము కాని స్థలమందు' అనఁగూడదు.

అసలు, 'ఉల్ల' అను తెనుగుమాట కర్థము చెప్పునప్పుడు-'నాతిదూరము నాతిసమీపము'-అని, అంత 'గీర్వాణ' మెందుకు?

వావిళ్ల నిఘంటువు,—"ఉల్ల = చాలదగ్గఱ చాలదూరముగాని స్థలమందు" అని తేటతెనుగుమాటలతో (సూ. ని. వాక్యములోని తప్పును తొలగించి) యెంతచక్కఁగా చెప్పినదో చూడండి.

## 54. తేనెతల

సూ.ని.—"తేనెతల = సస్యవిశేషము" అని యర్థము చెప్పి,—

"తేనెతలవడఁబండె ధాత్రీతలంబు
పొదలి దారణ పోఁకకుఁ బుట్టెఁడయ్యె
నన్నివంకల దుర్భిక్ష మడఁగిపోయెఁ
బ్రస్తుతింపఁగఁదగు రామరాజ్యమందు." (జైమిని. ౬.౯) అను

పద్యము నిచ్చినది.

కాని, తేనెతల = సస్యవిశేష మని బ్రౌణ్యమున లేదు; శ.ర. లోను లేదు. ఆ పదము లోకమున వాడుకలోను లేదు. సరిక్రొత్తపదము. అది సస్యవిశేషమని సూ. ని. యెట్లు తెలిసికొన్నది? ఎట్లో తెలిసికొన్నది; మంచిదే. మరి, అది మెట్టపైరో, పల్లపుపైరో; పునాసలలో చేరినదో, అపరాలలో చేరినదో తాను చెప్పవలదా? లోకానికి తెలియు టెట్లు?

ఒక క్రొత్తపదాని కర్థముఁ వ్రాయునపుడు, ఆ యర్థమును స్పష్టపరచు మరియొక తెనుగుమాటనో, సంస్కృతపదమునో అక్కడ ఇయ్యవలె. అట్లిచ్చు ఆచారము సూ.ని. కి లేదా? ఉన్నదే!

"కొఱ్ఱ = సస్యవిశేషము. ప్రియంగువు"
"జొన్న = స.వి. యావనాళము"
"కంది = స.వి. తువరి."
"అలసందియ(దె)లు = (సం. అలసాంద్రః) పెద్దబొబ్బరలు.— (అలచందలు. అని వ్యవహారము)"

అని వివరించిరియే యున్నది. ఆ విధముగానే, 'తేనెతల' యర్థమును తెలుపు మరియొక పదము నక్కడ చూపకపోవు టేల?

ఏలనగా : పద్యమున 'పండెఁ' అను క్రియ యుండుటను బట్టి, పండునది పైరుగదా, అని యూహచేసికొని, 'తేనెతల = సస్యవిశేషము' అన్నదేగాని,అదియేమి సస్యమో, ఏ దేశపు సస్యమో, యెట్టి సస్యమో సూ.ని. కిని - తెలియదు. నిజమింతే.

సరే; 'తేనెతల' సస్యవిశేషమే యగుగాక. అయితే రామరాజ్యమున ధాత్రీతలమంతయును-'తేనెతల' ఒక్కటే పండెనా ? ఇతర సస్యములు పండనేలేదా ? కవి యట్లే చెప్పియుండునా ? అట్లుచెప్పుట సమంజసమగునా?

అది యట్లుండనిండు. పద్యములో, 'తేనెతల వడఁబండెఁ' అని గదా యున్నది? తేనెతల = 'సస్యవిశేష' మైతే, 'వడఁ' ఏమికావలె ? వడఁ - పండెఁ - అనగా నర్థమేమి? అర్థమేర్పడుటలేదని ఆ 'వడ'ను త్రోసివేయవచ్చునా?

ఎందుకింకను పెంపకము. 'తేనెతలవడఁ' అనునది జాతీయమైన నయ్యుండవలె. లేదా పాఠము మరియొక విధముగానైన నుండవలె. అంతే గాని, 'తేనెతల = సస్యవిశేషము' అనుటమాత్రము కుదురదు.

పదములను కైకొనుటలోను, అర్థములను చెప్పుటలోను, సూ.ని. ఇట్లు పొరపడిన తావులింకను - ఎన్నో యున్నవి. మచ్చునకు కొన్ని మాత్రమే చూపినాను.

తత్త్వ మిట్లుండగా, సూ.ని. పండితులలో నన్యతములైన శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు,— "ప్రామాణికులగు పెక్కురు పండితు

లేకాభిప్రాయముగ నిర్ణయించిన పదపదార్థములనే పూర్వోత్తరవిరోధములు లేకుండ గ్రహించుట సూ.ని. పరిపాటి. నాఁటికి నేఁటికి నీ నిఘంటు నిర్మాణమున ఆసరణియే గ్రహింపఁబడుచున్నది" అంటారు. మరియు వారు,— "సూ.ని.లో గ్రహింపఁబడిన పాఠములు పదపదార్థములు నవిరుద్ధములని పాఠకు లెఱుఁగుదురుగాక" అనియు సెలవిచ్చియున్నారు.

సూ.ని. గ్రహించిన పాఠములలోని పూర్వోత్తర విరోధములను నేను నా పాఠపరామర్శలో తెలిపియే యున్నాను. అంతేకాదు పండితులచే పరామృష్టములైన పదపదార్థములు, పాఠములు సాధువులై యుండుటయు తదితరములు తద్విరుద్ధములై యుండుటయు పలుతావులలో ప్రస్ఫుట మొనరించియు నున్నాను.

శ్రీ సూర్యనారాయణశాస్త్రిగారి వాక్యములలోని సత్యాసత్యములను, నా పరామర్శలోని గుణాగుణములను, నిష్పాక్షికబుద్ధులును - భాషాసంప్రదాయాభిజ్ఞులును నగు పాఠకులు లోకమునకు తెలుపకపోరుగదా.

ఇప్పటికే గ్రంథము చాల పెరిగినది. ఇక, 'పొగరు' అను పదమును గూర్చి చెప్పవలసిన పరిశిష్ట మొక్కింత కలదు. అదిమాత్రము చెప్పి యీ ప్రకరణమును ముగింతును.

## 55. పొగరు

ఈ 'పొగరు'ను గురించి 111వ పుటలో కొంత చర్చించియున్నాను.

"అంబరశ్యామిక యంబుధి పొగరుగా
బ్రమసి యెక్కొనొకొక బాడబాగ్ని" (హరివంశము)

అన్న పద్యమున,— 'అంబుధి పొగరు' అనగా, సముద్రపు నీలకాంతి యని, యీ క్రింది మనుచరిత్రవచనమువలన నేర్పడుచున్నది.—

"అంతరంగంబున....పొంగి చింతాసాగరంబు....వెల్లివొడిచెననం దుడిచిన నడంగక,...తారకల నీరిక లెత్తు పొగరన నిగనిగ లినుమడిగ నిగుడ ...తెప్పలం జిప్పిలు కొటుక లప్పళించి...దృక్కోణంబులం దిగువాఱు కన్నీరు" (3. ఆ. ప్రౌ. ప్ర.)

ఈ వచనమున కన్నీరు చింతాసాగరపు వెల్లువగను, *(తారకల) నిగనిగలు - ఆ సాగరపు పొగరు (నీలిమ)గను ఉత్ప్రేక్షింపబడినవి.

కాబట్టి, హరివంశపద్యమునను, 'అంబుధిపొగరు' అనగా,— 'సముద్రపు నీలిమ' యనియే అర్థము.

గరుత్మంతుఁడు,— అంబరశ్యామికను - అంబుధిపొగరుగా భ్రమించి (అనగా సముద్రజలమని బ్రమసి) యెక్కిన, బాడబాగ్నియో - అన్నట్లున్నాడని, అక్కడ ఉత్ప్రేక్ష.

ఆకాశమును సముద్రముగా భ్రమించుట నీలవర్ణముచేతనే. ఆకాశమునకును, అట్లే అంబుధికిని నీలిమనుచెప్పుట కవిసమయము.—

"కృష్ణాని,-వి షాకాశ, మషీ పంక మ దాంభోధి యమునా
ధూమ కోకిలాః" (కవికల్పలత)

పొగరు - అను పదానికి, బ్రౌను,— "The shade or colour" అని యర్థము చెప్పి, యీ క్రింది ప్రయోగములు చూపియున్నాడు.—

(1) "కపురొందు, ఇంద్రనీలపు పొగరులొసంగు" (సత్య. 3-158)

---

* వావిళ్లవారి వ్యాఖ్యలో,— "తారకలన్ = నల్లగ్రుడ్లనుండి, ఈరికలు-ఎత్తు= మొలక లెత్తునట్లు, పొగరు=నల్లనయో (నల్లని వర్ణమేమో), అనన్, నిగనిగలు=నిగనిగ కాంతులు, ఇనుమడిగ నిగుడన్" అని టీకయు,- "ఱెప్పల కాటుకను గలసి నల్లగ్రుడ్లకాంతులో యన నిగనిగలాడుచు... కన్నుల కొనలనుండి దిగువాఱు కన్నీరు" అని తాత్పర్యమును ఉన్నవి.

నల్లగ్రుడ్డను నల్లని - నిగనిగలు సహజముగనే యుండును. కావున కాటుకను గలిసిన కన్నీళ్లను, 'నల్లగ్రుడ్లకాంతులో' యని ఊహచేయుట (ఉత్ప్రేక్షించుట) యుచితముకాదు.

తారకలన్=నల్లగ్రుడ్లనుండి, ఈరికలెత్తు, పొగరు-అనన్=సముద్రపు నీలకాంతియో - అన్నట్లు, నిగనిగలు = తారకల నీలకాంతులు, ఇనుమడిగ నిగుడన్,— అని అక్కడ అన్వయము.

సముద్రపు పొగరుగా, ఉత్ప్రేక్షింపబడినవి తారకల నిగనిగలే.

(2) "ఘనాఘనముల్ పొగరెక్కి కేవలాం, ధంకరణంబులై"
(రామా. 6-23)

(3) "నీలంపుజడలకుఁ బీలిజల్లులుగావె
నిగుడు నిగ్గులలోని పొగరుదెగలు" (రామా. 2-76)

శ. ర. కర్త,— "పొగరు = 1. గర్వము; 2. దైర్ఘ్యము" అని అర్థములు చెప్పి, దైర్ఘ్యమునకు,—

"అగరుధూపపుఁబొగల్ పొగరారు కురులుగా" (రామా. 6-103) అను ప్రయోగమును చూపినాడు.

కాని, 'పొగరారు'-అను పదానికి 'పొడుగైన' అని యర్థము కాదు. పొగరారు=నలుపారు (=నల్లని) అనియే యర్థము. పద్యమున, పొగలకును-కురులకును సామ్యము. ఆ సామ్యము ఆ రెంటికినిగల పొగరు (=నలుపు)ను బట్టిగాని, దైర్ఘ్యమునుబట్టి కాదు.

శ.ర. కర్తకు - పొగరు=నలుపు, అన్న సంగతి తెలియలేదు. పద్యార్థమునుగూడా ఆయన సరిగా గమనింపలేదు.

ఇది అర్థపరామర్శ.

—:o:—

# సాహిత్య సమీక్ష

## — తెలుఁగు నిఘంటువులు —



## శబ్దపరామర్శ



ఈ ప్రకరణమున సూ.ని. కెక్కని శబ్దములు కొన్ని చూపబడుచున్నవి.

### ౧. తూట్లకమ్మలు

ఇవతలినుండి అవతలికి రంధ్రముండు ఒకదినుసు కమ్మలు కలవు. వాటిని తూట్లకమ్మ లందురు. అవి గుంటూరుమండలమున ఇప్పటికి నున్నవి. దక్షిణదేశమునను కలవుగాని వాటి రంధ్రములు చాలా పెద్దవిగా నుండును. ఆ కమ్మలు పెట్టుకొను తెగను 'తొళ్ల కాదులవాం' డ్లందురు.

తూట్లకమ్మలు కావ్యములలోను వర్ణితములై యున్నవి.—

1. "చిత్తజుఁ డను దొమ్మరి లాఁ
గత్తి వడిం దూఁటిచనఁగ నిడిన కడానీ
బెత్తపు వలయములో యన
బిత్తరి తాటంకయుగము బెడఁగై తోఁచెన్" (చం.రా. 3-79)

2. "మగువ తాటంకయుగ్మంబు మన్మథునకు
లక్ష్యయుగ్మంబు గాఁబోలు లలిఁ దలంపఁ
గడఁగి సవ్యాపసవ్యమార్గణము లేయ
నైన రంధ్రంబుగాదె త దంతరంబు." (శృం.నై. 5-13)

## ౨. దుద్దుకమ్మలు

"బలితంపు విచ్చుటాకుల దుద్దుఁగమ్మలు
నిద్దంపుఁ జెక్కుల నీడఁజూడ" (క్రీడా. పు. 32)

దుద్దుకమ్మలను 'దుద్దు' లనియు నందురు.—

"కమలకర్ణికలు బంగారపుదుద్దుల
మురుపుఁజూపఁగఁ గర్ణముల ఘటించి" (ఉద్భటా. 1-92)

(సూ.ని. లో 'దుద్దు' మాత్రమే కలదు)

## ౩. చేయార

మనసార; కడుపార; కన్నులార-అన్నట్లు, 'చేయార' అనుటయును కలదు.—

"ఈ యాపదలకు మూలం
బౌ యింద్రతనూజుఁ డతని నాహవభూమిం
జేయారఁ జంపి నామదిఁ
బాయని వగ పార్పుమన నృపాలుఁ డబలతో." (జై. 4-65)

చేయారఁజంపి - అనగా, నీ చేతితో బాగా చచ్చేట్లు కొట్టి - అని భావము. 'చేయార'కు బ.వ. రూపమే,— 'చేతులార'.

## ౪. నాసికము

సూ. ని. లో 'నాసిక'యే కాని, 'నాసికము' లేదు. నాసికకు 'నాసికము' రూపాంతరము.

బా.వ్యా. లో, — "కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు" (తత్స. 66) అన్న సూత్రముక్రింద,- "కంధరము - కంధర. కంధరా నాసికా భిక్షా దంష్ట్రా గ్రీవా పాదు కోల్కా ప్రభృతులు కంధరాదులు" అని చెప్పబడియున్నది. అదియునుగాక, గౌ.హరి. (పుట. 137)లో,—

"సరస చంపకము మెచ్చని నాసికంబు"

అను ప్రయోగముకూడా ఉన్నది.

సూ.ని. కంధర; కంధరము - అను రెండు రూపములను చూపినది. 'నాసిక'ను మాత్రమే చూపి 'నాసికము'ను వదలినది. అందుకు కారణ మేమనగా :

శ.ర. లో "కంధర = మెడ (రూ. కంధరము)" అని యున్నది. కావున, సూ.ని. ఆ రెండు రూపములను చెప్పినది.

శ.ర. లో 'నాసిక'యే గాని 'నాసికము' లేదు. కావున తానును చెప్పలేదు.

## ౫. చెరవెట్టుకొను

1. "కేలఁ గ్రొమ్మించుటద్దంబు గీలుకొల్పి
'మంచి' తొడమీఁద నొప్పారె మదనరేఖ
ముద్దునెమ్మోము లావణ్యమున జయించి
కువలయాప్తునిఁ జెరవెట్టుకొన్నకరణి." (క్రీడా.)

చెరవెట్టుకొన్న కరణిఁ - అనగా తన యధీనమున నుంచుకొన్నట్లు - అని యర్థము.

2. "ఈయెడ ననుఁ జెఱవెట్టుక
పోయెడి విభుఁ డిందులేమిఁ బురుహూతుం డ
న్యాయము సెన్నక మునులా
రా యనదను నన్నుఁ గావుఁడని మొఱయిడఁగన్."
(దశా. చ. 4-56)

## ౬. ధర్మకాహళపట్టించు

"ఇత్తెఱంగున మాళవేంద్రు నింద్రుచెలిం జేసి తన చెలులు తదీయ తురంగరథంబులు రయంబునం బొదివి తేరం గైకొని ధర్మకాహళపట్టించి - పదాతి పరుష వ్యాపారంబులు సాలించి విడిచి." (దశకు. 12-67)

ధర్మకాహళపట్టించుట - యనగా యుద్ధవిరామ సూచనగా - బాకా ఊదించుట. దీనినే 'ధర్మదారపట్టించుట' యనియు నందురు.

సూ. ని. 'ధర్మదారపట్టించు' అను క్రియను చెప్పక, ఆ క్రియతో గూడిన ప్రయోగముల నొక నాల్గింటిని 'ధర్మదార' క్రింద ఉదాహరించినది. అది పొరపాటు.

'ధర్మదారపట్టించు' అను క్రియ శబ్దపల్లవము. నిఘంటు వా క్రియ నట్లే చూపవలెను. లేనిచో ఆ క్రియాతత్త్వము నెరుగనివారు,-'ధర్మదారను బట్టించెను'; 'ధర్మదారఁ బట్టించెను' అని తప్పుగా వాడుదురు.

క్రియా ప్రయోగములను - విశేష్యములక్రింద చూపుట సరికాదు.

సూ.ని. లో 'దారపట్టించు' అను క్రియయును లేదు.

## ౭. తెరువుపెట్టు

తెరువుపెట్టు (శ.ప.క్రి.) = దారిచూపుచు ముందు నడచు.

(1) "మత్ప్రవాహవేగంబునకుఁ దగ నీవు ముందటం దెరువుపెట్టకున్న నెటయేనియుం బోదు." (భోజ. 7-31)

(2) "ఆ ప్పశుపాలపుంగవుం డెక్కడెక్కడ యని యక్కాయి వచ్చినవారు తెరువువెట్ట నతిత్వరితంబుగ నరిగ"(హరి.పూ.7-29)

(3) "అవలనాక మాపయి మహర్జగ మావల కెక్కి వెండియుఁ
బోవఁగ సత్యలోక మెటపోవలతేనియుఁ ద్రోవపెట్టెదన్."
(కకుత్. 2-53)

## ౮. అచ్చుపోయు

'అచ్చుపోయు' అను క్రియ కర్థమేమో సూ.ని. లో ఏర్పడదు.

'అచ్చు' క్రింద,-"౫. అచ్చునఁ బోసి తీసిన వస్తువు. ఉదా॥ బెల్లపుటచ్చు" అని వ్రాసి, దానిక్రింద,—

"(వ్యవ) అచ్చుపోసి విడిచిన యాఁబోతు."

అన్నది. మరి, 'అచ్చుపోసి విడిచిన యాఁబోతు' - 'అచ్చునఁ బోసితీసిన బెల్లపుటచ్చు' వంటిదే యగునా?

అచ్చుపోసి విడిచిన యాఁబోతు - అనగా, ఆఁబోతుగా అచ్చు (= ముద్ర) వేసి వదలిన వృషభము. అంతేగాని, అచ్చునఁబోసి తీసినది కాదు.

## ౯. అచ్చువేయు

ఈ క్రియయును సూ.ని. లో లేదు. ఆఁబోతులను అచ్చువేయుట లోకములో నున్నది.

బ్రౌను,-"అచ్చువేసుట to print. అచ్చువేశిన యెద్దు-a ('braminy') bull that is marked or stamped; it is allowed to wander at large as consecrated to the deity" అని చెప్పియున్నాడు.

## ౧౦. నెపమార్చు

నెపమార్చు = చంపు.

"ధనము హేరాళ మబ్బె నితఁడు బళాయి
వీఁడు ప్రాణాన నరిగిన వెదకి వెదకి
మనల నెపమార్చుఁగా కేల మనఁగనిచ్చు
నితని వధియింత మని నిశ్చయింతు రపుడు." (కాశీ. 7-252)

## ౧౧. దంపతి

శ.ర. లోను, సూ.ని. లోనుకూడా "దంపతులు=(ద్వివచనాంతము) జాయాపతులు, ఆలుమగలు" అనియే యున్నది.

కాని ప్రౌఢకవుల రచనలలో 'దంపతి' అను ఏకవచనరూపము గూడా ప్రయుక్తమై యున్నది.

(1) "శంబరాంతక భుజాజయకీర్తి మహిమలు
కోకదంపతికి దృక్కూలశిఖలు" (కాశీ. 4-169)

(2) "అద్దంపతి ద్వాపరమున
మద్దులుగూల్చిన మహాత్త్వమహితుఁడ కలిలో
దిద్దుగడ నల్పు నని జను
లద్దిరపడ వేంకటాద్రి యను సుతుఁ గనియెన్."
(ములుగు పాపయారాధ్యుల, దేవీ.భా. 1-75)

## ౧౨. ఉపదర్శనము

"త్రిపురాంతకుఁ బిలిపింపక
యుపదర్శన మాచరించు టుచితమె హరికిన్." (కాశీ. 7-58)

ఉపదర్శన మాచరించుట - యనఁగా, పెత్తనముచేయుట.

## ౧౩. నిలువుఁబతిమ

*"కని మదిఁ గలిగిన తీరున
నిను మగనిన్ వ్రాసికొన్న నిలువుఁ బతిమలన్
గనుఁగొని" (యయా. 5-5)

నిలువుఁ బతిమ - నిలువుటద్దము వంటి పదము.

## ౧౪. దిశ

"దిశలేని నాబోఁటి పశువులపాపంబు
లడఁచువానికి." (భాగ. 8-81)

దిశలేని = ప్రాపు(రక్షణము)లేని - అని యర్థము. సూ.ని. "దిశ = దిక్కు, కడ" అని మాత్రమే చెప్పినది. 'దిశ'కు ప్రాపు - అని యర్థము చెప్పి, ఈ యర్థము తెనుగుననే - అని వ్రాయవలెను.

## ౧౫. తపమువడు

"ఇడ్డ బొట్టువోలె నింటిలో నుండక
యూఁడదాన వంత యడలి బాస
నడవిలోనఁ దపమువడఁ బోదు నను నింత
జఱభీతనము లెందుఁ గఱచి తీవు." (నన్నె.కు.సం. 6-16)

తపమువడన్ = తపస్సు చేయుటకు.—'తపమువడు' - శ.ప. క్రియ. అపురూపమైనది. నిఘంటువు తప్పక చెప్పవలసినది.

---

* "మనమునఁ గలిగిన తీరున" (శ.ర.పా. చూ. 'పతిమ')

## ౧౬. అండజంబుపాన్పు

అండజంబుపాన్పు = హంసతూలికాతల్పము.

(1) "చిగురులం దీర్చిన సెజ్జ యెందుల కేఁగె
నీ యండజంబుపా న్పేలవచ్చె" (దశకు. 9-7)

(2) "సౌవర్ణ కీటజ పట్ట జాండజ శయ్యలను." (భా.సభా. 2-113)

## ౧౭. ఉల్లాభము

శ.ర. లో,— "ఉల్లాభము=సం.వి.అ.పుం. వితానము, మేలుకట్టు" అని యున్నది. సూ.ని. లో లేదు.

## ౧౮. ఆపేక్ష

ఆపేక్ష = అపేక్ష.—

"వానిఁ జూచు నాపేక్ష మనంబునం గలిగె" (నాసికే. 3-49)

'ఆపేక్ష' వ్యాకరణసమ్మతము కాకపోవుఁగాక. వాడుకలో నే కాక-ఒక ప్రామాణిక కావ్యములోను ఉన్నప్పుడు, నిఘంటు వా పదమును గ్రహింపవలదా?

'అక్షింతలు' అను పద మెట్టిదో 'ఆపేక్ష'యు నట్టిదే.—

'అక్షింతలు' శ.ర. లో నున్నది. - సూ.ని. లోను ఉన్నది.

'ఆపేక్ష' శ.ర.లో లేదు.-సూ.ని. లోను లేదు. కాని 'బ్రౌ'లో నున్నది.

## ౧౯. దునియు

దునియు = దున్ను.

సీ॥ "...అన్నరపతి దున్నంగ, నింద్రుండు సనుదెంచి యేల *యిచట,
దునియెద వనిన న మ్మనుజాధిపతి తనకోర్కి సెప్పిన."
(భా.శల్య. 2-215)

'దునియు' అపూర్వమయిన క్రియ. ప్రయోగించినవాడు .. కవిబ్రహ్మ. సూ.ని. ఆ క్రియను వదలివేయవచ్చునా?

---

* వా.ని.లో, 'ఉల్లసమాడు' క్రింద, "యిచటఁ దునియెద వనిన" అని యున్నది. పొరపాటు కావచ్చును.

## ౨౦. అవ్వలించు ; అవ్వలికించు

దశకుమారచరిత్ర, 10-88 లో,—

"క్రొవ్వి ధూమిని మొండితోఁ దనకోర్కి తెల్పుడు సేయఁగా
నవ్వలించినఁ జూచి వాఁడును నంతరంగము లోపలన్"

అనియు, 10-105 లో,—

"నేలపై, నిరుసవడ్లను బోసి యెండ నెఱపి,
యొయ్యనొయ్యన క్రాసి యుముక నవ్వలికించి
కొని నేర్పుపై గర(?) కూరవిలిచి"

అనియు నున్నది.

సూ. ని. లో, అవ్వలించు, అవ్వలికించు — అను క్రియలు లేవు. (సూ.ని. లో చేరని పదములు దశ.చ. లో చాల ఉన్నవి.)

## ౨౧. ఓడఁగట్టిన దూలము

ఇది, నిరంతర సంబంధము - అను నర్థము నిచ్చు జాతీయము. శ.ర. లో లేదు. అందువల్లనే సూ.ని.లోను లేదు.

పూర్వ కవు లెట్లు వాడియున్నారో చూడండి.—

(1) "ఓడఁగట్టిన దూలమై యుండవలయు
మీకు మాకును నెనరైన మిత్రభావము" (ఉద్భటా. 2-211)

(2) "కరతలామలకంబు కైవల్యసంపద
యింటఁజేరిన పంట యీప్సితంబు,
ఓడఁగట్టిన దూల మీడులేని శుభంబు,
చేకొద్దికుంచ మశేషభూతి" (చంద్రా. 1-57)

(3) "ఈ లింగములోఁ బ్రాణము
కాలము గడదాఁక నోడఁగట్టిన దూలం
బై లంకె నుండఁజేసితి,
నేలా తుందుడుకు? పల్లె కేఁగుఁడు మీరల్" (కాళ. 3-80)

## ౨౨. గోలీ

గోరీ - అన్న యర్థముననే 'గోలీ' అను పదమున్ను ఉన్నది.

"ఘనభేరికాధ్వనుల్ విని గుండియలు వ్రీల
వ్రాలు మల్కాలకు గోలీలుచేసె" (వసు. 1-47)

సూ.ని. ద్వి.సం. అనుబంధములో,— "గోరీ = తురకల సమాధి. (చి.ని., బ్రౌ.మిశ్ర.)" అని చెప్పి,— "ఘన...గోరీలు చేసె.— వసు. ౧-౪౭. (గోలీలు. ము.పా.)" అన్నది.

'గోలీలు' - అను పాఠము సరియైనది కాదని సూ.ని. భావించినట్లు ఆ సూచనవలన తెలియుచున్నదిగదా!

'గోలీలు' - అను పాఠము తప్పుకాదు; ఒప్పే. 'గోరీ'కి రూపాంతరమే 'గోలీ'. 'గోరీ'ని, గోలి - అను వాడుక హైదరాబాదు ప్రాంతమున నున్నది.

సూ. ని. గమనించలేదుగాని, ఆ బ్రౌణ్యముననే — 'మిశ్రభాషా' భాగముననే,—

"గోలిదిబ్బ - A churchyard or burying ground. పాతే చోటు" అని యున్నది.

కాబట్టి, సూ.ని., వసుచరిత్రలోని - 'గోలీలు' అను, ము.ప్ర.పా. తప్పనుకొనుటయు, 'గోలీ = తురకల సమాధి' అని చెప్పకపోవుటయు పొరపాటు.

## ౨౩. కల్లచ్చు

కల్లచ్చు-అనగా ఒరగల్లు.

బ్రౌణ్యములో ఇట్లున్నది:— "కల్లచ్చు. A touchstone or crucible.—*'యిచ్చుచో నెరిగి కల్లచ్చుల నూది, యచ్చుల నొరగాను యగసాలి యతడు.' B.D. 4-127."

కల్లచ్చు శ.ర. లో లేదు; సూ ని. లో ఎట్లుండును?

---

* "ఇచ్చుచో నెఱిఁగి కల్లచ్చుల నూకి, యచ్చుల నొరగాను నగసాలి యతఁడు" అని, శ్రీ ప్రభాకరశాస్త్రిగారిప్రతి పాఠము.

సమగ్రమైన నిఘంటువును సంతరింప సమకట్టువారు, ఆ యీ నిఘంటువులలోని, కావ్యములలోని ఒక కొన్ని పదములనుమాత్రమే పోగు చేసిన చాలదు. గ్రంథజాలమును గాలించి అన్నిపదములను అందుకొనవలె. అందుకొనుటే కాదు, ప్రతిపదమును తాము స్వయముగా పరిశీలించి, పద స్వరూప స్వభావములను, సహజార్థ సంప్రదాయార్థ ప్రయోగవైవిధ్యాదులను తలస్పర్శముగా నవగతముచేసికొని, నిర్దుష్టముగా నిర్వచింపవలె. అంతేకాదు; దేశము నాలుగంచులును కలయదిరిగి (నిఘంటువులలో చేరని) పదములను, పదబంధములను, పలుకుబళ్లను, నానుడులను సేకరించవలె. దేశీయములైన ఆ నుడికారముల తీరుతియ్యములను, వాటిని వాడుకచేయు జాడలను తద్జ్ఞులవలన చక్కగా తెలిసికొని, జిజ్ఞాసువునకు సుబోధమగు విధమున వివరింపవలె. అట్టిపనికి చాలిన ప్రకృష్టప్రజ్ఞగల ప్రాజ్ఞులు భాషారాధనైకదీక్షతో పరిశ్రమించిననేగాని, సమగ్రమైన నిఘంటువు రూపొందదు. అట్టి నిఘంటు వవతరించిననేగాని భాషకుగల లోటు తీరదు.

సూర్యారాయనిఘంటువు-అట్టి బృహత్కోశమే అందుకు సందేహము లేదు. కాని, అది యొక్కరిచేతిమీదుగా తయారయినది కాదు. బహుకర్తృకము. అందువల్ల పూర్వాపరవిరుద్ధసిద్ధాంతముల కాస్పదమయినది. నిఘంటువులనుండియు, కావ్యములనుండియు—పదములను, అర్థములను, పాఠములను గ్రహించుటలో లోటుపాటులు వాటిల్లినవి; తారుమారులు తటస్థించినవి. ఆ యీ విషయములను నా పాఠపరామర్శలోను, అర్థపరామర్శలోను కొంతకుకొంత విశదముచేసి యున్నాను.

ప్రాచ్యాదినిఘంటువులలోని, భారతాదిగ్రంథములలోని పదములను పరికలించుటలోను పరిపూర్ణమయిన పరిశోధన జరగలేదనుటకు తార్కాణగా ఒక కొన్నిశబ్దము లీ ప్రకరణమున చూపబడినవి.

ఇది శబ్దపరామర్శ

దీపాల పిచ్చయ్యశాస్త్రి కృత సాహిత్యసమీక్షలో

తెలుఁగు నిఘంటువులు - అను భాగము

సమాప్తము.

# సాహిత్య సమీక్ష

## కావ్యములు ; వ్యాఖ్యానములు

### 1. మేఘసందేశము

కాళిదాస మేఘసందేశమునకు, ఆంధ్రమల్లినాథులు శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు వ్రాసిన తెనుగువ్యాఖ్యానములో నాకుఁ గలిగిన కొన్ని సందేహములను నేను (1927) ప్రభవ–ఉగాదిసంచికలో ప్రకటించితిని. నా సందేహములకు, భారతి–భాద్రపద సంచికయందు శ్రీ బులుసు వెంకటరమణయ్యగారును, 1927 అక్టోబరు 30–వ తేది 'యుగంధర' పత్రికయందు శ్రీమాన్ నల్లాన్‌చక్రవర్తుల వేంకటాచార్యులవారును కొన్ని సమాధానములు వ్రాసిరి.

అందు, వెంకటరమణయ్యగారి యుపన్యాస మసమగ్రమనియు, వారుపన్నిన యుక్తులు దుర్బలములనియు తెలుపుచు (శాస్త్రిగారి శిష్యులు) శ్రీమాన్ నేలటూరు రామదాసయ్యంగారు, (యం.ఏ., యల్.టి.) భారతి పుష్యసంచికలో, సుదీర్ఘమైన ఒక యాక్షేపవ్యాసమును ప్రచురించినారు.

వారి యాక్షేపములకు, విభవ వైశాఖ భారతిలో నేను సమాధానములు చెప్పుటయు జరిగినది.

ఆ యాక్షేప సమాధానముల సారాంశ మిందు పొందుపఱుపఁబడుచున్నది.

## ౧. మేఘహంసమైత్రి

"కర్తుం యచ్చ ప్రభవతి మహీ ముచ్ఛిలీన్ధ్రా మవన్ధ్యాం
తచ్ఛ్రుత్వా తే శ్రవణసుభగం గర్జితం మానసోత్కాః,
ఆకైలాసా ద్బిసకిసలయచ్ఛేదపాథేయవన్తః
సంపత్స్యన్తే నభసి భవతో రాజహంసాః సహాయాః" (పూ. మే. ౧౧)

ఈ శ్లోకములోని 'సహాయాః' అను పదమునకు, శాస్త్రిగారు పద ప్రయోజనము నిట్లు వివరించినారు.—

"శ్రవణసుభగమ్ శ్రుత్వా సహాయాః సంపత్స్యంతే- అనఁగా లోకుల చెవులకు ఇంపయిన (నీయురుమును) విని నీకు సహవాసగాండ్రు అగుదురు - అనుటచేత ఉత్తములయిన యా మహానుభావులకు నీ లోకోపకారశీలతచేత నీయందు స్నేహము కలుఁగుననియు, వారికి అతిప్రియమైన మానససరస్సు ఇటుపై తమకు నివాసయోగ్యమని నీవు ఉఱిమి సూచింతువుగాన, వారికిని నీవు ఉపకారివి; ఆ కృతజ్ఞతచే వారికి నీయందు స్నేహము కలుగుననియు 'హంసరాజులు మానసమునకు పోవుదురు; వారితోఁగూడి నీవు పొమ్ము' అనక 'రాజహంసాః సహాయాః సంపత్స్యన్తే' అనుటచేత పూర్వోక్తమయిన కృతజ్ఞతచేతను స్నేహముచేతను వారే నీ సాంగత్యమునుకోరి నీతో వత్తురు. నీవు ప్రార్థించవలసినదిలే దనియు......భావము."—

### నా ప్రశ్న

పదప్రయోజనము చెప్పుటలో శాస్త్రిగారు మేఘహంసలకు మైత్రి అతిమాత్రముగా ప్రతిపాదించినారు. సమంజసమగునా? మొదలా రెంటికిని మైత్రిచెప్పుటయే యొప్పదు. అందువల్లనే, మల్లినాథుఁడు, *'సహాయాః= సయాత్రాః' (తోడి బాటసారులు) అని యర్థము చెప్పి, 'సహాయ స్తు

* 'సహాయాః' అను స్థలమునందు 'సయాత్రాః' అని నిఘంటు ప్రదర్శనపూర్వకముగా కష్టించి వ్యాఖ్యానము చేసిన మల్లినాథసూరి, స్నేహాభాస వచ్చునేమో యని భయముతో విరోధమునే స్థాపించినాఁడు. (నఁచ. వేంకటాచార్యులుగారు.)

సయాత్రః స్యాత్' ఇతి శబ్దార్ణవే.— అని, నిఘంటుప్రమాణమునుగూడ చూపినాఁడు.

ఆ సయాత్రతను సమర్థించుటకే, ఇతర వ్యాఖ్యాతలు,— 'విరుద్ధానామపి సహాయతోక్తిః' అని ముందుగా వ్రాసియు,— 'హంసానాం పరుషం మేఘగర్జిత మితి ప్రసిద్ధమ్' అని యొప్పుకొనియు, నవల నెంతెంతో వ్రాయవలసివచ్చినది.

కవు లెల్లరును హంస మేఘములకు విరోధమునే చెప్పినారు.

ఉదాహరణములు.—

## (1) అయ్యలరాజు రామభద్రకవి

"స్థిరమైత్రిఁ దనవారిలోఁ గలయికన్ క్షీరంబు లుంపం బర
స్వరభేదం బొనరించు నంచుఁ గలహంసశ్రేణులం జండభీ
కరఘోషంబున ధిక్కరించి కడుఁగిన్కన్ బోలె వర్షోపలా
త్కరపాతంబున బిట్టు పాఱనడుచున్ గాలాభ్రసందర్భముల్".
(రామాభ్యుదయము ఆ. 6-9)

## (2) కూచిమంచి తిమ్మకవి

"పరమహంసలఁ బోవఁదఱుమని ఘనుఁడు నె
వ్వగ భంగ మొందని వాహినీశుఁడు" (రుక్మిణీపరిణయము)

అని, భీష్మకుని వర్ణించుచో పరమహంసఘనశబ్దములకు శ్లేష కల్పించి హంసలకును మేఘమునకును గల విరోధమును వెల్లడించినాఁడు.

## (3) సంకుసాల నృసింహకవి

కవికర్ణ రసాయనములో,—"అపూర్వనిర్వాహిత్వహంస ఘనాఘన" (ఆ. 5) అని తన గురువును సంబోధించియు,—

"నిర్భరగతిఁ గరకాసం
దర్భంబులు రాలె నంత ధరపై జలదా
విర్భావమగ్నహంసీ
గర్భస్రవ దండపిండఖండము లనఁగన్" (ఆ. 6)

అని, వడగండ్లను వర్ణించియు హంసాభ్రములకుఁగల ప్రబలవిరోధమును ప్రస్ఫుట మొనరించినాఁడు.

## (4) శ్రీకృష్ణదేవరాయలు

"ఉఱుమువిని యలకకై దివి
వెఱఁబఱచు మరాళపటలి విడిచినఁబడు న
క్కఱచిన బిసలవవిసరము
తెఱఁగున వడగండ్లు ధవళదీధితి రాలెన్." (ఆముక్త. ఆ. 4)

బిసకిసలయచ్ఛేద పాథేయవంతములై కైలాసమునకు బయలుదేరిన హంసలను, వానిని వెంబడించుచున్న మేఘమును - మేఘసందేశములోని వానినే-మనసున నుంచుకొని రాయ లీ రచన చేసిన ట్లున్నది.

మరాళపటలి యుఱుమువిని యలకకై పఱచుట,- వెఱన్ = భయము చేతఁగాని, మైత్రిచేతఁగాదని చెప్పుటయే కాక, ఆ కవిరాయలు, "అరిహంస సంసదభ్రాగమంబు" అని యీశ్వరదేవరాయల శౌర్యోత్కర్షను వర్ణించియు హంసమేఘ విరోధమును విశదముచేసినాఁడు.

## (5) మహాకవి భోజుఁడు

"రామాకర్షణ భగ్న కార్ముకభువా ధ్వానేన రోదోరుధా
దృప్తక్షత్రయశస్సితచ్ఛదకులే జీమూతనాదాయితమ్."
(రామాయణచంపువు)

అను, ఈ శ్లోకమున జీమూతనాదము సితచ్ఛదకులమునకు ఆపత్కరమని విశదముచేసినాఁడు.

ఇట్లు మేఘసందేశవ్యాఖ్యానములలోను, సంస్కృతాంధ్రకావ్యముల లోను, హంసమేఘములకు అరాతిత్వము నిరూపితమై యుండఁగా, హంస మేఘవిరోధము నించుకయు సూచింపక, అంధ్రమల్లినాథులు,-"మేఘుఁడా! వారికి నీవు ఉపకారివి. వారే నీ సాంగత్యముకోరి నీతో వత్తురు. నీవు వారిని ప్రార్థింపవలసినది లేదు" అని, అంతగా విశేషించివ్రాయుట యుచిత మగునా? అని నా ప్రశ్న.

## అయ్యంగారి యాక్షేపములు

(1) "హంసలు కావ్యలోకముననే కాని లోకమున లేవు; అవి బాతులవంటివి. (2) అంచ, ఉఱుమున కులుకదు; జలదమునకు జడియదు; హంస, మేఘమునకు జడిసి కాదు, పరుగెత్తుట. విక్రమోర్వశీయములో,— జలదావృతములయిన దిక్కులను గని మానసమునకు బయలువెడలెడు హంసలను జూచి, పురూరవుఁడు,—"మానసోత్సుకములైన యీ పక్షులు సరస్సునుండి ఎగిరిపోకమునుపే వీనివలన ప్రియావృత్తాంతమును తెలిసికొన వలయు—ననుచు, 'క. నా కొమ్మనిమ్ము హంసమ, కైకొంటి తదీయమైన కాంతగతంబున్.' అని యడిగెను. అతఁ డడుగుచుండఁగనే అదివరకే పోవనుంకించుచున్న ఆ హంస మెగిరిపోయినది. అప్పుడు పురూరవుఁడు,— 'ఇది, దొంగలను దండించువాఁడు రాజు అని భయముచేత ఎగిరిపోయినది' అనెను. పురూరవుఁడు, (హంస) తన దండనకు భయపడిపోయె ననెఁగాని మేఘగర్జకు బెదరిపోయె ననలేదు. కాన హంస మేఘగర్జకు జడియదు."

## నా సమాధానములు

(1) హంసలు లోకమున నున్నవేమి? లేకున్న నేమి? ఉన్నట్లు కవులు భావించిరి. కాళిదాసు మేఘునిచేతఁబోలె, మఱియొక మహాకవి హంసచేత సందేశమునుగూడ పంపెఁగదా! అవి లోకమున నున్నను, లేకున్నను కవులు వర్ణించునెడల వానికిని పయోదములకును వైయ్యము చెప్పిరా - వేరమి చెప్పిరా - అన్నది మనకు ప్రకృతము. అవి బాతుల వంటివో, కోఁతులవంటివో పరిశీలించి నిర్ణయించుట కిదియేమి జంతు శాస్త్రమా? కాదుగనుక - ఆ ప్రసంగ మప్రస్తుతము. (2) పురూరవుఁడు, ఉన్మత్తుఁడు. కావుననే, తన భార్యనడకను హంసదొంగిలించిన దనియు, అది తన దండనకు భయపడిపోయినదనియు అన్నాఁడు. ఉన్మత్తప్రలాప ములను ప్రమాణముగాఁ గొనుటయు, ఒక తెలుఁగు ఉన్మాదమే యగును.

## ఆక్షేపము

"హంసమేఘవైర మందందు ఆయా కవి యుత్ప్రేక్షితమకాని, ప్రకృతిసిద్ధమేనియు, దాటరాని కవిసమయసిద్ధమేనియు కాదు. ఆ రెంటికిని

మైత్రినిగూడఁ జెప్పవచ్చును. ఇది కవిసమయమే యైనచో సాహిత్యదర్పణమున నేల లేదు?"

## సమాధానము

హంసమేఘములకు వైరమున్నందుననే కవు లుత్ప్రేక్షించుట కవకాశము కలిగినది. లేనిచో ఉత్ప్రేక్షించు టెట్లు? ఇది ఉత్ప్రేక్షాతత్త్వ మెఱుఁగని వ్రాఁత.

కవిసమయములన్నియు నే గ్రంథమునను సంపూర్ణముగా చెప్పఁబడ లేదు. వానిని, సాకల్యముగా తెలిసికొనుటకు బహుకావ్యావలోడనమే సాధనము. సమయములు చెప్పుచోట కొన్ని గ్రంథములలో,—కవిలోక ప్రసిద్ధమగు - కమలార్క మైత్రియే చెప్పఁబడలేదు. తావన్మాత్రమున 'కమలార్కులకు విరోధమునుగూడ చెప్పవచ్చు'-ననవచ్చునా? అయ్యంగారి వంటివా రెవరైన నన్నను చెల్లునా?

## ఆక్షేపము

"హంసమేఘవైర నిర్ణాయకముగా, ఉదాహరింపఁబడిన,—

"నిర్భరగతిఁ గరకాసం
దర్భంబులు రాలె నంత ధరపై జలదా
విర్భావమగ్న హంసీ
గర్భస్రవదండపిండఖండము లనఁగన్."

అను పద్యములోని 'అనఁగన్' అను ఉత్ప్రేక్షావాచకము హంసమేఘ విరోధము లేమిని తెలుపుచున్నది."

## సమాధానము

పద్యములోని 'అనఁగన్' అను ఉత్ప్రేక్షావాచకము, అండపిండ ఖండములకు సంబంధించినది గాని, హంసమేఘవిరోధమునకు సంబంధించినది కాదు. అది, కరకలు, నిజముగా అండపిండఖండములు కావని తెలుపునే గాని, హంస మేఘ తద్విరోధాదికము లబద్ధములని తెలుపనే తెలుపదు. అలంకారస్వభావము, పద్యార్థముకూడ అయ్యంగారికి ఆకళింపు కాలేదు.

## ఆక్షేపము

"కాళిదాసునకు హంసమేఘద్వేషమున తాత్పర్యము లేదు."

## సమాధానము

లేనియెడల,— 'కతిపయదినస్థాయిహంసా దశార్ణాః' అన్నచోట, "కతిపయదిన - కొలఁది దినములే యుండుట మేఘమువలని ఉపద్రవము చేతను" అనియు,- "హంసలు పలాయనమగుట వర్షాకాలస్వభావ"మనియు పదప్రయోజనము తెలిపియున్నారే, శాస్త్రిగారు - (చూ. పు. 52, 53) అది యెట్లు సంగతపడును?

గురువులు "హంసకు మేఘ ముపద్రవకారి" యనుచుండఁగా, శిష్యులు 'కాదు; కాదు. ఉపకారి' యనుట తగునా?

## ఆక్షేపము

"ఆషాఢమునఁ బొడము మేఘము తొలిమేఘము. నవజలధరము. కాళిదాసు, 'నవజలధరః సన్నద్ధః' అని, 'నవ' మని విశేషించి రూఢిచేసి నాఁడు. తొలిమేఘము (నవజలధరము) గావున హంసల కుపకారి" అని అయ్యంగారి దొక యుక్తి.

## సమాధానము

"మేఘము హంస కపకారి కానే కాదు.— ఆ రెంటికిని విరోధము లేనే లేదు" అనుచువచ్చిన అయ్యంగారు, ఒకమెట్టు దిగి, "మలిమేఘమే గాని, తొలిమేఘము హంస కపకారి కా"దన్నారు. అనక యేమిచేయుదురు? వారు పన్నిన యుక్తియును నిరర్థకమే. తొలిమేఘముగూడ హంసలకు భయావహమే.—

(1) "సలిలంపు వృద్ధ జలధర
మలు పూనిన యూఁతకోల మొత్తముల క్రియన్
దొలువానకాళ్లు తెసఁగన్
గలహంస కులంబులెల్లఁ గలఁగంబడఁగన్" (పాం.మా.)

తొలువానకాళ్లను చూచి, కలహంసకులములు కలఁగఁబడినవఁట! తొలిమేఘ ముపకారి యగుచో కలహంసలు కలఁగఁబడ నేల?

(2) "రాయంచల గుండెబెదరు,
మాయామంత్రము వియుక్తమానచ్యుతి, క
త్యాయత మయూరకర్ణర
సాయన, *మనఁ బ్రథమజలధరారవ మెసఁగెన్."

(హరి. పూ. ౬. ఆ.)

ప్రథమజలధర మన తొలిమేఘమేగదా! దాని యారవము అంచల గుండె బెదరు కానేల ?

(3) "నవజలధరరవభయచకిత కలహంసకుల కోలాహలకోమలో... ఘోషణనినాదః" (కాదంబరి)

'నవ'జలధరముకూడ హంసకులమునకు భయకారియేయనుటకు—ఈ భట్టబాణునివాక్యము చాలదా?

## ఆక్షేపము

"వాల్మీకి, రామాయణమున, ఊరక 'సంప్రస్థితా మానసవాసలుబ్ధాః' అన్నాఁడేకాని రాయంచలకును, మేఘమునకును వైరమును చెప్పలేదు; అట్లే శ్రీనాథుఁడును, శృంగార నైషధమున-'శిబికాధరస్థులగు పురుషులు...దమయంతి మనోవిరాగం బెఱింగి ప్రావృషేణ్యపయోవాహంబులు రాజహంసావలిం బల్వలాంతరంబులవలనం బాపి మానససరోవరంబునుం బోలె...అయ్యంగన భుజంగపుంగవుఁ గదియం గొనివచ్చిరి' అన్నపట్టున మేఘహంసవిరోధమును చెప్పలేదు. కాబట్టి ఆ రెంటికిని వైరమును చెప్పియేతీరవలె ననుట సరికాదు."

## సమాధానము

వాల్మీకియు, శ్రీనాథుఁడును మేఘమరాళములకు విరోధమును చెప్పలేదు; సరే. మైత్రిని చెప్పిరా? లేదే. ప్రతి కవియు హంసమేఘవిద్వేషమును చెప్పియేతీరవలె నన్న నియమము లేదుగాని, చెప్పుచో, విద్వేషము నేగాని చెలిమిని చెప్పరాదన్న నియమముమాత్రము కలదు.

అయ్యంగారు, "ఆ రెంటికి మైత్రినిగూడ చెప్పవచ్చు" ననిరిగదా; అందుకు ప్రమాణముగా ఒక శాస్త్రవచనముగాని, ఒక కవిరచనముగాని

---

* 'మయి' అని యుండవచ్చును.

చూపఁగలిగిరా? లేదే! మఱి, నిరాధారపు ప్రసంగములతో పుటలు నెఱచుట యెందుకు?

కాళిదాసునకు పూర్వులు-నవ్యులునైన కవులు హంసమేఘవిరోధము నెట్లెట్లు విస్పష్టపఱిచియున్నారో చూడుఁడు.—

(1) "ఆలోకితం గృహశిఖండిభి రుత్కలాపై
ర్హంసై ర్యియాసుభి రపాకృత ము న్మనస్కైః,
ఆకాలికం సపది దుర్దిన మంతరిక్ష
ముత్కంఠితస్య హృదయంచ సమం రుణద్ధి."

మేఘాచ్ఛాదితమైన యాకాశమును నెమళ్లు పురులువిప్పి యాడుచు సంతోషముతో నవలోకించినవనియు, హంసలు 'అమ్మో! ఉండరాములు వచ్చిన'వని దిగులుపడి చూచినవనియు ఈ శ్లోకమున చెప్పఁబడినది.

(2) "ఏత త్త ద్ధృతరాష్ట్రవక్త్రసదృశం మేఘాంధకారం నభో
హృష్టో గర్జతి చాతిదర్పితబలో దుర్యోధనోవా శిఖీ,
అక్షద్యూతజితో యుధిష్ఠిర ఇవాఽధ్వానంగతః కోకిలో
హంసాః సంప్రతి పాండవా ఇవ వనా దజ్ఞాతచర్యాంగతాః."

మేఘోదయమునకు సంతసించి నెమలి దుర్యోధనునివలె గర్వించిన దఁట! హంసలు పాండవులవలె అజ్ఞాతవాసము పోయినవఁట!

(3) "ఏహ్యేహీతి శిఖండినాం పటుతరం కేకాభి రాక్రందితః
ప్రోడ్డీయేన బలాకయా సరభసం సోత్కంఠ మాలింగితః;
హంసై రుజ్ఝితపంకజై రతితరాం సోద్వేగముద్వీక్షితః
కుర్వ న్నంజనమేచకా ఇవ దిశో మేఘ స్సము త్తిష్ఠతి."

నెమళ్లు, 'రావయ్యా మేఘుఁడా! రా!' అని కేకలు వేసినవనియు, హంసలు, 'వీఁ డెక్కడ దాపరించెనా' యని మేఘునివంక కొందలపాటున వీక్షించినవనియు, ఈ శ్లోకమున వర్ణన.

ఈశ్లోకములు మూడును కాళిదాసునకు పూర్వుఁడైన శూద్రక మహాకవి రచించిన మృచ్ఛకటికా నాటకములోనివి. మూఁడింటియందును మేఘ హంసలకు విరోధమే చెప్పఁబడినది.

(4) ఘటకర్పరుఁడను కవి,—"హంసా నదన్మేఘభయాత్ ద్రవంతి" (హంసలు మేఘగర్జకు జడిసి పరుగెత్తుచున్నవి) అని వర్ణించినాఁడు.

(5) "తతో౽ఘనావిర్భవనా ద్భియేవ
తత్రామలం మానస మస్య భేజే;
కర్ణాంతరక్రౌంచపక్షేవ శోభా
యశోమరాళో యదుకన్యకాయాః." (భారతచంపువు)

హంస, మేఘోదయమునకు భయపడి మానసమును చేరినట్లు, సుభద్రయొక్క (సౌందర్య) కీర్తి, శ్రీకృష్ణుని మానసమును చేరినదని వర్ణన. "తతః అనంతరం ఘనానాం మేఘానాం...ఆవిర్భవనా దుద యాత్ - భియా భయే నేవే త్యుత్ప్రేక్షా.—వర్షాకాలే హంసా విహాయ భారతం వర్షం మానసం ప్రవిశంతీతి ప్రసిద్ధిః" వ్యాఖ్య.)

(6) "పృథ్వీతాపం సపది శమయ న్దేవకీదక్షిణస్యాః
ప్రాదుర్భూత స్సపది మురజి న్నీలమేఘో నిశీథే;
హర్షోత్కర్షం విబుధశిఖినాం వర్ధయ న్నాసురశ్రీ
హంసశ్రేణ్యాః కిల కలయితుం దూరదేశప్రవాసమ్."

(చంపూభాగవతమ్ 1-29)

శ్రీకృష్ణుఁడను మేఘ ముదయించుటవలన విబుధశిఖులకు హర్షో త్కర్షమును, అసురశ్రీహంసశ్రేణికి దూరదేశప్రవాసమును కలిగినవఁట. పూర్వోక్తకవిసమయమే యిందు పాటింపఁబడినది.

మఱియొక మహాకవి, ఉఱుమునకు హంస భయపడుట నిట్లు చమత్కరించినాఁడు :

(7) "దయితో౽సి తత స్తతః పృథివ్యా
మయి జీమూత! జనస్య జీవనేన;
విమయా దపి గచ్ఛతః కి మేతాన్
ధ్వనిభి ర్భీషయసీహ రాజహంసాన్."

అయ్యా, మేఘుఁడా, జీవనదానముచేత జగత్తునకు మేలుచేయు సత్పురుషుఁడవుగదా నీవు, ఆ హంసలు తమదేశమునకు పాఱిపోవుచున్నను వానిఁ జేరి ఉఱిమి యేల భయపెట్టెదవయ్యా?- అని శ్లోకతాత్పర్యము. ఇందును మేఘహంసలకు విరోధమే చెప్పఁబడినది.

మేఘహంస విరోధ మెంత ప్రసిద్ధమో, యీ క్రింది వేదాంతదేశికుల రచన చదివినవారికి వేఱుగా చెప్పనక్కరలేదు.

(8) "లక్ష్మీవిద్యు ల్లలితవపుషం తత్ర కారుణ్యపూర్ణం
మా శైక్షీ స్త్వం మరకతశిలామేచకం వీక్ష్య మేఘమ్;
శుద్ధై ర్నిత్యం పరిచితపద స్త్వాదృశై ర్దేవహంసై
ర్హంసీభూత స్స ఖలు భవతా మన్వవా యాగ్రజన్మా"
—హంససందేశము.

హంసరాజా, వైకుంఠమున లక్ష్మియను మెఱపుతీగతో కూడియుండు శ్రీమన్నారాయణుఁ డను మేఘమును చూచి భయపడెదవేమో! అట్లు భయపడ నక్కరలేదు. ఆతఁడు, భవాదృశులైన దేవహంసలచే నిత్య సేవితుఁడై, పరమహంసీభూతుఁడైనవాఁడు. అందువలన మీ కులమునకు పెద్ద. నీ వాతనికడకు నిర్భయముగా పోవచ్చును—అని శ్లోకభావము.

మహాకవి, శ్లేషయమకచక్రవర్తి, వేంకటాధ్వరి యేమన్నాఁడో విన్నారా?

(9) "చిత్రం చిత్రం జృంభితే కృష్ణమేఘే
కం సం ప్రాప్తా ప్రాపలోపం సమృద్ధిః
ఆసే ద్యుక్తం హా నిదాఘప్రశాంతిః
హంసో హింసాం మానసే కీర్తియత్తా." (విశ్వగుణాదర్శము)

వ్యాఖ్యా:—హంసః పక్షీ; అసురశ్చ. హింసాం మానసే ప్రాప్తవా నితియత్. వార్షికావసరస్య హంసహింసాకరణత్వం ప్రసిద్ధమ్.

'వర్షాకాలము (మేఘము) హంసలను హింసించునది' యట! హంస మేఘములకు వైర మనుట కింతకంటెను బలవత్తరసాక్ష్య మేమికావలెను?

హంసమేఘద్వేషమును తెలుపు తెలుఁగురచనల నింతకుముందే కొన్ని చూపియున్నాను. ఇంకను కొన్ని,—

(1) "కంధరా, లోకనహృష్టభీతశిఖిలోకమరాళము
సోన దోఁచినన్" (హంస. 5-54)

(2) "నిరతంబు రాజహంసలఁ
బరువెత్తఁగఁజేయు నౌర! పటుచటులభవ
త్కార కరవాల కరాళ
స్ఫురితాంభోదము నృసింహభూపాలమణీ."
(కావ్యాలంకార సంగ్రహము)

ఈ పద్యము ప్రతాపరుద్రీయమున శ్లిష్టకేవలపరంపరితరూపకాలంకారోదాహరణమునకై రచింపఁబడిన,—

"ప్రతాపరుద్రదేవస్య - మండలాగ్రవిధుంతుదః
అఖండవిక్రమోద్దామో - గ్రసతే రాజమండలమ్."

అను శ్లోకమునకు బదులుగా రచింపఁబడినది. శ్లోకమున విధుంతుదరాజమండలములు చెప్పఁబడఁగా, పద్యమున-తత్స్థానమున - 'అంభోదరాజహంసలు' చెప్పఁబడినవి. విధువిధుంతుదుల కెట్టి చెలిమియో రాజహంసాంభోదములకును అట్టి చెలిమియే - నన్న సంగతి యీ యాలంకారికరచనవలన నిస్సంశయముగా నేర్పడుటలేదా?

(3) "తన ధాటికారటత్పటహాగర్జ కరాతి
పారి ప్రావలి హంసపటలి గాఁగ." (బహులాశ్వ. పీఠిక. 49)

(4) "మగసిండు మగువపిండుం
జెగ లేర్పడి చల్లులాడ దివి కుప్పరముల్
నెగసిపడు వారిధారల
నగునెంచె న మేఘవృష్టి యంచలు సెదరన్." (కకుత్. 2-86)

వర్షము (మేఘము) అంచల కెంత భీత్యావహమో, హంసమేఘవైర మెంత ప్రసిద్ధమో యీ రచన తెలుపుటలేదా?

అయ్యంగారు తిక్కనభారతమునైనను చదివియున్నచో, "మరాళమేఘములకు మైత్రిని చెప్పవచ్చు" ననియు, "ఆ రెంటికిని విరోధము చెప్పుట కవి సమయముకా" దనియు వ్రాసియుండరు.

ఈ క్రింది పద్యము, ద్రోణార్జునుల యుద్ధవర్ణన ఘట్టములోనిది.

(5) "గురుశరములు సితపక్ష
స్ఫురణంబున నంచపిండుపోలుపు వహింపఁగా
నరుబాణతతి ఘనావలి
కరణి మిగులనొప్పె నల్లగఱుల చెలువునన్." (విరాట. 5-139)

కవిబ్రహ్మ తిక్కన నపుంసకములను అంగీకరింపగను, నపుంసకములను ఘనాఘనలిగను వర్ణించుటలో భావ మేమి? నపుంసకములు నపుంసకములను నిర్జించునని - యనియే కదా! మఱి ఆ భావ మేర్పడుటకు ఆధారము, మేఘము హంసను గెలిచునది యన్న ప్రసిద్ధకవిసమయము గాక వే ఱేమున్నది?

ఇంత యెందుకు? అంచ, జలదము (వర్షము)నకు జడిసియునది - యన్న అర్థము దాని పేరులోనే యున్నది.

తెనుగున, హంసకు,—తొలకరి గలగు సువ్వి; వానజాలిపులుగు; తొలకరి నూగుడు-అని పేరులు. (చూ. లక్ష్మీనారాయణీయము)

కాబట్టి మేఘుడు హంసలకు విరోధిగాని మిత్రుడు కాడు. మయూర మేఘములకు మైత్రిని, మరాళ మేఘములకు శాత్రవమును చెప్ప వలయు నన్నది వాటిగాని కవిసమయము. కావున ఆ రెంటికిని చెలికారము చెప్పుటయు, పైపెచ్చు మేఘుడు హంసల కుపకారి యనుటయు, కవి సమయమునకును, 'సహాయాః' అన్న కాళిదాసరచనకును విరుద్ధము.

అది యట్లుండగా శాస్త్రిగారు వ్రాసిన పదప్రయోజనములో పూర్వోత్తరవిప్రతిపత్తియు నున్నది.

అది యెట్లనగా: వారు ౧౧వ శ్లోకముక్రింద,—"మేఘుడా, హంసరాజులు నీ సాంగత్యముకోరి నీతో వత్తురు." అన్నారు. అనగా నర్థ మేమి? మేఘుడు ముందుపోవు ననియు, హంస లాతనివెనుక పోవు ననియును గదా!

మరల వారే, ౫౮వ శ్లో. క్రింద,-"హంసలు, మేఘుడు ఎక్కడికి వచ్చిన అక్కడినుండి ఉత్తరముగా పోవుచుండు" ననియు, ౬౧వ శ్లో. క్రింద,—"మేఘుడా, హంసలతోడ గూడనే పోవుచున్నచో, క్రౌంచ రంధ్రము నీకును తెలియు" ననియు వ్రాసినారు.

ఒకచోట - మేఘుడు ముందుపోవు ననియు, మఱియొకచోట - హంసలే ముందుపోవు ననియు వ్యాఖ్యానించుట యెట్లు ప్రతిపన్నమగును?

పలుపలుకు లేల? శాస్త్రిగారు హంసమేఘములకు పొత్తును చెప్పుట పొరపాటు. ఆ పొరపాటును నిరాధారపు వ్రాతలతోను, కుయుక్తులతోను సమర్థింపబూనుట తప్పు.

## ౨. ప్రక్షిప్తములు

"తత్సందేశం జలధరవరో దివ్యవాచా చచక్షే
ప్రాణాంస్తస్యా జనహితరతో రక్షితుం యక్ష వధ్వాః,
ప్రాప్యోదన్తం ప్రముదితమనాః సాపి తస్థౌ స్వభర్తుః
కేషాం న స్యాదభిమతఫలా ప్రార్థనా హ్యుత్తమానామ్."

—ఉ. మే. 56.

"శ్రుత్వా వార్తాం జలదకథితాం తాం ధనేశోఽపి సద్యః
శాపస్యాన్తం సదయహృదయః సన్నిధాయాస్తకోపః;
సంయోజ్యైతౌ విగళితశుచౌ దంపతీ హృష్టచిత్తౌ
భోగా నిష్టా నభిమతసుఖా౯ ప్రాపయామాస భూయః."

—ఉ. మే. 57.

మేఘసందేశకావ్యాంతమున గనుపట్టుచున్న ఈ రెండుశ్లోకములును కథాశరీరమునఁ గ్రొత్తగా మొలచిన యెక్కువ అవయవములవలె నిష్ప్రయోజకము లగుటయేకాక సౌందర్యభంగకరములు నగుచున్నవి. ఆవిషయ మించుక విపులముగా విమర్శింతము.

సందేశకావ్యమునఁ గల ఇతివృత్తమేమి? ప్రోషితుఁడగు నొక యక్షుఁడు, భార్యావియోగదుఃఖమున మతిచెదరి, చేతనాచేతన జ్ఞానము లేక, అవుగాముల విచారింపక, ప్రియురాలికిఁ దన కుశలవార్త తెలుప వలసినదని మేఘునిఁ బ్రార్థించుట. ఇట్టిప్రార్థన మొకవింతగాదు. ఏమన, విరహవ్యాకులతచే నున్మత్తులయినవారు ప్రపంచమును మఱచి, తమకుఁ గనఁబడు ప్రతివస్తువుతోడను మొఱవెట్టుకొనుటయు, సాయము చేయుమని కోరుటయు, వానితో సంభాషింపదొరఁకొనుటయు, వాని తూష్ణీంభావమును తమకనుకూలముగా సమర్థించుకొని తృప్తినందుటయు, కావ్యప్రపంచమున ఆచారముగా వచ్చుచున్నదే. చూడుఁడు : శ్రీమద్రామాయణమున శ్రీరామునంతటి మహాపురుషుఁడు తన ప్రియురాలింగానక కొనలవెదకుచు—

అశోక, శోకాపనుద, శోకోపహతచేతసమ్
త్వన్నామానం కురు క్షిప్రం ప్రియాసందర్శనేన మామ్.

శార్దూల, యది సా దృష్టా ప్రియా చంద్రనిభాననా,
మైథిలీ మమ విస్రబ్ధం కథయస్వ న తే భయమ్. (షష్టితమస్సర్గః)

ఇత్యాదిగా శార్దూలాదిమృగముల నేకాక అశోకాదివృక్షములనుకూడ తన ప్రేయురాలిని గూర్చి పలువిధములుగా ప్రశ్నించుచు వెఱ్ఱివానివలె వనమెల్లఁ గ్రుమ్మరెను. ఇట్లే భారతమున నలునిఁగానక దమయంతియు, భాగవతమున కృష్ణునింగానక గోపికలును చెట్టుచేమలను ప్రశ్నించిరి. మా ప్రియులను జూపుఁడని మఱియు మఱియుఁ బ్రార్థించిరి.

అట్లే యక్షుఁడును వలపు తలకెక్కి, లోకజ్ఞానశూన్యుఁడై అచేతనమగు మేఘమును సందేశహరణార్థము యాచించెను. యక్షుని లోకజ్ఞానశూన్యత నూఁతగాఁగొని కాళిదాసమహాకవి (పూర్వమేఘమున) చిత్రకూటము మొదలు కైలాసపర్యంతమునుగల మనోహరప్రకృతిని భావనాశక్తిబలమున నాకర్షించి, కవితాశిల్పమున మఱింత రమణీయముగాఁ జిత్రించి మన కన్నుల యెదుట నిలుపఁగలిగెను. (ఉత్తరమేఘమున) మానవహృదయమును ద్రవింపఁజేయు కరుణరసమును వెల్లిగొలుపుటకును యక్షుని యవివేకితయే యాధారము. యక్షుని యవివేకము పాకము చెడకుండుటకు మేఘుని యచేతనత పరమసాధనము. మేఘుఁడు మాటలాడనేరని అచేతనముగ నున్నంతవఱకే యక్షుని కున్మాదమును - కాళిదాసుకావ్యమునకు గౌరవమును - అనునది యిందలి రహస్యము.

కావ్యనిర్మాణమునకుఁ గథాపురుషుల విరహోన్మాదతాచేతనతలే ప్రేరకములును, ముఖ్యాధారములును. కల్పనాశిల్పమున నా రెండు విషయములును పరస్పరసంబంధముగల మూలసూత్రములు. ఆ సూత్రములలో నేది పురివిచ్చినను, కావ్యము బిగువుచెడి, వదలువాఱి ఛిన్నభిన్నమగును. కావున మూలసూత్రముల కేపాటి విచ్ఛిత్తియుఁ గలుగకుండ కథారథమును నడిపించుకొనవలసినది కవికిఁ దప్పనివిధి. కాళిదాసు తనవిధి చక్కఁగా నెఱవేర్చుకొనెనా?

దయితాజీవితాలంబనార్థియైన యక్షుఁడు, మేఘముచే సందేశము నంప సమకట్టినట్లు కావ్యప్రారంభ మొనర్చి, చేతనసాధ్యమగుపనిని అచేతన

మైన మేఘముచేఁ జేయింపఁదలఁచినాఁ డేమి యక్షుఁడు? అను నాక్షేపమునకు—

> "ధూమజ్యోతిస్సలిలమరుతాం సన్నిపాతః క్వ మేఘః
> సందేశార్థాః క్వ పటుకరణైః ప్రాణిభిః ప్రాపణీయాః;
> ఇత్యౌత్సుక్యా దపరిగణయన్ గుహ్యకస్తం యయాచే
> కామార్తా హి ప్రకృతికృపణా శ్చేతనాచేతనేషు." (పూ. మే. 5.)

(పొగ, అగ్ని, నీరు, గాలి యనువాని కలయిక యైన మబ్బెక్కడ? సమర్థములయిన యింద్రియములు గల ప్రాణులచేఁ బంపఁదగిన సందేశార్థ మెక్కడ? అను విషయమును ఉత్సుకుఁడు గావున యక్షుఁడు విచారింపక (సందేశహరణార్థము) మేఘుని యాచించెను. కామాంధులగు వారి కిది చేతనము, ఇది యచేతనము అను వివేకముండదు గదా?)

అని సొగసైన అర్థాంతరన్యాసముతో సముచిత సమాధానమును జెప్పినాఁడు. ఆక్షేపమును సమాధానమును లోకసమ్మతములై కావ్యనిర్మాణమునకు అత్యావశ్యకములై, కవితాశిల్పమునకు వన్నె వెట్టుచున్నవి. ఈ ఆక్షేపసమాధానముల భావ మేమి? విరహపీడితుఁడైన యక్షుఁడు లోకజ్ఞానములేక తనగోడును దాను వెళ్లఁబోసికొనుటే కాని, మేఘునివలనఁ దా నేపాటి ప్రయోజనమును బడయఁజాలఁడు. అనగా సందేశకృత్యము జరుగ దనియే కదా? కావ్యప్రారంభ మీరీతి నుండగా, మేఘునికి అచేతనత ప్రకృతిసిద్ధమై యుండగా గణింపకుండను, కాళిదాసు కథా సంవిధానమునకును ప్రకృతికిని విరుద్ధముగా,—

"ఆ మేఘశ్రేష్ఠుఁడు యక్షసందేశమును ఆయక్షవధువుయొక్క ప్రాణములను రక్షించుటకై, జనహితమైన ధ్వనికలవాఁడై (దేవరూపమును దాల్చి) దివ్యవాక్కులతో ఆమెకుఁ జెప్పెను. ఆమెయు ఆ వార్తవలన సంతోషించిన మనస్సుకలదై యుండెను. అట్లే కదా! గొప్పవారిని ప్రార్థించినయెడల నెవరికోరికలు సఫలములు కాకుండును!" అని కావ్యము నేల ముగింపునకుఁ దెచ్చెను?

ఆకాలపు ప్రభావముననో, యక్షుని యదృష్టమువలననో మబ్బు మాటాడనేర్చి సందేశము నందించినదే యుండు ననుకొందము. ఇప్పు

జేమయినది? "జలధరవరః చచక్షే" అను వాక్యమువలన మేఘునికిఁ ప్రాణము వచ్చినది. మూలసూత్రములలో నొకటి విచ్ఛిన్నమైనది. వెంటనే యక్షున కున్మాదము వదలినది. రెండవసూత్రము తునియలైనది. కల్పనా కౌశలము కళంకితమయినది. కథాసౌందర్యము మందగించినది. స్వవచన వ్యాఘాతదోషము కావ్యకర్త కంటుకొన్నది. చక్కగా భాషింపనేర్చిన మేఘుని నచేతనమనియు, ప్రాణియు - సత్వకార్యనిర్వహణ దక్షుఁడునగు మేఘుని యాచించిన యక్షుని ఉన్మాదియనియు చెప్పినాఁడనుట నీకు న్యాయమగునటయ్యా? అని కాళిదాసుమహాకవిని ప్రశ్నించుట కవకాశము దొరకినది. ఇంత యసంబద్ధముగా కావ్యపరిసమాప్తి గావింప నా కవీంద్రున కేమి యక్కఱగలిగెనో? మేఘుఁడు సందేశమునందించె ననకున్న —

"కేషాం నస్యా దభిమతఫలా ప్రార్థనా హ్యుత్తమానామ్."

అను తన యర్థాంతరన్యాసమున కిఁక నవకాశము లేకపోయెఁ గాఁబోలు! పోనిండు 'సందేశం చచక్షే" అను వాక్యము నే నమ్మి మబ్బు మాటాడ నేర్చిన ప్రాణియే యనుకొందము. అట్టియెన యక్షుఁడు నోరునొచ్చునట్లు తన్ను స్తోత్రము చేయునపుడుగాని, చిత్తము చెమ్మగిల్లునట్లు ప్రియురాలి వియోగదురవస్థను విన్నవించునపుడుగాని మఱియొక సందర్భమునఁగాని మాఱుపలుకక మూగమొద్దువలె నూరకుండునా? ఊఁ కొట్టనయిన నూఁకొట్టఁడా? ఎదుటివాఁడు గంటలకొలఁది ప్రసంగించుచుండ హరే-యనక, అచ్యుతా-యనక బెల్లముగొట్టిన రాయివలె నుండుట ప్రాణిధర్మమా? ప్రకృతిధర్మమా? పాపము! తానెంత మొత్తుకొన్నను మబ్బు మాఱు పలుకమిని యక్షుఁడిట్లు సమర్థించికొని తృప్తిపడుచున్నాఁడు.

"కచ్చి త్సౌమ్య, వ్యవసితమిదం బంధుకృత్యం త్వయా మే
ప్రత్యాదేశా న్నఖలు భవతో ధీరతాం కల్పయామి;
నిశ్శబ్దోపి ప్రదిశసి జలం యాచిత శ్చాతకేభ్యః
ప్రత్యుక్తం హి ప్రణయిషు సతామీప్సితార్థక్రియైవ." (ఉ. మే. 56)

(ఓయీ సాధూ! నాకొఱకీ బంధుకార్యమును నీవంగీకరించితివని తలంచెదను. నీవు బదులుమాట చెప్పకుండుట అనంగీకార సూచకము

కాదు. మఱియేమన? అది నీ స్వభావము. బదులుమాటచెప్పుట నీ గాంభీర్యమునకు లోపము. (ఉఱుమకయే) వాగ్దానములు పలుకకయే నీవు నిన్ను యాచించు చాతకములకు జలము నిచ్చుచున్నావు. నా విషయమునను అట్లే చేసెదవు. ఏలయనిన సత్పురుషులు యాచకుల కార్యమును చేయుదురుగాని చేసెదనని పలుకరు.) అని.

మేఘుని ప్రతిగుణమును తన కనుకూలముగ సిద్ధాంతము చేసికొని సంతోషించుట వానికిఁ దప్పనివిధి. ఆ విధియే కావ్యప్రభవ కారణమును, మన కానందదాయకమును గదా!

కావ్యప్రారంభమునుండి తుదివఱకును, అనఁగాఁ బూర్వమేఘమున నఱువదియేడు శ్లోకములలోను, ఉత్తరమేఘమున నేబదియైదవ శ్లోకము వఱకును మేఘ మచేతనమనుచు వచ్చిన మహాకవి, యేబదియాఱవ శ్లోకమున "జలధరవరః చచక్షే" అనుట పొంది పొసఁగియున్నదా? ఇప్పట్టున పాఠకులకు సందేహము జనింపకుండు టెట్లు? సందేహము పొడమకుండునట్లు వ్యాఖ్యాత లేమయిన విశేషించి వ్రాసిరా? తిలకింపుఁడు:—

సంస్కృతవ్యాఖ్యాత, "జలధరవరః చచక్షే ఉక్తవాన్" అని మాత్రము వ్రాసి "నచశంకా నచోత్తర" మన్నట్లు మిన్నకేగెను. మల్లినాథపాదులవారివ్రాఁతయు నిట్లుండునా? ఇఁక ఆంధ్రవ్యాఖ్యాతలగు శ్రీ శాస్త్రులవారు తమ పదప్రయోజనమున 'జలధరవరః' వరుఁడు కావుననే ఉపకారము చేసినాఁడు—అనగా సందేశము చెప్పినాఁడు. అని వ్రాసి సందేహమునకే మఱింత చోటొసంగిరి.

ఇది యిట్లుండ, 'మొదలులేదు శ్రీరామా' యన్నట్లు "చచక్షే" అనుటయే అసంభవమును, అసందర్భమునునై యుండఁగా మీఁదుమిక్కిలి "దివ్యవాచా" (దేవవాక్కులతో) నట మేఘుఁడు సందేశమును చెప్పుట! ఇందులకు సంస్కృతవ్యాఖ్యాత:—

"కామరూపం మఘోనః" ఇతి పూర్వం యక్షేణైవోక్తత్వాత్ తదానీం మేఘః దేవాకారీభూత్వా తాదృగ్వాచా యక్షసందేశం యక్షవధ్వా ఉవాచేత్యర్థః — (మేఘుఁడు కామరూపుఁ డని యక్షునిచే నిదివఱకే పలుకఁబడియున్నందున, అప్పుడు మేఘుఁడు దేవాకారమును దాల్చి, దివ్యవాక్కులతో సందేశమును చెప్పెను.) అని వ్రాసెను.

ఇచ్చో వ్యాఖ్యాతృసమర్థనము మిక్కిలి యద్భుతమును గొలుపుచున్నది. కార్యార్థియు, విరహార్తుడు నగు యక్షుడు తన యవసరమును బట్టి మేఘుని గొప్పచేసి పొగడుటలో నన్న 'కామరూప' మ్మన్న పలుకా తన సమర్థనమున కాధారము? శ్రీ శాస్త్రులవారో - 'దివ్యవాచా' వట్టి యుఱుములచే నభిప్రాయము తెలియదు గావున దివ్యవాక్కున చెప్పెను- అని వ్రాసిరి. ఎటులైనను యక్షుఁ డంపిన సందేశమును మేఘుఁడు చెప్పియే తీరవలయునని శ్రీ శాస్త్రులవారును తలఁచిరి!

అలకాపురమున కరిగియో, అరుగకయో, తాను 'వరుఁడు' కావుననో మఱియొక కారణముననో మేఘుఁడు సందేశమును చెప్పినను చెప్పియుండ వచ్చునుగాక; పనిలేని పనిగా దేవాకారమును దాల్చుట యెందుకు? యక్షుఁడైనను మొదట స్తోత్రసమయమున మాటవెంబడి మాటగా 'కామరూపమ్' అనెనేగాని నీవు దేవతవై — దేవవాక్కులతో నా రమణికడ భాషింపుమనెనా? లేదే. యక్షుఁ డున్మత్తుఁడయ్యును మేఘుఁడు దేవత యగునని తలఁపలేదు. కావుననే, సందేశ ప్రారంభమున,—

"కలభతనుతాం గత్వా క్రీడాశైలే నిషణ్ణ స్సన్ విద్యు దున్మేష దృష్టిమ్ అంతర్భవనపతితాం కర్తు మర్హసి" (ఉ. మే. 20) (ఏనుఁగుపిల్లంత చిన్న యాకారమును దాల్చి క్రీడాశైలమునఁ గూర్చున్నవాఁడవై నీ మెఱపు చూపును ఆ యింటిలోనికి నిగిడింపుము) అనియు,—

"తస్మిన్ కాలే సా లబ్ధనిద్రాసుఖా స్యాత్ యది స్తనితవిముఖస్సన్ యామమాత్రం సహస్వ" (ఉ. మే. 36) (నీవు పోయి చూచుసమయమున నామె నిద్రాసుఖ మనుభవించుచుండెనేని ఉఱుముక నిశ్శబ్దుఁడవై జాము సేపుమాత్రము కనిపెట్టుకొని యుండుము) అనియు,—

"తా ముత్థాప్య విద్యుద్గర్భస్సన్ స్తనితవచనైః వక్తుం ప్రక్రమేథాః" (ఉ. మే. 37)— 'విద్యుద్గర్భః అన్తర్లీనవిద్యుత్క ఇత్యర్థః. దృష్టి ప్రతిఘాతేన వక్తృ ముఖావలోకన ప్రతిబన్ధకత్వా న్న విద్యోతితవ్య మితి భావః. స్తనితవచనైః - స్తనితాన్యేవ వచనాని, తై ర్వక్తుం ప్రక్రమేథాః - ఉపక్రమస్వ' (వ్యాఖ్య)— (ఆమెను మేలుకొలిపి, మెఱసినయెడల దృష్టి ప్రతిహతమై మాటలాడువాని ముఖము కనఁబడకపోవునుగాన నీ మెఱపును

నీలో నణఁచికొని నీ యఱుకులు అను మాటలచేత సంభాషింప మొదలు పెట్టుము) అనియు చెప్పినాఁడు.

ఇట్లు యక్షుఁ డెప్పుడు చెప్పినను మేఘుని మేఘరూపముననే సందేశకార్యము నెరవేర్పు మనెనుగాని, దేవాకారముదాల్చి దేవ వాక్కులతో భాషింపుమని కోరలేదు. యక్షుఁడు కోరినదానిని పొస రించుటకే సమర్థుఁడు కానట్టి (ధూమ జ్యోతి స్సలిల మరుతాం సన్నిపాతః) మేఘుఁడు, యక్షుఁడు కోరకున్నను దేవాకారమును ధరించి, తత్కార్యమును నెరవేర్చె ననుటకంటె వింతకలదా!

దేవాకారమును దాల్చిన 'పెద్దమనిషి' మేఘుఁడు సందేశమును యక్షరమణికి నెమ్మదిగా వచింపక, నడికిరేయివేళ ఊరివారి కందఱికిని వినవచ్చునట్లు పెద్దగా అఱచి చెప్పెనట! ఆ యఱపును విని (గాఢనిద్రలో నున్న) కుబేరుఁడు సైతము మేల్కొని సందేశమును వినెనట; కుబేరుఁడు మేఘుఁడు చెప్పిన వార్తను విని జాలిపడి తత్క్షణమే శాపావసానము ననుగ్రహించెనట! అట్లా దంపతులను దుఃఖముతీర్చి సంతుష్టులనుజేసి మఱలఁ గూర్చి కుబేరుఁడు కాంక్షితభోగములను మునుపటివలెనే వారికిఁ గలుగఁ జేసెనట! అట్లు వారతని కరుణచే మఱల క్షేమమును బొందిరట! (ఇది 'శ్రుత్వావార్తామ్' అను శ్లోకమునకు శాస్త్రిగారు వ్రాసిన తాత్పర్యము.)

ఇందుపై వారు 'సంయోజ్య-ప్రాపయామాస' అని ణిజంతప్రయో గముచేత కుబేరుఁడు కరుణించి తానే ప్రయత్నపూర్వకముగా వారిని గూర్చి సంతుష్టులంజేసి యిష్టభోగముల నొసఁగెననియు, 'భోగా నిష్టా నభిమతసుఖాన్ ప్రాపయామాసభూయః' అనుట కావ్యాంతమందు మిగుల మంగళశ్రుతిగా నున్నదనియు, ఇందువలనఁ గవి వ్యాఖ్యా శ్రద్ధ్యాపయిత్రు పత్రాదుల కెల్ల మంగళ ముద్దేశింపఁబడినదనియు లిఖించి, ఆ శ్లోకమున కొక పెద్ద గౌరవమును, ప్రాముఖ్యమును నొసంగిరి. కాని ఆ శ్లోకము మూలముగను, దాని పైశ్లోకమగు 'తత్సందేశ'ము మూలముగను కాళిదాస మహాకవి కవితాశిల్పము కళంకితమగుటయు, పాఠకులకు సందేహములు పొడముటయు, ఇట్టి విమర్శనము వ్రాయవలయుటయుఁ దటస్థించినది.

ఇంతకును ఈ కావ్యమున మేఘుఁడు కామరూపి కావలసిన యవసరముగాని, వ్యాఖ్యాత లాతనిని కామరూపిం గావింపవలసిన యవసరముగాని, సందేశమును చెప్పవలసిన యవసరముగాని, చెప్పింపవలసిన యవసరముగాని - బొత్తిగా లేదు. అలోకసామాన్య ప్రతిభాశాలియు, లోకజ్ఞుఁడును నగు కాళిదాసమహాకవి స్వవచనవ్యాఘాతదోషభూయిష్ఠముగా కావ్యమును ముగింపను లేదు. ఏఁబదియైదవ శ్లోకమున,— 'మాభూ దేవం క్షణ మపిచ తే విద్యుతా విప్రయోగః' అను నాల్గవ చరణముతోనే ప్రౌఢముగా, కావ్యమును శుభాంతముగాఁ బరిసమాప్తి కావించినాఁడు.

కాళిదాసకవితామర్మవేది యగు మల్లినాథసూరియు, "ఏవం మద్వత్, క్షణ మపి స్వల్పకాల మపి, తే తవ, విద్యుతా కళత్రేణేతి శేషః, విప్రయోగః విరహః, మాభూత్ మాస్తు. 'అన్తే కావ్యస్య నిత్యత్వాత్కుర్యా దాశిష ముత్తమామ్. సర్వత్ర వ్యాప్తయే విద్వా న్నాయకేచ్ఛానురూపిణీమ్,' ఇతి సారస్వతాలంకారే దర్శనా త్కావ్యాన్తే నాయకేచ్ఛానురూపోఽయ మాశీర్వాదః ప్రయుక్త ఇత్యనుసంధేయమ్." అని తన వ్యాఖ్యానమును ముగించినాఁడు.

ఇచ్చట శ్రీ శాస్త్రులవారును "మంగళార్థము కావ్యాంతమందు ఆశీర్వాదము" అని వ్రాసిరి. ఇట్లు నిర్దుష్టముగను, సర్వలక్షణసంపన్నముగను కావ్యము ముగియుచుండఁగా, పూర్వోత్తరసందర్భ విప్రతిపన్నములగు నా శ్లోకముల కిఁక నవకాశ మెక్కడిది? అవి కాళిదాసకవికృతములు గావనుటకు జంకఁ బనిలేదు. మఱియు, తద్వ్యాఖ్యయు మల్లినాథకృతము కాదు. అగుచో 'మాభూదేవ'మునఁ గావ్యపరిసమాప్తి సూచించు టెట్లు? ఈ శ్లోకముల నా జోలి యెత్తకుండు టెట్లు? వేయేల : ఆ రెండు శ్లోకములును నిస్సంశయముగాఁ బ్రక్షిప్తములే. రెంటిలో నొకటియగు 'శ్రుత్వావార్తాం' ప్రక్షిప్తమనియు దానికి మల్లినాథసూరి వ్యాఖ్యానము లేనేలేదనియుఁ జెప్పి సందర్గ్శకారపండితులు, ఆ శ్లోకమును తమ ప్రతిలో ముద్రింపక విడిచిరని శ్రీ శాస్త్రులవారే వ్రాసియున్నారు.

కాని *“విడువ నిచ్చగింపక నేను ముద్రించితిని” అనియు వ్రాసిరి. సందర్భ కారపండితులైనను మల్లినాథవ్యాఖ్య లేదన్న కారణమున వదలినట్లున్నది గాని విమర్శించి కథావిరుద్ధమన్న హేతువున వదలినట్లులేదు. అట్లయినచో- ‘తత్సందేశ’-మునుగూడ వదలియే యుందురని నా నమ్మకము.

ప్రక్షిప్తములగు నీ శ్లోకములను కావ్యమునుండి తొలఁగించితిమేని కవికి స్వవచన వ్యాఘాతదోషమును, మేఘునికి దేవతావేషము వేసికొని దివ్యవాక్కులతో భాషింపవలయు నన్న ఇక్కట్టును దొలఁగుటయే కాక కావ్యమునకు మంగళాంతత్వమును గలుగును.

---

* “వ్యాఖ్యలో కథావిరుద్ధము లని తెలుపకున్న నేమి? వానికి ప్రాముఖ్యమిచ్చి, మూలకథతోఁ జేర్చి, పదప్రయోజనాది సారస్యవివరణ మును వ్రాసిన నేమి? శ్రీ శాస్త్రులవారు శిష్యులకు మాకు ఇవి ప్రక్షిప్తము లని ముప్పదియేండ్లనుండి సోపపత్తికముగా నేర్పినారు”— అన్నారు అయ్యంగారు.

ముప్పదియేండ్లక్రిందనే యెఱిఁగియున్న శాస్త్రిగారు, ఇరువది యేండ్లక్రింపట ముద్రించిన గ్రంథములో వానిని చేర్ప నేల? అవి ప్రక్షిప్తములని సూచింపకపోవు టేల? అని నేను ప్రశ్నించితిని.

కాని, అయ్యంగారు ప్రత్యుత్తర మియ్యలేదు.

మఱియు నయ్యంగారు,— “మఱి ప్రక్షిప్తములైనను కవనసౌభాగ్యము కలిగి వ్యాఖ్యయుఁ గలిగియున్న విడువ నిచ్చపొడమకుండును. ముద్రింపఁబడును. అందుల కేమి?” అన్నారు.

కవితాశిల్పము నెఱిఁగినవా రెవ్వరును అట్లనరనియు, కథాస్వరూపమును చెఱుపని ‘ధారాసి’ క్త్వాదిప్రక్షిప్తము లెన్నియైన నుండవచ్చునుగాని, కథాప్రణాళికాభంగకారియగు శ్లోక మొకటియైనను కావ్యమున నుండరాదనియు, అట్టి శ్లోకముగాని, తుద కొక పదముగాని, యెట్లో కథాగర్భమునఁ జొచ్చినను, ప్రమాదవశమున గర్భమునఁ జొచ్చు మక్షికాదులవలె- ఎప్పటికేని వెలువడవలసినవేగాని ఇముడునవి కావనియు, ‘ఆషాఢస్య ప్రథమదివస’ చర్చయే, అందుకు దృష్టాంతమనియు నేను బదులు చెప్పితిని.

మఱియు, నేనీ వ్యాసమును వ్రాయుచున్నపుడు, చెన్నపురికిఁ బోవఁ దటస్థించెను. అప్పుడు 'సందేశ'మును గూర్చిన నా యీ యూహ యెంతవఱకు సత్యములో — ప్రత్యంతరములను జూచి నిర్ణయించుకొందమన్న తలఁపున, ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున కరిగి, అందొక కొన్ని ప్రతులఁ బరిశీలించితిని.

(1) తెలుఁగు అచ్చుప్రతి. (2) సంపద్గిరా ప్రతి. (3) ఈశ్వర చంద్రునిఎడిషను. (4) Parab's Edition. (5) Gildemistar's Edition. (6) నేమిదూత. వీనియందు 'తత్సందేశ' మున్నమాట నిజము.

కాని, (1) 1919 సంవత్సరమున తిరువాన్కూరు గవర్నమెంటు సీరీసులో టి. గణపతి శాస్త్రులవారిచే — దక్షిణావర్తనాథవ్యాఖ్యా సహితముగాఁ బ్రకటింపఁబడిన ప్రతిలో ఈ శ్లోకము లేదు.

(2) 1911 సంవత్సరమున రాయల్ ఏష్యాటిక్ సొసైటీపక్షమున ప్రొఫెసర్ E. Hultzsch గారు — శ్రీరాజానకానందదేవ పరమాత్మ చిహ్నపరనామ వల్లభదేవ విరచిత మేఘదూత వృత్తితో బహుదేశకోశ వ్యాఖ్యాన పరిశోధన విమర్శపూర్వకముగా, నుపోద్ఘాతాదులను వ్రాసి ప్రకటించిన ప్రతిలో ఈ శ్లోకము లేదు.

వల్లభదేవుఁడు:— 'మాభూ దేవం' ఏవ మనేనప్రకారేణ మద్వత్ తవాపి నిమేషమపి తడిత్ప్రియయా విరహో మాభూ దితి భద్రం — అనియే ముగించినాఁడు.

(3) పూర్ణసరస్వతియు తన విద్యుల్లతావ్యాఖ్యానమున:— తయా సతత మవిరహశ్చభూయా దిత్యాశిషా శ్రీశబ్దప్రయోగాచ్చ ఏతత్కావ్య శ్రోతృ వ్యాఖ్యాత్రాదీనామభంగురమంగలసంపత్తిరిత్యశేషమతిమంగలం— అనుటతోనే కావ్యపరిసమాప్తిఁ బొనర్చెను.

(4) అభినవభట్టబాణ బిరుదాంకితులగు పండిత. ఆర్. వి. కృష్ణమాచార్యులవారు, పూర్ణసరస్వతిచే వదలఁబడి మల్లినాథునిచే వ్యాఖ్యానము చేయఁబడిన శ్లోకములనుచేర్చి ప్రచురించిరి. వాటిలో ఈ రెండు శ్లోకములును లేవు.

(5) 1813 సంవత్సరమున H. H. Wilson గారు కావించిన ఆంగ్ల భాషాంతరీకరణమునను 'తత్సందేశ'ము లేదు.

మఱియు, (6) మల్లినాథుని (కొన్ని) వ్యాఖ్యలలోను (7) జినసేనుని వ్యాఖ్యానమునను (8) తంజావూరి ప్రతిలోను (9) Panabokke పుస్తకమునను (10) Stenzler's ప్రతిలోను లేదు. 'మాభూదేవం'తోనే కావ్యము ముగింపఁబడియున్నది.

ఇట్లు పూర్వోత్తరసందర్భ పరామర్శమువలనను బహువ్యాఖ్యాన పరిశోధనములవలనను ప్రక్షిప్తమని నిర్వివాదముగాఁ దేలుచున్న 'తత్సందేశ' శ్లోకమును దమ ముద్రణమునఁ దొలఁగింపక పోవుటయేకాక శ్రీ శాస్త్రుల వారు "బొంబాయి ముద్రణమును మదరాసు తెలుఁగు ముద్రణమును బరికించి ఒకదాన లేనిదానిని మఱియొకదానినుండి గ్రహించి నా ముద్రణమును, ఆ రెంటికంటెను పుష్కలము గావించితి ననుచు 'శ్రుత్వావార్తా'మునుగూడఁ జేర్చిరి. కాని అప్రసక్తములును కథావిరుద్ధములు నగువానిని జేర్చుటవలన పుష్కలతకుమాఱు, వికృతి వాటిల్లినదని నా తలఁపు.

పుష్కలత యనఁగా గ్రంథబాహుళ్యము కాదుగదా? అగుచో నందర్గికార్ ఎడిషన్‌లో నున్న,—

"ఇత్థంభూతం సురచితపదం మేఘదూతాభిధానం
కామక్రీడా విరహితజనే విప్రయోగే వినోదః;
మేఘస్యాస్మి న్నతి నిపుణతా బుద్ధి భావః కవీనాం
నత్వార్యాయా శ్చరణకమలం కాళిదాస శ్చకార"

అను శ్లోకము మేఘసందేశకావ్యమునఁ జేర్పఁదగినది కాదో?

# గౌరనహరిశ్చంద్ర-టిప్పణము

*గౌరనహరిశ్చంద్ర - ద్విపద - పేరెన్నిక కెక్కిన కమ్మని జాను తెనుగుకావ్యము. అందలి జాతీయములును,

* ఈ వ్యాసము 1942 జనవరి — ఆంధ్రవారపత్రికలో ప్రచురింపబడినది.

పలుకుబడుల తీరుతెన్నులును, తెనుగువారి కానంద దాయకములు. అట్టి యుత్తమకావ్యము ఆంధ్రుల భాగ్యవశమున కీ. శే. వేదం వెంకట్రాయశాస్త్రి గారిచే పరిష్కృతమై ముచ్చటగా ముద్రితమైనది. ఈ కేటతెలుగు కబ్బమునకు టీకతో అంతగా అవసరము లేకపోయినను పరిష్కర్తలు టిప్పణమునుగూడా చేర్చి, తెనుగుతో చాలినంత పరిచయము చాలని పాఠకులకు మహోపకారము చేసినారు. కాని, వారి టిప్పణము కొన్నిమాటలకే మాత్రమే. వివరింపబడవలసిన పదము లనేకము లుపేక్షితము లయినవి. వ్రాసిన కొద్ది టిప్పణములోను పొరపాటులు విరివిగా దొర్లినవి. పాఠనిర్ణయమున సరియైన పరిశీలనమును జరుగలేదు. పరిష్కరణములో సాహస మెక్కువగా వినియోగింపబడినది. చాల తావులలో పరిష్కర్తలు గ్రంథకర్తభాషను తొలగించి తమ సొంతభాషను ప్రవేశపెట్టినారు. అందువలన జాతీయము లనేకములు స్వరూపస్వభావములను కోలుపోయి వికృతము లయినవి. కవి యుద్దేశించిన యర్థములు వ్యర్థములయినవి. ఈ విషయములనెల్ల విపులముగా విమర్శించుచో గ్రంథము పెరుగును. కావున, ఈ వ్యాసమున మాదిరి కొక కొన్ని యర్థదోషములనుమాత్రము చూపుచున్నాను.

### ౧. బందిపోటు

'ఉరవడిఁ గుక్కల నుసికొల్పికొల్పి
సందుగొందులఁ దప్పి చనుమేకంబులను
బందిపోటులఁ బాటుపఱిచియు, మఱియు' (పుట. 31)

'బందిపోటులన్ = దారి యడ్డగించుటలచేత' (టిప్ప.)

'బందిపోటు' - 'దారి యడ్డగింపు' అనునవి దొంగలకృత్యములుగాని వేటరుల పనులు కావు.—

''బందిపోటు - దొంగలు గుంపులుగా వచ్చి, యింటనున్నవారిపైబడి నిర్బంధించి చేయు దోపిడి. Gang robbery, predatory incursion.'' (బ్రౌను.)

వేటగాండ్లు మెకములను పాటుపఱిచినది 'పందిపోటులతో'గాని 'బందిపోటు'లతో కాదు. 'పందిపో' టనగా పందులనుపొడుచు ఈటె. పందిపోటు = పందీటె. (శ.ర.)

(1) ద్విపద:-''పసిఁడికామలనొప్పు బలుపందిపోట్లు, వెసఁబూని'' (నవనాథచరిత్ర. పుట 37.)

(2) క. ''...పందిపోటు లమ్ములు, వలలు తెరలు దీమములు సివంగులబోనుల్'' (వరాహ 4-71).

'బందిపోటు' - 'దారి యడ్డగింపు' అనునవి భిన్నకృత్యములు కావున, ''బందిపోటులకా-దారియడ్డగించుటలచేత'' అనుటయును తప్పే.

## ౨. ఇంగితము

''ఈరత్నభూషాదు లేటికి మాకు?
నీరువట్టాలునే నెయిత్రావికొనిన
నింగితంబెఱుఁగని దే జాణతనము?'' (పు. 48)

''ఇంగితము=మొగముజాడ.'' (టిప్ప)

ఇంగితమునకు, బొమముడి లోనగు వికారము; అభిప్రాయము అని రెండర్థములు. (శ.ర.) ఇక్కడ చెప్పదగినది రెండవయర్థము. పైవాక్యములు, ఆటపాటలకుమెచ్చి హరిశ్చంద్రు డాభరణాదు లియ్యబోయినప్పుడు మతంగకన్య లన్నవి. తమ్మేలుకొనవలసినదని యాకన్నెలు కోరుకోరిక. 'మా మనసులోని కోరిక నెరుగజాలని నీవేమి నేర్పరివి?' అని ఆయింతుల మాటల కర్థము. నిజానికి తెలిసికొనవలసినది యెదుటివాని హృదయములోని భావమునుగాని, వట్టి మొగముజాడను కాదు. మొగముజాడను బట్టియు నూహింపవలసినది హృద్గతభావమునే. అట్లూహింపగలవాడే నేర్పరి; వాడే పండితుడు.

(1) 'పరేంగితావగాహియైన బుద్ధి యొక్క ఉనికియే పండితునకు విశేషము. అది లేనినాఁడు పండితునికిఁ బామరునికంటె విశేషమేమి?'

(నీతి. మిత్రభేదము)

(2) 'ఎంగిలిముచ్చు గులాములు
సంగతిగాఁ గులముఁ జెఱుపఁ జనుదెంచిరయా
యింగిత మెఱిఁగిన ఘనుఁ డీ
మంగలి కొండోజి మేలు మంత్రులకంటెన్.'

—చాటు. రత్నాకరము.

(3) "ఇంగితము Hint, sign, symptom, gesture. Intention, purpose, inclination 'ఆకారైరింగితైర్గత్యా చేష్టయా భాషణేన చ। నేత్రవక్త్రవికారైశ్చ లక్ష్యతేఽంతర్గతం మనః' పరేంగితం, గర్భస్థం కేతకీపుష్ప మామోదేనైవ షట్పదాః'. ఇంగితజ్ఞుడు penetrating, skilful in reading a character. One who sees the heart." (బ్రౌను)

(4) "తస్యసంవృతమంత్రస్య గూఢాకారేంగితస్యచ" (రఘు. 1.20) 'శోకహర్షాది సూచకో భ్రుకుటీముఖరాగాది రాకారః. ఇంగితం చేష్టితం, హృద్గత వికారోవా; 'ఇంగితం హృద్గతోభావో బహిరాకార ఆకృతి' ఇతి సజ్జనః' (మల్లినాథుఁడు)

## ౩. బడుగు

"నీవేమి చెప్పిన నీకు నిచ్చకము
గా వినుతించుచుఁ గడుపుఁగూటికిని
బాయక నీయింట బడుగవై పనులు
సేయుచునుండ వసిష్ఠుండఁ గాను" (పుట. 59)

'బడుగను = అశక్తుఁడను.' (టిప్ప)

శ.ర.లో 'బడువు = బడుగు = అశక్తుఁడు,' అని యున్నది. ఆమాట మీదనే ఆధారపడి శాస్త్రిగారు 'బడుగను = అశక్తుఁడను' అన్నారు. పొరపాటు. కడుపుకూటి కొకరియింట బడియుండు 'బడుగు' కూటిపేద యగునుగాని 'అశక్తు' డగునా? అశక్తుడు పనులు సేయగలడా? విస్తర

మెండుకు : 'బడుగవనై = కూటిపేదనై'—'నీపెట్టుపోఁతల కాసపడి'-అని ప్రకరణోచితమైన యర్థము.

"బడుగు Poor, necessitous" (బ్రౌను)

ఆ.వె. "సర్వధనము విష్ణు సంసర్జనముచేసి
బడుగుపగిది నెట్లు బ్రదికె దీవు?" (భాగ. 8–578)

ఈ యర్థమును గమనింపక 'వేదం'వారు శ్బ్రం. నై.లోగూడ ఇట్లే యనుచితార్థము వ్రాసినారు. (చూ. 'బడుగు')

## ౪. ఎరియు

"ఓపినరీతిఁ బ్రియోక్తుల నెదిరి
కోపము వదలించి, కుశలంబుమీఱ,
నేచిన యాపద నెరియక, తన్నుఁ
గాచుకో దగు." (పుట. 61)

'ఎరియక = మండక.' (టిప్ప.)

'ఎరియు' అను క్రియకు, 'మండు', 'పరితపించు', అని రెండర్థము లున్నవి. (చూ. శ.ర.) ఇక్కడ రెండవ యర్థము ప్రకరణమునకు దగినది. ఆపదచేత 'పరితపించుట' స్వభావముగాని 'మండుట'–'కాలుట' స్వభావము కాదు. పైపెచ్చు బ్రౌను 'ఎరియుట = బాధపడుట' అని యర్థము చెప్పి, అందు కీ పద్యమునే చూపియున్నాడు. కనుక ఆ టిప్పణము సరికాదు.

## ౫. అదరంట

(1) "కరపల్లవము సాప, కలగొనరేఁగి
కడుదురు లదరంటఁ గఱవ." (పుట 79)

'అదరు అంటన్ = నిష్ఠురవ తగిలినట్లు' (టిప్ప.)

(2) "ఆలోన నడఁగిన యమ్మహాభుజగ
మా లోహితాస్యుని నదరంటఁ గఱచె". (పుట 205)

'అదరు అంటఁగా = నిప్పుక యంటునట్లుగా-భగ్గాలు మనునట్లుగా' (టిప్ప.)

ఇది భాషా సంప్రదాయమునకు చాలా దూరమైన టీక. 'నిప్పు' అనే యర్థమునిచ్చు పదము 'అదరులు' నిత్యబహువచనాంతము. అది 'అదరుటగ్గ' ఇత్యాదిగా వృత్తియందుమాత్రమే యేకవచనాంత మగును. (చూడు శ.ర.; ప్రౌ.వ్యా.శబ్ద. 36). కావున 'అదరు = నిప్పు' అనుట తప్పు. 'అంటఁగా' అను క్రియకు 'తగిలినట్లు' అని యర్థము కాదు. 'పాము నిప్పు అంటునట్లుగా కఱచె' ననుట యర్థములేని మాట. 'పాము-అదరంట గరచినది' అంటే, 'అదరు = నిప్పు-అంటునట్లు భగ్గున కరచిన' దనియు, 'తేలు-చిగురంట బొడిచినది' అంటే, 'చిగురు = చిగురాకు - అంటునట్లు (చల్లగా) కుట్టిన'దనియు తెను గాకివాని యర్థము చెప్పరు. అదరంటఁగా, చిగురంటఁగా, అను పదములకు లెస్సగా అని యర్థము. అందుకు కవుల ప్రయోగములు ప్రమాణము. అట్టి ప్రయోగములు వందలకొలదిగా నున్నవి. మచ్చుకు కొన్ని —,

(1) గా. హరి. లోనే మరియొకచోట;—

'కుదికిలఁబడ రెట్ట గుదియించి తిగిచి,
అదరంట మొత్తి, నోరడఁగ జంకించి.' (పుట 164)

(ఇక్కడ 'అదరంట'కు టిప్పణిలేదు.)

(2) మంజరి:—

'శకటసమూహంబు చనియెడివేళఁ
జీల లూడఁగఁదీయుఁ, జేతులఁబట్టి
యూడెడి పాపల నదరంటఁగొట్టు.' (పల్నాటిచరిత్ర. పు. 45)

(3) లయగ్రాహి:—'అంతపడిఁ దాఁకి, యదరంటఁ బడద్రేసి, పెను మంట లెగయం, జఱచి, దంటతన మొప్పఁగా' (భాస్క.యుద్ధ. 1430)

(4) 'వత్సు మదరంట ద్రేసిన వ్రాలె నతఁడు.' (ఉ.హరి. 1-46)

(5) 'కెంగేల నదరంట వాటువడు కాముకుల వెలవెలపాటు.' (మను. 3-42)

'అదరంటఁ-చురుకు ముట్టటట్టుగా' అని జూలూరివారి టీక.

(6) ద్విపద:—

'అనినఁ గాలిననూదు లదరంటఁ జెవులఁ,
జొనిపినయట్లైన సురసుర గ్రుక్కి.' (నవనాథ. పు. 47)

సూ.ని. 'అదరంట = మర్మస్థాన మంటునట్లుగా — గాఢముగా, తీవ్రముగా' అని యర్థము చెప్పి, పై గౌరన-ద్విపదనే యుదాహరించినది.

## ౬. కంటగించు

"నేనేడ? నీవేడ? నెలతుకయేడ?
పూని తపోవిఘ్నమున కిది త్రోవ
తరళాక్షు లన్న మా తల కంటగించు" (పుట. 86)

'కంటగించున్ = గగుర్పొడుచును' (టిప్ప)

'కంటగించున్' అనగా 'నొచ్చును' అని యర్థముగాని 'గగుర్పొడుచు' నని కాదు. ఆడవాండ్లంటే మాకు తలనొప్పి అని యర్థము. సరిపడదు అని భావము. (జాతీయము)

(1) కంటగించు = విరోధించు (శ. ర.)

(2) 'కంటగించుట-To hate, be intolerant, or outrageous. To rave or storm' (బ్రౌ)

ఒక కొన్ని ప్రయోగములు:—

(1) 'నిష్కారణంబు నా, పేరన్నన్ మదిఁ గంటగించెదరు పెంపే మీకు నన్నేచుటల్' (శుక. 2-457)

'మదిఁ కంటగించెదరు = మనసులో గగుర్పొడిచెదరు' అని యర్థము చెప్పుట సరికాదుగదా?

(2) 'మేనమామలు బావలు కానివానిఁ
గాఁగఁ జూతురు, మా వాడకట్టువారు
కంటగింతురు నన్నంతె'. (హంసవింశతి. 3-150)

(3) 'బాకీమోమనఁగాదు పగసాటి చెదరించు, నొంటిపల్లవకాదు కంటగించు' (శుక. 3-21)

(4) 'సకల క్రొందొడిమ యొత్తిఁ గంటగిలు మస్తకం బెట్టు లోర్చెనో కఱకు జడలు.' (పాండు. 4-3)

(5) 'గృహంబులోనికిఁ, దారఁడు కొనకే యారఁడు తాపము నొందఁడు కంటగింపఁడుఁ' (భాగ. 7-194)

'కంటగింపఁడు = విరోధింపడు' అని యర్థముగాని 'గగుర్పాటుఁ' డని కాదు.

కంటగించుట యనగా 'కంటకిత మగుట' యనుకొనుట భ్రాంతి. శాస్త్రిగారు 'ఆముక్త' (5-106)లో 'ఒంటి కురువేరు పోచకుఁ గంటగింప దైరి' అన్నచోట 'కంటగించు'- ప్ర. కంటకము (తేటాలుసం గలిగిన యప్రీతికి రోమహర్షణము కలుగును) అని వ్రాసినారు. 'కంటగించు'కు 'కంటకము-ప్రకృతి' యనుటయును పొరపాటే. 'కంటకము' అను దేశ్యపద మున్నది. కంటకము (=కంటు) = విరోధము. కంటు + ఇంచు = కంటగించు. దేశ్యక్రియ. అప్రీతికి గగుర్పాటు కలుగుట నిజమే-గాని, తల, మొల, పిరుదు, పిక్క - అప్రీతికిగాని ప్రీతికిగాని గగుర్పొడిచినట్లు చెప్పినవా రెందును లేరు. కావున శా. టీ. అసాధువు.

## ౭. చిదుగు

(1) "ముష్టిఁ, జదిమియుఁ గటములు చదియలు గాఁగఁ, బడగ లొత్తియును." (పు. 93)

'చదియలు గాఁగన్ = చిదుగునట్లు.' (టిప్ప)

(2) "బలుకత్తి రాతికిఁ బాసిన గొంటు." (పుట. 153)

'రాతి...గొంటు = రాతిదెబ్బకు చిదుగని గొంటుపోఁక.' (టిప్ప)

క్రియ 'చిదుకు' గాని 'చిదుగు' కాదు. చిదుగు విశేష్యము. 'పడుచుల కాపురము-చిదుగులమంట' అని లోకోక్తి.

(1) "చిదుగు-A small stick or pin, or spillikin, fire wood. చిదుకుట-To be smashed" (బ్రౌణ్యము.)

(2) "చిదుగు = ఎండినపుల్ల; సమిధ.-చిదుకు = చిప్పిలు." (శ.ర.)

(3) వ. "వానికిం దేజస్వి యను ఋషిపుట్టి అపారంబైన యిధ్మ భారంబు వహించుటంజేసి యిధ్మవాహుం డనంబరగె." (భా. ఆర. 2-353) అన్న రచనకు,— 'ఇధ్మభారంబు = చిదుగులమోపు' అని శ్రీ పళ్లె పూర్ణ ప్రజ్ఞాచార్యులవారి టీక.

(4) "బగబగన మండు చిదుగుసొదమంటల కడ్డంబువట్టి."
(మను. 4-60)

## ౮. అసిఁబోవు

"అసికోఁతలుగఁ గోయ, నంత నవ్విభుని
యసికోఁత లసిఁబోవ, నప్పిశాచములు." (పు. 96)

'అసిఁబోవఁగా = తప్పిపోఁగా.' (టిప్ప)

క్రియ (అసి + పోవు=) 'అసివోవు' గాని (అసిఁ + పోవు=) 'అసింబోవు' కాదు. *"అసివోవుటెట్లు నా యసి, వోవు మెకములఁ జించు నాయమ్మ నా చిలుకోటమ్మ" (రామాభ్యుదయము. 2-24) అని యమకబద్ధమయిన ప్రామాణిక ప్రయోగము. 'అసిపోవు', 'అసియాడు', అసియార్చు' అను క్రియలను 'అసింబోవు'; 'అసినాడు'; 'అసినార్చు' అని వాడుట సరికాదు.

---

* 'అసిఁబోవుటెట్లు నాయసిఁ బోవు మెకముల' అని శ.ర. పా.— (చూ. 'అసిఁబోవు'.) తప్పు. సూ. ని. 'అసివోవు'

## ౯. గుత్త

"పట్టి గుత్తని నిన్నుఁ బ్రజలు వీక్షింపఁ
జట్టు మోయించెద సర్వథా చూడు." (ప్ర. 129)

'గుత్త అని = పైకము పెట్టి కొన్నట్టి దాసుఁడని' (టిప్ప)

*'గుత్త' యనగా 'ఫలప్రదమైన యొక సొత్తును ఆ సొత్తు గలవానికి తత్ఫలార్థము తగినధన మిచ్చి తన యనుభవమున నుంచుకొనుట.' (శ. ర.) గాని, పైకము పెట్టి కొనుట కాదు.

"గుత్త Rent, farm, contract గుత్తలంజ a kept-courtesan. ఆ వూరిని గుత్త చేసుకొన్నాడు; he took the village on rent." (బ్రౌను.)

"గుత్త = (గుప్తశబ్దభవము) మక్తా. (శం. ని.)

"గుడిసెవేటుల నిల్లాలు గుత్తలంజె." (వేమ. శతకము.)

పైకము పెట్టి కొన్నయెడల కొన్నవా డా వస్తువును దానాధమన వినిమయవిక్రయాదులపాలు చేయవచ్చును. గుత్తవస్తువును అట్లు అన్యాక్రాంతము చేయుటకు వీలులేదు.

## ౧౦. ముట్టఁ జిక్క

"కంఠీరవంబు, ముదిసిన నాఁకొన్న ముట్టఁ జిక్కినను, బొదలు మాంసము డించి పులు మేయఁ జనునె?" (పు. 149)

'ముట్టక = పడఁద్రోయఁదగినట్లు, చిక్కినన్ = కృశించినప్పటికిని(టిప్ప)

'ముట్టక' అను క్రియకు 'పడద్రోయదగినట్లు' అని యర్థము చెప్పుట యొప్పదు. 'ముట్టక = కడముట్ట, చిక్కినను' అని సరియైన యర్థము. ఈ యర్థము నిఘంటువులలో ఎంత స్పష్టముగా చెప్పబడియున్నదో చూడండి.

---

* "పచ్చిత్రిక్కతో ల్బత్త్రి చు చ్చాలమె ట్లుందికొనఁ దాన యూళ్లెల్ల గుత్తపట్టి" (ఆముక్త. 7-5)

"గుత్తపట్టి = తన కొక్కనికే ఇచ్చునట్లుగా అందఱను స్వాధీన పఱచుకొని' అని సంజీవనీవ్యాఖ్య.

(1) "ముట్టు = కడముట్టు. "మ. మును మీచే విను రావణాదుల కథల్ ముట్టం బ్రశంసింపుఁడు. నిర్వ. రామా. 3. ఆ." (శ. ర.)

(2) "ముట్టుట, 'ముట్టగొల్చిన ఫలం బిట్టుండవలదె' బసవ; ముట్ట గొలిచిన = కట్టకడవెళ్ళా గొలిచిన To worship to the end or with unfailing devotion" (బ్రౌణ్యము)

## ౧౧. అట్టాడు

"ఆఁకటఁ జంటి కట్టాడుచునున్న
సుతు లోహితాస్యునిఁ జూచి" (పు. 155)

'అట్టాడుచు = మెడయెత్తుచు' (టిప్ప.)

'అట్టాడు' అను అకర్మకక్రియను అట్టు + ఆడు అని విభజించుటయు, అట్టు = మెడ, ఆడు = ఎత్తు-అని యర్థము కల్పించుటయు సరికాదు. అట్టాడు లోనిది 'అట్ట' కాని అట్టు కాదు. (చూ. శ. ర.) గ్రంథవిస్తర మెందుకు? అట్టాడుట యనగా తమక పడుట; చుట్టిచుట్టి తిరుగుట. అంతే కాని మెడయెత్తుట కాదు.

"అట్రాడుట To hesitate, waver, roam about, wander about in great distrees తడమాడుట, అల్లాడుట, దేవులాడుట. ద్రౌపది యున్నయెడకుంజని యా సమీపమున నట్రాడుచున్న నమ్మానినితో నిట్లనియె. M. IV. 2-47" (బ్రౌణ్యము.)

సూ. ని. అట్టాడు = తమకించు, తహతహపడు - అని యర్థముచెప్పి, ఆ యర్థమునకు పై ద్విపదనే యుదాహరించినది.

కావున, 'మెడయెత్తుచు' అను టీక తప్పు.

## ౧౨. వెరవేఁకి

"నన్నెఱింగెదుఁగాక! నా పేరు తెలియ
విన్న మిత్తికి నైన వెరవేఁకివచ్చు." (పుట 177)

'వెరవేఁకి=విపరీతజ్వరము.' (టిప్ప.)

'వెరవేఁకి' యనగా వెరవలనివేఁకి (వెర=భయము; వేఁకి=జ్వరము) =జడుపుజ్వరము. భయంకరములయిన విషయములను విన్నను, కన్నను జ్వరమువచ్చుట లోకమున కలదు. కావ్యలోకమునను కలదు.—

(1) 'తల్లడంబునఁ ద్రయోదశవిధ జ్వరునకు
విన్నమాత్రనె వెఱవేఁకి వాఁకె' (జై మి. 8-17)

(2) *"కయ్యంబునఁ బాఱఁబాఱగాయంబుసేసి వెఱవేకిఁ గొలిపిన." (ఆము క్త. 6-86) 'వెఱవేకి - భయజ్వరము' అని వావిళ్ల-వేదంవారి టీకలు.

శ.ర. కర్త 'వెరవేకి = విరహతాపము' అని యర్థము చెప్పి, 'నా, కీ వెరవేకి మాన్పఁగమలేక్షణ, యక్కొతిపీవు వెజ్జవై.' (హరి. ఉ. 7 ఆ.) అను ప్రయోగమును చూపి వెరశబ్దము విరహార్థకమయి ప్రత్యేకముగా ప్రయోగములందు కానబడదు—అన్నారు.

'వెర'కు 'విరహ'మనే యర్థము లేనిమాట నిజము. ఉండవలసిన యక్కరయూ లేదు. పద్యములోని 'వెరవేకి' జడుపుజ్వరమేగాని విరహజ్వరము కాదు. జడుపుజ్వరము కావుననే 'వెజ్జ'తో పనిపడినది. జడుపుజ్వరమునకు వెజ్జులు మంత్రించి విభూతిపెట్టుటయు, అది నిమ్మళించుటయు లోకమున నున్నది. కాని విరహాజ్వరమునకు, అట్టి మందులు - మంత్రములు - వెజ్జులు లోకమున కనబడుట లేదు.

శ.ర. లో 'వెరవేఁకి' లఘురేఫముతో నున్నది. శాస్త్రిగారున్ను, 'హరిశ్చంద్ర' మూలమునను టిప్పణముననుగూడా లఘురేఫముతోనే ముద్రించినారు. కాని 'ఆము క్త' లో మాత్రము (వావిళ్లవారి ప్రతినిబట్టి కాబోలు) గురురేఫముతో ముద్రించినారు.

## ౧౩. తఱలక

"విను నిక్కమిది సుమ్ము వీఁడు నీసొమ్ము. గొను మన్న వాఁడు నిక్కుచుఁబల్కె: నీకు, ధనరాశి యిచ్చోటఁ దఱలకయిత్తు" (పుట 190)

'తఱలక = అవతలికిపోక.' (టిప్ప.)

---

* ఈ నాటి ముద్రితప్రతులు రెండింటను ఈ పాఠమే యున్నది. కాని ప్రాచ్యమున 'బారం బారం గాయంబునం గాయంబుజేసి' అనుపాఠమున్నది.

'తఱలకయిత్తు' ననగా,—'తప్పకయిత్తు' నని యర్థముగాని, 'అవతలికి పోక యిత్తు' నని కాదు. అవతలికి పోవు; ప్రయాణమగు అను నర్థముల నిచ్చు 'తరలు' లఘురేఫము కలది. బ్రౌనుపండితుడు 'తఱలు' అను పదము క్రింద ఈ ద్విపదనే యుదాహరించి 'తఱలక నిత్తుఁ = I will give it without fail' అని యర్థముకూడా చెప్పియున్నాడు.

## ౧౮. తన

"వీరబాహుఁడు తనవెంట నేతెంచు...
తన కింకరులఁ బంపి, ధనము తెప్పించి
పెనురాసి పోయించి, ప్రియము రెట్టింప
మునికుమారునకిచ్చి, మ్రొక్కి పొమ్మనిన" (పు. 193)

'తన = నా' (టిప్ప.)

'నా' వెంటవచ్చు 'నా' కింకరులను బంపి వీరబాహుడు ధనము తెప్పించి నక్షత్రకున కిచ్చెను.—అని టీకాకర్తలు వ్రాయుట అక్రమము. వీరబాహుడు అతనివెంట వచ్చుచున్న అతని బంటులనే పంపి, ధనము తెప్పించుకొన్నాడుగాని టీకాకర్తల బంటుల నంపి తెప్పించుకొనలేదు.

'తన కింకరులఁ' అనగా 'వీరబాహుని కింకరులను' అని యర్థము గాని 'నా, కింకరుల' - నని కాదు. ప్రౌ. వ్యా. శబ్ద. 78 లో 'ఆత్మార్థం బౌకానొకచో నామాస్మదర్థాభిధాయియు నగు' అని యున్నది. కావున 'తనకు 'నా' యన్న యర్థమును చెప్పవచ్చును. కాని ప్రకరణవిరుద్ధముగా 'అతనియొక్క' అని చెప్పవలసినచోట 'నా' (నాయొక్క) అని చెప్పుట తప్పు.

## ౧౯. పడఁగఱచు

"అహికులోత్తమ, లోహితాస్యకుమారు
గహనంబులోఁ బడఁ గఱచిర మ్మనిన." (పు. 202)

'పడఁ = కూలునట్లు' (టిప్ప).

'పడఁగఱచుట' యనగా లెస్సగా కఱచుటగాని, పడునట్లు కఱచుట కాదు. పడదిట్టు; పడఁగొద్దు; పడద్రోయు మొదలగు క్రియలవలెనే 'పడగఱచు' జాతీయము. ఆ జాతీయములోని 'పడ'ను వేర్పఱచి 'పడక = పడునట్లు' అని యర్థముచెప్పుట తప్పు.

## ౧౬. కడపు

"ఎలమితో మున్నొక్కఁ డిచ్చిన ధరనఁ
బొలుపొందఁ దా దారపోసిన ధరన
సూదిమోపెడునంత చోటు నాభూమి
లేదని కడపినఁ, లెక్కింపవాఁడు
ఘనతరమగు నరకమున వేయేండ్లు
మునుఁగుచుఁ గ్రిమిరూపమున వసియించు." (పు. 250)

'కడపినఁ = అపహరించినయెడల' (టిప్ప.)

కడపుట యనగా ఇయ్యక పెట్టక పొమ్మనుటగాని, 'అపహరించుట' కాదు.

(1) 'కడపు = ఇయ్యక పొమ్మను. 'ఏపట్టున నర్థులం గడప' భో. 3 ఆ. (శ. ర.)

(2) సీ. "దుర్భిక్షదోషంబు దొరఁకొన్న *గడపనీ
కడపనీ గృహమేధికంబునందు,
మీఁదువోకున్నఁ గడపనీ మిన్నకెట్లు
గడపె నింటింట నీ కాశికా పురమునఁ
బుణ్యగేహిని? యిది మహాద్భుతము కాదె? (కాశీ. 7 ఆ. 139.)

---

*కడపనీ = కడపనిమ్ము-అని యర్థము.

వావిళ్లవారి ప్రతిలో, పాఠము "కడపని, కడపని గృహమేధికమ్మునందు" అని యున్నది.

గీ. మనము మనమనపూర్వజన్మములయందుఁ
గడపినారము మధ్యాహ్నకాలభిక్ష
యనుభవింపక పోవంగ నలవియగునె
కమలజునికైనఁ బ్రారబ్ధకర్మఫలము? (కాశీ. 7-148).

క. అడిగిన యప్పుడ చెచ్చెరఁ
గడపినఁ బోనవ్వ యేను? గడుదుర్మతివై
పడఁతి నను నిలిపి భిక్షం
బిడక కడునవజ్ఞ చేసి తేల మదమునన్?" (భా. అర. 5-13.)

# శృంగారనైషధము

ఆంధ్రమల్లినాథులు శృంగారనైషధము పూర్వముద్రణములలోని అపపాఠములను దాదాపు రెండువేలు సవరించియు, సర్వంకష యను సార్థకాభిధగల విపుల వ్యాఖ్యానము వ్రాసియు, ఆ గ్రంథమును సర్వాంగసుందరముగా తీర్చి ఆంధ్రావళి కపారమైన యుపకార మొనరించినారు. నేఁడు పఠన పాఠనములలో నున్నది వారి ప్రతియే. వారి పరిష్కరణములోను, వ్యాఖ్యానములోను జాఱుపాటు లుప్పతిల్లినవి. *నా కగపడినవాటిలో కొన్నిటి నిక్కడ చూపుచున్నాను.

## పాఠవిచారణ

### ౧. 'ఆనందంబునఁ బొందు'

"ఆనందంబునఁ బొందు మిందునిభవక్త్రా" (5-61)

* ఈ వ్యాసములోని కొన్ని విషయములు శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి షష్టిపూర్తి సంచిక (1941)లో అచ్చయినవి.

ఆనందంబునన్ = సంతోషముచేత - పొందును = పొందిక కలిగి యుండును. (సంతోషింపు మనుట. 'ఆనందంబును' అనియేని పా. అగుఁ గాక.) అని స.వ్యా.

ఆనందంబునుబొందు - అన్న యర్థమున 'ఆనందంబునఁబొందు' అనుట ప్రాచీన సంప్రదాయము. భారతాదులను చక్కఁగా చదువనివారికి ఈ ప్రయోగము తప్పుగను-వింతగను కనుపట్టును.

## భారత ప్రయోగములు

(1) "ఎవ్వరి యాంద్రు రింకఁ, బరిభవంబునఁ బొందక బ్రదుకువారు." (విరా. 2-140)

(2) "ఇప్పు డిటు బ్రుంగుడుపాటునఁ బొందఁ జూచి" ( ,, 2-192)

(3) "ఈ యున్నవారెల్ల నా,చే దైన్యంబునఁ బొందు టొప్పదని" (ఉద్యో. 3-378)

(4) "నీ సుతుండు సహోదరులుం దానునుం బుణ్యలోకసౌఖ్యంబునం బొందియున్నవాఁడు." (ఆశ్ర. 1-101)

(5) "రిపుకోటిచే నపజయంబునఁ బొంది" (ఆరణ్య. 7-225)

(6) "సంతాపభరం,బునఁ బొందుదు రింతకు" ( ,, 7-256)

## భాస్కర రామాయణ ప్రయోగములు

(1) "అని కౌశికుఁ డలుగఁగ మే
దిని గంపించె సమస్తదేవతలు భయం
బునఁబొంది రపుడు" (భాస్క. బాల. 201)

(2) "సంతస, మునఁబొందితి మేము నీవు మునివర" (,,–259)

(3) "దివ్యశస్త్రాస్త్రంబులు వడసి మహోత్సాహంబునం బొంది దర్పాతిరేకంబున." (,,–562)

ఇట్టి ప్రయోగములు పరశ్శతముగా కలవు. కులము వాఁడు-అనుటకు (ప్రౌ. వ్యా.సమా. 32) కులమునవాఁడు-అనుట యెట్టి ప్రయోగవిశేషమో, ఆనందమును బొందు-అనుటకు,–'ఆనందమునఁ బొందు' అనుటయు నట్టిదే.

కావున ''ఆనందంబును అనియేని పా. అగుఁగాక'' అని సవరణ సూచించుట అనవసరము; "ఆనందముచేత-పొందిక గలిగియుండుము'' అని యర్థము చెప్పుట ఉచితము కాదు.

పొందు-అను క్రియకు 'పొందిక కలిగియుండు' అను నర్థము లేదు.

N.B. — శృం.నై. లోని కొన్ని పాఠదోషములు, అర్థదోషములు కూడా-నా 'జితకాశి' పీఠికలోను, ఇందే పాఠపరామర్శార్థపరామర్శలలోను చూపబడియున్నవి.

# అర్థవిచారణ

## ౧. మృదుమధుర చిత్ర విస్తరములు

''మృదు మధుర చిత్ర విస్తర కవితావిలాస వాగీశ్వరులగు కవీశ్వరులును.'' (1-11)

'మృదు = సులువును, మధుర = ఇంపును, (అయిన), చిత్ర=శబ్ద చిత్రము - అర్థచిత్రము నను నిరుదెఱఁగుల రచనయొక్క-, విస్తర=విరివిగలిగినట్టి, కవితా = కవనముయొక్క-, విలాస = క్రీడయందు, వాగీశ్వరులు = బ్రహ్మలు (రూపకము)' అని సర్వంకషావ్యాఖ్య.

మృదుమధుర చిత్ర విస్తరములు చతుర్విధ కవితలుగాని అవి కవితకు విశేషణములు కావు. చతుర్విధకవితలప్రస్తావము కావ్యములయందు పలు తావులఁ గలదు.

పెద్దన, భట్టుమూర్తి, కణాద పెద్దన సోమయాజి మొదలగు కవులు 'చతుర్విధకవితానిర్వాహకు' లయినట్లు వారి వారి గద్యములు తెలుపుచున్నవి.

విజయరాఘవభూపాలుఁడు, తన 'పూతనాపహరణ' నాటకమున, చతుర్విధకవితల నిట్లు తడవియున్నాఁడు.

'దక్షిణసింహాసనపట్టభద్ర, కలియుగరామభద్ర, చతుర్విధకవితానిర్వాహకసార్వభౌమ .....విజయరాఘవనాయక, పరాకు;' (చూ. తంజావూరు సరస్వతి మహాల్ లైబ్రరి క్యాటలాగు. పుట 227.)

## చతుర్విధకవితలు

'బంధగర్భచిత్రాశువు' లనియు, 'చిత్రవిస్తరమధురాశువు' లనియు, 'మృదుమధురచిత్రవిస్తరము' లనియు, చతుర్విధకవితల విషయమున మతభేదము లున్నవి.

(1) 1832 లో,— మనుచరిత్రకు టీక వ్రాసిన జూలూరి అప్పయ్యశాస్త్రిగారు,— 'చతుర్విధ = నాలుగుప్రకారములు, అనగా బంధకవిత్వ చిత్రకవిత్వ గర్భకవిత్వ ఆశుకవిత్వము లనేభేదములు కలిగినటువంటి కవిత.' అన్నారు.

(2) తారాశశాంకకర్త—చ। 'చిత్రవిస్తరమధురాశు' లీలఁగవితల్ రచియింపఁగనేర్చె. (2-54). అని చతుర్విధకవితలను పేర్కొన్నాఁడు.

(3) కళాపూర్ణోదయకర్త,-'ఆశుమధుర చిత్రవిస్తారములు' (1-11) చతుర్విధకవిత లన్నాఁడు.

(4) మఱియు నాతఁడే, 'నెఱయమెచ్చిరి కవినృపుల యాశు విచిత్ర మృదుకవిత్వకృతియుఁ దదవగతియు' (కళా. 6-177) అని, ఆశువు-చిత్రము-మృదువు, అను కవితాభేదముల నొకరిముఖమున చెప్పించి తన కావ్యమున చొప్పించినాఁడు.

(5) 'పాండురంగ' కర్త, సీ. 'నలుదెఱంగులనెన్నఁగల కావ్యధారల ఘనుఁడ వాశువునందుఁ గరము మేటి, వి' (1-23) అని, రాజు తన్నగ్గించినట్లు వ్రాసికొన్నాఁడు.

(6) 'ఆశు మధుర చిత్ర విస్తార-కవిత్వ తత్త్వ కోవిదత్వ ప్రసక్తి.' (పరమయోగి విలాసము. పుట 206.)

(7) వారి వీరి మాటలెందుకు? ఆదికవి-నన్నయభట్టు, శ్రీ రాజరాజనరేంద్రుని విద్యావిలాసగోష్ఠిలో, 'మృదుమధుర చిత్రవిస్తర' నవరసభావభాసుర కవితారచనా విశారదులైన మహాకవు లున్నట్లు, ఆదిపర్వము (1-8) లో చెప్పియున్నాఁడు. నన్నయ సమాసమును శ్రీనాథుఁడట్లే యనువదించినాఁడు. కావున కవితాప్రస్తావమున మృదుమధురచిత్రవిస్తరములను విశేషణముల పట్టికగా భావించుట సంప్రదాయము కాదు. అది కవ్యభిప్రాయవిరుద్ధము.

సర్వంకషాకర్తలు 'చిత్ర...కవనముయొక్క క్రీడయందు, వాగీశ్వరులు = బ్రహ్మలు (రూపకము), అన్నారు. కాని బ్రహ్మదేవుఁడు 'చిత్ర... కవనముయొక్క క్రీడ' యందు నేర్పరి- అనుటకు ప్రమాణమేమో తెలుప లేదు.

శ.ర. కర్త, ఆశువు, గర్భము, బంధము, చిత్రము అను పదములలో నొకదాని క్రిందనైనను, చతుర్విధకవితలను తడవలేదు. ఒక్క 'బంధము' క్రింద 'కావ్యరచనావిశేషము' అనిమాత్ర మన్నాఁడు. బ్రౌను దొర,—"ఆశుకవిత్వము or ఆశుధారాకవిత్వం, Extempore poetry ఆశుకవిత్వము చెప్పుట To improvise. బంధము, బంధకవిత్వము A poem composed in a fantastic form; in the shape of a sword (ఖడ్గబంధము) a serpent (నాగబంధము)etc." అని వివరించియున్నాఁడు.

సూ.ని. కవి, కవిత, కవిత్వము, గర్భము, గర్భితము, ఆశువు, ఆశు కవి, అను పదములలో దేనిక్రిందనైనను, చతుర్విధ కవితలనుగూర్చి చెప్పి యుండవచ్చును. కాని చెప్పలేదు.

'చిత్రము' క్రింద,— 'శబ్దచిత్రముగాని అర్థచిత్రముగాని ఉభయ చిత్రముగాని యగు కావ్యము' అన్నది.

శబ్దచిత్రాదులు కవితాభేదములుగాని, కావ్యభేదములు కావు. కావున చిత్రమగు కావ్య మనుట సరికాదు.

## ౨. అంగుళము

"ధర నేకాంఘ్రి కనిష్ఠికాంగుళమ యాధారంబుగా నిల్చి ని,ర్భర లీలం గృతవేళ నెట్టన యధర్మంబుం దపస్విత్వముం బొరసెఁ" (1-55)

"ఏకా...యు(?).-ఏక=ఒక, అంఘ్రి=పాదముయొక్క, కనిష్ఠికా = చిటికెన వ్రేలియొక్క, అంగుళము అ = ఎనిమిదియవల ప్రమాణము మాత్రమే ('యవోదరై రఙ్గుళ మష్టసంఖ్యైః' లీలావతి) ఆధారంబుగా - నిల్చి,—అధర్మము చిటికెనవ్రేల నంగుళప్రమాణభాగముపైనిమాత్రమే నిలిచిన దనుటచే కొంచెముకొంచెము అటనట నుండెడినని భా.—ఒంటికాలి కనిష్ఠికపై నిలుచుట కఠోరతరతపశ్చరణప్రకారము" అని స. వ్యా.

కఠోరతపస్సులను చెప్పు ఘట్టములలో, కవులు సాధారణముగా, *ఒంటికాలి బొటనవ్రేలిమీఁద నిలఁబడి తపముచేసినట్లుగా చెప్పుచుందురు. అధర్మముచేసిన తపస్సు కఠోరతరమని యేర్పఱుచుటకు శ్రీనాథుడు, ఒంటికాలి బొటనవ్రేలిని చెప్పక—చిటికెనవ్రేలిని చెప్పినాడు. తపఃకఠోరతరతను తెలుపుటకు చిటికెనవ్రేలే చాలియుండగా, వ్యాఖ్యాతలు-చిటికెనవ్రేలిలోని అంగుళప్రమాణభాగమును చెప్పవలసిన యక్కఱ యేమి?

ఏమియును లేదు. అమరములో అంగుళీశబ్దమేగాని అంగుళశబ్దము లేదు; అందువల్ల వారా శబ్దాని కర్థము వెదకవలసివచ్చినది. ఆ వెదకుటలో—'ఎనిమిదియవల ప్రమాణ'మన్న యర్థమొకటి లీలావతిలో చిక్కినది. ఆ యర్థముతోనే వ్యాఖ్య సాగించినారు.

కాని, కనిష్ఠికలో అంగుళప్రమాణభాగమును 'కనిష్ఠికాంగుళము' అనుట పొసఁగదు. అసలు కాలి కనిష్ఠిక అంగుళముకంటె నెక్కువ యుండదు. కావున కనిష్ఠికలో అంగుళమాత్ర భాగమనుట యొప్పదు. కనిష్ఠికాంగుళము-అనగా చిటికెనవ్రేలు అనియే అర్థము. (కనిష్ఠికయైన అంగుళము - అని విగ్రహము.)

శ్రీనాథుడు, అంగుళి-యను నర్థముననే 'అంగుళ'మును వాడినాడు. వ్యాఖ్యాతలు గమనింపలేరు.

---

* (1) "ధర బొటవ్రేల నూని, రవిఁ దప్పక చూచుచు."
—తా. శ. 1-22

(2) "చెటచెటఁ బేలుచు నలుగడఁ
బటుతరశిఖిశిఖలు నెగయఁ బదిలముగా నం
గుటము ధర నూఁది సుస్థితిఁ
గుటిలాలక వదన మెత్తుకొని రవిఁ జూచున్."
—నన్నె. కు. సం. ౯. ౨౦౦.

(3) "అంగుష్ఠాగ్రము నేలమోపి తప మేకాబ్దంబు నిండంగఁ జేయంగన్"
(భాస్క. బాల. 448)

"భువం య దేకాంఘ్రికనిష్ఠయా స్పృశన్" అనిమూలము. 'ఏక పాదస్య కనిష్ఠయా కనిష్ఠాంగుళ్యా భువం స్పృశన్" అని మల్లినాథ వ్యాఖ్య.

కాబట్టి, "కనిష్ఠికయొక్క, అంగుళము=ఎనిమిదియవలప్రమాణము" అను అర్థ మనవసరము; మూలవిరుద్ధము కూడాను.

అంగుళశబ్దమునకు 'వ్రే'లన్నయర్థము సుప్రసిద్ధమే కాని అప్రసిద్ధము కాదు. చూడండి.

(1) "ముక్కుపయి నంగుళముం గదియించి" (భా. విరా. 2-356)

(2) "అంగుళాగ్రముల్ సిటికెనలందు మొదళు
లనఘ దేవర్షి తీర్థము లనఁగఁ బరఁగు" (,,—అను. 4-113)

(3) "కరతలాంగుళములఁ గనుఱెప్ప లెత్తి
సెర సున్నదని పాఱ నిష్ఠించి యూఁదు" (బస. పు. 3-763)

(4) "కొలుకులురెండు నంగుళముల నదుమ" (,,—3-768)

(5) "వినాయకు నుంగర మంగుళంబునన్" (హంస. 4-156)

(6) "తనదగు బాహాం, గుళములు దక్కటి యంగం
బుల కెక్కటిసేయ రాజపుత్రుఁడు మెఱసెన్" (భోజ. 4-97)

'అంగుళము = వ్రేలు' అని నిఘంటువులలోను ఉన్నది.—

(1) "అంగుళము = వ్రేలు" (శ. ర.)

(2) "అంగుళము = A finger" (బ్రౌణ్యము)

(3) "అంగుల = A finger" (కన్నడ-నిఘంటువు)

## ౩. మడవక

"మడవక ముష్టియోగ్యమగు మధ్యముతో నెలవంకయైన య
ప్పుడఁతుక భ్రూలతాధనువు పట్టి మనోభవుఁ డింత నుండియున్
విడుచునకాని మానఁ, డిది నిక్కము, షట్పదకీటజుష్టమై
యుడుగక కమ్మధూళి నుసి యొల్కుచునున్న పురాణచాపమున్"
(5-12)

మనోభవుఁడు, ఇంతనుండియుఁగా,—సాదనక=(సహజముగా వంగియే యుండుటవలన) వంపనక్కఱలేకయే, ముష్టి.....తోఁగా = పిడికిటికి తగినట్టి నడిమిభాగము కలదై, నెలవంకయైన,—ఈ తరుణియొక్క బొమతీవ యనెడి వింటిని, పట్టి, (తన) పురాణ = ప్రాంత, చాపమును, విడిచియైనను చూనే కాని విడువకుండఁడు—అని వ. వ్యా.

విల్లు వంపదగినది కాని, చాకువలెను, ఆకువలెను మడవదగినది కాదు. వింటిని వంచుటను - 'మడచుట' యనరు. భాషలో విలువంపు-తలవంపు ఉన్నవిగాని, విలుమడత-తలమడత లేవు.

తొలుత ఋజువుగా నుండి, యెక్కువెట్టుటచేత వంగినవిల్లు శర ప్రయోగమునకు పనికివచ్చును గాని, పుట్టుకతోనే వంగియుండు విల్లు పనికిరాదు. అది లక్కబొమ్మచేతివింటివలె, వినోదముగా చూచుటకు మాత్రమే పనికివచ్చును.

కావున, 'బొమ-విల్లు' సహజముగానే వంగియుండుట నొక గుణముగా చెప్పుటయు, అట్టి వింటి కొఁగపడి, మనోభవుఁడు తనచేతివింటిని పాఱవేయు - ననుటయు నుచితము కాదు.

అసలు, ఎక్కుపెట్టుటచేత నెలవంకవలె వంగియుండు వింటితోనే పడతుకల కనుబొమలకు పోలిక. కనుబొమలను మోపెట్టిన చాపముగను, చూపులను తూపులుగను వర్ణించుట పరిపాటి.

ఉదాహరణములు.—

(1) "బొమవిలు చూపుతూపులును బూని మృగాంకుని గెల్చి."

—వసు. 2-71

గిరికయొక్క కనుబొమలు వంపఁబడిన విండ్లవలె నున్నవనియుఁ జూపులు బాణములవలె నున్నవనియు...ఫలితార్థము.—అని వ్యాఖ్య.

(2) "భ్రూచాపవల్లీం సుముఖీ, యావ న్నయతి వక్రతాం
తావ త్కటాక్షవిశిఖై, శ్ఛిద్యతే హృదయం మమ."

(మడవక)

'మడవక' అనునది 'మడఁచు' ధాతువుయొక్క వ్యతిరేక క్త్వార్థక రూపము కాదు, 'మడవు' ధాతువుయొక్క వ్య. క్త్వా. రూపము. (మడవు-అను క్రియకు ప్రయోగములు కనబడవు.)

'మడవక' అనుక్రియకు,-కాదనక, తప్పక, వెనుదీయక ఇత్యాదిగా సందర్భమునుబట్టి అర్థములు.

(1) "ఏమి పంచినను, మడవక చేయుమీ" (భా. ఆది. 2-43)

ఇక్కడ,-మడవక = కాదనక-అని యర్థము.

(2) "మడవక కౌశికా విభుని మస్తక ముద్ధతిఁ ద్రుంచి" (భాగ. 10. ఉ. 524)

ఇక్కడ,-మడవక = వెనుదీయక-అని యర్థము.

(3) "మడవక భీమసేనుఁడును మాగధరాజు గడంగి" (,, ,,-736)

ఇందును, మడవక = వెనుదీయక-అనియే అర్థము.

శ.ర. కర్త,— 'మడవు=విముఖమగు' అని యర్థముచెప్పి,— "మడవక తనుమధ్య నిండు మనమున నుండెను" (భా. ఆది. 2 ఆ.) అను ప్రయోగము నిచ్చియున్నాడు.

ఒక్కొకయెడ, ఈ క్రియ,-గొనకొని, బలువిడి, కడఁకొని-ప్రభృతులవలె.ఊతపదముగా మాత్రమే ప్రయుక్తమగుచుండును.

ఉదా:—"నీకును, మడవక మాయట్టివారిమాటలు కొఱయే" (భా. సభా. 2-190)

ఈ పద్యమున 'మడవక' అను పదమునకు ప్రయోజనము లేదు.—

ఇట్లే నైషధపద్యమునను 'మడవక' ఊతపదముమాత్రమేనని భావించుట యుచితము. కాదేని, మనోభవుఁడు ఆ పడఁతుక భ్రూలతా ధనువును, మడవక = తప్పక, పట్టును (=గ్రహించును) అనియు, తన పురాణచాపమును విడుచునకాని-మానఁడనియు-నర్థము చెప్పికోవలెను.

అంతేగాని, 'మడవక=వంపనక్కఱలేకయే' అని చెప్పుటమాత్రము తగదు.

## ४. నెఱులు

"బలరామ కృష్ణ సంజ్ఞలఁ
తెలుపు నలుపు నైన దివ్య తేజంబులతో
నిలమీఁద నవతరించిన
జలజాక్షుని నెఱులు శర్మసౌరభ మొసఁగుఁగాత." (8-137)

"ఇలమీఁదన్ - అవతరించిన - జలజాక్షుని = నారాయణునియొక్క - నెఱులు = ప్రకారములు (విలాసములు,) శర్మసౌరభమున్ - ఒసఁగుఁగాత.— శ్రీహరికి కృతయుగమందు ధవళవర్ణము, (కలియందు) కృష్ణవర్ణమును నియతములు. శ్వేతగణమందు 'బ్రాహ్మణానాం వర్ణో ధర్మః పీతర శ్చ కృతాచ్యుతః' అనియు, కృష్ణగణమందు 'కృష్ణాని కేశవః సీకి-చీర చంద్రాంక రాహావః' అనియు కా. క. ల."—అని స. వ్యా.

బలరామకృష్ణులు- తెలుపు, నలుపు రంగులతో పుట్టిన, నారాయణుని యొక్క - నెఱులు=ప్రకారములు (విలాసములు)-అనుట సరికాదు. ఎందు వల్లననగా:—'నెఱి'యను మాటకు ప్రకారము, విలాసము అను నర్థములు లేవు. ఉన్ననూ ప్రకారములకు విలాసములకు రంగు లుండవు.

శ్రీహరికి కృతయుగమందు ధవళవర్ణము, కలియందు కృష్ణవర్ణము నియతము లనిరిగదా; మరి, కలియందు - బలరామరూపహరికి ధవళవర్ణ మెట్లు కలిగెను?

ఎందు కెక్కువ చర్చ.— పై పద్యములోని 'నెఱులు' వెంట్రుకలు గాని, ప్రకారములు కావు; విలాసములును కావు.

తెలుపు నలుపు వర్ణములతో—బలరామ కృష్ణ సంజ్ఞలతో ఇలమీద నవతరించినవి - నారాయణుని తెలుపు-నలుపు వెంట్రుకలే. ఇది పురాణ ప్రసిద్ధవిషయము.

(1) "స చాపి కేశౌ బహి రుద్బబర్హ
శుక్ల మేక మపరం చాపి కృష్ణమ్,
తౌ చాపి కేశౌ నివిశేతాం యదూనాం
కులే స్త్రియౌ దేవకీం రోహిణీం చ,

తయో రేకో బలదేవో బభూవ
యో సౌ శ్వేత స్తస్య దేవస్య కేశః,
కృష్ణో ద్వితీయః కేశవ స్సంబభూవ
కేశో యోసౌ వర్ణతః కృష్ణ ఉక్తః''
—భార. ఆది. 197. అధ్యా.

(2) "యదా బ్రహ్మాదయో దేవాః ప్రార్థనార్థం హరిం గతాః
హరిణాచ తదా దత్తౌ కేశౌ ఖలు సితాఽసితౌ
శ్యామవర్ణ స్తతః కృష్ణః శ్వేత స్సంకర్ష ణ స్తథా."
—దేవీభాగ. 4 స్కం. 22 అ.

వ్యాఖ్య.— "సితాఽసితావితి.–తథా చ కృష్ణః పూర్వోక్త రీత్యా నారాయణస్య అసితకేశ స్యావతారః; బలరామస్తు శేషస్య సితకేశ స్యావతారః."

(3) సీ. "నారాయణుండు, చెచ్చెరఁ దన సితాసితకేశయుగమున బలరామకృష్ణరూపములఁ దనరి; యదుకులంబున *లీలమై నుదయమయ్యె."
—భాగవతము. 2-173

పురాణములదాకా పో నక్కరలేదు. శ్రీనాథుని పద్యమునకు మూలమయిన శ్రీహర్షుని శ్లోకమును చూచినను, ఆ 'నెఱులు' కేశములే గాని, ప్రకారములు (విలాసములు) కావని తెలియఁగలదు. చూడుఁడు.

"తావ కాఽపర తనోః సితకేశ, స్త్వం హలీ కిల స ఏవచ శేషః,
సాధ్వసా వవతర స్తవ ధత్తే,త జ్జర చ్చికురనాల విలాసః."
(21-85)

## ౫. బడుగు - చిదిపి

"విశ్వరూప, భవ ద్భూరి విభవ మహిమ
నెంత వర్ణింపఁజాలు మా యీ మనంబు?
ప్రాఁత పైచీర చెఱఁగున బడుగువాఁడు
హేమశైలంబు చిదిపిటా లెన్నిముడుచు." (8-148)

---

* 'లీనమై' అని వావిళ్ల-వారి ప్రతి.

"బడుగువాఁడు = అశక్తుఁడు (దుర్బలుఁడు), హేమశైలంబుఁగా = మేరువును, చిదిపి = చిన్న చిన్న తాలుగా చిదియఁగొట్టి, ఎన్ని తాలు ముడుచుఁ చుఁగా = కొంచెపాటియేని ముడిఁచికొని పోఁజాలఁడు" అని వ్యాఖ్య.

దుర్బలుఁడేమి? మేరుపర్వతమును చిన్నచిన్న తాలుగా చిదియఁ గొట్టుట యేమి? కొండనే చిదుకగొట్టిన ఆ దుర్బలుఁడు, వానిశక్తికి తగినట్లు, కొంచెమయినను ముడిచికొనిపోఁజాలక పోవుటేమి? అసలు, దుర్బలునికి పసిడికొండతో పనియేమి? సర్వాంకషావ్యాఖ్యసంగతము కాదు.

పద్యములోని 'బడుగు' దరిద్రుఁడుగాని, దుర్బలుఁడు కాఁడు. అందలి 'చిదిపి' (=గట్టి) విశేషణముగాని, క్రియ కాదు. అసలు పాఠము 'చిడిపి'గాని, 'చిదిపి' కాదు.

శ. ర. కర్త, 'చిడిపి = పరుషము' అని యర్థము చెప్పి, అందుకీ పద్యమునే యుదాహరించియున్నాఁడు.

[మఱియు నక్కడనే, "కొన్నిజీవులు చిడిపితా ల్గాఁకికి బ్రదుకు" అను, (శృం. నై. 3-140) పద్యమునుకూడ ఇచ్చియున్నాఁడు. స.వ్యా.లో 'చిడిపి'కి అర్థములేదు. 'జీవులు = ప్రాణులు, తాల్ = తాలను'— అని మాత్రమే యున్నది.]

కాఁబట్టి, 'హేమశైలంబుఁగా = మేరువును, చిదిపి = చిదియఁగొట్టి' అని యర్థముచెప్పుట సరి కాదు.

గట్టి పైగుడ్డయైనను లేని దరిద్రుఁడు ఆశకొలఁది బంగారుకొండకు పోయినను, ఆ కొండబంగ రెన్ని మూటగట్టుకొనిరాఁగలఁడు? మోహముఁ గలిగినన్ని కట్టుకొనివచ్చుటకైనను, వాని పైగుడ్డ ప్రాతది-చినుగుపట్టినది. క్రొత్తది (గట్టిది) కాదు. అందువలన ఎక్కువరాళ్లు కట్టిన నది నిలువదు.- అని యర్థము. దరిద్రుఁడు బంగారుకొండకు పోయినను వాఁడు గ్రహింపగల్గునది అల్పాల్పమే; అట్లే, విశ్వరూపా, మా మనస్సు నీ భూరివిభవమహిమను వర్ణింపజాలునదియు అల్పాల్పమే—అని పద్యభావము. (చూడుఁడు 'జిత', పీఠి. పుట 29).

## ౬. చేపట్లు

"పట్టాంశుకములపైఁ బన్నీరు చిలికించి
చేయార్చి చేపట్లు సేయువారు" (6-108)

పట్ట అంశుకములపైన్ = పట్టు వలువలమీఁద,... చే ఆర్చి = చేతితో జాడించి తడియార్చి, చేపట్లు చేయువారున్. (పింజలు పెట్టి మడతలు పెట్టి) పిడికిటం బట్టుటకు తగినట్లుగా సిద్ధపఱుచుచున్నవారును; [ఇది మడికి పట్టు వస్త్రములను సిద్ధపఱుచుట; సీతారామాచార్యులవారు 'చేపట్లు' అనుచో 'చాఁపట్లు' అని పఠించి, చాఁపట్లు అనగా 'అప్పడములవంటి యొకవిధ మయిన పిండివంటలు' అని యర్థముం దెలిపినారు. కాని, ఈ పద్యములోఁ జెప్పిన యితరములన్నియు భోజనార్థమయిన స్థలసంస్కారాదికముగా నున్నవి.—పట్టుతో చేసిన యాసనములమీఁద పన్నీరుచల్లి చేతితో తడవి చాఁపట్లవలె చదునుచేసినా రనియేని చెప్పవచ్చును. కాని, ఆసనప్రస్తావము గీతమం దున్నది-కాన నీ పాఠము తృప్తికరము గాదు.] అని సర్వంకషా వ్యాఖ్యా వివరణము.

(1) "పట్టాసనములపైఁ బన్నీరు ప్రోక్షించి, చెయ్యార్చి చాఁపట్లు చేయువారు" అని శ.ర. పా.

(2) "పట్టాంశుకములపై...చిలికించి...చేయార్చి చేపట్లు...వారు" అని శాస్త్రిగారి పాఠము.

రెండు పాఠములును సవరింపబడవలసినవే. ఏలనగా:—

కవి చెప్పదలచినది ఆసనశుద్ధిని; స్థలశుద్ధిని. కావున పద్యమున నుండవలసినవి 'పట్టాసనములు' గాని, 'పట్టాంశుకములు' కావు. 'చేపట్లు' గాని 'చాఁపట్లు' కావు.

చిలికించు-ప్రోక్షించు అను క్రియలు రెండును సమానార్థకములు కావున, ఏదయిన నుండవచ్చును. కవివాడిన క్రియయేదో మన మూహింప జాలముగదా! కావున, పాఠము,—

'పట్టాసనములపైఁ బన్నీరు చిలికించి, చేయార్చి చేపట్లు చేయువారు' అని యుండవలెను.

పట్టాసనము-అనగా పట్టుపీటలు = చెక్కపీటలు.

(1) "పట్టి; ట్టం. A slab, tablet [for writing-upon] plate in general. శిలాపట్ట మధిశయానా. S. 3" ఆప్టే.)

(2) "పట్టము=పీఁట" (శ.ర.)

చేపట్టుచేయుట-యనగా, గలకుద్ధిచేయుట = చేతితో అలికి ముగ్గు పెట్టుట. భోజనసమయమున పీటలపై నీరు చిలికించి, తుడిచి-శుభ్రపరచి, పీటముందు చేపట్టు కావించి, దానిమీఁద విస్తరివేసి - వడ్డించుట వైదిక సంప్రదాయము.

(1) "కరగ్రహీతములైన పరిమళోదకములు
పలుచఁగాఁ జిలికించి-'పట్టుచేసి'
రమణీయ నవరత్న రజత చామీకర
రచితంబులగు పళ్లెరములు పెట్టి" (నాసికే. 2-218)

(2) "రారయ్య యని శుద్ధమచ్చరణు గోత్రాదేవతాపుత్రు, వి
స్మరాగ్నిప్రభుఁ గూరుచుండనిడి క్రోల్ చేపట్టుగావించి, నీ
రారం బండిన ప్రాఁతరాజనపుదివ్యాన్నంబు నొక్కింత వా
ర్ధారాఘాతముగుండ *యూర్చి యొసఁగెన్ రంభాపలాశంబునన్.
—పాండు. 4-168 (శ.ర. పా.)

(3) "చూపట్టఁగ గోమయమునఁ, జేపట్టొనరించి" (శుక. 2-88)

చేపట్టు కావించుటను శ్రీనాథుడు హరవిలాసములోకూడా వాడి యున్నాడు.

(4) "చెలువ గొజ్జఁగినీటఁ జేపట్టుగావించి,
పాటించి రత్నకంబళము పఱచి" (హర. 2-213)

* 'యూడ్చి' అచ్చుప్రతి.

చేపట్టు కావించుట నే 'పట్టుపెట్టుట' యందురు.

"పట్టుపెట్టుట-To prepare a spot for performing religious rites" (బ్రౌణ్యము.)

భోజనశాలయందు స్త్రీలుకొందరు, పట్టాసనముల పైఁ = పట్టుపుపీటలమీద, పన్నీరు చిలికించి, చేయార్చి = చేయాడించి ( = తుడిచి), ఆ పీటలముందు, చేపట్టుచేయువారు అయిరి - అని నైషధపద్యపాదమునకు సరియైన యర్థము.

పట్టుబట్టలను పన్నీట దడిపి మడతలుపెట్టుటతో గాని, చాపట్లు చేయుటతో గాని, అందు ప్రసక్తి లేదు. పట్టుబట్ట నెవ్వరును తడిపి కట్టుకొనరు.

చేయార్చి - అను మాటకు, చేయాడించి - అని యర్థ మగునే గాని,- చేతితో జాడించి తడియార్చి - అని కాదు. కావున ఆ టీక చెల్లదు.

## ౭. ఝూంకారితము

"కలహంసంబు...ఝూంకారిత పతత్ర ధారా విహారంబుగ గోడివడి డిగ్గునప్పుడు" (2-35)

ఝూం...బుగాఁ = 'ఝూమ్' అను శబ్దము చేయింపఁబడిన ఱెక్కల యంచులయొక్క లీల కలుగునట్లుగా (ఱెక్కల కొనలచే లీలగా 'ఝామ్' అని శబ్దము చేయించుచు)' అని స.వ్యా.

'శబ్దము చేయింపఁబడిన ఱెక్కలు'— అను వాక్యము (కొబ్బరిముక్కలు పాతిపెట్టింపఁబడిన తాతగారు—అన్నట్లు) తప్పు.

'ఝూం = ఝూమ్ అను శబ్దము, కారిత = చేయింపఁబడిన, పతత్ర = ఱెక్కలయొక్క' అని యర్థము చెప్పుట సరి కాదు.

'త దస్య సంజాతం తారకాదిభ్య ఇతచ్' అను సూత్రముప్రకారము 'ఝూంకార' శబ్దముమీఁద 'ఇత'(చ్) చేరి, యేర్పడినరూపము 'ఝూంకారితము.' తారకిత కోరకితముల వంటిది.

"వ. వసంత సమయ సౌభాగ్య సంప దంకురిత పల్లవిత కోరకిత కుసుమిత ఫలిత లలిత విటప విటపి వీరు న్నివహాలంకృతము" (భాగ.8-24)

పల్లవిత = చిగిర్చిన, కోరకిత = మొగ్గతొడిగిన—ఇత్యాదిగా అర్థము.

అట్లే, ఝాంకారిత = ఝాంకారముగల (ఝాంకరించుచున్న) పత్త్ర = 'రెక్కలు' అని సరియైనయర్థము.

మూలశ్లోకవ్యాఖ్యానము చూచినవారికీ యర్థ మొకరుచెప్ప నక్కఱలేదు.

"*స్యదఝాంకారిత పత్త్ర పద్ధతిః —(2-70) స్యదేన పత్త్ర వేగేన ఝాంకారి ఝామ్ ఇత్యాకారకశబ్దం కుర్వతీ పత్త్రపద్ధతిః ఝాంకారితేతి తారకాదిత్వా దితచ్. (నా. వ్యాఖ్య.)

## ౮. జ్యోత్స్న

తే॥ జ్యోత్స్న నాఁగఁ దమిస్ర నా నుభయభార్య
లుడుపతికి; నందు నొకతె తెల్లొకర్తు నలుపు;
తాను వారికి మెచ్చుగాఁ దాల్పెఁబోలుఁ
దెలుపు నలుపును నగు మేను నెలఁత, యితఁడు. (8-184)

"ఓ నెలఁత, ఉడుపతికిన్ = చంద్రునికి, జ్యోత్స్న = వెన్నెల ('చన్ద్రికా కౌముదీ జ్యోత్స్నా' అమ.) నాఁగన్ = అనియు, తమిస్ర = చీఁకటి రాత్రి ('తమిస్రా తామసీ రాత్రిః' అమ.) నాన్ = అనియు... ఉత్ప్రేక్ష." అని సర్వంకషావ్యాఖ్య.

చంద్రునికి ఒకభార్య 'వెన్నెల' అనియు రెండవభార్య 'చీకటిరాత్రి' యనియు వ్యాఖ్యాతలుచేసిన అర్థము. ఒకభార్య 'వెన్నెల' అయినప్పుడు రెండవది 'చీకటి' కావలెగాని చీకటిరాత్రి యెట్లగును? చీకటిరాత్రికి సవతి కాదగినది వెన్నెలరాత్రిగాని, వట్టి వెన్నెల యెట్లవును? మహాకవియైన శ్రీహర్షుడు చీకటిరాత్రికీ, వెన్నెలకూ లంకె వేసి, విజ్జోడు

---

* 'స్యదఝాంకారి పతత్త్రిపద్ధతిః' అని తెనుగులిపి—'వావిళ్ల' వారి ప్రతి. 'స్యదేన వేగేన ఝాంకారిణీ ఝా మితి శబ్దం కుర్వాణా పతత్త్రి పద్ధతిః పక్షిసరణిః'—అని మల్లినాథ వ్యాఖ్య.

సాపత్న్యమును కూర్చియుండునా? అని నా సందేహము. అయినను చూతమని మూలమును తీసి చూతునుగదా అందులో ఇట్లున్నది:

"గౌరే ప్రియే భాతి తమాం తమిస్రా
జ్యోత్స్నాచ నీలే దయితా య దస్మిన్,
శోభా ప్తిలోభా దుభయో స్తయోర్వా
సితాసితాం మూర్తి మయం బిభర్తి" (22-97.)

చంద్రుని కొకభార్య 'తమిస్ర' యనియు, రెండవది 'జ్యోత్స్న' అనియు మూలమున సరిగానే యున్నది. 'జ్యోత్స్న' యనగా వెన్నెల రాత్రి. 'జ్యోత్స్న చంద్రికయాన్వితా-రాత్రిః' అని అమరము.

మరి తెనుగువ్యాఖ్యాతలు తప్పర్థము వ్రాయుటకు కారణమేమనగా.- శ్రీనాథుఁడు, జ్యోత్స్న(=వెన్నెలరాత్రి) యన్న యర్థమున, 'జ్యోత్స్న' అను పదమును వాడినాఁడు. జ్యోత్స్న-యను పదమునకును, వెన్నెల రాత్రి-యను నర్థమున్నది.

'జ్యోత్స్న చంద్రిక యాన్వితా' అన్న పంక్తిక్రిందనే, అమర కోశమున,—'జ్యోత్స్నే త్యాకారాంత పాఠో ప్యస్తి' అని తెలుపబడి యున్నది.—"జ్యోత్స్న-కు 'వెన్నెలరాత్రి' యన్న యర్థము శ.ర.లోను ఉన్నది.

శాస్త్రిగారు, పద్యభావమును, జ్యోత్స్న శబ్దార్థమునుగూడ సరిగా గమనింపలేదు. అందువలన వారుచెప్పిన యర్థము తప్పయినది.

## ౯. ఉరి

"ఇందుముఖుల, కురులు మరుఁడను వేటకాఁ డురులుసేసి" (3-90) 'ఉరులు = వలలుగా' అని శాస్త్రిగారి టీక.

'ఉరి' యనగా 'ఉచ్చు' (Noose) గాని, 'వల' (Net) కాదు.

"ఉచ్చునా నురి యన నొప్పుచుండుఁ, బక్షిబంధనసంజ్ఞ" (ఆం.భా. 2-293) లోకములో 'ఉరిశిక్ష' కలదుగాని 'వలశిక్ష' లేదు. కాబట్టి, 'ఉరులు = వలలు' అనుట పొరపాటు.

## ౧౦. కోపాగ్ని

"హరుని కోపాగ్నిఁ బొగచూఁడి మరుని చాయ
మసితకేసరపరివేష మైనవాఁడు." (3-161)

"హరుని (శివుని), కోప అగ్నిన్ = కోపముతోడి నిప్పుచే" అని స.వ్యా.

'కోపాగ్ని' యనఁగా కోప మనెడి యగ్ని (రూపకము) గాని, కోపముతోడి యగ్ని (అని తృ. తత్పురుషము) కాదు.

కోపాగ్ని = కోపముతోడి యగ్ని; వియోగానలము = వియోగముతోడి యనలము; ముఖకమలము = ముఖముతోడి కమలము—అని యర్థము చెప్పుట యొప్పదు.

## ౧౧. మరుకీర్తి

"కిన్నరకంఠి యోర్తు మరుకీర్తియుఁబోని పటీరపంకమున్
విన్నను వొప్పఁగా నలఁదె." (6-50)

కిన్నరకంఠి = కిన్నరుల కంఠమువంటి కంఠముకలది.—మరు... మున్ = (నలునియవయవములకు) "మదనసుందరుఁడను కీర్తి యనఁదగినట్టి గంధపుఁబూఁతను, ... అలఁదెన్ = పూసెను" అని స.వ్యా.

మరుకీర్తి = మరునియొక్క కీర్తి. ష.త.సమాసము.— కాబట్టి, మరుకీర్తి యనగా-'మదనసుందరుడనుకీర్తి' యనుటయు,-నలుని యంగములకు పూసిన గంధము—'ఈ నలుఁడు మదనసుందరుఁడు-అను-కీర్తి-అనఁదగినది' యనుటయు సరికాదు.

మన్మథుని కీర్తినిపోలిన, (పటీరపంకమును=)గంధమును, అలఁదెన్-అని యర్థము చెప్పవలెను. గంధము తెలుపు గావున కీర్తితో పోలిక. మన్మథోద్దీపకము గావున మరుకీర్తితో పోలిక.

పటీరపంకమున్ = గంధపుఁబూఁతను- అనుట తప్పు. 'పటీరపంక' మనగా గంధమే గాని 'పూఁత' కాదు.

# శబ్దవిచారణ

## ౧. ఎడఁబాపు

(1) 'భవద్వియోగకలుషతన్ = నీతోడి యెడఁబాపుచేతఁ గలిగిన చిత్తకాలుష్యము కారణంబుగా' (పు. 309)

(2) 'కొంగుముడి యనఁగా వధూవస్త్రాంతముతో వరవస్త్రాంతమును ముడివేయుట-ఎడఁబాపు కలుగకుండుటకై యీ కర్మాంగము' (పు. 522)

(3) 'తిమిర విరహ పాండూయమాన దిఙ్మండలంబును = చీఁకటితోడి యెడఁబాపుచేత తెల్లనగుచున్న దిక్కులసమూహము కలదియు.'. (పు. 651)

(4) 'తత్ వియోగమునన్ = అంత యనురక్తలయిన యా భార్యలతోడి యెడఁబాపుచేత' (పుట. 657)

ఇట్లు వారు 'ఎడఁబాపు'ను విశేష్యముగా పలుమారు వాడియున్నారు. విశేష్యము - 'ఎడఁబాటు' గాని, 'ఎడఁబాపు' కాదు. 'ఎడఁబాపు' ప్రేరణక్రియ. ఎడఁబాయఁజేయు-అని యర్థము.

(1) "ఎడబాపుట To cut off or dis-continue" (బ్రౌను.)

(2) "ఎడఁబాపు = ఎడఁబాయఁజేయు.—ఎడఁబాటు = వియోగము" (శ. ర.)

(3) "ఎడఁబాపు = తొలఁగించు, తీర్చు" (సూ. ని.)

'ఎడఁబాటు' అను విశేష్యరూప మున్నట్లు శాస్త్రిగారు గమనించినట్లే లేదు. వారు తమవ్రాతలలో సర్వత్ర 'ఎడఁబాపు'నే వాడియున్నారు. చూడండి!

(1) "దార వియోగజ వహ్నిన్. దార = భార్యతోడి, వియోగ = ఎడఁబాపువలన, జ=పుట్టిన, వహ్నిన్ = చిచ్చును" (ఆము. పు. 394)

(2) "నాతోడి యెడఁబాపు కలిగిన దినమంచె" (మే.సం.పు. 192)

(3) "కూటమియే ఎడఁబాపు గలుగునని సూచించును." (హితోప. పు. 112)

శాస్త్రిగారు, 'మాయు'నకు 'మాపు'వలె,— 'ఎడఁబాయు'నకు, 'ఎడఁబాపు'-కృద్రూపమనుకొనిరేమో! బా. వ్యా. (క్రి. ౭౩)లో- పాయు- అను క్రియకు, పాచు; పాపు - అనునవి ప్రేరణరూపములని చెప్పబడి యున్నది.

## ౨. తోఁటమాలియ

పు. 56 లో,-'దోహదము తోఁటమాలియలు చేసినందున'--'తోఁట మాలెలు దాడిమవృక్షమునకు...పూఁగను పట్టించును' అన్నారు.

చెట్లకు దోహదముచేయువాడును, పూఁగను పట్టించువాడును 'తోఁట మాలి' గాని, 'తోఁట-మాలియ' కాదు; 'తోఁట-మాలె'యును కాదు.

"తోఁటమాలి రాముఁ డెంత పాటుపడునో చూడరా"

అని రెండవతరగతి వాచకపుస్తకమున నొకపాట. తోఁటమాలియ, తోఁట మాలె-అను రెండుపదములకును-ఆకులు పువ్వులు కూర్చి కట్టిన దండ, వన మాల-అనియర్థము. ఆ రెండుపదములకును, తోమాలియ-తోమాలె అనునవి రూపాంతరములు. (చూ. శ.ర.)

మాలి, మాలియ (=మాలె) అను పదములకుగల రూపసాదృశ్యము వలన సరిగా గుర్తింపలేక శాస్త్రిగారు పొరపడ్డారు.

వారిట్లు పొరపడిన తావు లింకను గలవు. ఒక కొన్ని ఉదాహరిస్తాను.

### (1) దెప్పరము

(1) శృం.నై. పు. 234 లో,-"నీవు శ్రుతితో సమానురాలవా? అని దెప్పరము"—అన్నారు.

(2) 'ఆముక్త'లో,—"ముఁగా, రాట్కంఠీరవమై యొనర్చె వడి సోణాలంట ఘోణాచ్ఛిదన్" (5-50) అన్నచోట,—

"రాట్కంఠీరవము-ఇది దెప్పరము. ఆతని గొప్పతనమునకు ఆ పని యనుచితమని భావము" అన్నారు.

(3) అమరుకము, పు. 108 లో,— "నీవు నీయందలి యితర సంభోగచిహ్నములను ఎట్లపలపించినను నీ మోవికొటులు...బయలుపెట్టుచున్నవి సుమా-అని దెప్పరము" అన్నారు.

'నీవు శ్రుతితో సమానురాలవా?' అనుటయు,—అనుచిత కార్యము చేసినవానిని 'రాట్కాంతీరవ' మనుటయు,—'నీ మోవికొటులు బయలుపెట్టుచున్నవి సుమా' అనుటయును 'దెప్పుట' యగును గాని 'దెప్పరము' కాదు.

దెప్పుట యనగా—ఎత్తిపొడుచుట.

దెప్పరము—అనగా ఆపద, కష్టము, కీడు, దుస్సహవాక్యము ఇత్యాదిగా అర్థములు.

(1) "దెప్పరమై మీఁదఁ గీడు దెచ్చుర సుమతీ" (సు. శ.)

(2) "ఉప్పరవీదికిఁ దెప్పరంబుగా నెగసి" (భాస్క. యు. 1946)

(3) "ఇమ్ము దెప్పరంబై (ఆము. 4-35)='తమ తొంటి నివాసస్థానము-ఆపత్ప్రాప్తమై"-అని వేదం-వారిదే టీక.

దెప్పుట; దెప్పరము-అను పదములకు బ్రౌను ఇట్లు అర్థము చెప్పియున్నాడు.

"దెప్పుట To taunt, quiz, gibe at, slander, దెప్పుడు మాటలు, Sarcasm." - "దెప్పరము-కీడు; కష్టము Difficulty, distress."

కాబట్టి దెప్పుటను - 'దెప్పర' మనుట తప్పు.

## (2) మనికితము

హితోపదేశచంపువు (పు. 53)లో,—

"ఈ రహస్య మెఱిఁగి యెడలకే యుండును
మతిగలాఁడు తనదు మనికితంబు"—అన్నారు.

'ఇతి విజ్ఞాయ మతిమాన్ స్వస్థానం న పరిత్యజేత్' అని ఆ పద్యమునకు మూలము.

స్వస్థానమున 'తనరు-మనికితో' మనుట తప్పు. స్థానము-'మనికి' గాని, 'మనికితము' కాదు. 'మనికిత' మనగా సుఖము. (చూ. వివరములకు 'జిత కాశి' పీఠిక. పు. 40)

ఒక్క ప్రయోగము.—

"కనుసన్నల పరిజనములు
దనకుం బ్రియమైన సంవిధానము నడపన్
జెనుపొందిన దీపిన్నది
మనికితపడనీకుఁ దమ్ము మనసున దీనన్" (నాసి. 1-226)

## (3) పురణించు

శాస్త్రిగారు,-ప్రువడించు ( = పోలు) అను క్రియకు బదులుగా— పురణించు (వర్ధిల్లు) అను క్రియను అనేకపర్యాయములు వాడియున్నారు. తప్పు. (చూ. జి. పీ. పు. 43)

## (4) కరుళ్లు

(1) శృం. నై. (౭-౭౭)లో—"కరుళ్లచప్పుళ్లు. కరుళ్ల=కరడముల యొక్క-చప్పుళ్లు" అని స. వ్యా.

(2) ఆము క్త. (1-19)లో,—"గర్భవీచిమతల్లి.-వీచిమతల్లి = శ్రేష్ఠమైన కరుడు" అని సంజీవనివ్యాఖ్య.

(3) 'విజ' (2-19)లో,—"తెరయెత్తన్=(ప్రేమ అను సముద్రము) పొంగి *కరుళ్లెత్తఁగా" అని శాస్త్రిగారి టీక.

అల-యను నర్థమునిచ్చు పదము 'కరడు' గాని 'కరుడు' కాదు. కరుడు అనగా, గట్టిపడినముద్ద.—

---

* బులుసువారును,-"తెరయెత్తన్=పొంగి కరుళ్లెత్తఁగా" అనియే అన్నారు.

ఇట్లు వేదంవారి టీకనుండి బులుసువారి టీకలో ప్రవేశించిన ప్రమాదము లనేక మున్నవి. వాని నన్నిటిని చూపబూనినచో, అది యొక పెద్ద గ్రంథమగును. కావున సూచించి వదలుచున్నాను.

"కలసి శుక్లశోణితములు కరుడుగట్టి" (భా. స్త్రీ. 1-36)

కాబట్టి, తరంగ పర్యాయముగ 'కరుడు; కరుళ్లు' అనుట తప్పు. ("కర డనఁ... పెరయనంగను వీచి పరఁగును" (ఆం. భా. 1-154)

(5) 'దొమ్మరిది'

శ్బం. నై. (పుట 425)లో 'లాసిక = దొమ్మరిది'.—'దొమ్మరిది ముందుగా నేలలో విద్దెలుచూపి'; — 'కీర్తి యనెడి దొమ్మరిది' అని, దొమ్మరదానిని 'దొమ్మరిది' అని ముష్మా రన్నారు.

అట్లనరాదు. 'దొమ్మరది' అనవలెను.

'దొమ్మర'-జాతి. ఆ జాతి పురుషుఁడు దొమ్మరవాఁడు; దొమ్మరి; దొమ్మరీఁడు.—

"వెలయు దొమ్మరి యన లఘువిద్యవాఁడు" (ఆం. భా. 2-287)

శ. ర. లో,—"దొమ్మర = గడకట్టియాడి జీవనముచేసెడి యొకానొక జాతి. (దొమ్మరవాఁడు. దొమ్మరది.)—దొమ్మరి (దొమ్మర + ఇ)= దొమ్మరవాఁడు"—అని చెప్పబడియున్నది.

ఇట్లే, * కాఁపది (కాఁపు + అది) = కాఁపుజాతిస్త్రీ.—

"చొక్కటపు టొయారమారఁ గని కాఁపది మోహమునిల్పలేక"

హంస. 7. 148

---

* సూ. ని. కాఁపుది; కాఁపది—అను రెండుపదములకును, శూద్రజాతిస్త్రీ— అని యర్థముచెప్పి,—

"కాఁపది యనఁదగునా యది
కాపదియార్వన్నెనలరు కనకముఁ బుటముల్
కాఁప దిగిన డాల్పుత్తిమ" (ఉ. హరిశ్చ. ౪-౩౩)

అను పద్యమునిచ్చి, 'ఆ కాఁపుది చాల యోగ్యురాలు (వ్యవ)'—అన్నది.

పద్యమునసున్నది 'కాఁపది'గాని, 'కాఁపుది'కాదు. 'కాఁపుది' అను పదమున కా పద్యము ప్రమాణ మెట్లగును? విస్తరమెందుకు: కాఁపుది-

ఆ జాతి స్త్రీ-యన్న యర్థమున కమ్మరది; కుమ్మరది; ఉప్పరది; చాకలది; మంగలది;—అనవలెను. ఈ శబ్దములను గమనింపనివారు,— కమ్మరిది; కుమ్మరిది; ఉప్పరిది; చాకలిది; మంగలిది అందురు.

(6) 'ఉప్పరలు'

ఆ శాస్త్రులవారే తమ గ్రామ్య భాషాప్రయోగనిబంధనము (పు.13)లో 'చెంచులు, గొల్లలు,...ఉప్పరలు' అన్నారు.

ఉప్పరలు-అనుట సరికాదు. 'ఉప్పర' జాతివాచకము. ఆ జాతి వాఁడు 'ఉప్పరి',

(1) "పరఁగుఁ గుద్దాలికారి యుప్పరి యనంగ" (ఆం. భా. 2-285)
(2) "ఉప్పర = త్రవ్వియు గోడలుపెట్టియు బ్రదికెడు జాతి.—
ఉప్పరి = ఉప్పరవాఁడు, ఖనకుఁడు." (శ.ర.)

(3) "ఉప్పర The name of the mining caste: who are tank diggers and makers of wells. ఉప్పరవాఁడు, A man of this caste. ఉప్పరది, Female of the same. ఉప్పరవాండ్లు or ఉప్పరీలు." (బ్రౌను)

కాఁబట్టి 'ఉప్పరులు' అనవలెను.

సంస్కృతశబ్దములను గుర్తించుటలోను-ఆంధ్రమల్లినాథులు ప్రమాద పడ్డ పట్లున్నవి.—

(1) 'కూర్చి'

శృం.నై. (పు. 372)లో,— 'పవిత్రములు కూర్చి లోనగు దర్భ మయములం జేయునపుడు'-అన్నారు.

---

యనగా, కాఁపువానిది-యని యర్థముగాని-కాఁపుజాతిస్త్రీ-యని యర్థము కాదు.

ఆ చేను కాఁపుది. ఆ పిల్ల కాఁపది. అనుట గ్రాంథికమయిన భాష. 'ఆ కాఁపుది చాల యోగ్యురాలు' అని, సూ.ని. యుదాహరించిన 'వ్యవ' వ్యావహారికమేగాని గ్రాంథికము కాదు. ఆ వ్యవహారమును ప్రమాణముగా గ్రహించుట గ్రాంథికనిఘంటువయిన సూ.ని. కి చెల్లదు.

దర్భమయ మయినది 'కూర్చము'; 'కూర్చ' అగునేగాని 'కూర్చి' కాదు.

(1) "కూర్చము. (అ. పుం. న.) దర్భపిడికిలి" (శ.ర.)
(2) "కూర్చము=భ్రూమధ్యే, శ్మశ్రుణి, గడ్డము మీసాల వెంట్రుకలు, జెండాకుచ్చు, కుశే, కైతవే, పీఠే." (బ్రౌణ్యము)
(3) "కూర్చః; కూర్చమ్ A handful of kusa grass." (ఆప్టే)
(4) "కూర్చము (అ.పుం.న.) కుశముష్టి, పిడికెఁడు దర్భలు" (సూ.ని.)

## (2) 'కరకా'

'ఝరి నచ్ఛాంబువు క్రింద జీర్ణకరకాంశవ్రాతముల్ గాననౌ.'
(నాగా. పు. 9)

'జీర్ణకరకా అంశవ్రాతములు = పగిలిన కమండలువులయొక్క ముక్కల సమూహములు' అని వారిదే టీక.

కమండలువు అనే యర్థమున కరకశబ్దము పున్నపుంసకములలోనే కాని స్త్రీలింగమున లేదు.

(1) 'కమండలౌచ కరకః' (అమరము)
(2) 'కరకః పక్షిభేదే స్యాత్ కమండలుకరంకయోః
కరకదాడిమయోః పుంసిస్త్రియా మపి ఘనోపలే.'
(విశ్వప్రకాశము.)
(3) 'కరకః కరకం వా పానీయభాజనమ్' (హర్షవర్ధనుని లింగానుశాసనము.)
(4) 'కరకః కరకం. The water pot (of an ascetic). The shell of the cocoanut (used) as a pot.' (ఆప్టే.)
(5) 'ఉపానహౌ చ, వాసశ్చ, ధృతమన్యైర్న ధారయేత్,
ఉపవీత మలంకారం స్రజం కరకమేవ చ.' (మనుస్మృతి.)

కరకం = కమండలువును, అని యర్థము.

## ౩. 'నాలిగింటిని'

'నాలుగింటిని' అను పదమును, ఆ శాస్త్రిగారు తమ గ్రంథములలో పలుమారు—'నాలిగింటిని' అని వ్రాసియున్నారు. చూడండి.—

(a) ఆంధ్రప్రసన్నరాఘవ విమర్శలో,—

(1) 'నాలిగింటిని నాలుగు స్వతంత్రవాక్యములుగా' (పు. 120)

(2) 'వీనిని నాలిగింటిని' (పు. 151)

(3) 'ఈ నాలిగింటిలో' ( ,, )

(4) 'కడమ నాలిగింటి వలెనే' ( ,, )

(b) భోజచరిత్రలో,—

(5) 'చతుష్టయమ్ = నాలిగింటిని' (పుట. 119)

(c) మేఘసందేశములో,—

(6) 'నాలిగింటిలో కడపటి మూడును' (పీఠిక, పుట. 20)

అసలు శబ్దము 'నాలుగు'గాని 'నాలిగు' కాదుగదా! "టి-తి-వర్ణంబులు పరంబు లగునపుడు, వానికిముందున్న ఉత్వమున కిత్వ మగు" నన్న (బా.వ్యా. అచ్చిక. 86) సూత్రముప్రకారము 'నాలుగు' లోని 'గు' - 'గి' యగును. అంతేగాని, 'లు' - 'లి' కాదు. అందువల్ల, నాలుగిటిని; నాలుగింటిని—అను రూపములేగాని, 'నాలిగిటిని' - 'నాలిగింటిని' అను రూపములు పుట్టవు.

ప్రాచీన కావ్యములలోను, నిఘంటువులలోనుగూడా 'నాలుగిటిని' అను రూపమే కనబడుచున్నది.

(1) "అధిప యాషాఢముఖ్యంబులైన నెలలు
నాలుగింటను మాంసంబు నమల కుడుగు
టాయురారోగ్యబలకీర్తు లను ఫలములు
నాలుగింటిని నిచ్చు నన్నరున కండ్రు" (భార. అను. 4-301)

(2) "ఘోటకమ్ముల నాలుగిట నోసేసి" (భీష్మ. 3-19)
(3) "తురగముల నాలుగిట న్నుత్తరు నాటెట" (విరా. 5-103)
(4) "నాలుగింటను వెండియు నాలుగింట" (శాంతి. 4-222)
(5) "నఱకె శితశరముల నాలుగింట" (కర్ణ. 2-356)
(6) "ఓలి విశ్రాంతి పద్నాలుగింట" ('గిడుగు'-అప్ప. 4-304)
(7) "నాలుగింటికి మిత్రేంద్ర నైరుతాంబులు" (అప్ప. 2-285)
(8) "ఎనిమిదింటను పదునాలుగింట యతులు" (సుల.సా.పు. 42)
(9) "వదనములు నాలుగింటికి వరుసఁగలియ" (కశాపూ. 5-341)
(10) "కొనకొనంగోడి యేట్రింత కొంకనక్క-
నమలి యీ నాలుగిటి దర్శనంబు లెస్స."
(వే.ప్ర.క్రీడా. పుట 17)
(11) "ఈ నాలుగింట నొక్కఁడైన" ('గిడుగు'-నీతిచంద్రిక.పు. 61)
(12) "బుద్ధి = అంతఃకరణవృత్తులు నాలుగింటిలో నొకటి.-
(13) ఆన్వీక్షికి = రాజవిద్యలు నాలుగింటిలో నొకటి." (శ.ర.)

ఇంతయేల? బా.వ్యా.లోనే,— 'నాలుగు + టి = నాలుగిటి' యని చెప్పబడియున్నది. కాబట్టి 'నాలిగిటిని' అను రూపము లక్ష్యలక్షణ విరుద్ధము. కాని 'నాల్గిటిని'— 'నాల్గింటిని' అనవచ్చును.

అది యెట్లనగా:— బా.వ్యా. ప్రకీ. ౧౭ వ సూత్రము ప్రకారము నాలుగు-'నాల్గు' అగును. నాల్గు + టి = నాల్గి టి యగును. 'ల్గు'లోని లకార గకారములు వేరగుచో 'నాలుగు' అగునేగాని 'నాలిగు' కాదు. కనుక 'నాలిగిటి' అను రూపము పుట్టదు.

## ౪. 'ఉరిఁబోసికొనుట'

"అనలోద్బంధన వారిమజ్జన విధా వ్యాపార పారీణతఁ" (పు. 327)

"అనల-ఉద్బంధన = అగ్ని (ప్రవేశము), ఉరిఁబోసికొనుట" అని సం.వ్యా.

'ఉరిహోయు' (ఉరివోయు) అనునది శబ్దపల్లవక్రియ. కావున 'ఉరింబోసికొనుట' అనుట తప్పు. (చూ. 'నవీనోక్తి' ప్ర. 59)

"ఉభయపార్శ్వంబుల నురిదోసిన బ్లిఖి" (భా. శాంతి. 4-46).

ఒకొక్కకపూరు వారు ప్రయోగించుక్రియలు భాషా సంప్రదాయ విరుద్ధములుగనే గాక హాస్యభాజనములుగా గూడా ఉండెను. మచ్చు కొకటి.—

'ఓండ్రరచించు'

హితో. చంపువు (పు: 95) లో 'గాడిద ఓండ్రను రచించిన' దన్నారు.

గాడిద ఓండ్ర పెట్టుటయు, ఒక రచన యగునా? రచన యనగా నేమి? ప్రతిభతో ప్రయత్నపూర్వకముగా నేర్పుమెయి కావించు పని. (కావ్యరచన; చిత్రరచన; మాలారచన; - మొదలయినవి.) అంతేగాని, ఓండ్రపెట్టుట; మొఱుఁగుట; మ్యావ్-అనుట, రచనలు కావు.

'గాడిద ఓండ్రను రచించెను'
'కుక్క భౌభౌను రచించెను'
'పిల్లి మ్యావును రచించెను'
'ఆవు అంబాను రచించెను'

అన్న కవులు పూర్వులలోగాని ఇప్పటివారిలోగాని కలరా? 'రచన'కు నిఘంటువులు చెప్పినయర్థము లిట్లున్నవి.

(1) "రచన=మాల్యాదినిర్మాణము; రచనము=నిర్మాణము. (శ.ర.)

(2) "రచన-Making, composing, arranging, preparing, decoration, dressing of the hair. Stringing flowers, weaving wreaths: the arrangement of troops. Literary composition. చేయడము, పుష్పమకరికా పత్త్రాదిరచన, దండలుకట్టడము మొదలైనది. గద్యపద్యాదిరచన, కవిత్వముచెప్పడము.—'ధారుణినట్టి విచిత్రసభారచనలు వినగ జూడబడ దెవ్వరికిఁ' భారతము." (బ్రౌను.)

# అలంకార విచారణ

## ౧. విరోధాభాసము

"అనుచున్ సారఘు సార సారణికి నెయ్యంపుం జెలిం బోని తి
య్యని వాక్యంబున బోఁటి భీమసుత మాటై యేర్పడం బల్కఁగన్
మన మాహ్లాదముఁ బొందుచుండఁగను భూనాథుండు గంభీరతన్
వినఁ డయ్యెన్ సురరాజకార్యఘటనా విఘ్నంబు వాటిల్లుటన్."
—(4-102)

"అనుచున్-బోఁటి, దమయంతీ ప్రతినిధిగా, తేనెయొక్క-శ్రేష్ఠాంశముయొక్క - చిఱుతయేటికి - ప్రియసఖివంటిదైన—తియ్యని వాక్యంబునన్,... పల్కఁగన్ = చెప్పఁగా,... పాటిల్లుటన్ = సంభవించుటచేత.— [ఆహ్లాదకరమైనను వినమి విరోధము, సురకార్యవిఘ్నముచే సమాధానము, విరోధాభాసము.] అని సర్వంకషావ్యాఖ్య.

దమయంతి వాక్యము ఆహ్లాదకరమైనను విన్నచో సురకార్యము విఘ్నమగునన్న భావమున (నలుడు) వినలేదు.-అన్నప్పుడు, ఆ వినమికి, సురకార్యము విఘ్నమగునన్న భావము కారణముగాని 'సమాధానము' కాదు. వినమి 'విరోధము'ను కాదు. ఈ వాక్యమున విరోధాభాసాలంకారమున్నదనుట పొరపాటు.

ఆశాస్త్రిగారు, విరోధాభాసాలంకారమును వివరించుటలో, సారంగధర - టీకలోను ప్రమాదపడియున్నారు. (చూ. 'జితకాశి' పు. ౧౪౪)

## ౨. యథాసంఖ్యము

"ఉపలములకంటెఁ గఠినమ్ము లొక్కవేళఁ
గుసుమములకంటె నొకవేళఁ గోమలములు
గాన లజ్జాభయంబులు గలవో? లేవో?
పువ్వుఁబోఁడుల హృదయంబు లెవ్వఁ డెఱుఁగు" (7-162)

"కలవో లేవో-దీనికి పూర్వపాదములతో యథాసంఖ్యాలంకారము" అని, సు.వ్యా.

"దీనికి పూర్వపాదములతో యథాసంఖ్యాలంకారము" అనఁగా అర్థ మేమో నాకు తెలియలేదు. ఈ పద్యములో యథాసంఖ్యము లేనే లేదు. ఉన్నట్లు ఆంధ్రమల్లినాథులు భావించినారు.

### 3. విశేషోక్తి

"ఆమోదాశ్రుభరంబు వెల్లిగొన నెట్లాలించుఁ గర్ణంబులన్...... పన్నగస్వామి, యుద్దామప్రౌఢిని వీనికీర్తి ఫణభృత్కాంతామణుల్ పాడఁగన్." (5-137)

"నాగకాంతలు కాళింగునికీర్తిని పాడినప్పుడు పన్నగస్వామి గానరసజ్ఞుఁ డయ్యెను, కనులందు ఆనందపూరము వెల్లువ పొడువఁగా - చెవులతో - నెట్లాలించును? అనఁగా వినలే డనుట.—ఇట రసగ్రహణరూప ప్రవృత్తికారణ మున్నను శ్రవణ...రూప కార్యము జనింపనందున విశేషోక్తి" అని వ్యాఖ్య.

కర్ణంబులన్ ఆమోదాశ్రుభరంబు వెల్లిగొన - నెట్లాలించున్ - అను శ్రీనాథుని రచనకు,—ఆలింపఁజాలఁడు; కావున, ఆమోదాశ్రువులను వహింపఁడు.—అని యర్థము.

అంతేగాని 'విననే వినఁడు' అని యర్థము కాదు. ఈ పద్యమున విశేషోక్తి-యును నలంకార మున్నదనుటయును పొరపాటే. (వివరములకు చూ. 'జిఠ.' పీ. పు. 37)

# ఆముక్తమాల్యద ; వ్యాఖ్యానములు

*ఆముక్తమాల్యద ప్రతిభావంతులగు పండితులకు సైతము సులువుగా కొరుకుపడని గడుసుకావ్యము. ఆ

* ఈ వ్యాసములోని కొన్ని యంశములు 1942 లో శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారి జన్మదినోత్సవసన్మానసంపుటములో ప్రకటితమైనవి.

కావ్యమునకుగల వ్యాఖ్యానములు రెండు. వావిళ్ల రామ స్వామిశాస్త్రిగారి 'రుచి' మొదటిది; వేదము వేంకట్రాయ శాస్త్రిగారి 'సంజీవని' రెండవది:—'రుచి'కంటెను 'సంజీవని' ఆకారముచేత చాల పెద్దది. వావిళ్లవారి మూలమూ వ్యాఖ్యానముకూడా దోషభూయిష్ఠములుగా నున్నందున వేదమువారు 'సంజీవని'ని వెలయించినారఁట. ఆ విషయమును వారీ క్రిందివిధముగా వక్కాణించినారు:—

'గ్రంథమున కెల్ల జీర్ణోద్ధారమే కావలసివచ్చినది. అందులకై సమగ్రసంస్కరణ సాధుపాఠనిర్ధారణ కువ్యాఖ్యా విషహరణ సమంజసార్థావిష్కరణపూర్వక విపుల వ్యాఖ్యానము వ్రాయ నుద్యమించితిని.' (ఉపోద్ఘాతము.)

వేదంవారు వావిళ్లవారి వ్యాఖ్యను 'కువ్యాఖ్య' అనుటయే కాక, ఆ 'కువ్యాఖ్య' యైనను వారి సొంతము కాదనియు, ఎవరో తయారుచేసి ప్రకటన కియ్యగా, దానిని తమపేర ప్రకటించుకొన్నారనియు, రామస్వామిశాస్త్రిగారి మీఁద ఒక సొడ్డుగూడా వేసినారు. అది మనకు విచార్యము కాదు. ఉభయ వ్యాఖ్యానములలోని గుణదోషములను పరామర్శించుటయే వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము.

వావిళ్లవారివ్యాఖ్యలో కొన్నిప్రమాదము లున్నమాట నిజమేగాని, వేదంవారివ్యాఖ్యలో నున్నప్రమాదము లంత కంటెను తక్కువ కావు. ఆకారముచేత పెద్దది కావున తదనుగుణముగా ప్రమాదములును ఎక్కువగనే యున్నవి. మఱియొకవిశేష మేమనగా? వేదంవారు స్వయముగా టీక

వ్రాయుటకు ప్రాలుమాలికాబోలు, వావిళ్లవారి టీకకే అక్కడక్కడ చిన్నచిన్న మార్పులుచేసి, కూర్పులుపోసి, రూపము మార్చి, 'సంజీవని' యని పేరుపెట్టినారు. అందువల్ల చాల తావులలో వావిళ్లవారిగ్రంథములోని ప్రమాదములు వేదంవారి పుస్తకములోనికి యథాతథము ప్రవేశించినవి. సంజీవనీకర్తలు, మార్చరానిస్థలములలో మార్చినందున 'రుచి'లోని గుణములు కొన్ని దోషములుగా పరివర్తనమును చెందినవి. వావిళ్లవారిటీక చదువకయు, నిఘంటువులు చూడకయు, వేదంపండితులు పెక్కుపదముల కర్థములు తప్పుగా చెప్పినారు. సంజీవనిలో పెక్కుచోట్ల ఔచితికి విరుద్ధములయిన యన్వయములు చేయబడియున్నవి. పాఠమును నిర్ణయించుటలో వే. వేం. శాస్త్రిగారు 'ప్రమాణమంతఃకరణప్రవృత్తయః' అన్నట్లు వర్తించిరేగాని ప్రత్యంతరపరిశోధనపూర్వకముగా సాధుపాఠమును సంతరించినవారు కారు. వావిళ్లవారిప్రతినుండి మూలమును, అర్థమును ఎత్తి వ్రాసికొనుటలోనైనను నెలకువగలిగి మెలగలేదు. అందువల్ల అందలి అచ్చుతప్పులును ఇందులోనికి చొచ్చుకొన్నవి. ఇన్ని మాట లెందుకు? 'సంజీవని', 'రుచి' నధిక్షేపింపదగిన ఉత్తమ వ్యాఖ్యానము కాలేదు. ఎల్లదోషములకును పుట్టినిల్లయినది. ఈ తత్త్వమును పలువురు పెద్దలు గమనించినట్లు లేదు. అందువల్లనే సామాన్యులమాట అటుండ, నిఘంటునిర్మాణమునకు పూనుకొన్న విద్వాంసులును, 'శాస్త్రిగారి వ్రాతలలో దోషము లుండవు' అన్న నమ్మకముమీద, సంజీవనిలోని

పాఠములను, అర్థములను అపరిశీలితములుగానే కైకొను చున్నారు. అందువల్ల శాశ్వతముగా నుండవలసిన కోశముల లోనికి ఒప్పులతోపాటు తప్పులును ఎక్కుచున్నవి. ఈ విధముగా భాషకు అపకారము జరుగుచున్నది. నా మనసునకు వచ్చిన యీ విషయమును లోకమునకు తెలుపకుండుట దోష మగుననియు, లోకమునకు తెలుపుట భాషకు గొప్ప సేవ చేయుట యగుననియు తోచి యీ వ్యాసమున వివరించు చున్నాను. ఇందలి గుణదోషములకు సహృదయులే ప్రమాణము.

## పాఠ విచారణ

### ౧. స్రగ్ధరాయతి

*అప్పకవీయములో 'యతినియతి' అను శీర్షిక క్రింద ఈ పద్యము లున్నవి.

క. "ఏకపదంబున విరతు ల
నేకంబులు గలిగియుండునేని పదాదిం
జేకొన్న లిపియె యన్నిటఁ
బ్రాకటముగ నిలుచు సీసపదములఁ దక్కన్." (3-110)

ఆ. "ఒక్కపదములోనఁ బెక్కు మిశ్రమములు
జఱుగుచోట మొదల జడ్డలున్న
నడుగు వెడలుదనుక నందొక్కటియెకాని
యుండ దొకట నదియు నొకట నిదియు." (3-111)

* ఈ వ్యాసము (1941) త్రిలిఙ్గ రజతోత్సవసంపుటములో 'యతినియతి' యను శీర్షికతో ప్రకటింపబడినది.

జయభద్రరగడ

"క్ష్మాపుత్రికాలోల-కమనీయగుణజాల,
ఘననీల యని చెప్పఁగా బహుకరతు లొప్పఁ;
క్ష్మాపాలకలలామ-కంధిగర్వవిరామ,
సంగ్రామభీమ యన-మహిని రెంటికిఁ దప్పఁ." (3-112)

తే. "ఒంటియడుగున బహుయతు లుండునపుడు
నడుమ నొకదాన జమిలివర్ణంబు గదియ
నందుఁ జరణాదికి సవర్ణమయ్యె నెద్ది
దానికయ నిల్పు విరతి ముందరను గృతుల." (3-113)

విజయమంగళరగడ

"వైరిమదతమఃపతంగ-స్వజనపోషితాంతరంగ,
వ్రజవధూభుజంగ యనఁగ-వలయుఁ జెక్కువడులమొదల;
దారితక్షమాకుమార-ద్వారకాపురీవిహార,
వ్యాససన్నుతప్రచార-యనఁగఁ దప్పఁ గడకు వెడల."
(3-114)

ఆముక్తమాల్యదలో, సంజీవనీకర్తలు 'ఏకపదంబున' అను పద్యము నుదాహరించి, పద్యోక్తలక్షణమునకు భిన్నముగా నున్నవన్న హేతువున, మూడు స్రగ్ధరలలో - నాలుగు తావులలో, (వావిళ్లవారి ప్రతిలోనున్న) ప్రాంతయతులను తొలఁగించి క్రొత్తయతులను ప్రవేశపెట్టినారు. పరిశీలించి చూడఁగా, ఆ దిద్దుబాటు సరియైనది కాదని నాకుఁ దోఁచినది. పూర్వపాఠమును, 'సంజీవని' దిద్దుబాటును, నా యూహకుఁగల యుపపత్తులను వివరించుచున్నాను.

(1)

"ఈ రెండును దీనుల్గాంచు నమ్మా-డువులనె యడుగం-దోఁచు-"(1-58)

ఇందు 2-3 స్థానములలోని 'డు-ందో' లకు మైత్రి లేదుగనుక తప్పని శాస్త్రిగారు,—'ఈ రెండును దీను ల్గాంచు న'మ్మ-న్కు-వ' లనె'.— అని పీఠిక (పు. 27)లో సవరణను చూపి, గ్రంథములో - 'డువులనె యడుగం-డోఁగు'.—అని ముద్రించినారు.

(2)

"చరదృష్టిక్ వైరిపక్షే-క్షణము సచివము-ఖ్య".— (4-28)

ఇందు 1-3, 'చ-ఖ'లకు చెలిమి చెల్లదని 'క్షణము సచివ 'ష-ష్ఠ'.- అని మార్చినారు.

(3)

"ప్లవమానోత్పాతభూత-ప్రకరపటిమ హా-లాహల". — (7-11)

ఇందు, తొలుత గ్రహింపఁబడిన వర్ణము పకారము. దానితో తుదియతి యైన లకారమునకు మైత్రి లేదు. అందువలన వారు, 'ప్లవమానో త్పాతభూత-గ్లపన'.—అని లకారయతిగా మార్చినారు.

(4)

"ప్లవబృందంబుల్ వనిక్ న-ల్గడఁ బోడు పొడుమక్-పల్కు-లుక్." (7-11)

ఇందులో, 2-3 'ల్గ-ప'లకు మైత్రి కుదురదని,—'ప్లవబృందంబుల్ వనిక్, బ-ల్వడి'.—అని సవరించినారు.

అట్లు సవరించుట సరికాదు. ఎందువల్ల ననగా, అప్పకవీయపు 'యతినియతి' రగడలను గూర్చినదిగాని, స్రగ్ధరలను గూర్చినది కాదు. కావుననే ఆతఁ డా నియతికి రగడలనే చూపినాఁడు. అప్పకవికి పూర్వుఁడయిన అనంతుఁడును, 'సంయుక్తయతి'నిగూర్చి చెప్పుచోట,—

క. 'ఒక్కెడుగున విశ్రాంతులు
పెక్కగుచో సంయుతములు పెనుపకమును జ
డ్డక్కరమునఁ దానెత్తిన
యక్కరమే యునుపవలయు నన్నిటఁ గృష్ణా.' (1-109)

క. 'వడినెలవులలోఁ జేరువ
యొడ నొకసంయుతము నాలయొడ నొకటినిఁ దా
మిడికేని కవులు తప్పుట
యొడఁబడరు పృథగ్యతిప్రయోగముల హరీ.' (1-110)

అని లక్షణముచెప్పి, అందుకు లక్ష్యముగా,

"క్ష్మావలయమంతయును విష్ణువునకెత్తె కిటి,
మహిమ దలపోయ నక్కజ మనుచు నిట్లనక;
క్ష్మావలయ మంతయును విష్ణువున కెత్తె కిటి,
సత్త్వ మరుదన నొప్పు సంయుక్తయతి చెడక."

అను ద్విరదగతిరగడను, మఱియొకవిధముగ రగడను చూపినాఁడు. అంతే గాని స్రగ్ధరలను చూపలేదు.

కాఁబట్టి, అప్పకవి 'యతినియతి'యు, అనంతుని 'సంయుక్తయతి'యు రగడలనుగూర్చినవే కాని, స్రగ్ధరలను గూర్చినవి కావనుట నిజము. తాతంభట్టుమాత్రము (సులక్షణసారములో) 'స్రగ్ధరలలో సంయుక్తయతిని వాడరా'దని వ్రాసినాఁడు. కాని, ఆ వ్రాఁత యంతగా నాదరణీయము కాదు. ఎందువల్లననఁగా, ప్రాచీనకావ్యములలో పెక్కుతావులలో స్రగ్ధరావృత్తములలో 'సంయుక్తయతి' వాడఁబడియున్నది. స్రగ్ధరాయతులు మూఁడును పరస్పరము మైత్రి గలిగియుండ నక్కఱలేదు. ఆ మూఁటిలో నేరెండు మైత్రిని కలిగియున్నను చాలు ననుటకును ప్రాచీనులరచనలలో ప్రమాణము లున్నవి. కొన్ని యుదాహరణలు.

(1) "స—న్మానాధీనుండుగా వై-ష్ణవసుఖదుఁడుగా-మత్కృపా"
(పాండు. 2-185.)

ఇందు, తొలియక్షరము 'న్మా' కావున, రెండవచోట నకారమునకును, మూడవచోట మకారమునకును యతి చెల్లింపఁబడినది. (2-3, 'ష్ణ-మ'లకు మైత్రిలేదు.)

(2) "క్షామాత్మ స్వామిధామ-క్రమణకృశపిపూ-ష్ణ ప్రవిక్రాణితాతి"
(కళా. 7-177)

ఇందులో, తొలి 'క్షా'లోని కకారమునకును - షకారమునకును (2-3 స్థానములలో) యతులు కూర్పఁబడినవి. (1-3, 'క-ష'లకు మాత్రము మైత్రి చెల్లదు.)

(3) "బాలవృద్ధా * స్త్రీ శేషంబుగా నం-దఱుఁ బొలిసిన వె-న్కా ర్జ-జయంబేల నాకున్." (భాస్క. యుద్ధ. 884)

* ఇది ఆనందప్రతి పా. 'వావిళ్ల' ప్రతిలో, 'బాలవృద్ధాస్త్రీ'అని పా.

ఇందు, తొలుత (1-2) తకార దకారములకును, పిమ్మట (2. 3) బిందుపూర్వ దకార నకారములకును మైత్రి చెల్లింపఁబడినది. (అంతేగాని, 1-3, 'ర్త', 'న్క'లకు మైత్రి చెల్లనే చెల్లదు.)

(4) "క్షితిఁగూలఁగ గోటిసంఖ్యల్ - గెడయఁ గరివరా - శీతిసాహస్ర సంఖ్యల్" (ఉ. హరి. 6-135.)

ఇందును మొదటి 'క్షి' కారములోని కకార షకారములకు వరుసగా 2-3 యతులు చెల్లింపబడినవి. (కాని, 2-3, గె-శీ లకు మైత్రి పొసఁగదు.)

ఇట్లు ప్రామాణికప్రయోగములు కనఁబడుచుండఁగా వావిళ్లవారి 'ఆముక్త' ప్రతిలోని యతులు దుష్టములగుట యెట్లు? దిద్దవలసిన అక్కఱ యేమి?

ఎందు కింకను విస్తరము. వేదంవారు, ప్రాచీనరచనలను పరిశీలింపకయు, అప్పకవి 'యతినియతి' రగడలకు సంబంధించినదిగాని వృత్తములకు సంబంధించినది కాదన్న సంగతి గమనింపకయు, 'ఆముక్త' స్రగ్ధరా యతులను మార్చివేసినారు. పొరపాటు.

అప్పకవి, క్రౌంచపదవృత్తమున,—

"క్రౌంచపదీవృత్తమ్మునఁ జెన్నారఁగఁ బలుకు దురిలఁ-గవివరులెల్లన్" (4. ఆ.) అని 'క్రౌ'లోని రేఫముతో నొకమారును, కకారముతో నొకమారును యతిమైత్రి కూర్చియున్నాఁడు. కావున ఆతని 'యతినియతి' వృత్తములను గుఱించి చెప్పలేదనుట స్పష్టము. ఒకవేళ చెప్పియున్నను ఆతని మాటనుబట్టి ఆముక్తమాల్యదరచనను మార్చుట మర్యాద కాదు. ఎందువల్లననగా 'ఆముక్త' కెన్నో తరాలిఁవతలివాఁడైన అప్పకవి శాసనము ఆ గ్రంథముమీఁద చెలామణి కానేరదు. అప్పకవీయమునుబట్టి ఆముక్తమాల్యదను, చిన్నయ్యసూరిని బట్టి నన్నయ్యభట్టును సవరించుట అక్రమము. అది యట్లుండఁగా, 'ఆముక్త' కవి, ఒకటికి నాలుగుతావుల పాటించిన యతివిధాన మాతని మతమగును గాని ప్రమాదము కాదు. కవి బుద్ధిపూర్వకముగాఁ గావించిన రచనను మార్చివేయుట తప్పు.

ఇంకొకమాట—అప్పకవిమతమున, కవిరాజవిరాజితమునకు యతులు మూఁడు. ('అలరినచో స్వర, వాచలవైలము, త్రైవిరామము, లంగి నర రళకవిరాజవిరాజితవృత్తము...వ్రాలు' - అ.క.) ఆముక్తమాల్యదలో,- "జయజయదానవదారణకారణ - శార్ఙ్గరథాంగగదాసిధరా" అని ఒక్క యతితోనే యున్నది. అప్పకవి వ్రాఁతనే ప్రమాణముగాఁ గొని గ్రక్కరా యతులను మార్చిన పెద్దలు, ఆ కవిరాజవిరాజితములో మఱిరెండు యతులను ఏల చేర్చలేదో!

అక్కడ వారు,-'కవిరాజవిరాజితమున-౮, ౩, ౭. అక్షరములయందు యతులు. ఈ పద్యము మనుచరిత్రమందునుం గలదు. యతి ఒకటియే' అనిమాత్రము తెలిపి వదలినారు.

## ౨. చేఁగొను

చ. *'క్షితి దున నేటికిఁ హాలము చేఁగొని.' (4-28)

'హాలము = నాఁగటి నే, చేఁ = చేతియందు, కొని = గ్రహించి ('హాలముచేకొని' పా.)' అని సంజీవని.

'చేకొని' అను పాఠమున్నను, ఆ పాఠమున 'చేఁ = చేతియందు, కొని = గ్రహించి' అనే యర్థము సిద్ధింపదని 'చేఁగొని' అని సవరించినారు; తప్పు. చేకొను; కైకొను; వాకొను; పైకొను అను క్రియలను, 'చేఁగొను; కైఁగొను; వాఁగొను; పైఁగొను' అని దిద్దుట సరికాదు.

"క్వచిన్నైవ వికార స్స్యాద్ద్రాఘత్వాచ్ఛబ్దపల్లవః" (అథర్వణ. క్రి. ౯౨.)

తాత్పర్యము.—"శబ్దపల్లవము రూఢమైన దౌటవలనఁ బరుషములకు సరళాదేశ మొకానొకచో రాదు. ఉ.-చేకొని ఇత్యాదులు."

అది యట్లుండఁగా.—నాఁగటిని గ్రహించుట 'చేతితో' గాని 'చేతి యందు' కాదు. కావున 'చేఁకొని = చేతియందు గ్రహించి' అని అర్థము చెప్పుటయు నుచితముకాదు.

---

* క్షితి దున నేటికిఁ హాలముచే మఱి' అని వావిళ్లవారి పాఠము.

## ౩. సున్నమెత్తుట

'సున్న మెత్తుటయుం బట్టు కౌరులం బట్టుటయు సౌధ సౌవర్ణ భూషాదినిర్మాణంబుల యందకాక, యితరస్థలంబుల లేకుండ రాజ్య పరిపాలనంబు సేయుచుండె.' (4-187.)

'సున్న మెత్తుటయుఁ = సుధాలేపమును'; (సున్నముఁ బూయుట మేడలకును...)' అని వావిళ్ల టీక.

'సున్నము ఎత్తుట, మోయించుట-దండ్యులకు ఒక శిక్ష. (మేడలకు సున్నము-అనఁగా గచ్చు-పూయుదురు) అని వేదమువారి టీక.

లోకములో శిక్షగా 'బండలెత్తి మోయించుట కలదుగాని, 'సున్నపు కుండనో-గంపనో యెత్తి మోయించుట లేదు. శరీరమునకు 'సున్నముఁ-మెత్తుట' ఒకశిక్షగా లోకమున ప్రసిద్ధి.

గీ. 'మేన రాసున్న మెంతయు మెత్తి, నెత్తి
గోకిగి, నిమ్మపులుసు గంట్లఁగ్రమ్మి, లోని
కిముడ నేపాళము లూసంగి, యిట్లు శిశిర
కృత్యములు సేయ, నప్పు డక్కితవవనిత.'

ఈ పద్యము చంద్రరేఖావిలాపములోనిది. అది హాస్యప్రబంధము కావున, బాధాకరములయిన కృత్యములు శీతలోపచారములుగా చెప్ప బడినవి.

సున్నముమెత్తుట, వావిళ్లవారి ప్రతిలో 'సున్న మెత్తుట'అని ముద్రిత మయినది. ముద్రణమున 'ము' జారిపోయినది. (అర్థము సరిగానే వ్రాయ బడినది.) ఆ జారుపాటును గుర్తింపక, వేదమువారు 'సున్న మెత్తుట' అనియే ముద్రించి 'సున్నము + ఎత్తుట' అని విభజించి, 'సున్నము-ఎత్తుట ఒక శిక్ష' యనియు, 'సున్నము-ఎత్తుట = గచ్చు-పూయుట' యనియు, లోకములో లేని శిక్షను, భాషలో లేని యర్థమును చెప్పినారు.

వారి పాఠపరిశోధనపద్ధతి తెలియుట కీయుదాహరణములు చాలవా? వారు ఒకటికి రెండుమూడు తాళపత్రప్రతులను పరీక్షించి సాధుపాఠములను గ్రహింపలేదు, సరిగదా వావిళ్లవారి ప్రతినుండి యెత్తి వ్రాసికొనుటలో

నైనను మెలకువగలిగి వర్తింపలేదు. అందువల్ల ఆ ప్రతిలోని అర్థానుస్వార ప్రమాదములుకూడా కొన్ని ప్రతిలోనికి అట్లే దిగుమతియైనవి. చూడండి.—

1. 'కొండవీడు.' (పు. 41)
2. 'మన్ని' (పు. 47)
3. 'బెగువు' (పు. 60)
4. 'జిగురుగంటె' (పు. 301)
5. 'ఆడు (=నృత్యముచేయుచున్న) వారిపై' (పు. 301)
6. 'జరుపు' (పు. 525)
7. 'గుత్తవట్టి.' (పు. 677)

సంస్కృతకృతుల ననువదించునప్పుడును, వ్యాఖ్యానించునప్పుడును కూడా ఆంధ్రమల్లినాథులు, పాఠమును సరిగా పరిశీలింపమి కలదు.

ఒకటి రెండు ఉదాహరణలు.—

(1) కొమరయ్య

"జనయంతి సుతాన్ గావః సర్వా ఏవ గవాకృతీన్;
విషాణోల్లిఖితస్కంధం కాచి దేవ గవాంపతిమ్."
(హితో. విగ్ర. 147)

అను శ్లోకానికి, వారు (1914-లో)— "ఆవు లన్నియు ఎద్దురూపు కోడెలను ఈనసే యీనును. కాని కొమ్ముతో కుమారస్వామిని గ్రోచునట్టి (శివుని) యాలఁబోతును ఈనునది ఏదో ఒక్క యావే" అని తాత్పర్యము వ్రాసినారు. తరువాత (1932-లో) ఆ తాత్పర్యమునే,—

"ఆలుఁ గోడెల నీను వృషాకృతులనె
అందు భేదంబుగలుగ దావంత యేని
కొమ్ముతోఁ గొమరయ్యను గోఁకు వృషభుఁ
గనెడు నా గోమతల్లి యొక్క తెయు గాదె"

అని పద్యములో నిక్షేపించినారు. కాని వా రా శ్లోకమునకు చేసిన ఆ యర్థము నాకేమో చాలా విపరీతముగా కనుపట్టినది.

శివుని యాలపో తేమి? కొమరయ్యను కొమ్ముతో గ్రోఁకుటయేమి? శివలోకములో కుమారస్వామిని కొమ్ముతో గ్రోఁకు శివుని యాలపోతును,

ఈ లోకములో-ఈ నాఁడు-ఎక్కడనో-ఏదో ఒక యావు ఈనుటయేమి?-అనుకొని, సంస్కృతవ్యాఖ్యానము నెత్తి చూచితిని. అందులో,—

“విషాణ-విషాణాభ్యా ముల్లిఖితౌ స్కంధౌ యస్య”-అని యున్నది. అంతట (Kale) ఆంగ్లానువాదమును తీసిచూచితిని. అం దిట్లున్నది.—

“All cows bring forth calves that have the shape of the cowkind: but some one alone produces one, the master of a herd (the best of bulls), having stout and muscular shoulders (lit., having shoulders that are rubbed against by his horns).”—

“లోకములో ఎన్నో ఆవు లున్నవి. అన్నియు కోడెల నీనుచునే యున్నవి. ఆ కోడెలన్నియు వృషభాకారముకలవే (అనగా - పేరుకు అన్నియు నెద్దులే) కాని, మూఁపులకు తాఁకునట్లు పెరిగిన పెద్దకొమ్ములు గలిగి - అఁబోతు కాఁదగిన కోడెనీనునది యేదో ఒక యావే” అని యాశ్లోక తాత్పర్యము. అంతేగాని, అందులో ‘కొమరయ్య’ లేఁడు. ఆ కొమరయ్యను కొమ్ముతోఁ గ్రోఁకు శివుని యాలఁబోతూ లేదు.

---

ఆ శ్లోకములో, అటు సంస్కృతవ్యాఖ్యాతకూ, ఇటు ఆంగ్లానువాదకునకూ కనబడని ‘కొమరయ్య’; ‘శివుని ఆలఁబోతు’ శాస్త్రిగారికి కనబడుటకు కారణ మేమో!

నా కిట్లు తోఁచినది. వారు చదివిన పుస్తకములో ‘స్కందం’ అని యున్నది. (లేదా, స్కంధం-అనియున్నను, వారు ‘స్కందం’అని చదువుకొనియైన నుందురు) స్కందం = కుమారస్వామిని-అని యర్థముచేసికొని, ఆ యర్థము సరిపడుటకు ‘గవాంపతి’ని —‘శివుని ఆలఁబోతు’ అన్నారు.

---

అంతేగాని, ఆ యర్థమునగల యనౌచిత్యమును వారు గమనించలేదు. గమనించియే యున్నచో ‘స్కంధ’ పాఠమును గ్రహించియే యుందురు.

## (2) జీర్ణోద్యానము

ఆ గ్రంథములోనే,—“అస్తి జీర్ణోద్యానే మందవిషో నామ సర్పః” అన్న సంస్కృతవాక్యమునకు,—‘వల్లకాటిలో మందవిషుని పా మొకటి యుండెను’ అని తెనుగు వ్రాసియున్నారు.

జీర్ణోద్యాన మనఁగా పాడుపడిన తోఁట గాని 'వల్లకాడు' కాదు. శాస్త్రిగారి అనువాద మొప్పుకాదు. (చూ. 'జతకాశ' పీఠిక. పు. 25)

(3) 'కిమంగ'

ఆ గ్రంథములోనే,—

"త్యజేన కార్యం భవ తీక్ష్వరాణాం
కిమంగ వాగ్మహ స్తవతా నరేణ"—అను శ్లోకమునకు,—

క. "పూరి పురుకచేఁ, గలమపని యీశులకుఁ గయు, పలు, కంగంబులు గలానిఁ బలుకవలయునే"-అని వారి తెనిఁగింపు.

శ్లోకములోని 'కిమంగ'ను తెంచి, వారు 'కిం-అంగవాక్ప్రాజమతా' అని యన్వయముచేసి తెనిగించినారు. అది తప్పువాద.

(1) ఆప్టి 'అంగ Used with 'కిం' in the sense of 'how much less' or 'how much more'—అని వివరించి - అక్కడ పైశ్లోకమునే యుదాహరించి యున్నాఁడు.

(2) "అంగ - ఇది మఱియు నను నర్థమందు వర్తించును. ఉ.— 'మూర్ఖస్తు నావమంతవ్యః కిమంగ విద్వాన్". (గురు. ప్రబో.)

(3) "శక్తిరస్తి కస్యచి ద్విదేహ రాజస్యభాయామప్యవస్కందితుం కిమంగ జామాతరమ్" (మహావీరచరిత్ర.)

(4) "అవశ్యంకృత కార్యస్య - వాక్యం హనుమతోమయా అకార్యమపి కర్తవ్యం, కిమంగ పున రీదృశమ్" (సుందర. ౬౭-౮.)

(5) "ఆలోకనంచ వచనంచ నిగూహనంచ
యాసాంస్మరన్నమృతవత్సరసం కృశస్త్వమ్,
తాసాం కిమంగ! పిశితాస్ర పురీషపాత్రం
గాత్రంవిచింత్య సుదృశాం ననిరాకులోసి."

—వాగ్భటుని అలంకారగ్రంథము.

ఆంధ్రమల్లినాథులు 'కిమంగ' తత్త్వమును గుర్తింపలేదన్నది యిక్కడి సారాంశము.

**N.B :**—శ్రీ శాస్త్రిగారి శాకుంతలా ద్యనువాదములలోను ఇట్టి ప్రమాదములు విరివిగా దొరలియున్నవి. అందు కొన్ని, 'ఓదార్పు' - అను గ్రంథమున చూపబడినవి.

## ౮. పాటిపాటి

'వావిళ్ల'వారి ప్రతి (4-35)లో, — "గంధకారులు పాటిపాటి పద్యంపు ముక్కలతో" అను పాఠము, "పాటిపాటి=కొంచెకొంచెపు,..." అను టీకయు నున్నవి.

వేదం-వారు ఆ పాఠమును - అర్థమును అట్లే గ్రహించినారు.

'కొంచెముకొంచెము' అను నర్థమునిచ్చు పలుకుబడి—'పాటపాట' గాని, పాటిపాటి కాదు. చూ. శ.ర.

(1) "...చిటపాటమని పాటపాట చినుకులు వడఁజొ,
చ్చుట యాదిగాఁగ" (కళా. ౪. ఆ.)

(2) "వేనలి పాటపాట నరవెండ్రుకతోఁ దిలతండు లాన్వయ
శ్రీనటియింప." (కాశీఖండము 7-160)

# అర్థవిచారణ

## ౧. ఒకఁడుచెప్పక

ఆ. 'పాత్రభూతు లెస్స బరికించి యతఁడడు
గకయు నొకఁడు సెప్పకయు మనుపుగఁ
బనసపండ్లు దిగినపరిగ, స్వప్నము గన్న
సెఱిఁగ, నొసఁగి వెఱఁగుపఱుచు టొప్పు.' (4-274)

అతఁడు అడుగకయున్ = అడుగుటకును, ఒకఁడు సెప్పకయు = మఱియొక్కఁ డతనికి దానమిమ్మని తనతోఁ జెప్పుటకును, మనుపుగన్. ఇచ్చి వెఱఁగుపఱుచు టొప్పును.' అని వావిళ్లవారి టీక.

'చెప్పకయున్ మనుపు=రాజు నీకు సత్కారముచేయ నున్నాఁడని ఆతనితో ఎవ్వఁడును చెప్పక, ముందే, ఇచ్చి ఆశ్చర్యపెట్టుట ఒప్పున్' అని వేదమువారి టీక.

రాజు నీకు సత్కారము చేయనున్నాడని ఎవడో పోయి చెప్పక ముందే రాజు ఇయ్యవలె నని-యర్థము చెప్పుట కేవల మనుచితము.

వావిళ్లవారి వ్యాఖ్య సరిగాదని-వేదంవారు చేసిన యీ సవరణ తప్పు.

## ౨. పనసపండ్లు దిగిన పరిగ

'పనసపండ్లు దిగినపరిగఁ = మొత్తములుగాఁ బనసపం డ్లొకసారి దిగిన చందముగా' అని వావిళ్లవారు.

"పనస ..రిగఁ = ఉన్నట్లుండి ఒకక్షణములో పనసచెట్టునిండ పనసపండ్లే దిగఁబడిన నెట్లుండునో ఆ విధముగాను, అభూతోపమ' అని వేదంవారు.

'అభూతోపమ' అనగా, సహజముకానట్టి (=కవికల్పితమైన)ఉపమ. ఉదా.—'ఆ యేనుఁగు నడకొండవలె నున్నది' అన్నప్పుడు, నడకొండ (=నడచుచున్న కొండ) కవికల్పితము కావున 'అభూతోపమ.' అట్లే ప్రకృతమున వేదమువారు 'పనసపండ్లు' అను పదానికి 'పండిన పనస కాయలు' అని యర్థముచేసికొని, పచ్చికాయలుగాక, పండ్లు-పండ్లుగానే చెట్టున దిగబడుట సహజముకాదు గావున, పండ్లు దిగబడినట్లు చెప్పుట - 'అభూతోపమ' అన్నారు. పొరపాటు.

పనసపండ్లు దిగుట-యనగా, పనసపిందెలు పుట్టుట అని సంప్రదాయార్థము. "దిగుట-To come forth as fruit from the bud." (బ్రౌను.)

'పనస'-వనస్పతి. అనగా పూతలేకయే కాయలుకాయుచెట్టు. ఉదా— మేడి. వనస్పతి ఫలోత్పత్తికి ముం దెట్టి సూచనయు నుండదు. ఉన్నట్లుండి చెట్టు ఆపాదమస్తకము పిందెలు పుట్టి కూర్చుండును.

'పనస ఉన్నట్లుండి తటాలున సమృద్ధిగా ఫలించి ఆశ్చర్యమును కలిగించునట్లు, రాజును ఉన్నట్లుండి తటాలున సమృద్ధిగా సత్కరించి ఆశ్చర్యమును కొలుపవలెను'-అని చక్కని ఉపమ.

వావిళ్లవారి టీకయే సరియైనది.

కాచిన మేడిచెట్టును శ్రీనాథు డిట్లు వర్ణించినాడు.—

గీ. 'కమియ నామూలచూడంబుగా ఫలించి
యంబరము మోచియున్న యుదుంబరములు
లీల బ్రహ్మాండభాండమాలికలభూష
లవధరించిన వృషభాంకు ననుకరించె.' (కాశీ. 1-91)

ఫలించి యనగా కాయలుకాచి-అని యర్థము. మేడిపంట యెట్టిదో పనసపంటయు నట్టిదే.

## 3. కసీసము

''ఇంగిలికమ్మునం దడిపి యెత్తు కసీసపు రెంటెమో యనక్
నింగి గరుత్పరంపరల నిగ్గున లేఁ దొగరెక్క-'' (4-10)

''కసీసపు రెంటెమో = నల్లని జంటనేఁత వస్త్రమో.— *కసీసము అనఁగా నల్లనిది, దీనికి ప్రకృతి 'కాసీసము.' కాసీస మనఁగా మైలుతుత్తము; అది నలుపుగాన దీనికి ఈ యర్థము వచ్చినది'' అని సంజీవనీ వ్యాఖ్య.

---

* వావిళ్ల నిఘంటువు, ''కసీసము = 1. అన్నభేది. 2. నల్లచాయ గల తెల్లబట్ట.'' అని యర్థములు చెప్పి, రెండవయర్థమునకు,-''సీ...కలధౌత వస్త్రముల్ చెలఁగుచుండు నవి నల్లచాయచే నలరుచున్నను గసీసం బనఁగాఁదగు''నను, ఆం. భా (ద్వి. ౧౨౧౫) పద్యము నుదాహరించినది.

ఆం. భా. పద్యమును గ్రహించుటలో ఆ నిఘంటువు పొరపడినది.

'జరబాజు సేరాజు బుట్టసా తగటి యనఁ, గలధౌత వస్త్రముల్ చెలఁగుచుండును'; —'అవి నల్లచాయచే నలరుచున్నను గసీసం బనఁగాఁ దగును'-అని పద్యార్థము.

'కలధౌతవస్త్ర' మనగా బంగారు—వెండి సరిగగల వస్త్రముగాని 'తెల్లబట్ట' కాదు. కావున 'నల్లచాయగల తెల్లబట్ట' అనుట సరికాదు.

నలుపు తెలుపులకు సామానాధికరణ్యము కుదురదు.

శ.ర. లో, 'కాసీసము = మైలుతుత్తము' అని యున్నది. సంజీవని కర్త లా వ్రాత నట్లే గ్రహించినారు. పొరపాటు.

కాసీసము-అనగా 'అన్నభేది' గాని 'మైలుతుత్తము' కాదు.

కాసీసము, ఇనుమునుండి పుట్టునది.—మైలుతుత్తము, ఇత్తడినుండి పుట్టునది.

(a) "కాసీసమ్ Green vitriol, green sulphate of iron.-మయూరతుత్థమ్ Blue vitriol or sulphate of copper" (ఆప్టే.)

(b) "అన్నభేది Green vitriol, sulphate of iron. ఒక మందు దినుసు.— మైలతుత్తము Blue vitriol or sulphate of copper. తుత్థము." (బ్రౌను.)

కావుననే శ.ర. కర్తయు, సంజీవనికర్తయును,— 'కాసీసము=మైలుతుత్తము' అనుట పొరపాటు. మైలుతుత్తమురంగు-నీలము (Blue) గాని కేవలము నలుపు కాదు. కావున 'మైలుతుత్తము నలుపు' అనుటయును సరి కాదు. ఆకాశవస్త్రమును నీలమేగాని కేవలము నలుపు (Black) కాదు. అందువల్లనే వావిళ్ల వారు,— "కసీ...అసక=నీలవస్త్రమో అనునట్లుగా" అన్నారు. అదే యుచితమైన అర్థము.

## ౪. చట్టలు

'తమ యెక్కిరింతలు ... నవీన సవిధ కేదారంబులం ద్రెళ్లి చట్టలు దిగంబడి వెడలలేకుండం దారు దిగ నిమ్ములేక పిమ్మటం గొని.' (4-35.)

'చట్టలు దిగంబడి = చంకలవఱకుం గ్రుంగిపోయి.' అని, వా. వ్యా.

'(కర్త - ఎక్కిరింతలు) చెంగటి వరిపొలములో పడి, చట్టలు = పిఱుదులు, దిగంబడి = పూడిపోయి, వెడలలేకుండక = పైకి లేచిరాలేని వారై' అని వే-వ్యా.

మాగానిబురదలో దిగబడినవి, గుఱ్ఱముల 'జబ్బలు' గాని 'పిఱుదులు' కావు. 'చట్టలు = పిఱుదులు' అనుట సరికాదు.

(1) "భుజసమాఖ్యయగు, జబ్బ-చట్ట-బుజంబన." (ఆం. భా. 2-138)

(2) "చట్ట- The outside of the thigh." (బ్రౌను.)

(3) "చట్ట = తొడను వెలుపలిభాగము. (శ.ర.)

'పిఱుఁదు' లనగా పిఱ్ఱలు. ('The buttocks or posteriors.'–బ్రౌను.) కావున 'చట్టలు దిగంబడి' యనగా 'తొడలవరకు దిగబడి' యని యర్థము కాని, 'పిఱుఁదులు పూడిపోయి' అని యర్థము కాదు.

. దిగఁబడుట అనగా, బురదలోనికి దిగిపోవుట. కాబట్టి, దిగఁబడి= పూడిపోయి–అనుట చెల్లదు.

'పైకి రాలేనివారై' అనుటయును ప్రమాదమే. బురదలో దిగబడి పైకిలేచి రాలేకున్నవి గుఱ్ఱములు; అమహత్తులు. కావున, 'పైకి...రాలేనివై' అనవలెను.

'పిమ్మటగాను' శ.ప. క్రియ. కావున 'పిమ్మటఁగాని' అనగూడదు. (చూ. సమీక్ష. పు. 29)

## ౫. చెల్కు—

ఉ. 'అంటలుగట్టి *చెల్కులకు నాంధ్రుఁను బిడ్డలుఁ గూరఁగోయఁబోఁ
కంటకముల్ పదాబ్జములఁ గాఁడ.' (3–33.)

'చెల్కులకుఁ = చెలికలకుఁ = బీటి నేలలకు' – అని సంజీవని.

ఈ పాఠమూ – అర్థమూ శ.ర. ననుసరించినవి. 'చేలకును' అని వావిళ్ల–ప్రతి పాఠము. అదే సాధువు. ఎందువల్లననగా : చెలిక–యనగా 'చేను'గాని బీడు కాదు.

"చేననఁ జెలిక నా క్షేత్రంబు విలసిల్లు" అని ఆం.భా.(2–230) చెప్పుచున్నది. కావున,—'చెలికలకుఁ = బీటి నేలలకు' అనుటీక తప్పు.

తరువాత, అసలుపదము 'చెలికి' అని ఇకారాంతమగుచో, బా. వ్యా. ప్రకీ. ౧౮. సూ. ప్రకారము–'చెల్కి' అగునేగాని, అకారాంతమైన 'చెలిక' 'చెల్కు' కాదు. కావున 'చెల్కులకుఁ' అను పాఠముకంటె 'చేలకును' అను పాఠమే మేలయినది.

## ౬. అంతలు – ఇంతలు

ఉ. 'ఎం, తే రుష ద్రొబ్బ నంతలును నింతలునై పడు తన్నభశ్చ్యుతాం
గార శిశుప్రతానముల కైవడి రాలె సురేంద్రగోపముల్.' (4–107)

'అంతలు నింతలునై = ఇంతంతతునియలై.' (వావిళ్ల టీక.)

'అంతలును = పెద్ద గుంపులును, ఇంతలును = చిన్న గుంపులును, ఐ–సురేంద్రగోపములలో = ఆరుద్రపురుగులు (ఇంతలును అంతలును ఐ=చిన్న మొత్తములును పెద్ద మొత్తములునుంగా) రాలెన్ = నేలకు రాలినవి.' (వేదం. టీక.)

వావిళ్లవారిదే సరియైన టీక. వేదంవారిటీక కేవల మనుచితము.

క. "ఇంతలు నంతలునగు తన, సంతానము." (పాండు. 3-29) ఇంతవాండ్లును - అంతవాండ్లును అయిన బిడ్డలని యర్థము.

## ౭. అక్కవాడ

గీ. 'పచ్చిపోటులు తిని, లేని తఱుల మైత్రి
నంటి పిత్రు శేషము భుజించి, యది యు నెడల
నక్కవాడల నరకూళ్లు మెక్కి, మీఁద
పీనిశేఖర మొకతులాభిన్వజ్యము కొని.' (7-5)

"అక్కవాడలన్=అమ్మలక్కల వీథులయందు." (వా. వ్యా.)

"అక్కవాడలన్ = అమ్మలక్కల వీథులయందు (అనఁగా వీథివీథి కేఁగి అమ్మా అక్కా అని స్త్రీలను మంచిమాటలాడి స్నేహము చేసికొని ఆ దాక్షిణ్యముచేత వారియింట), అరకూళ్లు = సగము కడుపునకు తిని" (వే. వ్యా.)

'అక్కవాడ' యనగా పూటకూలి యిండ్లుండు వీథిగాని 'అమ్మలక్కల వీథి' కాదు. ఏ పట్టణములోగాని 'అమ్మలక్కలవీథి' యని ఒకవీథియున్నట్లు కావ్యములోను కనబడదు. శ.ర. కర్త 'అక్క = వంటలక్క' అని యర్థము చెప్పి, అందు కుదాహరణగా ఈ పద్యమునే చూపినాడు; లక్ష్మీనారాయణీయములో 'అక్కలవాడ=వంటలక్క లుండువీథి' అని స్పష్టముగా చెప్పబడియున్నది; బ్రౌనుపండితుడు "అక్కలవాడ Slut's alley, a street in which cook maids live వంటచేసే ఆఁడంగులు వుండేవీథి" అని వివరించి అక్కడ 'అక్కవాడల నరకూళ్లుమెక్కి' అని యీ పద్య పాదమునే ఉదాహరించినాఁడు.

క్రీడాభిరామమున ఈ పదము పలుమారు ప్రయుక్తమై యున్నది.—

(1) "ఎక్కడికి వార్వఁబోయెద రెఱుఁగఁ జెప్పఁ
దక్కవాడను మేము బ్రాహ్మణుల మగుట." (పుట. 60)

(2) "సన్మతినుండఁగావలయుఁ జక్కనివాఁడవ యక్కవాడలోన్."
(పుట. 63)

(3) "క్రొమ్మెఱుంగుతో, నుక్కవమాడుమేని పస యొడ్డనుఁ గల్గునె
యోరుఁగంటియం, దక్కల వాడలోని వెలయాండ్రనుఁ దక్కఁ
గిరాట టిట్టిభా." (పుట. 87)

(4) "గర్భమాదిగ నోరుఁగంటి యక్కలవాడ
వలఁతియై తిరుగాడు వాఁడు వీఁడు." (పీఠిక. పుట. 88)

## ౮. తనుయాత్ర

గీ. "అలన మృదుబాహు యుగబిసలతలు గడఁగి
బిసలతా శ్రీలనెల్లను వెస హరించె
మఱి హరింపంగ నవి నెఱివిఱిగి కాదె
సారెఁ దనుయాత్రఁ దంతుల జరుపుచుండు." (5-19)

'తనుయాత్రన్=దేహయాత్రను, (శరీరపోషణము ననుట.) తంతుల =నూలిపోఁగులచేతను, జరుపుచుండున్=కడపుచుండును.—ఆయమయొక్క కోమలములగు బాహువులనియెడు తామరతూఁడులు చెలరేఁగి యెల్ల తూఁడుల కాంతిసంపదల నపహరింపఁగా నవి గుంపుచెదరి మఱియొక విధముచే బ్రదుకఁజాలక నూలిపోఁగులు వడికికొని శరీరయాత్ర గడుపు ననియును, దామరతూఁడులు విఱిగినేని వానిలో నూలిపోఁగు లుండునని యును భావము.' (వావిళ్లవారి వ్యాఖ్య)

"తనుయాత్రన్ = దేహధారణము, తంతులన్=నూలువడుకుటచేత (సన్నపోఁగులను ధరించి) జరుపుచుండున్.—ఆమె బాహువులు తామర తూండ్ల సిరిని హరించినవి. ఆకారణంబున తామరతూండ్లు-నూలువడుకుకొని జీవించుచున్నవి. అదే వానిని విఱిచినచో సన్నపాటిదారములు వచ్చుట."

(వేదమువారి వ్యాఖ్య.)

'తంతువులతో తనుయాత్ర జరుపుట=నూలిపోగులు వడికికొని శరీర యాత్ర గడపుట' యన్న వావిళ్లవారి యర్థమునే పాటలుమార్చి వేదము వారు అనువదించినారు.

తంతువులతో తనుయాత్ర జరుపుట-యనగా, తంతువులే ఆహారముగా కాలము గడపుటగాని 'నూలువడికి-అమ్ముకొని తద్ద్వారమున జీవించుట' కాదు.

గాంధి వేరుసెనగపప్పుతో శరీరయాత్ర జరిపెడివాడు— అంటే, వేరుసెనగపప్పును అమ్ముకొని తద్ద్వారమున జీవించెడివా డని యర్థము కాదు. ఆ పప్పును తిని శరీరమును నిల్పుకొనెడివాడని యర్థము. అట్లే ప్రకృతమునను.

మరియు,—'తామరతూండ్లు నూలువడుకుకొని జీవించునవి అయి నందువల్లనే వానిని విఱిచినచో సన్నపాటి దారములు వచ్చుట' అని ఆంధ్రమల్లినాథులు వ్రాయుట మిక్కిలి వింత. నూలును తినువారి కడుపులో నూలుండవచ్చునుగాని, నూలువడికి అమ్మి జీవించువారి కడుపులో నూలుండు టెట్లు?

ఎందుకు గ్రంథవిస్తరము. దేహయాత్ర, శరీరయాత్ర-అను పదములకు భుజించుట - అని యర్థము. అందు కీక్రింది గ్రంథములు ప్రమాణము.

(1) దేహయాత్ర = మెసవుట, భుజించుట (శబ్దార్థకల్పతరువు)

(2) ,, = Nourishment, food. (ఆప్టే)

(3) ,, = తిండి. (శ.ర.)

(4) "యాత్రాస్యాద్యాపనేగతౌ. (అమరము) యాత్రాశబ్దము భోజనము మొదలైన వర్తనములకును గమనమునకును పేరు. ఉదా:—శరీర యాత్రా. ప్రాణయాత్రా." (గురుబాల ప్రబోధిక)

(5) శ్లో. నైషధమున—(హంసవాక్యము) 'ఫలకుసుమ మూలమాత్రంబున శరీరయాత్ర నడపుచు మునులుంబోలె...ఉన్నవారము.' (1-108)

(6) గీ. "పుష్ప ఫల పత్ర జల మాత్రముల శరీర
యాత్ర గడపుచు సన్మార్గమధిగమించి
యొసఁగు నివియెల్ల నీకేల యొగ్గొనర్చు" (వసు. 3-128)

(7) నీతిచంద్రిక.—(మిత్రభేదమున కొంగవాక్యము.) 'జలశైవాలాదులతో దేహధారణంబు చేయుచు ముముక్షుత్వంబు బూని మునివృత్తినున్న వాఁడను."

(8) సీ. "అనుదినంబును దేహయాత్ర కౌయితమౌనె
నీవార శాకాది పూవుఁబోణి" (హర. 4-18)

(9) క. "తనుయాత్రకుఁగా నశనము
గొనుఁ బూర్ణముగా" (శాంతి. 5-321)

## ౯. 'తొడిఁబడి'; 'విషయాతురు'

### వేదంవారి పాఠము

క. 'తొడిఁబడి, విషయాతురు నవి
విడు మనియెడుకంటెఁ గలదె వేఱేపగ? నే
ర్పడరఁ గథాదుల నొకవెం
బడి దోఁపంబలికి మైత్రిఁ బాపుట యొప్పన్.' (4-191)

'బడి' అను పదముక్రింద, శ.ర. లోను, వావిళ్ల - ప్రతిలోను పాఠ మిట్లున్నది.—

"తొడిఁబడ ... *విడువు మనియెడికంటె ... గథాదుల నొకటం,బడి దోఁపఁ బలికి మైత్రి వాపుటయొప్పన్."

"తొడిఁబడి = తొట్రుపడి, విషయ ఆతురున్ = శబ్దాదులయిన యింద్రియార్థములచేత, ఆతురున్ = రోగియైనవానిని (అనఁగా - అవి లేని యెడ దుఃఖపడువానిని - విషయాసక్తునను‌ట).—అవి ..కంటెన్=ఆ విషయములను వదలుమని యుపదేశించుటకంటె, ఒకవెంబడిన్ = ఒక క్రమమున,

* 'విడువు మనుటకంటె' అని వావిళ్లవారి పా.

తోఁపక=అతనికే తెలివి వచ్చునట్లు, పలికి=పలికించి, పైత్రికా=విషయము మీఁది ఆసక్తిని, పాపుట=తొలఁగించుట, ఒప్పఁగా=తగుచు" అని వేదం వారి వ్యాఖ్య.

(1)

ఉపదేశించువాఁడు తొట్రుపడుట స్వభావము కాదు. కావున 'తొట్రుపడి యుపదేశించుటకంటె' అని అర్థము చెప్పుట సరికాదు.

తొడిఁబడి = తొందరపడి-అని చెప్పుట యుచితము.

'తొడిఁబడక = త్వరపడి' అని వావిళ్లవారి టీక.

(2)

'విషయ-ఆతురు = ...ఇంద్రియార్థములచేత - రోగియైనవానిని' అని యర్థము చెప్పుటయు సరికాదు.

శ.ర. లో, 'ఆతురుఁడు = వ్యాధిగ్రస్తుఁడు; తెవులుగొంటు' అని యున్నది. అందువలన సంజీవనీ పండితులు,— 'విషయములచేత రోగియైన వానిని' అని యర్థము చెప్పినారు. కాని అది సరియైనమార్గము కాదు. 'విషయ ఆతురుఁడు = విషయములు లేనియెడ దుఃఖపడువాఁడు = విషయాసక్తుఁడు' అని డొంకతిరుగుడుగా వ్రాయ నక్కరలేదు. 'ఆతుర' శబ్దమునకు-'ఆసక్తుఁడు' అన్న యర్థము నిఘంటువులలో నున్నది. —

(1) "ఆతుర-Eager, Over-anxious-" (ఆప్టే.)

(2) ఆతురము Hurry, eagerness, affection, ఆతురచిత్తమై Being afflicted. గర్భాతురము Famishing hunger. క్షుధాతురుడై the same. కామాతురుడై eager with lust." (బ్రౌణ్యము)

(3) విషయాతురు = స్రక్చందనాది విషయములయం దాసక్తుఁడైనవానిని" అని వావిళ్లవారి టీక.

విషయాతురుడు - అనగా విషయాసక్తుడని సరియైన అర్థము.

విషయాతురుడు=విషయములచేత రోగియైనవాడు. విద్యాతురుఁడు= విద్యచేత రోగియైనవాఁడు. అర్థాతురుఁడు = అర్థము (= ధనము) చేత రోగియైనవాడు. అని యర్థములు వ్రాయుట యుచితము కాదు.

(3)

'మైత్రి=విషయములయందున్న స్నేహమును' అని వావిళ్ల వారును,— "మైత్రిన్ = విషయముమీఁది ఆసక్తిని" అని వేదంవారును అర్థము చెప్పినారు. కాని అట్లు చెప్పుట సరికాదు.

ఆ విషయాసక్తిని—మైత్రిన్=మైత్రితో-మంచిమాటలచేత, పాపుట యొప్పున్-అని చెప్పుట యుచితము.

కావున 'మైత్రివాపుట' అను పాఠముకంటె 'మైత్రిఁబాపుట' అను శాస్త్రిగారి పాఠమే గ్రహింపదగినది. కాని వారుచెప్పిన అర్థముమాత్రము గ్రహింపదగినది కాదు.

(తోడిఁబడ)

తోడిఁబడ—అను పాఠమున,—తోడిఁబడన్-విడుమనియెడుకంటెన్= (విషయములను) పూర్తిగా విడిచిపెట్టుమని (ఒకమాటుగా) చెప్పుట కంటెను, వేఱే పగగలదే?-అని యన్వయము.

తోడిఁబడన్=పూర్తిగా-అనుటకు,—

"తోడిఁబడఁ జేతికి దొరకిన ధనము
విడిచి మీఁదటఁగాను వెంగలి గలఁడె?) (గౌ. హరి. పు. 181)

'తోడిఁబడ'ను ఊతపదముగానైనను గ్రహింపవచ్చును. అందు కొక ప్రయోగము.—

"తోడిఁబడఁ బరుసంబుతో నిన్ము సోఁకి
కడువడి మేల్మిబంగార మైనట్లు." (గౌ. హరి. పు. 251)

## ౧౦. జపయజ్ఞశీలురు

చ. 'చిరసముపార్చితాగ్ని తడిఁజెంది నశించునటంచునో, కృతా
ధ్వరతఁ దదగ్ని మై నునికి దాన నొకంగము తాచుచేతనో
పురధరణీసురుల్ నిగమభూధరముల్ జపయజ్ఞశీలు, రా
హారిధనదాదులైన వలహస్తము సాఁపరు దానధారకున్. (2-33)

"జపయజ్ఞశీలః=జపయజ్ఞపరః" అని వాసుదేవ టీక.

"జపయజ్ఞశీలః = మంత్రానుష్ఠానములు, యజ్ఞములు చేయించుట స్వభావముగాఁ గలవాఁడు" అని వేదంవారివ్యాఖ్య.

జపయజ్ఞశీల యనగా, జపయజ్ఞపరుఁడే (= జపయజ్ఞములు చేయుట స్వభావముగా గలవాఁడే) కాని 'చేయించుట స్వభావముగా గలవాఁడు' కాఁడు.

'జపశీలుఁడు = జపము చేయించుట స్వభావముగా గలవాఁడు.' — 'యజ్ఞశీలుఁడు=యజ్ఞము చేయించుట స్వభావముగా గలవాఁడు.' 'భయశీలుఁడు =భయపెట్టుట స్వభావముగా గలవాఁడు.' 'దానశీలుఁడు = ఇప్పించుట స్వభావముగా గలవాఁడు.'—అని యర్థము చెప్పుట తప్పు.

శీలశబ్దార్థమును నిఘంటువు లిట్లు చెప్పుచున్నవి.

(1) "శీలుఁడు He who is possessed of, or endowed with; practising, versed in; స్వభావముగలవాఁడు. స్నానశీలుఁడు he who is addicted to bathing. భయశీలుఁడు he who fears." (బ్రౌను.)

(2) "శీలః - Disposition, nature; frequently at the end of comp. in the sense of disposed or habituated to, indulging in, prone to, addicted to; attached to &c.—as కలహశీల disposed to quarrel, quarrel-some, భావనశీల disposed or apt to think, so దానశీల; మృగయాశీల, దయాశీల; పుణ్యశీల; అధ్యాపనశీల. etc" (ఆప్టె)

'యజ్ఞపరుఁడు = యజ్ఞము చేయువాఁడు' - అనుటకు—

(1) అగ్నికార్యముఁ దీర్చు మభవుఁ బూజింపుము
పంచమహాయజ్ఞపరుఁడ వగుము.' (కాశీ. 4-105)

(2) "వలయునేని యధిప వాసవుచాడ్పునఁ, గ్రతుపరుండ వగుము." (భా. శాంతి. 1-289)

## ౧౧. చేవెలుఁగు

సీ. 'తమ్ముమోలనుండు నందలముఁ గానక దాఁటి
చేవెలుం గిడి బెస్తఁ జీరువారు.' (4-7)-పాఠాంతరము

"చేవెలుంగిడి = (చేవ + ఎలుంగు) పటిమగల కంఠస్వరముచేసికొని (పా. 'చేయెలుం గిడి = చేతితోఁ గూడుకొన్న యెలుఁగు కావించి, చేయెత్తి కూకవేసి అనుట') మఱియు లక్ష్యము.—క. 'దీవించి యతనివదనము, చేవెలుఁ గిడి చూచి'— హరవిలాసము" (సంజీవని.)

చేవెలుఁ గిడుట-చూచుటయందు గాని 'చీరుటయందు' కాదు. కావున 'చేవెలుఁగిడి-చీరువారు' అనుపాఠ మసాధువు. మఱియు వారు,—'అతని వదనము చేవెలుఁగిడి చూచి' యన్న లక్ష్యపద్యమునకును,—పటిమగల కంఠస్వరము చేసికొని చూచి-అనియు, చేతితోఁగూడుకొన్న యెలుఁగు కావించి, చేయెత్తి కూకవేసిచూచి - అనియు అనుచితార్థమునే భావించినారు.

అసలు, చేవ + ఎలుఁగు=చేవెలుఁగు-అను సంధికార్య మప్రశస్తము.

'చేయెలుఁగు'-అను పదమూ, 'చేతితోఁ గూడుకొన్న కంఠస్వరము'- 'చేయెత్తివేయు కూక' అను నర్థములును అప్రశస్తములే.

చేవెలుఁ గిడుట చూచుటయందే ననుటకు ఒక కొన్ని ప్రయోగములు.-

(1) సీ. 'పెద్దవిన్నపము చెప్పినఁగాని వినరాదు
చేవెలుం గిడకున్నఁ జెడును దృష్టి' (విష్ణుపురాణము.)

(2) వ. 'కంబంబుమఱుంగునం గదలమెదల వెఱచియున్న యమ్మహాను భావుం జేవెలుంగునం గనుంగొని' (మల్ల. విప్ర. 4-24)

(3) సీ. 'కంటికిఁ జేయోరగానిల్పి కన్గొని
యన్నన్న యెంతదవ్వానెడువారు.' (సారంగ. ౧-౧౨౩.)

(4) 'సంజప్రొద్దు వెలుంగునకుఁ గరంబు మఱుంగుపెట్టుకొని, కనుమేర దూరంబు చూపు సారించి' (మిత్రభేదము.)

## ౧౨. పచ్చికస్తూరి

(పు. 521) 'పచ్చికస్తురి = తడియాఱని కస్తురి.— కస్తూరికి ఆఱక ముందు పరిమళము హెచ్చు.' వే. వ్యా.

ఇది కస్తూరియొక్క ప్రకృతిస్వభావము తెలియని వ్యాఖ్య. అందు కీ క్రింది వ్యాసపంక్తులే తార్కాణము.—

(యువ. ఆషాఢభారతి. 'కస్తూరి మృగము')

1. "కస్తూరి పచ్చిగనుండగ అసహ్యమగు కొంకువాసనయున్ను మూత్రపువాసనయున్ను కలిగియుండును. నిజమగు కస్తూరి సౌరభపరిమళములు ఈ స్రావము ఎండినకొలదిని కలుగుచుండును. అట్టి సువాసన గలిగిన పిదపనే దీనికి గొప్ప విలువ గలుగుచున్నది." (వ్యాసకర్త, ఒంగోలు వెంకటరంగయ్యపంతులుగారు.)

Harmsworth's popular Science. Group 5. Animal life.

II. "The gland in adult male contains about an ounce of a secretion of a powerful musky odour.

When first obtained it is overwhelmingly strong to the human nose, but it rapidly dries, and lo, it is the musk of commerce which scents charms and amulets beyond number—"(Page 1416.)

కస్తూరికి ఆఱకముందు పరిమళము హెచ్చు అనుట సరికాదని పై పంక్తులవలన తేలినదిగదా? ఇక 'పచ్చికస్తూరి' యను నుడి తత్త్వమేమనగా: అది యొక జాతీయమైన పలుకుబడి. పచ్చివిషము. పచ్చినెత్తురు. పచ్చితేనె. పచ్చిబోగముది. పచ్చిపలువ. పచ్చిషోదా- ఇత్యాదుల వంటిది.—పచ్చితేనె = తడితేనె; పచ్చితురక = తడియాఱని మహామ్మదీయుడు-అనురీతి టీకలు అసమంజసములు.

'పచ్చితేనె' అనుట కొకటి-రెండు ప్రయోగములు.—

సీ. 'చిలుకపోటులచేతఁ జిరిగిన సహకార
    ఫలములఁ దొరఁగెడి పచ్చితేనె.' (పాండు. 1-117)

క. 'పుట్టకుఁ బుట్టెడివేళం
దిట్టపు నునుపచ్చి పుట్టతేనియ చవితోఁ
బుట్టె నన నమృతము పుట్టెడు
పుట్టనిసువు సత్కవిత్వములు వర్ణింతుఁగా' (పాండు. 1-10)

గీ. 'డాంబికులచేతఁ బచ్చిబండగులచేతఁ
కల్లరులచేత దర్పించుఁ గలియుగంబు.' (జైమిని. 8-112)

బండగుఁడు = ఆతతాయి, దుర్మార్గుడు. పచ్చిబండగు డనఁగా, కడుంగడు దుర్మార్గుడని యర్థము. అంతేగాని, 'తడియాఱని దుర్మార్గు' డని కాదు.

ఇట్లే 'పచ్చి'కి సందర్భానుసారముగా-క్రొత్త, మేలైన, నికరమైన- ఇత్యాదిగా నర్థములు చెప్పికోవలెను.

## ౧౩. అశ్లీలము

(పు. 521) "కస్తూరి ఒకజాతిలేడియొక్క యండకోశమందు జనించును. దానిని అశ్లీలతాపరిహారార్థము నాభిజ మందురు." అని సంజీవనీ వ్యాఖ్య.

ఇదియును ఊజ్జాయింపు రాద్ధాంతమేగాని, వస్తుతత్త్వము నెరిగిన సిద్ధాంతము కాదు.

కస్తూరి, కస్తూరిమృగముయొక్క* అండమునుండి పుట్టునని కొందరనుకొన్నారు. వారు 'అండజ' యన్నారు. నాభినుండి పుట్టునని కొందరి మతము. ఆమతమువారు 'నాభిజ' యన్నారు. అంతేగాని అశ్లీలతా పరిహారార్థము 'అండజ'ను-'నాభిజ'గా ఎవరును మార్చలేదు. అట్లు మార్చి రనుటకు ప్రమాణమును 'సంజీవని'వారు చూపను లేదు. 'అండ' పదమే అశ్లీలమైతే 'అండజయానలు' అధోగతిపాలు కారా? 'బ్రహ్మాండము' మునిగిపోదా?

కస్తూరియొక్క పుట్టుకనుగూర్చి పరిశోధించిన పండితులు అది నాభినుండి పుట్టునదేగాని అండమునుండి పుట్టునది కాదని స్పష్టముగా చెప్పినారు. ఈ క్రింది పంక్తులు పఠింపదగినవి.

---

* "కస్తూరికామృగాణామండా ద్గంధగుణమఖిల మాదాయ
యది పునరహం విధిస్స్యాం ఖలజిహ్వాకాయాం నివేశయిష్యామి."
—అలంకార చంద్రిక.

ఒంగోలు వెంకటరంగయ్యపంతులుగారి వ్యాసమునుండి.—

(a) "పురుషకస్తూరికిమాత్రమే దీనికిని అడుగభాగమున నొక చిన్న గ్రంథి (కాయ) గలదు. ఈ గ్రంథినుండి యూరుచుండు నొక ద్రవ్యము తోకపొడవున నేర్పడియుండిన ఒకకాలువవంటి గాడిగుండ ప్రవహించుచుండును. కస్తూరియూరే గ్రంథి ఇదికాదు. కస్తూరియూరు గ్రంథి పెంటి జాతికిమాత్రమే యుండును. తెలుగువారు 'కస్తూరి' యను ద్రవ్యమును ఇంగ్లీషున మస్కు (Musk) అనియు, హిందూస్థానమందు 'ముష్కు' లేక 'మష్కు' అనియు అందురు. కస్తూరికి కస్తురి యను హ్రస్వరూపమును గలదు. ఇంగ్లీషు ఉర్దూపర్యాయముల వ్యుత్పత్తిని విచారింప సంస్కృతము లోని ముష్కశబ్దభవములని తెలియుచున్నది. ఐనను ఈ ద్రవ్యోత్పత్తి ముష్కగ్రంథులనుండి వెడలునట్టుల వారు భ్రమపడి యుందురు. మన పూర్వికులుమాత్రము ఇట్టి పొరపాటు పడలేదు. నాభిప్రదేశమే దీనికి యుత్పత్తిస్థానమని అర్థపరిజ్ఞానము. అందుచేతనే దీనికి మృగనాభియనియు పేరు గలిగినది." (భారతి.)

Harmsworth's popular Science Group 5. Animal life.

(b) 'To catalogue the nature and purposes of the many external glands which distinguish the various species of deer would task the most expert student of the subject, but the glandular abdominal pouch from which this deer gets its name must not be passed without notice.'

(c) 'కస్తూరి, కస్తూరి యను లేడివంటి మృగముయొక్క నాభినుండి పుట్టును. ఆ మృగమును జంపి దానియొక్క నాభిని గోయుదురు. ఆ నాభిని చీల్చి కస్తూరిని తీయుదురు.' (భావప్రకాశ.)

(d) పండితరాయలు—

'కస్తూరికాం తృణభుజా మటవీచరాణాం
విన్యస్య నాభిషు వధాయ వృథా చకార;
మూఢో విధిస్స కిల దుర్జనలోలజిహ్వా
మూలేషు నిక్షిపతి చేత్ సకలోపకారః' (భామినీవిలాసమ్.)

(e) కాళిదాసు.— "ఆసీనానాం సురభితశిలం నాభిగంధై ర్మృగాణాం" (మే. సం. 1-56)

"నాభిగంధైః కస్తూరీగంధైః తేషాం తదుద్భవత్వాత్ - అత ఏవ మృగనాభిసంజ్ఞా చ. 'మృగనాభి ర్మృగమదః కస్తూరీ చ' ఇత్యమరః" అని మల్లినాథ వ్యాఖ్య.

(f) శ్రీ వేటూరి శంకరశాస్త్రిగారు,—'కస్తూరి, మృగముయొక్క అండములనుండి జనించునని కొందరు తలంచిరి' అన్నారు. (చూ. యువ. ఆశ్వయుజ-భారతి. 'కస్తూరి.')

నాభిజము ; అండజము

సంజీవనీకర్తలు 'నాభిజము'-'అండజము'-అన్నారు. కాని కస్తూరీ పర్యాయములైన, నాభిజా-అండజా శబ్దములు నిఘంటువులలో ఆకారాంత స్త్రీలింగములుగానే కనబడుచున్నవి. పుంలింగములుగాగాని నపుంసక లింగములుగాగాని కనబడుటలేదు.

(1) 'గంధధూలిశ్చ కస్తూరీ మదాహ్వా మృగనాభిజా
కస్తూరి కాండజా నాభి ర్మిశ్రా యోజనగంధికా'
(శాలిగ్రామ నిఘంటువు.)

(2) 'అండజా మృగనాభౌ స్యాత్' (మేదిని.)

## ౧౪. ఖురాసానిపుచ్చలు

(వావిళ్లవారి పాఠము; వ్యాఖ్యానము)

"'అలుకక్షోటక ధట్టికా ఖురపుటీహల్య స్ఖురాసానిపుచ్చలు వోఁదున్ని" (1-42)—"ఖురా...చ్చలు - ఖురాసాని = ఖురాసానిదేశసులగు మ్లేచ్ఛ లనియెడు, పుచ్చలు = పుచ్చచెట్లు, పోఁదున్ని = చెడఁదున్ని."—

(వేదంవారి పాఠము; వ్యాఖ్యానము)

"... హల్యక్షురాసాని పుచ్చలు *వోఁదున్ని".— "ఖురాసాని పుచ్చలు = ఖురాసాన దేశపు పుచ్చకాయలవంటి వగు సశిరస్త్ర మ్లేచ్ఛ

* వావిళ్లవారి ప్రతిలో, 'వోఁదున్ని' అని పద్యమునను, 'పోఁదున్ని = చెడఁదున్ని' అని టీకలోనుగూడా, 'దు'కు ముందు అరసున్న యున్నది. అది ప్రమాదమూలకము. ఆప్రమాద మట్టే-శ్రీ వేదంవారి ప్రతిలోనికిని వచ్చినది.

శిరస్సులను, పోన్ = పోడగునట్లు, దున్ని.—క్షురకల శిరములను, పుచ్చ తోటలనుంబోలె...దున్నివైచి".—

(1) పద్యమున, కృష్ణరాయడు - ఖురాసాని దేశీయులైన (ఏదిల ఖానుని) సైనికులను తన గుఱ్ఱపుదళములచేత త్రొక్కించి అంతమొందించుట వర్ణ్యము; ఆ సేనల నట్లు ధ్వంసము చేయుట, పుచ్చలుదున్ని పొలము బాగుచేయుటగా చెప్పుట అలంకారము.

యుద్ధవీరుడు ప్రతిభటుల శిరములను నరుకునుగాని దున్నడు.— పొలమును బాగుపరచ బూనినవాడు, ఆ పొలములోనున్న పుచ్చలు-వెంపలులు మొదలగు చెట్టుచేమలను దున్నివేయునుగాని, (సశిరస్త్ర మ్లేచ్ఛు) 'శిరస్సులను' దున్నడు.

కావున, వేదంవారు అటు యుద్ధపక్షమునను, ఇటు వ్యవసాయ పక్షమునను గూడా- (సశిరస్త్ర మ్లేచ్ఛ) శిరస్సులను-దున్నినట్లే వ్యాఖ్యానించుట సమంజసము కాదు.

'మ్లేచ్ఛు లనియెడి పుచ్చచెట్లు పోదున్ని' అన్న వావిళ్ల వ్యాఖ్యయే సరియైనది. (ఖురాసానిదేశస్థు లనుటమాత్రము సరికాదు.)

(2) ఖురాసానిపుచ్చలు - అను రూపకసమాసమునకు, ఖురాసాను లనెడి పుచ్చలు-అని యర్థ మగునేగాని, 'ఖురాసానిదేశపు పుచ్చకాయల వంటి వగు సశిరస్త్ర మ్లేచ్ఛ శిరస్సులు-అని యర్థము కాదు. కావున వేదం వారు చేసిన అర్థకల్పనము సరియైనది కాదు.

(3) పుచ్చలు-అనగా పుచ్చచెట్లేగాని, పుచ్చకాయలు కావు.— పుచ్చలు, నిమ్మలు, తుమ్మలు, వేపలు-మొదలగు బహువచనాంత శబ్దము లన్నియు వృక్షబోధకములుగాని ఫలబోధకములు కావు.

(i) 'బాపలు తప్పినను వేపలు తప్పవు'-

(ii) 'తుమ్మలలో పొద్దుపొడిచినట్లు' అని లోకోక్తులు.

(iii) "గౌడపతి సేనయుఁ దా, నుం గలఁగి పోలెన్ చేఁగులు, దంతేల్లుఁగఁ ద్రొక్కికొనుచుఁ దద్దయుభీతిన్" (క శా. 8-72.)

(iv) "కదలికాచయముఁ దుంగతతులున్ నారంగములు నాదిగ ధరంగలుగునట్టి హృదయంగమ బహుద్రుమ కదంబములు పెంచెన్" (క శా. 4-79)

ఇత్యాదిగా కవిప్రయోగములు. కాబట్టి 'పుచ్చలు=పుచ్చకాయలు'-అనుట భాషాసంప్రదాయ విరుద్ధము.

ఇక్కడ ఒక్కమాట.— 'ఆముక్త'లోనే, (6-13) దొగ్గలు-*దుండిగలు అను బహువచనాంతపదములు, దొగ్గలిచెట్లు-దుండిగపుచెట్లు అన్న యర్థముననే వాడబడియున్నవి. వేదంవారి టీకగూడా అట్టి యర్థముతోనే నడచినది. కాని, దొగ్గలు=దొగ్గలిచెట్లు-అని వ్రాసియు, పుచ్చలు=పుచ్చచెట్లు-అన్న యర్థము నూహింపలేక పోయినారు.

(4) 'పుచ్చతోఁటలనుంబోలె దున్నివైచి' అనుటయును తప్పే. ఎందువల్లనగా.— వెఱ్ఱిపుచ్చ-మంచిపుచ్చ అని పుచ్చ రెండువిధములు. వెఱ్ఱిపుచ్చకాయలు కటికిచేదు. మానవులు తినరు. పశువులును తినవు. వెఱ్ఱిపుచ్చలు పొలములో తమంతనే మొలచును. ఎవరును పైరుచేయరు. మంచి పుచ్చకాయలు (పండ్లు) తినదగినవి. రైతులు ఫలాభిలాషచే, మంచి పుచ్చవిత్తనములు చల్లి, నీరుకట్టి, ఆ చెట్లను పెంచుదురు. అట్లు పెంపబడునదే పుచ్చతోఁట. శ్రమపడి పెంచుకొన్న అట్టి తోఁటను, ఎట్టి యవివేకియు దున్ని పాడుచేసికొనడు. కావున—'పుచ్చతోఁటలనుంబోలె దున్నివైచి'-అనుట అసంగతము.

## ౧౭. నాభి; నిర్విషము

"స్వనిదానోగ్రనిదాఘవైఖరినె యూష్మన్ మల్లికల్ కామినీ
కన దానీల కచాగ్రపంక్తి నెఱియల్గాఁ బాపఁగాఁ, బాటలల్
ఘనతం దేనియసోనఁ గూర్చె; నదియౌఁ గా; నాభియున్ నిర్విషం
బును దోఁబుట్టువులయ్యు వేర్పడ గుణంబుల్సూపఁగాఁ జూడమే?"
—2-67

* 'దుండుగలు'-అని ఆ యిరువురి పాఠమున్ను. చెట్టు 'దుండిగ'(ము) గాని 'దుండుగ' కాదు. కావున 'దుండుగలు'అనుట సరికాదు. 'దుండిగలు' అనవలెను.

'దుండుగలు=కలుపు మొలకలు' అని వేదంవారి టీక.—దుండుగలు=దుండిగపుఁజెట్లు-అని వావిళ్లవారి టీక. వావిళ్లవారిదే సరియైన టీక.

"నాభియుఁ=విషమును ('నా మైకదేశ గ్రహణే నామగ్రహణ' మ్మను న్యాయంబున, నాభియే వత్సనాభి), నిర్విషంబును=అమృతంబును, తోఁబుట్టువు లయ్యు=సాగరోత్పన్నము లగుటచేత అన్నదమ్ము లయ్యును, వేర్పడఁ=భేదపడునట్లు, గుణంబుల్=ఒకటి చంపెడుగుణమును రెండవది ప్రాణమిచ్చు గుణమును, చూపవే = చూపుచున్న విగదా.—గ్రీష్మ ర్తువులో ఉవిదలు మల్లెలను పాటలములను కొప్పులోఁ దాల్తురు. అందు మల్లెలు... ప్రమదల తలవెంట్రుకల యగ్రములను చీల్పంబోడంగుడు,...పాటలలు తాము గ్రీష్మకారణములే యయ్యును,...ఆ చీలికలను మరల కూర్చినవి. ఇది సరియే. తోఁబుట్టువుల కిట్లు విరుద్ధగుణము లుండునా? యనిన ఉండును. సాగరోత్పన్నము లగుటచేత తోఁబుట్టువులయిన కాలకూటామృతములయందు విరుద్ధగుణములు ప్రసిద్ధములేగదా." అని *సంజీవనీ వ్యాఖ్య.

నాభి, నిర్విషము-అను పదములకు 'సాగరోత్పన్నములయిన కాలకూటము, అమృతము-అని యర్థము చెప్పుట తప్పు. కాలకూటామృతములు భిన్నగుణముల నిచ్చుచుండుట మనము చూచుచున్నాముగదా! అనుట అనుభవదూరమైన మాట. సాగరోత్పన్న కాలకూటమును 'నాభి' యనియు, అమృతమును 'నిర్విష' మనియు పేర్కొన్నకవి ఒక్కడును నాకు కనబడ లేదు. ఆ పదముల కట్టివాడుక భాషాలోకమున లేదు.

తత్త్వమేమనగా: 'నాభి' - 'నిర్విషము' అనునవి అంగడిదినుసులు గాని కాలకూటామృతములు కావు. భూమినుండిపుట్టు ఓషధులుగాని - సాగరోత్పన్న విషామృతములు కావు. (వత్స) నాభి; కాలకూటము అనునవి రెండును రెండురకములయిన స్థావర విషములు.—

"పుంసి క్లీబే చ కాకోల కాలకూట హలాహలాః
సౌరాష్ట్రిక శ్శౌక్లికేయో బ్రహ్మపుత్ర ప్రదీపనః
దారదో వత్సనాభశ్చ విషభేదా అమీ నవ." (అమరము)

కాబట్టి, "నాభి = కాలకూట" మనుట సరికాదు.

---

* ఈ వ్యాఖ్య వావిళ్లవారి వ్యాఖ్య ననుసరించి వ్రాయబడినదే.

వత్సనాభము (=నాభి), నిర్విష (=నిర్విషము; అనునవి చెట్లవేళ్లని నిఘంటువులలో స్పష్టముగా చెప్పబడి యున్నది.

(వత్సనాభి)

(1) "వత్సస్యేవ నాభి రస్య వత్సనాభః. వత్సముయొక్క నాభి వలె నుండునది. సింధువార సమ పత్ర వృక్షవిశేష భవః తత్సంబంధివాయు ర్జ్వరప్రదః-వావిలాకువంటి ఆకులుగలిగిన వృక్షమందు పుట్టునది. దీనియందుఁ బుట్టిన వాయువుయొక్క స్పర్శముచేత జ్వరము పుట్టును." (గురు. ప్రబో.)

(2) "వత్సనాభము. An active poison, also called Mith zeher the root of the Aconitum ferox brought from Nepal. వసనాభి." (బ్రౌణ్యము)

(నిర్విష)

(1) "నిర్విషా, నిర్విషి-తృణవిశేషః" (శబ్దకల్పద్రుమము)

(2) "నిర్విషాఽపవిషా చైవ, వివిషా విషహా పరా
విషహంత్రీ విషాభావా, హ్యవిషా విషవైరిణీ.
సం. నిర్విషీ.-హిందీ. నిర్విషీఘాసా." (శాలిగ్రామ నిఘంటువు)

(3) "నిర్విష Kyllingia Monocephala delphinenne denuatum. సం. నిర్విషా. నిర్బిషీ. దీనిని ఫార్షి భాషలో 'జద్వార్' అందురు. ఇది కారముగ చేదుగా నుండును. శీతవీర్యము కలది. దీనిదుంప 'నాభి' కొమ్మును బోలి యుండును. మిక్కిలి కఠినముగా నుండును. విషములను హరించును. తేలు, పాము మొదలగువాని విషములను హరించు శక్తిగల దగుటచేత దీనికి నిర్విష మని పేరు." (వస్తుగుణదీపిక.)

నాభీ-నిర్విషమూ, రెండును ఉద్భిజ్జములే. అందువలన నవి తోఁబుట్టువులు. అందు * నాభి-(=వత్సనాభము) నిలువున ప్రాణముతీయు కటికివిషము; నిర్విషము-విషహారము.

---

* "అనేన వత్సనాభ నామ్నా మహావిషేణ సన్నీయ తోయం, తత్ర మాలాం మజ్జయిత్వా, తయా స వక్షసి ముఖే చ హన్తవ్యః" (దశకుమార చరితమ్)

తోఁబుట్టువు లయ్యును, అవి యిట్టి పరస్పరవిరుద్ధగుణములు కలవియై యున్నవి. ఆ రెంటిని వైద్యులు వాడుట కలదు. అందువలన వాటిగుణములు లోకవిశ్రుతములు.

కావున నే కవిరాయలు, తోఁబుట్టువులయ్యును విరుద్ధగుణములుచూపు మళ్లీ పాటలల కుదాహరణగా- అట్టి గుణముల నేచూపు నాభిని-నిర్విషమును చూపినాడు; వాటిగుణములు లోకులెల్ల రెఱిఁగినవే కావున,-"నాభియుఁ నిర్విషంబును దోఁబుట్టువు లయ్యు వేర్పడ గుణంబుల్ సూపఁగాఁ జూడమే" అన్నాఁడు.

కాబట్టి, "నాభి = సాగరోత్పన్న కాలకూటము.— నిర్విషము = అమృతము" అని యర్థము చెప్పుట తప్పు.

## ౧౬. భల్లాతకి

"పల్లచీమల వక్రభల్లాతకియుఁ బోలె
నెజ్జనుప్పటి నొప్పు కట్టివాని" (౬. ౧౯)

"వక్రభల్లాతకియుఁ బోలెన్ = వంపుగింజల జీడిచెట్టువలె (ముంత మామిడిచెట్టు = మొక్కజీడిచెట్టువలె)" అని సంజీవనీ.

(1) 'వక్ర=వంపుగింజల' అనుట తప్పు. వక్ర=వంకరయైన, భల్లాతకి = జీడిచెట్టు అనుట ఒప్పు.— "వక్ర...బోలెన్ = వంకర జీడిచెట్టువలె" అనియే వావిళ్లవారి టీక.

(2) 'భల్లాతకి = ముంతమామిడిచెట్టు = మొక్కజీడిచెట్టు'-అనుట యును తప్పే.

భల్లాతకి (=జీడిచెట్టు), ముంతమామిడిచెట్టు-భిన్నజాతివృక్షములు.- బ్రౌను, "జీడిచెట్టు-The marking nut plant. ముంతమామిడి (*జీడిమామిడి) చెట్టు—The cushoo nut tree" అని చెప్పియున్నాఁడు.

ముంతమామిడిపప్పు (Cushoo nuts) తినదగినవి. జీడిగింజలను మానవులు తినరు. పశువులును తినవు. మందులలో వాడుదురు. వాటి రసము సోకినచో శరీరము పెట్లి పుండగును.

---

* శ. ర. కర్త 'జీడిమామిడి = మోరటి (దీని కాయలయందలి దే చాఱపప్పు" అన్నాడు. తప్పు. (చూ. ఈ గ్రంథముననే, పు. 142)

జీడిగింజను సంస్కృతమున 'అరుష్కర' మందురు.— 'అరూంషి వ్రణాన్ కరోతీతి అరుష్కరః. అరుస్సు లనగా వ్రణములు. వానిని చేయునది అని ఆ పదమున కర్థము. (చూ. గురు. ప్రబో.)

· కావున వేదంవారి టీక గ్రాహ్యము కాదు.

## ౧౭. షాడబము

*"నానావిధ షాడబముల
నాను నృపాహార మెపుడు నపరాహ్ణమునం
గాని మఱి శుద్ధకోష్ఠతఁ
గాని తమిన్ భుక్తియెపుడుఁ గడుఁ బథ్యమగున్" (4-281)

"నానావిధషాడబములన్ = పలుతెఱంగుల రుచులతో, ♦అనునృప ఆహారము=భుజింపఁబడు రాజభోజనము, ఎపుడున్=ఎప్పుడును, అనున్= కూడియుండును. అపరాహ్ణమునన్ = మధ్యాహ్నమున కనంతర మేగాని, మఱి=మఱియు, శుద్ధకోష్ఠతఁగాని=ఆమాశయపక్వాశయశుద్ధిం జెందిగాని, తమిన్=ఆఁకటితో, భుక్తి=తినుట, ఎపుడున్=సదా, కడున్=మిక్కిలి, పథ్యమగున్ = దేహమునకు హితమగును"-అని సంజీవనీవ్యాఖ్య.

నే నీ పద్యమును, టీకను పరామర్శించుచూ, ఆంధ్రవారపత్రిక - బహుధాన్య (1918) దసరాసంచికలో, ఇట్లు వివరించియున్నాను.

---

* షాడబశబ్ద పరిశీలనము-అను శీర్షికతో (1952 అక్టోబరు-నవంబరు-డిసెంబరు) త్రిలిఙ్గలో నొక పెద్దవ్యాసము ప్రచురించితిని. ఆ వ్యాసమున కిది సంగ్రహము.

♦ "అను నృపాహారము = భుజింపఁబడు రాజభోజనము, అనున్= కూడియుండును" అని రెండు "అను"లతోనున్న టీకయు, 'శుద్ధకోష్ఠతన్' అన్న మాటకు "ఆమాశయ పక్వాశయ శుద్ధింజెంది" అన్న వివరణమును, "నృపాహార మెపుడు......"భుక్తియెపుడు" అని రెండు "ఎపుడు"లతో నున్న పాఠమున్నూ సరియైనవి కావనికూడా నే నా పరామర్శలో తెలిసియున్నాను.

"రాజుల భోజనము పలు తెఱగుల రుచులతో కూడియుండును. కనుక అపరాహ్ణమున నే తినవలయును-అని యర్థము చెప్పుట యుచితము కాదు. రాజులభోజనమే కాదు; ఎవరిభోజన మైనను పలురుచులతో కూడియే యుండునుగాని - ఒక్కరుచితో నుండనే యుండదు.

'షాడబ' మనునది ఒక పానీయవిశేషముగాని రుచి కాదు. అది ఉపహారములలో చేరినది. ఉపాహారములు అపరాహ్ణమున (అనగా 'టిఫిన్' సమయమున) గాని, క్షుద్రకోష్ఠతఱి=పరగడుపునగాని తీసికొనుట మంచిది.

రసాలా రాగ ఖాండవ షాడబములని పానీయములు వివిధములు. రాగషాడబములను వాల్మీకి, రామాయణమున వాడియున్నాడు.

"తథామ్ల లవణోత్తంసైః వివిధై రాగషాడబైః." (సుందర. 11-15)

వ్యాఖ్య.—"తథేతి.- రాగషాడబైః శర్కరా క్షౌద్ర ద్రాక్షా దాడిమ మధుర ద్రవ్యాణాం వికారాః విరళరసాః త ఏవవస్త్రగళితాః సాంద్రాః షాడబాః.—తదుక్తమ్ "సితా మధ్వాదిమధురాః రాగా స్తే స్వచ్ఛతాం గతాః; తే సాంద్రాః షాడబా లేహ్యాః తే వస్త్రగళితా ఇతి."— "సితా మధ్వాది మధురో ద్రాక్షా దాడిమజోరసః, విరళశ్చేత్ కృతోరాగః సాంద్రశ్చేత్ షాడబః స్మృతః."

మరియు, బ్రౌను తన నిఘంటువులో షాడబమునకు 'షడ్రస నిర్మిత భోజనము" అని యర్థముచెప్పి, అందుకు పై 'ఆముక్త' పద్యము నే యుదాహరించి యున్నాడు. 'పాండురంగ' టీకలో, 'షాడబ=ఆఱురసములతో గూడిన పదార్థము' లని యున్నది. అందువల్ల "షాడబ" శబ్దానికి "రుచి" యని యర్థము చెప్పుట యుచితముకాదు. 'నృపాహార' మను పాఠమున్నూ సరియైనది కాదు. 'ఉపాహార'మని యుండనగును".—(ఇది నా వ్యాసము లోని సారాంశము.)

ఈ నా వ్యాసమును విమర్శించుచూ,—శ్రీ బులుసు వేంకట రమణయ్యగారు తారణ ఆషాఢ (1944 జూలై) భారతిలో, "షాడబానికి 'రుచి' అనే అర్థము కుదురనట్లే పానీయరూపమైన 'ఉపాహార'మనే అర్థముకూడా కుదరదు.—షాడబాలంటే పులుసు" అన్నారు.

తరువాత తారణ ఆశ్వయుజ (1944-అక్టోబరు) భారతిలో, డాక్టరు, చిలుకూరి నారాయణరావుగారు, "షాడబము = పులుసు - అనకూడదు. కుడుము-అనవలెను" నన్నారు.

ఆపైని, తారణకార్తిక (1944-నవంబరు) భారతిలో, శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు,—శ్రీ వేంకటరాయశాస్త్రిగారు - "పాడబము = రుచి" అనుట లోపమే అనుకొనినను ఊని చెప్పదగినది కాదు. "ప్రాచీను లెవ్వరును శ్రీ బులుసు వేంకటరమణయ్యగారివలె 'పులు' సనియు, శ్రీ నారాయణరావుగారివలె 'కుడు'మనియు చెప్పలేదు. శ్రీ గోవిందరాజొక్కడుదక్క ఇది భక్ష్యమని చెప్పినవా రెవ్వరును లేరు. లేహ్యమని కొందఱు నిర్ణయించిరి. కాని సర్వసామాన్యముగా నందఱును దీనిని పానీయముగనే గ్రహించిరి" అన్నారు.

## నా సమాధానము

పాడబము = పులుసు-అనగూడదు గాని, కుడుము-అని చెప్పుటలో తప్పులేదు.

'పాడబాః మద్రసంయోగకృతా భక్ష్యవిశేషాః' అని చెప్పిన రామాయణవ్యాఖ్యాత శ్రీ గోవిందరాజపండితునిమాట గీటునబుచ్చుట పాటికాదు.

వైద్యనిఘంటుకర్త యగు శివదాసపండితుడును,—"ఖాండవః మధురామ్ల లవణ నానాసుగంధి ద్రవ్యకృతఖాద్య విశేషే, ఖాండవాః-ఫల మధురామ్ల లవణాః సుస్నిగ్ధద్రవ్యజాః నానావిధాః" అని చెప్పియున్నాడు.

కాబట్టి, "గోవిందరాజొక్కడు దక్క ఇది భక్ష్యమని చెప్పినవా రెవ్వరును లేరు" అనుట పొరపాటు.

పాడబము=కుడుము-అనవచ్చు ననుచు శ్రీ నారాయణరావుగారు,— "పాడబము ఒక తీయని భక్ష్యము; పిండివంట. మిఠాయివస్తువు. పాడవ శబ్దానికి విల్సన్ పండితుడు తన సంస్కృత నిఘంటువులో "Confectionery, Sweet Meats" అని యర్థము వ్రాసి, రామాయణ మహాభారత ములలో ఉదాహరణము లున్నవని నిరూపించినాడు. పాడవశబ్దమునకు ప్రయోగము సుశ్రుతములో భక్ష్యార్థమున నున్నట్లు తెలిపినాడు......." అని సప్రమాణముగా నిరూపించి యున్నారు.

కాబట్టి, 'పాడబము = భక్ష్యము' అని చెప్పగూడ దనుట తప్పు.

## షాడబతత్త్వము

షాడబము లనునవి ఆమ్లలవణాదులును, చక్కెర తేనె మొదలగు మధుర ద్రవ్యములనుచేర్చి ద్రవరూపమునను, లేహ్యాపాకమునను, భక్ష్యరూపమునను, తుదకు చూర్ణముగను తయారుచేయబడు పదార్థములు. అందుకీ క్రింది గ్రంథములు ప్రమాణము.

రాగఖాండవములు (మొరాజే, మురబ్బా).

"ఆమమాత్రం త్వచాహీనం ద్విత్రిర్వా ఖండితం తతః
భృష్ట మాజ్యమనాగ స్తం ఖండపాకేథ యుక్తితః
సుపక్వంచ సముత్తీర్య మరీచై లేంకువాసితం
స్థాపితం స్నిగ్ధమృద్భాండే రాగఖాండవ సంజ్ఞితమ్.
పుష్టిదో బలదః పిత్త వా తా స్రాపరుచి నాశనః
స్నిగ్ధో గురు స్తర్పణశ్చ సుస్వాదూ రాగఖాండవః."

## లేహ్యము

"సితా రుచక సింధూత్థైః స వృక్షామ్ల పరూషకైః
జంబూఫలరసై ర్యుక్తో రాగో రాజికయా కృతః."

"ఖాండవా మధురామ్లాదిరస సంయోగ సంభవాః,
దీపనా బృంహణా రుచ్యా ప్రోక్తా హృద్యా శ్ర(?)మాపహాః."

ఇతి నానాఖాండవాః (యోగరత్నాకరము.)

## చూర్ణము

"కోమలామలకజం చూర్ణం శుంఠ్యేలా శర్కరాన్వితమ్,
మాతులుంగ సమే నాక్తం శోషితం సూర్యరశ్మిభిః."

"ఏవంతు బహుశోభ్య క్తం శోషితంచ పునః పునః
ఈష ల్లవణ సంయుక్తం చూర్ణం ఖాడవ ముచ్యతే."

(క్షేమకౌతూహలమ్.)

## పానీయము

పాడవము (=ఖాండవము) తాపశాంతికై గ్రీష్మర్తువున సేవింపదగిన పానీయమని వాగ్భట సూత్రస్థానమున ఈ క్రింది శ్లోకరూపమున చెప్పబడి యున్నది.

"పిబే ద్రసం నాతిఘనం రసాలాం రాగఖాండవౌ
పానకం పంచసారం వా నవమృద్భాజన స్థితమ్."
(గ్రీష్మర్తుచర్య)

పాడబము పానీయరూపమున తయారుచేయబడుటయు కలదు. కావున "పరిశీలించిచూస్తే పాడబానికి 'రుచి' అనే అర్థము కుదరనట్లే, పానీయ (రూపమైన 'ఉపాహార') మనే అర్థముకూడా కుదరదు. పాడబ మనగా పులుసు" అన్న 'బులుసు'వారి వాదము నిరాకరము; నీరసమున్నూ.

# శబ్దవిచారణ

## ౧. ఉప్పందనము

(పు. 141) 'లావణ్యకలనః.—లావణ్య = ఉప్పందనముయొక్క' అని సంజీవనీవ్యాఖ్య.

ఆ శాస్త్రిగారు, అమరుకము (అనుబంధము)లోగూడా, —'లావణ్య మనఁగా కాంతి; ఉప్పందనము' అనియే అన్నారు.

'ఉప్పఁదనము' అనవలెగాని 'ఉప్పందనము' అనగూడదు.

ఉప్పు=లవణము. ఉప్పుయొక్క గుణము 'ఉప్పన'(రసము). ఉప్ప-గుణవాచకము. ఉప్ప+తనము = ఉప్పఁదనము.

ఉప్పనీరు; ఉప్పనినీరు; ఉప్పనిది; ఆ బావినీళ్లు ఉప్పగా నుండును-ఇత్యాదిగా వాడుక. "ఉప్పదనము or ఉప్పన saltness."— 'వుప్పని మాట చప్పనిమాటచెప్పి-By fair means or foul" అని బ్రౌణ్యము.

ఉ. 'ఊరును పేరు లేని యొక యుప్పని చప్పని కావ్యమల్లు సిం
గారపుఁగైతగాండ్రు' (శ్రీ|తిరుపతికవుల|బుద్ధచరిత్ర. 1-12)

## ౨. కరటము

2-41 క్రింద 'లహరి = పెద్దయలల (పెద్ద కరటముల)యొక్క' అన్నారు.

'అల' యను అర్థమిచ్చుపదము 'కెరటము' గాని 'కరటము' కాదు.

కరటము (సంస్కృతము) = కాకి. కెరటము (దేశ్యము) = అల. 'కెరటము', పూర్వ నిఘంటువులలోనే కాదు నేటి నిఘంటువయిన సూ. ని. లోను లేదు; కాని, ఉత్తరసర్కారులలో వ్యవహారమునను, ఈనాటి రచనలలోను విరివిగా ఉన్నది.

1. ప్రభవశ్రావణ-భారతి.—"కమ్మతెమ్మెర కెరటాల కలతలోన." (పూడిపెద్ది వెంకటరమణయ్యగారు.)

2. ఆంధ్ర-(పత్రిక) ప్రమాధికార్తీకి.—"ముదికిదొరువులలోని బురద నీటి కెరటములపై సీద మురియునట్లు." (కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు.)

3. విభవభాద్రపద-భారతి; 'భావకవిత్వము.'— "గంగాపదము కాంగ. అది నాలో గొల్లగూడెము, ఉండవో-ఉండదో అని కెరటములచే ఘోషించును." (వేలూరి శివరామశాస్త్రిగారు.)

4. చిత్రాశ్వీయము.—(పీఠిక. పు. VI.) "పైకి, లేచి విరిసిన కెరటాల లేతగాడ్పు." (కోట వీరాంజనేయ శర్మగారు.)

5. విష్ణుధనువు (కావ్యము.) పుట 16—"అలలై-లయల కెరటాల రీతి ఎగురుచు." (ఉమావిజయ మహేశ్వరంగారు)

6. ఈశ్వర ఉగాదిసంచిక—'కుంతీకుమారి',—

'ఏటి కెరటాలలో పెట్టె యేగుచుండ
సుదతి కనుచూపుమేరకు చూచి చూచి.'

(జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు.)

వేదంవారు తమ కథాసరిత్సాగరము ప్రథమ ముద్రణము (1892సం.) పీఠికలోకూడా—"రైనాల్డు మొదలగువారి నావెల్సు,...బృహత్కథ యను మహాసముద్రములో ఒక 'కరట'మైనను గానేరవు" అని వ్రాసియున్నారు.

## ౩. అడ్డుకొయ్య

౨-౧౦ క్రింద,-"కందపట్టెలు=కవాట తిర్యగ్దారువిశేషములు" అన్నారు వావిళ్లవారు.— "కందపట్టెలు = తలుపుమీఁద నమర్చిన యడ్డుకొయ్యలు" అన్నారు వేదంవారు.

శ.ర.లో,-"కందపట్టె = తలుపుమీఁద నమర్చెడి యడ్డుకొయ్య" అని యున్నది. * ఆ మాటలనే తీసికొన్నారు వేదంవారు.

కాని 'అడ్డుకొయ్య'-అనుట తప్పు. కందపట్టె, తలుపుమీద అడ్డముగా నమర్చబడునుగాని 'అడ్డు'గా నమర్చబడదు.

(a) ♦"కందపట్టెలు Cross pieces of wood, at the back of a door" (బ్రౌణ్యము.)

(b) "ఆ ధాత్రీశు వక్షఃకవాటముపై నెడ్డాకొ గందపట్టెగతి నుంచఁగా నాదు కేల్సేర్చుటల్." (కళా. 7-110)

అడ్డముగా అమర్చబడు కొయ్య 'అడ్డకొయ్య' అగునుగాని 'అడ్డుకొయ్య' కాదు. అడ్డము; అడ్డు-అను పదముల కర్థములో భేదమున్నది.

అడ్డము = వెడలుపు (నిలువునకు వ్యతిరేకము), తిర్యక్కు.

అడ్డు = నిరోధము.

కాబట్టి, అడ్డకొయ్య; అడ్డబొట్టు; అడ్డకమ్మి మున్నగు పదములను అడ్డుకొయ్య, అడ్డుబొట్టు, అడ్డుకమ్మి-అనఁగూడదు.

అడ్డము = తిర్యక్కు, అనుటకు,—

(1) "అడ్డంబు నిడుపు నా పడ్డలగతి" (మను. 2-7)

(2) "మోమడ్డంబు గదల్చి" (పార. 2-58)

మోము అడ్డంబు గదల్చి-అనగా, తల యీ ప్రక్కకును-ఆ ప్రక్కకును అడ్డముగా ఆడించి-యని యర్థము, —†అడ్డుగా కదలించి-యనరాదు.

---

* వే. వేం. శాస్త్రిగారివలెనే, సూ. ని.యును-గందపట్టె=తలుపుమీఁద నమర్చెడి యడ్డుకొయ్య' అని శ.ర.లోని మాటలనే వ్రాసికొన్నది.

♦కందపట్టెలు-at the front-అని యుండదగును.

† సూ.ని. "అడ్డముగా=అడ్డుగా-కదల్చి" అనియే అర్థముచెప్పినది. సరికాదు.

(3) "పిశితఖండంబులు బగబగనమంచు చిదుగు సోదమంటల కడ్డంబువట్టి" (మను. 4-60)

"అడ్డంబువట్టి=అడ్డముగా ద్రేలఁబట్టి" అని జూలూరివారి టీక. మంటల కడ్డుగా ద్రేలఁబట్టి—అని చెప్పఁగూడదు.

(4) "అడ్డ మారుమూళ్లు, నిలువు తొమ్మిదిమూళ్లు" (పల్నాటిసుద్దులు)

అడ్డు = నిరోధము–అనుటకు,—

(1) "పౌర నేత్రముల కడ్డుచొరక యున్న" (కాశీ. 3-[illegible])

'అడ్డుచొచ్చు=అడ్డుగా చొచ్చు'-అని సూ. వి. వివరణము.

(2) 'వాడి మాట కడ్డులేదు' అని వ్యవహారము.

కాబట్టి 'అడ్డము' అన్న యర్థమున 'అడ్డు' అను పదమును వాడరా దనియు, అడ్డకొయ్యను—అడ్డుకొయ్య–అనఁగూడదనియు సర్వసామాన్యము.

వేదంవారు, శృం. నై. లో కూడా,— "ప్రాకారశిఖర దీర్ఘ దీపితయును గోపురద్వారకవాటమర్ధ తిరఃప్రసారితయును" (1-59) అన్నచోట,— 'తిరః = అడ్డుగా, ప్రసారితయును = విస్తరిల్లినదై యుండుటను' అన్నారు.

కవాటము, తిరఃప్రసారిత = అడ్డము(వెడలుపు)గా ప్రసరించుట కలదిగాని, అడ్డుగా ప్రసరించుటకలది కాదు. కావున, 'అడ్డుగా–విస్తరిల్లిన' దనుట సరికాదు.

'తిర' శబ్దమునకు 'అడ్డముగా' ననియే అర్థము.—

"తిర్యగర్థే సాచి తిరోపి. సాచి, తిరః ఈ రెండును అడ్డముగా నను నర్థమునందు వర్తించును." అని గురు. ప్రబో. వివరణము.

కాబట్టి, 'తిరః = అడ్డుగా' అని చెప్పుట తప్పు.

మరియు, వారు (5-62) క్రింద,—"పాముకాళ్లు దేహముపొడుగు నను అడ్డుగా తగడులవలె నుండును" అన్నారు.

పాముకాళ్లు దానిదేహము పొడుగునను–అడ్డముగా నుండును గాని అడ్డుగా (నిరోధముగా) నుండవు. కావున, ఆ టీక యొప్పదు.

ఒక విశేషము: అడ్డు (నిరోధము) అన్న యర్థమున 'అడ్డము'ను వాడవచ్చునుగాని, అడ్డము (తిర్యక్కు) అను నర్థమున 'అడ్డు'ను వాడరాదు.

# అలంకారవిచారణ

సర్వంకషా వ్యాఖ్యలోవలెనే సంజీవనీ వ్యాఖ్యలోను అలంకారనిర్ణయమున పొరపాటులు జరిగియున్నవి. గ్రంథ విస్తర భయముచే మచ్చున కొక్కటిమాత్ర మిందు చూపుచున్నాను.

## ౧. ఉపమ

గీ. "మంత్రభృత్య, భూతభూతాత్త శాంభవ భూమికుండు." (2-39)

"మంత్రములచేత సేవకు లయినట్టి బూచులచేత (బూచులమూలముగా) పొందఁబడిన శివసంబంధియైన వేషముకలవాఁడు—(భూతములను పనిగొనుచు అపరశివుఁడో యన నున్నాఁడనుట.-ఉపమ." (సంజీవని.)

(బూచులమూలముగా పొందఁబడిన) శివసంబంధియైన వేషము కలవాఁడు-అన్న వాక్యమున నిజముగా అలంకారము లేదు. 'ఉపమ' యఁట! అది యెక్కడ? పద్యములోనా? వివరణ వాక్యములోనా?

'అపరశివుఁడో యన నున్నాఁడు' అంటే ఉపమయగునా? ఉపమకు-అపరశివు డొక డుండవలెగదా! ఉన్నాడా? అతడే లేనప్పుడు ఉపమించుటెట్లు?

ఎందుకు విస్తరము.—'అపరశివుఁడో యన నున్నాఁడు' అనునది, ఒక ఊహ. ఊహ ఉత్ప్రేక్ష యగునుగాని 'ఉపమ' కాదు.

ఆయుత్ప్రేక్షయైనను - శాస్త్రిగారి వివరణ వాక్యములోనేగాని - పద్యములో లేదు. వ్యాఖ్యాత అలంకారమును చెప్పవలసినది మూలమునకుగాని-తన సొంతవాక్యమునకు కాదు.

దీపాల పిచ్చయ్యశాస్త్రికృత సాహిత్యసమీక్షలో
కావ్యములు ; వ్యాఖ్యానములు
అను భాగము సమాప్తము.

# కూర్పులు, మార్పులు

పుట 156లో,-చనవరి = కొలువుకాఁడు, సేవకుఁడు - అనుటకు,—
మడికిసింగన సకలనీతిసమ్మతమున రాజనీతిలో,—

(1) "జనటాయుగాంధ్రము జనవరిలెంకలు-రాష్ట్రకంటకులు పిరల నృపాలుఁ, డెప్పుడు మాన్పక సాగనిచ్చిన.....అల్పుల నవలించి తినియు, లంచములుగొన్న ధరయెల్లఁ బాడుగాదె?" (పద్యసంఖ్య 196)

చనవరిలెంకలు-అనగా 'చనవరు' లనబడు సేవకు లన్నమాట.

(2) "క్షత్రియుఁ గోపింప ఖడ్గముఁజూపుఁ జూ
ట్టముఁ జనవరియు నోడక భజింప,...
కాన నిట్టివిధము మానవులకు నధి
కార మీఁగి వెరవ్రకటెమి గాదు." (ప.సం. 215)

పుట 58లో,—పండ్లుకొఱుకుట-కోపలక్షణ మనుటకు,—
"పాఱుతెంచికీరంబులు పండ్లుగఱవ" (శృం. నై. 1-96)

'పండ్లుగఱవన్ = ఫలములను కొట్టఁగా (కోపముచే పటపట పండ్లు కొఱుకఁగా-అనియు)' వేదంవారి వ్యాఖ్య. 'పండ్లుకొఱుకుట అసూయా లక్షణ' మన్న వారికీయుదాహరణమును చిత్తగింతురుగాక.

పుట 66 లో "కడలేని......ముసుఁగుదన్న" అన్నచోట, అర్థమిట్లు చెప్పికోవలెను.

విడ్యంబు కప్పు = విడెమువల్ల కలిగిన నలుపు, చందురకావిమోవి పల్లొత్తులన్ = ఎఱ్ఱని మోవియందలి పలునొక్కులను, ముసుఁగుదన్నన్ = కప్పివేయగా.

విడెపురంగును నలుపుగా చెప్పుట కలదు.—

(1) "మృగమదము మించు తములంపు టీరులు మోవి, దళముగా"
(ఆముక్త. ౪-౧౩౫)

(2) "దరహాసములఁ దోఁచు తాంబూలసేవాంధ
కారితాధరరదక్షతుల యొఱపు" (మను. 6-44)

తాంబూలసేవా = తాంబూల సేవనముచేత (=తాంబూలపు కప్పు చేత) అంధకారిత=కనబడకుండా చేయబడిన, అధర దంతక్షతుల యొుఅపు-అని యర్థము.

పుట. 92-'ఆనలువెట్టు' అనుటకు.—(కళా. ౬. ౬౬)
"పలికిన నేను నీ తలఁపుపద్ధతిగా కిపుడేమి మీఱి వ
ర్తిలితిఁ *దొడింబడక నిను వధింపఁగవచ్చెదనో యటంచు సా
కలఁగుచు రాకమాను మని యానలువెట్టఁగ." శ.ర. పా.

పుట. 100 లో,—వలరాచవారు = మన్మథుడు-అనుటకు.—
"అతివ తొడలును, జఘనంబు లరసిచూడఁ
గొమరుమీఱెడు జమిలితొండముల శిరసు
తోడి వలరాచవారి యద్భుతపుహస్తి
యగ్రభాగంబు చూపఱ కాత్మఁ దోఁప." (కళా. 7-133)

పుట. 166 లో,-కుట్టిమములు మేడమీది ప్రదేశము లనుటకు,—
"అధఃకృతాంభోధర మండలానాంయస్యాం శశాంకోపలకుట్టిమానామ్;
జ్యోత్స్నానిపాతాత్ క్షరతాం పయోభిః కేలీపదం వృద్ధి మురీకరోతి."

కుట్టిమ-శబ్దము,—రత్నాలుచెక్కిన కిరీటప్రదేశమునందును వర్తించు నని యీ క్రింది పద్యము చెప్పుచున్నది.
"కైటభరిపునకు సురవర
కోటీర తటాగ్ర రత్నకుట్టిమ కురువిం
దాటోప కిరణరంజిత
పాటలిత విరాజమానపదపద్మునకున్."
(సకలనీతిసమ్మతము-ప. సం. 288)

కాఁబట్టి, 'కుట్టిమము = జాతికట్టనపు నేల' అనుటయు,—'శిలారత్నాది నిబద్ధభూమి' అనుటయు సరికాదు.

---

*-తొడింబడిక-అని వావిళ్ల పా.

పుట 111, 266.—పొగరు = నీలకాంతి - యనుటకు,—

క. "కరము పొగరెక్కె నంబర
మురువిద్యుద్దీపకళిక లుమిసిన ధూమ
స్ఫురణఁ బొగచూరె ననఁగా
హరిమణిజంబూఫలాసితామలరుచులన్" ('ఆము'-4-138)

పుట 240.—రేవంతుఁడు = గుహ్యకు డనుటకు,—

"రేవంతప్రముఖ గుహ్యకులను,...నలకూబరుండు రావించె" (మను. 5-55)

పుట 276లో,—'అవ్వలించు' అను క్రియను, సూ.ని.-ద్వి.సం.లో,-ప్ర.సం. అనుబంధములో చూపియున్నది. (నేనిట్లీవల చూచినాను.)

పుట. 256-"కమ్మపంజుల వజ్రపుం జకచకల" అన్న 'మను' వచనమునకు,—

"కమ్మపంజుల=దివిటీలవలె వెలుఁగుచున్న కమ్మలయందలి, వజ్రపుం జకచకల = మగరాల కాంతులచేత" అని 'వావిళ్ల'వారి టీక. 'ఆనంద' వారి టీకయు నిదే.

కాని, 'కమ్మపంజు' అను పదములోని 'పంజు'కు 'దివిటీ' యని అర్థము చెప్పచో, ఆ కమ్మ, పంజువలె వెలుగు వట్టి 'కమ్మ' యగునే గాని రత్నాలకమ్మ కానేరదు. అప్పుడు, అందు మగరా లున్నట్లు వర్ణించుట పొసగదు.

కావున ఆ కమ్మను రత్నతాటంకముగానే చెప్పవలెను. అట్లు చెప్పుటకు 'పంజు'కు మగరాలకట్టుబడి యనియే అర్థము చెప్పవలెను.

అందువల్లనే 'జూలూరి' వారు, దివిటీప్రస్తావమే యెత్తలేదు.—"కమ్మపంజుల...చకల=పంజులతాటంకములయందలి హీరమణులయొక్క" అని మాత్రమే టీక వ్రాసినారు.

ఈ క్రింది పదములు పుట 277 లో చేర్పదగినవి :

## ౨౮. అగ్రపుస్తకము

భారతములో,— "అగ్రపుస్తకంబు లర్చించి చూచుచు" అని (ద్రోణ. 2-345) యున్నది.

సూ.ని.లో, 'అగ్రపుస్తకము' లేదు.

## ౨౯. కరూశము

భాస్కర రామాయణములో,- "మలకలితమైన దేశము, మలదంబు కరూశయుక్త మహిగలదేశం, బలవడఁ గరూశము" (బాల. 233) అని యున్నది.

శ.ర., సూ.ని., వా.ని. కూడా "కరూశము = ఒకదేశము" అని మాత్రమే చెప్పినవి. ఒకదేశము - అను నర్థము పై పద్యమున సరిపడునా ?

పుట 317లో,— '...బునంబొందు' అనుటకు, నన్నె. కు. సం॥ ప్రయోగము.—

"దివ్యశక్తు లెంత శేషంబులయ్యును...అతికోమలంబైన కౌముశక్తి లోనై మృదుభావంబునం బొందు" (4-78)



## శ్రీ గన్నవరపు సుబ్బరామయ్యగారు, విద్వాన్

Ex-Editor, Bharati., Senior Telugu Pandit,
A.B.M. Girls' High School - Nellore. 27-9-1954

"మీరు పంపిన కుమారకథామంజరి చేరినది. చేరిననాఁటినుండియు వారు వీ రెందఱో, - యాఁడువారు - మగవారు - పిల్లలు - పెద్దలు మోజు పడి దానిని నా కందనీయక చదువుచుండిరి. ఎట్లో సందుచూచి నేనును దానిని నిన్న నేఁడు మొదటినుండి తుదివఱకు 'తు-చ' విడువక చదివితిని. ఆ 'మంజరి' అట్లుండుట 'మోజు'పడఁదగినదే యని తెలిసికొంటిని.

కథాప్రధానముగ మీ రనువాదమునఁ గావించిన మారుపుల తీరు, పలుకుబడులసౌరు జదువఁజదువఁ జవులూరించుచున్నవి. విషయమువలెనే రచనమును దాని పేరును సార్థకముచేయుచున్నది.

మూలము దండిదయినట్లే మీ యనువాదమును తెనుఁగున దండిదయి వెలయఁగలుగుట నిక్కము. ఇంతకన్న నిఁకఁ గావలసిన దేమి !"

## త్రిలిఙ్గ (26-12-55)

"దండి దశకుమారచరిత్ర వచనకావ్యమైనను పాఠకులకు పద్మవ్యూహమువలె తోఁచునది. కథలో కథ, కథలో కథగా రచింపబడినది. శ్రీ శాస్త్రిగారు ఆ కథలనన్నిటిని విప్పి అతుకులను చూపుచు విడివిడిగా నీగ్రంథమును తెనుగులో వ్రాసిరి. ఒక్కొక్క కథలోను వచ్చు పాత్రలను, వారికి వారికి గల సంబంధబాంధవ్యములను పేర్కొని పాఠకులకు కథలను చదువుటకు, జ్ఞాపక ముంచుకొనుటకు అనువు కల్పించినారు... వీరి వచనము గ్రాంథికమయ్యు సులభగ్రాహ్యమైనది. వీరి మేఘదూత, రఘువంశాదులవలె నిదియు కళాశాలా విద్యార్థులకు పాఠ్యగ్రంథముగా నిర్ణయింపదగినది."

---

ప్రతులకు,—

దీపాల పిచ్చయ్యశాస్త్రి
నెల్లూరు.

ఈ క్రింది పదములు పుట 277 లో చేర్పదగినవి :

## ౨౮. అగ్రపుస్తకము

భారతములో,— "అగ్రపుస్తకంబు లర్చించి చూచుచు" అని (ద్రోణ. 2-345) యున్నది.

సూ.ని.లో, 'అగ్రపుస్తకము' లేదు.

## ౨౯. కరూశము

భాస్కర రామాయణములో,- "మలకలితమైన దేశము, మలదంబు కరూశయుక్త మహిగలదేశం, బలవడఁ గరూశము" (బాల. 238) అని యున్నది.

శ.ర., సూ.ని., వా.ని. కూడా "కరూశము = ఒకదేశము" అని మాత్రమే చెప్పినవి. ఒకదేశము - అను నర్థము పై పద్యమున సరిపడునా?

పుట 317లో,— '...బునంబొందు' అనుటకు, నన్నె. కు. సం॥ ప్రయోగము.—

"దివ్యశక్తు లెంత శేషంబులయ్యును...అతికోమలంబైన కౌముశక్తి లోనై మృదుభావంబునం బొందు" (4-78)

